# వెండి వెలుగులు




## రజతోత్సవ సంచిక

1991-92

# TIRUMALA TIRUPATI DEVASTHANAMS

**M.V.S. Prasad,** I.A.S.,
Executive Officer.

***Tirupati***

Dear devotee,

There is no gift worthier and nobler than Annadana. In our country, giving food to the needy and poor is not merely a service, but a hoary tradition practised since vedic times. It is said that one who offers food is placed among the devas.

Sri Venkateswara Nitya Annadana Scheme, aimed at providing free and wholesome food to the devotees visiting Tirumala, launched by the T.T. Devasthanams in 1985, has become a glorious success. There has been an overwhelming response from philanthropists all over India.

The quality of food was also immensely appreciated by the public. The benefit of this unique Annadana scheme is now enjoyed by most of the pilgrims at Tirumala.

With a view to providing a wonderful opportunity to the common devotee to contribute his mite in the Nitya Annadana Scheme, the T.T. Devasthanams has recently decided to slash the slab considerably. Enough you just pay Rs. 1000 or in multiples and serve a noble and befitting cause, thus enabling T.T.D. to preserve the timeless tradition of Annadana.

If your heart goes out to those devotees coming from farflung areas, join the modified *Nitya Annadana Scheme* and have the pride of partnership in this sacred service.

अन्ने श्रितानि भूतानि अन्नं प्राणमिति श्रुतिः ।
तस्मादन्नं प्रदातव्यं अन्नं हि परमं हविः ॥

— बोधायनधर्मसूत्रम् ।

Vedas affirm that food is life animating the inner energy. Annadana is a priceless measure transcending the earthly qualities. Annadana should, therefore, be done.

*-Bodhayana Dharma Sutra.*

Thanking you,

Yours sincerely

***M.V.S. PRASAD***

---

*R.O.C. No. 1862/P.R.-4/Adv-28/92, dated 11 March '92*

# వెండి వెలుగులు

## యువభారతి రజతోత్సవ సంచిక

సంపాదక మండలి

సహజకవి మల్లెమాల

డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి

డాక్టర్ జె. బాపురెడ్డి

శ్రీ కె.వి. రమణ

డాక్టర్ ఎన్. గోపి

డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్య

డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం

యువభారతి రజతోత్సవ సంఘం

యువభారతి కార్యాలయం

ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు

తిలక్ రోడ్, హైదరాబాదు – 500 001

**VENDI VELUGULU**
**YUVABHARATHI SILVER JUBILEE SOUVENIR**

*Editorial Committee:*

**Sahajakavi Mallemala**
**Dr. V. Malakonda Reddi**
**Dr. J. Bapu Reddi, IAS**
**Sri K.V. Ramana, IAS**
**Prof. N. Gopi**
**Dr. T. Srinivasacharya**
**Prof. G.V. Subrahmanyam** ***(Convenor)***

*Publihed by:*

**YUVABHARATHI** Silver Jubilee Celebrations Committee


Silver Jubilee Publication No. 142
First Edition: June 1992
Cover Design: Sri Seela Veera Raju

*Price:* **Rs.100/-**

*Copies available with:*

**YUVABHARATHI**
(Literary & Cultural Organisation)
Andhra Sarasvatha Parisath Buildings
Tilak Road, Hyderabad - 500 001.

*Printed at:*

**VIPLA Computer Services,**
Nallakunta, Hyderabad - 500 044
Phone: 667476

# యువభారతి రజతోత్సవ మహాసభ

ప్రారంభకులు

**మాన్యశ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి గారు**

(భారత ప్రభుత్వ న్యాయశాఖ మంత్రి)

జ్యోతిని వెలిగించి మహాసభను ప్రారంభిస్తారు.

**ముఖ్య అతిథి**

**మాన్యశ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి గారు**

(ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి)

(యువభారతి రజతోత్సవ సంఘ ప్రధాన పోషకులు)

ఆచార్య సి.నారాయణ రెడ్డి గారి 'తెలుగు కవిత - లయాత్మకత'ను ఆవిష్కరిస్తారు.

**ప్రత్యేక ఆహ్వానితులు**

**పద్మభూషణ్ డాక్టర్ సి.నారాయణరెడ్డి గారు**

(తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు)

'వెండి వెలుగులు' యువభారతి రజతోత్సవ సంచికను ఆవిష్కరిస్తారు.

**డాక్టర్ దేవులపల్లి రామానుజరావు గారు**

(ఆంధ్ర సారస్వత పరిషత్తు అధ్యక్షులు)

రజతోత్సవ శుభాశీస్సుల నందిస్తారు.

సభాధ్యక్షులు

**వాస్తు శిల్పి శ్రీ బి.ఎన్. రెడ్డి గారు**

యువభారతి రజతోత్సవ సంఘాధ్యక్షులు

స్వాగతం

**సహజకవి 'మల్లెమాల' గారు**

ఆంధ్రప్రదేశ్ చలనచిత్ర పరిశ్రామభివృద్ధి సమాఖ్య ఛైర్మన్

యువభారతి రజతోత్సవ కార్యనిర్వాహకాధ్యక్షులు

శుభాకాంక్షలు

**డాక్టర్ జె. బాపురెడ్డి గారు IAS**

(ఆం.ప్ర పరిశ్రమల శాఖ కమీషనరు)

**శ్రీ పి.వి. ఆర్.కె. ప్రసాద్ గారు IAS**

(ఛైర్మన్, విశాఖపట్నం పోర్ట్ ట్రస్ట్)

# యువభారతి రజతోత్సవ సంఘం

ప్రధాన పోషకులు
మాన్యశ్రీ ఎన్. జనార్దన రెడ్డి
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

**పోషకులు**
డాక్టర్ సి. నారాయణరెడ్డి
డాక్టర్ దేవులపల్లి రామానుజరావు
డాక్టర్ బోయి భీమన్న
శ్రీ కె.వి.కె. రాజు
శ్రీ రమణయ్య రాజా
శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు
డాక్టర్ అంజిరెడ్డి

**అధ్యక్షులు**
'వాస్తుశిల్పి' శ్రీ బి.ఎన్.రెడ్డి

**కార్యనిర్వాహక అధ్యక్షులు**
'సహజకవి' మల్లెమాల

**ఉపాధ్యక్షులు**
డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి
డాక్టర్ జె. బాపురెడ్డి
శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్
శ్రీ వి. కొండలరావు

**సభ్యులు**
శ్రీ కె.వి. రమణ
శ్రీ ఎం.ఆర్. సుబ్రహ్మణ్యం
శ్రీ జి. రామదాస్
శ్రీ జి. పుల్లారెడ్డి
శ్రీ జె. భాస్కరరావు
శ్రీ ఎ.వి.యస్. రాజు
శ్రీ వి. వాసుదేవ దీక్షితులు
శ్రీమతి వాసుదేవి కైలాస్
శ్రీమతి వేదవతి ప్రభాకరరావు
శ్రీమందడి కృష్ణారెడ్డి

**కార్యదర్శి**
డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం

**కోశాధికారి**
శ్రీ ఎస్. వెంకటేశ్వర రావు

**సమావేశ కర్త**
డాక్టర్ వంగపల్లి విశ్వనాథం



యువభారతి రజతోత్సవ మహాసభ ప్రారంభకులు
మాన్యశ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి గారు
(భారత ప్రభుత్వ న్యాయశాఖ మంత్రి)



యువభారతి రజతోత్సవ మహాసభ ముఖ్య అతిథి
మాన్య శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి గారు
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి



యువభారతి రజతోత్సవ సంచిక ఆవిష్కర్త
పద్మభూషణ్ డాక్టర్ సి. నారాయణరెడ్డి గారు
తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు



యువభారతి రజతోత్సవ మహాసభ అధ్యక్షులు
వాస్తుశిల్పి శ్రీ బి. ఎస్. రెడ్డి గారు
మాజీ పార్లమెంటు సభ్యులు



రజతోత్సవ మహాసభ ప్రత్యేక ఆహ్వానితులు
డాక్టర్ దేవులపల్లి రామానుజరావు గారు
ఆంధ్ర సారస్వత పరిషత్తు అధ్యక్షులు



యువభారతి రజతోత్సవ మహాసభ స్వాగతోపన్యాసకులు
'సహజకవి' మల్లెమాల గారు
ఆంధ్రప్రదేశ్ చలనచిత్ర పరిశ్రమాభివృద్ధి సమాఖ్య ఛైర్మన్
యువభారతి రజతోత్సవ కార్యనిర్వాహకాధ్యక్షులు



యువభారతి రజతోత్సవ సంఘ ఉపాధ్యక్షులు
డాక్టర్ ఉండేల మాల కొండారెడ్డి గారు
మేనేజింగ్ పార్టనర్, అన్నపూర్ణ హోటల్



యువభారతి రజతోత్సవ సంఘ ఉపాధ్యక్షులు
డాక్టర్ జె. బాపురెడ్డి గారు IAS
ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల శాఖ కమీషనరు



యువభారతి రజతోత్సవ సంఘ ఉపాధ్యక్షులు
శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్ గారు IAS
ఛైర్మన్, విశాఖపట్నం పోర్ట్ ట్రస్ట్



యువభారతి రజతోత్సవ సంఘ సభ్యులు
శ్రీ కె.వి. రమణ గారు IAS
'కుడా' అడ్మినిస్ట్రేటర్
'పాతికేళ్ళ పత్రికా రచన' ఆవిష్కర్త

# మా మాట

## మూడు ఆశయాలు :

సమాజ శ్రేయస్సుకు సమున్నత ప్రమాణాలు గల సాహిత్యం, ఉత్తమ మూల్యాలను పెంచి పోషించగల సహృదయలోకం అవసరమని గుర్తించి, ఆ రెండింటినీ బలంగా పెంపొందించే సాహిత్య సాంస్కృతిక సామాజిక చైతన్యాన్ని కలిగించటానికి యువభారతి ఉద్యమిస్తున్నది!

సాహిత్యం ఎటువంటి సాహిత్యేతర శక్తుల ఆజమాయిషీకి లోనుగాకుండా, స్వతంత్ర వ్యక్తిత్వంతో సాత్త్విక శక్తిగా రూపొందాలనీ, అటువంటి సాహిత్యాన్ని సృష్టించే రచయితలు ఏ కాలంవారైనా, వారి కృషినీ, సందేశాన్నీ సామాన్య ప్రజానీకానికి అందేటట్లు వివిధ ప్రచురణల ద్వారా, కార్యక్రమాల ద్వారా యువభారతి యత్నిస్తోంది : అంటే - రాజకీయ కాలుష్యంలేని సాహిత్యోద్యమాన్ని యువభారతి అవిశ్రాంతంగా సాగిస్తోంది!

'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుండూ కూర్చోవడంకంటే, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది' - అనే లక్ష్యంతో సమాజంలో వ్యష్టిగా, సమష్టిగా, శాంతియుతసహజీవనాన్నీ, ప్రజాస్వామ్య విధానాన్నీ, నిర్మాణాత్మక కార్యశీలాన్నీ, మానవత్వపు విలువలతో కూడిన సేవాభావాన్నీ ఆచరించి చూపిస్తోంది యువభారతి!

## సాహితీ సంస్థగా ముందడుగు :

రాజకీయాల స్వార్థకాలుష్యాలకు అతీతంగా ఉండగలిగే విశ్వజనీనమైన సాహిత్యస్పృహను సమాజంలో జాగృతం చేసి తెలుగు సాహిత్యాభిమానాన్ని ఇంటింటా జ్యోతిలా వెలిగించాలనే ప్రయత్నంతో యువభారతి ఇరవై యేడేళ్లకు పైగా ఉద్యమాన్ని సాగిస్తున్నది. సమాజంలో ఉత్తమసాహిత్యం పుట్టటంతోనే చాలదు. దానిని ప్రజల మధ్యకు తీసుకొనిపోయే ప్రయత్నం జరగాలి. పొలం దున్నే రైతులు, రాట్నం తిప్పే పల్లెటూరి పడతులు, మధ్యతరగతి మహిళలు, విద్యార్థినీ విద్యార్థులు, ఫ్యాక్టరీ కూలీలు, ఉద్యోగులు, ఉద్యోగినులు, యువతీయువకులు - ఇలా చదువుకున్న ప్రతివారూ తెలుగు సాహిత్యంలో వెలువడిన - అంటే వారి మాతృభాషలో వెలువడిన - సాహిత్యం చదవాలి. లేదా - కనీసం ఆ సాహిత్యం గురించి పరిచయమన్నా చేసుకోవాలి. అప్పుడే తెలుగు సాహితి సమాజంలో సజీవంగా ప్రవహించటానికి వీలుంటుంది. ఒకజాతిలో రచయిత(త్రు)లు పుట్టటం ఎంత గొప్పో, సహృదయులు అధికశాతంలో అభివృద్ధి చెందటంకూడా అంతేగొప్ప. సహృదయ లోకాన్నీ, సాహితీవాతావరణాన్నీ సమాజంలో నిర్మించటంలో సాహితీ సంస్థల పాత్ర విశేషంగా ఉంది. ఈ బాధ్యత గుర్తించి యువభారతి ఇన్నాళ్ళుగా సాహిత్యోద్యమాన్ని సాగిస్తున్నది. ప్రజల హృదయాలలో తన ముద్ర పదిలంగా వేసుకొన్నది.

## యువభారతి జీవితం ఒక సాహిత్యోద్యమం :

యువభారతి 1963 సం॥ విజయదశమి నాడు పుట్టింది. మొదటి రెండేళ్లూ రూపుదిద్దుకొన్నది. ప్రతినెలా మొదటి, మూడవ ఆదివారాలలో సమావేశమై యువ భారతీయులు మూడుగంటలసేపు సమగ్ర వ్యక్తిత్వ నిర్మాణానికి తోడ్పడే కార్యక్రమాలను నిర్వహించు కొనేవారు. వచోరీతిని, రచనాపాటవాన్ని, ఆలోచనా శక్తినీ, అధ్యయనశీలమునూ అలవరచే క్లుప్తగోష్ఠి, పుస్తకచర్చ, కవితా పఠనం, సమాలోచనం మొదలైన అంశాలు చైతన్యవంతంగా సాగేవి. అప్పటి సమావేశాలన్నీ శిక్షణశిబిరాలుగా ఉండేవి. 1965 విజయదశమినాటికి యువభారతి ఒక సమగ్రరూపం తాల్చింది.

1965-70 సంవత్సరాల మధ్య యువభారతి తన ఆశయాలకు అనుగుణంగా సాహిత్యకార్యక్రమాలను చేపట్టి ప్రజల మధ్యకు నడిచింది. బలమైన ప్రయోగాలు చిత్తశుద్ధితో చేసి ప్రజల మన్ననలు పొందటం ప్రారంభించింది. మహిళా విభాగ కార్యక్రమాల ప్రారంభం, సైక్లోస్టైల్డు పత్రిక వెలువరించటం (దాదాపు వెయ్యి

ప్రతులు చెల్లేవి) ముఖ్యమైన అంశాలు. యువభారతి ప్రచురణలు, సదస్సులు ఒక ప్రత్యేక వ్యక్తిత్వంతో తెలుగువారిని ఆకర్షించటం ఆరంభించాయి. అనుముల కృష్ణమూర్తిగారి 'సరస్వతీ సాక్షాత్కారం' కాళోజీగారి 'జీవనగీత', యువభారతీయుల కవితా సంకలనం 'వీచికలు' తక్కువ ధరకు ప్రచురణపూర్వవిరాళ పద్ధతిలో ప్రచురించిన తొలి ప్రచురణలు. 1970లో 'మారుతున్న విలువలు : రచయితల బాధ్యతలు' అనే అంశం మీద నిర్వహించిన గోష్ఠి, దానిని 'రచన'గా ప్రచురించిన అనుభవం యువభారతికి కర్తృప్రతిష్ఠలతో పాటు, ఒక ప్రామాణికమైన సాహిత్యసంస్థకు వచ్చే గుర్తింపును కూడా తెచ్చిపెట్టాయి.

1971-1985 మధ్య యువభారతి సమాజంలో ఒక అపూర్వ సాహిత్య చైతన్యాన్ని కలిగించింది. యువభారతి వార్షికోత్సవాల 'లహరి ఉపన్యాస పరంపరలు' ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారిచ్చిన 'కావ్యలహరి'తో మొదలయ్యాయి - 1971లో. వేలమంది సాహితీ సభలకు రావటం, సాహిత్యపువిలువల పట్ల సదవగాహన సమాజంలో ఏర్పడటం యువభారతి సాహిత్యోద్యమం కలిగించిన విలువైన చైతన్యం. కావ్యలహరి, వికాసలహరి, ప్రతిభాలహరి, ఆలోచనాలహరి, సుధాలహరి, కవితాలహరి, నవోదయలహరి, నవ్యసాహిత్యలహరి, సంస్కృత సాహిత్యలహరి, మొదలైన విలువైన ఉపన్యాస వ్యాస మంజరులు వెలువడి తెలుగువారి మన్ననలు అందుకొంటున్నాయి. 1991 నవంబరులో పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు తెలుగు కవిత: లయాత్మకత అనే అంశం మీద రజతోత్సవ ఉపన్యాస లహరిని అందిచారు. అది గ్రంథరూపంగా వెలువడింది.

1985 నుండి 1990 వరకు యువభారతి ఆర్థికమైన ఇబ్బందులకు ఎదురై కార్యక్రమాలను జరపటంలో కొంత అశక్తతను ప్రకటించినా సంకల్ప బలంలో గాని, ఉద్యమస్ఫూర్తిలో గానీ ఎన్నడూ వెనుకంజ వేయలేదు. దీనికి తోడు యువభారతి అధ్యక్షులు డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తిగారి హఠాన్మరణం ఒక షాక్‌గా పనిచేసింది. ఏమైనా యువభారతి మరల నూతనాధ్యక్షుణ్ణి, కార్యవర్గాన్నీ ఎన్నుకొన్నది. రజతోత్సవాలను నిర్వహించాలని నడుంకట్టి ముందుకు సాగింది.

యువభారతి సాహిత్యోద్యమం మీద సానుభూతి పరులు ఎందరో ఉన్నారు మనరాష్ట్రంలో. వారిలో జంటనగరాల్లో ఉన్న కొంతమంది పెద్దలను యువభారతి సమీపించి రజతోత్సవ ఆహ్వానసంఘంగా ఏర్పడి సముచిత సహాయసహకారాలను అందించమని ప్రార్థించింది. యువభారతి అభ్యర్థన మేరకు ఆహ్వానసంఘం ఏర్పడింది.

యువభారతి రజతోత్సవకార్యక్రమాలను అయిదారు రకాలుగా విభజించవచ్చు.

1. నెలనెలా జరిగే 'సమాలోచనం' సమావేశాలు
2. రజతోత్సవ ప్రచురణలు (18 ప్రచురణలు)
3. రజతోత్సవ సాహిత్య సదస్సులు
    1. ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం (1980-1990)
    2. పాతికేళ్ల పత్రికా రచన (1965-90)
    3. కొత్తగొంతుకలు - సరికొత్త విలువలు
    4. విద్యావైద్యశాస్త్ర కళారంగాలు - మానవతావిలువలు
    5. స్త్రీ వాదధోరణులు - సమకాలీన సాహిత్యం
4. ఉపన్యాస 'లహరి' (నాలుగు ఉపన్యాసాలు) - 'తెలుగు కవిత : లయాత్మకత' అనే అంశంపై ఆచార్య సి.నారాయణరెడ్డిగారి ఉపన్యాసలహరి.
5. యువభారతి రజతోత్సవ సంచిక 'వెండివెలుగులు' ప్రచురణ.
6. మే 31, జూన్ 1,2 తేదీలలో జరిగిన యువభారతి రజతోత్సవ మహాసభలు. (ఈ కార్యక్రమాల సమీక్షలు ఆయా గ్రంథాలలోనూ, ఈ సంచికలోను జతపరిచాం. గమనింప ప్రార్థన.)

యువభారతి రజతోత్సవాలు సాహితీపరులకు మనసుపండుగగా జరిగాయి. అధిక సంఖ్యలో సహృదయులు సభలకు వచ్చి కార్యక్రమాలను

విజయవంతం చేశారు. యువభారతిని ఆశీర్వదించారు. భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి దివ్యాశీస్సులతో రజతోత్సవాలు విజయవంతంగా సాగాయి. వారికి యువభారతి సదా కృతజ్ఞతలు.

యువభారతి రజతోత్సవ సంఘ ప్రధాన పోషకులుగా ఉండటానికి దయతో అంగీకరించటమే కాకుండా, మహాసభలో ముఖ్యఅతిథిగా పాల్గొని యువభారతి కార్యక్రమాన్ని మనసారా ప్రోత్సహించిన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి మాన్యశ్రీ ఎన్. జనార్దనరెడ్డిగారికి, పోషకులుగా ఉండటమేకాక యువభారతికి మేనమామనని చెప్పి, అండగా నిలిచిన సహృదయమూర్తి తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు, జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత డాక్టర్ సి. నారాయణరెడ్డిగారికి, యువభారతికి సదా తమ అండదండలనిచ్చి కాపాడుతున్న వాత్సల్యమూర్తులు అమృతహృదయులు ఆంధ్ర సారస్వత పరిషత్ అధ్యక్షులు డాక్టర్ దేవులపల్లి రామానుజరావుగారికి, ఎప్పుడూ మీవెంటనున్నానని మైత్రినిసౌజన్యాన్ని అందించిన శ్రీ పాతర్లారి వెంకటేశ్వరరావుగారికి మా కృతజ్ఞతాభివందనాలు.

యువభారతి రజతోత్సవ సంఘాధ్యక్షులు వాస్తుశిల్పి శ్రీ బి.ఎన్. రెడ్డిగారు ఎప్పుడూ మా భుజంతట్టి ముందుకు నడుపుతూ కార్యక్రమాలను కూడా ముందుకు నడిపారు. కార్యనిర్వాహక అధ్యక్షులు సహజకవులు, సంతతోత్సాహమూర్తులు అయిన శ్రీ 'మల్లెమాల' (ఎం.ఎస్.రెడ్డిగారు ) రజతోత్సవ విజయసారధిగా రథాన్ని నడిపించారు. సాహితీబంధువు, స్నేహసింధువు అయిన డాక్టర్ జె.బాపురెడ్డిగారు యువభారతి హృదయ భారతిని దర్శించి చేయూతనిచ్చిన సాహితీమూర్తి. నవ్వులతో పాటు చేయూతనిచ్చిన సౌజన్యమూర్తి డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డిగారు. అడగకుండానే మిత్రుల హృదయాలను అంచనా వేసి ఆదరంతో ఆహ్వానం పలికే ఉత్సాహమూర్తి శ్రీ కె.వి. రమణగారు, సాహిత్యమంటే మనసుపడి సహాయహస్తాన్ని అందించే స్నేహమూర్తులు శ్రీ జి. రామదాసుగారు, శ్రీ ఎం.ఆర్. సుబ్రహ్మణ్యంగారు. ఇలా రజతోత్సవ సంఘసభ్యులందరూ యువభారతి ఆత్మబంధువులు. అందరికీ మా హార్దిక కృతజ్ఞతలు.

డాక్టర్ దేవులపల్లి రామానుజరావుగారు – ఆంధ్ర సారస్వత పరిషత్తును తల్లితో, యువభారతిని పిల్లతో పోల్చి చెప్పారు. వారి ప్రేమ హృదయం అటువంటిది. వారికి పరిషత్ కార్యవర్గసభ్యులకు, శ్రీ హరికిషన్‌రావు మొదలైన ఉద్యోగులకు యువభారతి నమస్సులు అందజేస్తున్నది. యువభారతి రజతోత్సవాల సందర్భంగా ఆర్థిక సహాయం చేసిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి, సభ్యులుగా చేరిన వారికి, ప్రకటనలు ఇచ్చి, ఇప్పించి సహకరించిన వారికీ, విశేషించి తిరుమల తిరుపతి దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ ఎం.వి.యస్. ప్రసాద్ IAS గారికి, కులీకుతుబ్‌షా అర్బన్ అథారిటీ శ్రీ కె.వి.రమణ IAS గారికి, సమాచార పౌర సంబంధాల శాఖ కమీషనర్ గారికీ, విరాళాలిచ్చి ప్రోత్సహించిన వారికీ, అన్ని విధాలా యువభారతికి సహాయసహకారాలందించిన నగర కేంద్ర గ్రంథాలయాధికారులకూ, సహృదయులకూ, ఎందరో మహానుభావులకు అందరికీ నమస్కారములు.

రజతోత్సవాల వార్తలను స్నేహపూర్వకంగా ప్రజలకందించిన పత్రికలవారికి, దూరదర్శన్, ఆకాశవాణివారికి, యువభారతి రజతోత్స ప్రచురణలకు అవకాశం కలిగించిన రచయితలకు, వక్తలకు, వ్యాసకర్తలకు, వివిధ కార్యక్రమాలలో పాల్గొన్న పెద్దలకు, అక్షరశిల్పి శ్రీ శీలావీర్రాజుగారికి, ముద్రాపకులు పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, విష్ణు కంప్యూటర్ సర్వీసెస్ యజమానులు శ్రీ శ్రీనివాస్‌గారికి, శ్రీ విజయసేనారెడ్డి గారికి, కృతజ్ఞతలు

సంపాదకమండలి పక్షాన

**జి.వి. సుబ్రహ్మణ్యం**

# యువభారతి రజతోత్సవ 'సమాలోచనం' సమావేశాలు

యువభారతి కార్యక్రమాలలో 'సమాలోచనం' సాహిత్యచైతన్యాన్ని యువతలో కలిగించటానికి ప్రత్యేకంగా రూపొందించింది. నెలనెలా ప్రతి మొదటి ఆదివారం నిర్వహించే ఈ సాహిత్య కార్యక్రమంలో వివిధ విషయాలపై విభిన్న దృక్పథాల సమాలోచనం సాగుతుంది.

1990 ఆగస్టు 5 వ తేదీన రజతోత్సవ సమాలోచన సమావేశపరంపరను ప్రముఖ కవి డాక్టర్ జె.బాపురెడ్డిగారు ప్రారంభించారు. ఆ సమావేశానికి డాక్టర్ వెలిచాల కొండలరావుగారు అధ్యక్షత వహించారు. ఆ సభలో 'వర్తమాన కవిత్వం - వస్తువు' మీద డాక్టర్ ఎన్. గోపిగారు, 'రుబాయీలు - కవితారీతులు' మీద డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్యులు గారు, 'రచయితలు - పత్రికలు' మీద శ్రీ బుర్రా సుబ్రహ్మణ్యంగారు ఉపన్యసించారు.

1990 సెప్టెంబరు 2వ తేదీ ఆదివారం సమావేశానికి డాక్టర్ ఎల్లూరి శివారెడ్డిగారు అధ్యక్షత వహించగా, శ్రీ మండడి కృష్ణారెడ్డి గారు ముఖ్య అతిథిగా సందేశాన్ని అందించారు. 'ఆధునిక సాహిత్యంలో అభావపద్యధోరణి' పై డాక్టర్ వై. కామేశ్వరిగారు, 'ఆధునిక సాహిత్యంలో గేయకథాకావ్యాలు' పై శ్రీ తాళ్లపల్లి మురళీధరగౌడ్‌గారు. తెలుగు దూరదర్శన్ ఇలా ఎందుకుంది?' అనే అంశంపై డా. సి. మృణాళినిగారు ఉపన్యసించారు.

1990 అక్టోబరు 7వ తేదీ ఆదివారం సమావేశానికి ముఖ్య అతిథిగా శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావుగారు విచ్చేశారు. సభాధ్యక్షులుగా డాక్టర్ అక్కిరాజు రమాపతి రావు గారు 'మంజుశ్రీ' పాల్గొన్నారు. 'ఆధునిక తెలుగునాటకం: ప్రయోగాలు' పై డాక్టర్ పి.వి. రమణగారు, 'తెలుగు నవల : ఇటీవలి ధోరణులు' పై డాక్టర్ కె.వి.కృష్ణకుమారిగారు, 'నామిని కథలు : ఒక వివేచన' అనే అంశంమీద శ్రీ ఫణికుమార్‌గారు ముచ్చటించారు. నవంబరు సమావేశం కారణాంతరాలవలన జరగలేదు.

1990 డిసెంబరు 2వ తేదీ ఆదివారం సమావేశంలో ముఖ్యఅతిథిగా డాక్టర్ ఉండేలమాల కొండారెడ్డిగారు పాల్గొన్నారు. ఆచార్య రవ్వా శ్రీహరిగారు అధ్యక్షత వహించారు. 'తెలుగులో పేరడీలు' పై డాక్టర్ ముక్తేవి భారతిగారు, 'ఆధునిక కవిత - కవయిత్రులు' పై డాక్టర్ ఎం. లావణ్య సరస్వతిగారు, 'టీనేజ్ టెంప్టేషన్స్'ను గురించి శ్రీమతి పరిమళా సోమేశ్వర్ గారు ప్రసంగించారు.

1991 జనవరి 6 వతేదీ సమావేశంలో డాక్టర్ తిరుమల కృష్ణదేశికాచార్యులు గారు రచించిన కావ్యం 'ఋతుసంహారము', డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యంగారి 'కలంతో కాలమ్', శ్రీమతి వారణాసి లక్ష్మి రవీంద్రనాథ్ రచించిన సిద్ధాంతవ్యాసం 'కిన్నెరసాని పాటలు - వాక్య ప్రయోగ వైచిత్రి' - ఆవిష్కరింపబడ్డాయి. ఆవిష్కర్త : శ్రీ కె.వి. రమణగారు ఐ.ఎ.ఎస్. నాటి సభాధ్యక్షులు: ఆచార్య ఎస్.వి. రామారావుగారు, గ్రంథపరిచయ కర్తలు (వరుసగా) - డాక్టర్ తిరుమల శ్రీనివాచార్యులుగారు, డాక్టర్ ఎల్లూరి శివారెడ్డిగారు, డాక్టర్ సుమతీ నరేంద్రగారు. ఆ సభలో 'రేడియో రచన: పద్ధతులు: ప్రయోగాలు' అనే అంశంమీద శ్రీ సధామ గారు, 'బుఱ్ఱకథ : బాణీలు' గురించి శ్రీ వై. ఫిలిప్‌రాజుగారు మాట్లాడారు.

1992 ఫిబ్రవరి 3 వ తేదీ సమావేశంలో అధ్యక్షులు : డాక్టర్ ఎన్.గోపిగారు, ముఖ్యఅతిథి - ఆచార్య నాయని కృష్ణకుమారిగారు, ఉపన్యాసకులు - 'కె. శివారెడ్డి సాహిత్యం' గురించి శ్రీ చీకోలు సుందరయ్యాగారు, 'తెలుగులో ఆధునిక మహాకావ్యం : విమర్శ'ను గురించి డాక్టర్ సుమనశ్రీ గారు, 'పత్రికలు - అనువాద రచన'ను గురించి శ్రీమతి కె.టి.లక్ష్మిగారు ఉపన్యసించారు.

1991 మార్చి 3వ తేదీ సమావేశంలో యువభారతి రజతోత్సవ ప్రచురణ 'యువత' ఆవిష్కరింపబడింది. ఆచార్య జి. లక్ష్మీనారాయణగారు ఆ సభకు అధ్యక్షత వహించి ప్రచురణను ఆవిష్కరించారు. ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు, డాక్టర్ మసన చెన్నప్పగారు 'యువత'ను గురించి మాట్లాడారు. ఆ తరువాత – "తెలుగు ఋతువులు ః విశ్వనాథ ః శేషేంద్ర ః సి.నా.రె." అనే అంశంమీద శ్రీ పి.ఎ.వి. వల్లభాచార్యులు గారు, 'తెలుగు పత్రికలలో ఫీచర్స్' మీద శ్రీ సి.హెచ్. దయానంద్ గారు ఉపన్యసించారు.

1991 ఏప్రిల్ 7వ తేదీన ఆచార్య సి.నారాయణరెడ్డిగారు, డాక్టర్ కామేశ్వరిగారు రచించిన 'అమృతం కురిసిన రాత్రిః వాక్యలయః భావపోషణ' అనే గ్రంథాన్ని ఆవిష్కరించి ఉపన్యసించారు. ఆచార్య ఎం. కులశేఖరరావుగారు సభకు అధ్యక్షత వహించారు. వచనపద్యం – తిలక్ – వాక్యలయ ః 'భావపోషణ' అనే అంశంమీద డాక్టర్ కోవెల సంపత్కుమారాచార్యగారు, 'వచన కవిత్వంలో వాక్యలయః శాస్త్రీయదృక్పథం' మీద శ్రీ పాతూరి నాగరాజుగారు, 'వచన కవిత్వంలో వాక్యలయః ఆధునిక కవుల శైలులు' పై డాక్టర్ వై. కామేశ్వరిగారు ఉపన్యసించారు.

1991 మే 5వ తేదీన శ్రీ ముక్తేవి లక్ష్మణరావుగారు, డాక్టర్ ముక్తేవి భారతిగారు కలిసి రచించిన 'భారతంలో ప్రేమకథలు' అనే యువభారతి రజతోత్సవ ప్రచురణను ఆచార్య సి. నారాయణరెడ్డి గారు ఆవిష్కరించారు. మహాభారతంలోని ప్రేమ కథలపై డాక్టర్ వి.వి. యల్. నరసింహారావుగారు, శ్రీ ఓలేటి పార్వతీశంగారు, డాక్టర్ పి. అనంతలక్ష్మీగారు ఉపన్యసించారు.

1991 జూన్ 2వ తేదీనాడు ప్రజాస్వామ్య వ్యవస్థలో నేడు విలయతాండవం చేస్తున్న హత్యా రాజకీయాలపై కవుల తీవ్ర ప్రతిస్పందన తెలిపే కవిసమ్మేళన కార్యక్రమం 'ప్రజాస్వామ్య హత్య' అనే శీర్షికతో జరిగింది. అధ్యక్షులు సహజకవి శ్రీ మల్లెమాల గారు (ఎం.ఎస్.రెడ్డి); ముఖ్యఅతిథిగా ఆచార్య సి. నారాయణరెడ్డిగారు పాల్గొన్నారు. ఈ కవిసమ్మేళనంలో 35మంది కవులు పాల్గొని కవితలు చదివారు. వారిలో శ్రీయుతులు –డాక్టర్ బోయి భీయన్న, డాక్టర్ నాయని కృష్ణకుమారి, డాక్టర్ జె. బాపురెడ్డి, వాస్తుశిల్పి శ్రీ బి.యన్. రెడ్డి, డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి, డాక్టర్ వెలిచాల కొండలరావు, శ్రీ కె. వెంకటశివయ్య, శ్రీ ఊట్ల కొండయ్య, డాక్టర్ వి.వి. యల్. నరసింహారావు, శ్రీ ఎల్లోరా, డాక్టర్ ఎల్లూరి శివారెడ్డి, డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్య, డాక్టర్ ముకురాల రామారెడ్డి, ఆచార్య తిరుమల, సి. వేదవతి, డాక్టర్ కసిరెడ్డి వెంకటరెడ్డి, సి.వి. కృష్ణారావు, డాక్టర్ కాళేశ్వరం శంకర్, కె. రామమోహన శర్మ, హరిచంద్రశేఖర్, డాక్టర్ గౌరీశంకర్, డాక్టర్ సుమనశ్రీ, డాక్టర్ అంతటి నరసింహం, మందడి కృష్ణారెడ్డి, తాళ్లపల్లి మురళీధరగౌడ్, కుమారస్వామి నాయుడు, మసన చెన్నప్ప, శారదా అశోకవర్ధన్, దోర్బల రాజశేఖరశర్మ, అయ్యగారి ప్రభాకర్, దయానందబాబు, డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం ప్రభృతులు స్వీయ కవితాగానం చేశారు.

1991 జులై 7వతేదీ సమావేశానికి అధ్యక్షులు డాక్టర్ ముదిగొండ శివప్రసాద్ గారు, ముఖ్యఅతిథి శ్రీ హరిహరశర్మగారు. ఆ సభలో 'నవలః రస సిద్ధాంతం' పై డాక్టర్ ముదిగంటి సుజాతారెడ్డిగారు, 'రచయిత్రుల నవలల్లో సామాజిక స్పృహ' పై డాక్టర్ టి.వి. నాగ రంజని గారు, 'జానపద కథానిర్మాణం' పై శ్రీ పులికొండ సుబ్బాచారిగారు ఉపన్యసించారు.

1991 ఆగస్టు 4 వ తేదీ సమాలోచనంలో డాక్టర్ నాగినేని భాస్కరరావుగారు రచించిన కవితా సంపుటి (యువభారతి రజతోత్సవ ప్రచురణ) ఆవిష్కరణ జరిగింది. సభాధ్యక్షులు – శ్రీ శీలా వీర్రాజుగారు, ముఖ్యఅతిథి, గ్రంథావిష్కర్త – శ్రీ కె. శివారెడ్డిగారు; ఆచార్య చేకూరి రామారావుగారు శుభాకాంక్షలు తెలిపారు. శ్రీ కె. శ్రీనివాస్, శ్రీమతి కె.బి. లక్ష్మి, శ్రీ జి. కుమారస్వామినాయుడుగారలు

గ్రంథ సమీక్ష చేశారు. డాక్టర్ నాగినేని భాస్కరరావుగారు రచయితగా మాట్లాడారు.

1991 సెప్టెంబరు 1వ తేదీనాడు 'శ్రీ కృష్ణ సాహితీ సమాలోచనం సాగింది. ముఖ్యఅతిథిగా డాక్టర్ పి.యశోదారెడ్డిగారు పాల్గొని 'యశోద : శ్రీ కృష్ణుడు' అనే అంశం మీద ఆర్ద్రగంభీరంగా మాట్లాడారు. సభలో 'కావ్యసాహిత్యంలో రాధాకృష్ణులు' అనే అంశంమీద డాక్టర్ పి. అనంతలక్ష్మిగారు, 'కృష్ణశాస్త్రి సాహిత్యంలో కృష్ణుడు' పై డాక్టర్ ఎన్.నిర్మలాదేవిగారు, 'తెలుగునాటక రంగం: శ్రీకృష్ణపాత్ర' పై శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు గారు, ఉపన్యసించారు. డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం గారు సభకు అధ్యక్షత వహించారు.

1991 అక్టోబరు 6వ తేదీనాటి సభలో విశ్వనాథ సాహితీ సమాలోచనం సాగింది. సభాధ్యక్షులు డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు. ముఖ్యఅతిథి - శ్రీ వాకాటి పాండురంగారావుగారు, ఆ సభలో 'విశ్వనాథ మధ్యాక్కరలు' మీద డాక్టర్ ఎన్.ఎస్. రాజుగారు, విశ్వనాథవారి 'కిన్నెరసాని' మీద శ్రీమతి సి.వేదవతిగారు, 'విశ్వనాథ నాటకాలలో విషాదాంతనాయకులు' పై డాక్టర్ ఆర్. కమలగారు ఉపన్యసించారు.

1991 నవంబరు 3 వ తేదీనాడు శ్రీ ఎం. నాగరాజుగారి గ్రంథం 'ఆధునిక సాహిత్య విమర్శ - అభిరుచి ధోరణి' ని శ్రీ వడలి మందేశ్వరరావుగారు ఆవిష్కరించారు. ఆచార్య రవ్వా శ్రీహరిగారు కృతిని స్వీకరించారు. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం సభకు అధ్యక్షత వహించారు. అభిరుచి విమర్శను గురించి డాక్టర్ ఎల్లూరి శివారెడ్డిగారు, డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు, శ్రీ పి. నాగరాజుగారు మాట్లాడారు. 1991 డిసెంబరు 1వ తేదీన డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్యగారి అధ్యక్షతన యువకవి సమ్మేళనం జరిగింది. ఇరవై నలుగురు యువ కవులు, కవయిత్రులు తమ కవితలు చదివారు.

1992 జనవరి 5వ తేదీన శ్రీమతి వై. రెడ్డి శ్యామల రచించిన గ్రంథం 'హిందీ మాతృభాషగాగల విద్యార్థులకు ద్వితీయ భాషగా తెలుగు బోధన - సమస్యల విశ్లేషణ' ను ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు ఆవిష్కరించారు. ఆచార్య భీమసేన్ నిర్మల్ గారు సభకు అధ్యక్షత వహించారు. ఆచార్య వై. వెంకట రమణరావు దంపతులు కృతిని స్వీకరించారు. ఆచార్య బి. రామకృష్ణా రెడ్డిగారు, డాక్టర్ పి. రామనరసింహంగారు ఉపన్యసించారు.

1992 ఫిబ్రవరి మొదటి ఆదివారం యువభారతి సాహితీ మిత్రుల సమావేశం జరిగింది. మార్చి 1వ తేదీ ఆదివారంనాడు మహిళా సమావేశం జరిగింది. సభాధ్యక్షురాలు శ్రీమతి తురగా జానకిరాణిగారు, ముఖ్యఅతిథిమాన్యులు శ్రీమతి నన్నపనేని రాజకుమారి గారు. ఆ సభలో 'సంస్కృతీ పరిరక్షణం - కుటుంబం' అనే అంశం మీద శ్రీమతి అరుణా వ్యాస్‌గారు, 'పాఠ్యపుస్తకాల్లో స్త్రీ చిత్రణ' పై డాక్టర్. బి. సరోజన గారు, 'కథానికల్లో స్త్రీ పాత్రచిత్రణ మీద శ్రీమతి నాగపద్మినిగారు మాట్లాడారు. 1992 ఏప్రిల్ 5వతేదీ ఆదివారంనాడు డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారి అధ్యక్షతన కవిసమ్మేళనం జరిగింది. 1992 మే 3వ తేదీ ఆదివారం నాడు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతన కవి, కథక, విమర్శక సమ్మేళనం జరిగింది. ఒకవిధంగా 1992 జనవరి నుండి సమాలోచన కార్యక్రమంలో ఒక క్రొత్త మార్పు తెచ్చే ప్రయోగం కనపడుతుంది. ఎక్కువమంది యువతీ యువకులు కార్యక్రమాలలో పాల్గొనేటట్లు సమాలోచనం రూపొందుతోంది. వివిధ విషయాలపై విభిన్న దృక్పథాల సమాలోచనంగా యువతకు సన్నిహితం కావాలని ఉద్యమిస్తున్నది !

ఈ 'సమాలోచనం' గోష్ఠులకు సమావేశకర్తలుగా ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు, డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు, శ్రీ మాడభూషి అనంతాచార్యగారు, శ్రీ పాతూరి నాగరాజుగారు, శ్రీమతి కె.బి. లక్ష్మిగారు వ్యవహరించారు. వారికి నా కృతజ్ఞతలు.

ఎస్. వెంకటేశ్వరరావు

కార్యదర్శి, యువభారతి



"మహతి"ని ఆవిష్కరించి ప్రసంగిస్తున్న అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, ఇప్పటి భారత ప్రధాని మాన్యశ్రీ పి.వి.నరసింహారావు గారు. వేదిక మీద డా.ఇరివెంటి కృష్ణమూర్తి, డా. జి.వి. సుబ్రహ్మణ్యం, డా. దేవులపల్లి రామానుజరావు, మాన్యశ్రీ భాట్టం శ్రీరామమూర్తి, డా॥ దాశరథి, శ్రీ అక్కిరాజు వాసుదేవరావు గారలు.




'చైతన్యలహరి' ఉపన్యాస పరంపరలో ముఖ్య అతిథి సందేశాన్ని అందిస్తున్న మాన్యశ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు. వేదిక మీద ఆసీనులైనవారు – డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు, డాక్టర్ సి. నారాయణరెడ్డి, డా॥ దాశరథి, డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారలు



కావ్యలహరి ఉపన్యాస పరంపర సభలో ముఖ్య అతిథిగా ప్రసంగిస్తున్న మాన్యశ్రీ జస్టిస్ ఆవుల సాంబశివరావు గారు.
వేదిక మీద డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి, డా॥ సి. నారాయణరెడ్డి, ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారలు



యువభారతి లహరి ఉపన్యాస వేదికపై ఆసీనులై ఉన్న ప్రముఖులు - డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం,
మాన్యశ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, మాన్యశ్రీ ఎం.వి. కృష్ణరావు, శ్రీ కె.వి. గోపాలస్వామి, డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి,
డా॥ మోటూరి సత్యనారాయణ గారలు



యువభారతి లహరి సభలో ఉపన్యసిస్తున్న డా॥ దాశరథి గారు. వేదికమీద - శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ, డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి ప్రభృతులు




యువభారతి లహరి ఉపన్యాస సభలో అధ్యక్షోపన్యాసం చేస్తున్న శ్రీ గడియారం రామకృష్ణ శర్మ గారు. వేదిక మీద - డా॥ బి. రామరాజు, మాన్యశ్రీ డా॥ బెజవాడ గోపాలరెడ్డి, డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారలు.




రామాయణ సుధా లహరిలో ఉపన్యసిస్తున్న ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు. వేదిక మీద – డా॥ దేవులపల్లి రామానుజరావు, శ్రీ యడవల్లి శివరామశాస్త్రి, డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారలు.



రామాయణ సుధాలహరిలో ఉపన్యసిస్తున్న కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు. వేదిక మీద – డా॥ బి. రామరాజు, డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు, శ్రీ ఇ.వి. రామిరెడ్డి గారలు.



వికాసలహరిలో అధ్యక్షోపన్యాసం చేస్తున్న డా॥ పి. యస్. ఆర్. అప్పారావు గారు, వేదిక మీద -
శ్రీ ఆరుద్ర, మాన్య శ్రీ జస్టిస్ ఒ. చిన్నప రెడ్డి, డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారలు.




యువభారతి సభలో అధ్యక్షోన్యాసం చేస్తున్న డా॥ పాటిబండ మాధవశర్మగారు. వేదిక మీద -
డా॥ దేవులపల్లి రామానుజరావు గారు, సరస్వతీపుత్ర డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు గారు మొదలైనవారు.




జగద్గురు సాహితీ లహరిని ప్రారంభిస్తూ అనుగ్రహభాషణాన్ని ప్రసాదిస్తున్న జగద్గురువులు శ్రీ శృంగేరీ మఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ భారతీ తీర్థ మహాస్వాముల వారు.



'మారుతున్న విలువలు - రచయితల బాధ్యతలు' సదస్సును నిర్వహించిన యువభారతీయులు.



యువభారతి లహరి సభలకు వచ్చే అశేష సహృదయలోకంలో ఒక భాగం.



యువభారతి లహరి సభలలో పాల్గొన్న ప్రేక్షకులలో ఒక భాగం.

# ఇందులో 'వెలుగులు'

•••



యువభారతి రజతోత్సవ మహాసభను జ్యోతి వెలిగించి ప్రారంభిస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి
మాన్య శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి గారు




యువభారతి రజతోత్సవ మహాసభలో ఉపన్యసిస్తున్న మాన్య శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డిగారు. వేదికపై ఆసీనులైన వారు
(ఎడమనుంచి కుడికి) డా॥ జె. బాపురెడ్డి, డా॥ దేవులపల్లి రామానుజరావు, వాస్తుశిల్పి శ్రీ బి.ఎన్.రెడ్డి,
పద్మభూషణ్ డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ జి.వి.సుబ్రహ్మణ్యం గారలు



యువభారతి రజతోత్సవ కవిసమ్మేళనంలో ముఖ్యఅతిథిగా పాల్గొని 'అమృతరాజీవం'ను ఆవిష్కరిస్తున్న శ్రీ టి. ఎస్.రావు I.P.S., గారు. వేదిక మీద - డా. జి.వి.సుబ్రహ్మణ్యం, వాస్తుశిల్పి శ్రీ బి.ఎన్.రెడ్డి, సహజకవి శ్రీ మల్లెమాల (కవిసమ్మేళనం అధ్యక్షులు), శ్రీ కె. కామేశ్వరరావు మొ॥ వారు.



యువభారతి రజతోత్సవాలలో 'పాతికేళ్ల పత్రికారచన' గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న శ్రీ కె.వి. రమణగారు I.A.S., వేదిక మీద పద్మశ్రీ కుమారి శ్రీరంగం గోపాలరత్నం, డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం, డాక్టర్ పుండేల మాలకొండారెడ్డి, పద్మభూషన్ శ్రీ ఎ. ఆర్. కృష్ణ, పద్మశ్రీ శ్రీ నటరాజ రామకృష్ణగారలు



యువభారతి రజతోత్సవ లహరి 'తెలుగు కవిత - లయాత్మకత' ఉపన్యాస పరంపరలో 'పద్యకవిత - లయాత్మకత' మీద ఉపన్యసిస్తున్న పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డి గారు. వేదిక మీద ఆసీనులైనవారు - సభాధ్యక్షులు డాక్టర్ జె. బాపురెడ్డి గారు, ముఖ్య అతిథి మాన్యశ్రీ డి. శ్రీపాదరావు గారు, డాక్టర్ వుండేల మాలకొండారెడ్డి గారు.



యువభారతి రజతోత్సవ ఉపన్యాసలహరి కార్యక్రమాలకు వచ్చిన అశేష ప్రేక్షకులలో ఒక భాగం




యువభారతి రజతోత్సవాల సదస్సు 'క్రొత్త గొంతుకలు - సరిక్రొత్త విలువలు'లో ముఖ్య అతిథి సందేశాన్నిస్తున్న శ్రీ ఎం.ఆర్. సుబ్రహ్మణ్యంగారు. వేదికమీద ఉన్నవారు - డాక్టర్ ముక్తేవి భారతి, ఆచార్య నాయని కృష్ణకుమారి, ఆచార్య ఎస్.గోపి, ఆచార్య పేర్వారం జగన్నాథం, డాక్టర్ ముసన చెన్నప్ప గారలు.



యువభారతి రజతోత్సవాల సదస్సు - 'విద్యావైద్య శాస్త్ర కళారంగాలు - మానవతా విలువలు'లో ముఖ్య అతిథి సందేశాన్ని ఇస్తున్న శ్రీ జి. రామదాసు గారు. వేదికమీద - డాక్టర్ కె.వి. కృష్ణకుమారి, ఆచార్య జి. లక్ష్మీనారాయణ, శ్రీ తెన్నేటి పూర్ణచంద్రరావు, శ్రీ పి. నాగరాజు గారలు




'పాతికేళ్ళ పత్రికా రచన' సదస్సు ప్రారంభ సభ (27-10-1991)లో ప్రధానపత్రం సమర్పిస్తున్న శ్రీ ఎ.బి.కె. ప్రసాద్ గారు. వేదిక మీద - [illegible] శ్రీ బి.ఎన్.రెడ్డి గారు, ఆచార్య సి. నారాయణరెడ్డి గారు, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు.




'పాతికేళ్ళ పత్రికా రచన' సదస్సులో 'పత్రికలు, రాజకీయాలు - పరస్పర ప్రభావం' అనే అంశం మీద ముఖ్య అతిథి గా ఉపన్యసిస్తున్న శ్రీ గజ్జెల మల్లారెడ్డి గారు. వేదిక మీద శ్రీ కె.వి. రమణ I.A.S., శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు, శ్రీ ఆర్.వి.రామారావు, శ్రీ దాసు కేశవరావు గారలు.




‘స్త్రీ వాద ధోరణులు – సమకాలీన సాహిత్యం’ సదస్సులో అధ్యక్షోపన్యాసం చేస్తున్న డాక్టర్ ఎన్. నిర్మలా దేవి గారు. వేదిక మీద – డాక్టర్ ఎం. లావణ్య సరస్వతి, శ్రీమతి శారదా అశోకవర్ధన్, డాక్టర్ కాత్యాయనీ విద్మహే, శ్రీమతి కె.బి. లక్ష్మిగారలు.



యువభారతి ప్రచురణల ప్రదర్శనలో యువభారతీయులు – శ్రీయుతులు ఎస్. వెంకటేశ్వరరావు, వి. కృష్ణమూర్తి, ఆర్. నారాయణరెడ్డి, డా॥ డి.కె. శ్రీనివాసాచార్యులు, వి. జనార్దనరావు, వి.వి.శాస్త్రి, శ్రీమతి కె.బి.లక్ష్మిగారలు



నెల నెలా జరిగే 'సమాలోచనం'లో 1991 ఆగస్టు 4వ తేదీన డాక్టర్ నాగినేని భాస్కరరావు గారి కవితా సంపుటి 'ఆక్సిజన్' ఆవిష్కరణం. వేదిక మీద ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం, ఆచార్య చేకూరి రామారావు, శ్రీ శీలా వీర్రాజు, శ్రీ కె. శివారెడ్డి (ఆవిష్కర్త), శ్రీమతి కె.బి. లక్ష్మి, డా॥ నాగినేని భాస్కరరావు, శ్రీ జి. కుమారస్వామి నాయుడు గారలు.




రజతోత్సవ 'సమాలోచనం' కార్యక్రమాలను నిర్వహించిన యువభారతీయులు.



యువభారతి గౌరవ సభ్యులతో యువభారతీయులు

# భారతీయ జ్ఞానపీఠం
## పురస్కార ప్రదానోత్సవ ప్రసంగం

**పద్మశ్రీ కళాప్రపూర్ణ డా॥ సి. నారాయణ రెడ్డి**
**న్యూఢిల్లీ, 29 డిసెంబర్ 1989**

మాన్యులు భారత ఉపరాష్ట్రపతి డా. శంకర్ దయాళ్ శర్మగారికి,
మాన్యులు భారతీయ జ్ఞానపీఠ నిర్ణాయక సంఘాధ్యక్షులు
శ్రీ పి.వి. నరసింహారావుగారికి,
భారతీయ జ్ఞానపీఠ అధ్యక్షులు శ్రీ సాహు శ్రేయాన్స్ ప్రసాద్ జైన్ గారికి
భారతీయ జ్ఞానపీఠ మేనేజింగ్ ట్రస్టీ శ్రీ అశోక్‌కుమార్ జైన్ గారికి,
ప్రేక్షక మహాశయులకు

**నమస్కారాలు,**

ప్రతిష్ఠాత్మకమైన భారతీయ జ్ఞానపీఠ పురస్కార ప్రదానం జరగుతున్న ఈ రోజు నిజంగా భారతీయ సాహిత్య చరిత్రలో చిరస్మరణీయం. ఈ అత్యున్నత పురస్కారాన్ని నెలకొల్పినందుకు శ్రీ సాహు శాంతి ప్రసాద్ జైన్‌గారికి సాహిత్యాభిమానులందరి పక్షాన కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను. మౌలిక సాహిత్య సృజనను ప్రోత్సహించే సత్సంకల్పంతో ఈ పురస్కారాన్ని ఏర్పాటు చేయడం ఆయన వదాన్యతకు నిదర్శనం. తెలుగులో ఈ పురస్కారం అందుకున్న వారిలో రెండవ వాణ్ణి కావడం అదృష్టంగా భావిస్తున్నాను. 'రామయణ కల్పవృక్ష' కావ్యకర్త, బహుముఖ ప్రజ్ఞశాలి కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారికి 1970లో మొదట ఈ పురస్కారం లభించింది. అరవై సంవత్సరాల లోపు వయస్సులో ఈ పురస్కారాన్ని అందుకున్న వారిలో నేనూ ఒకణ్ణి కావడం విశేష గౌరవంగా భావిస్తున్నాను.

పురస్కారం అందుకుంటున్న సందర్భంలో సాహిత్యాన్ని గురించి గ్రహీత తన దృక్పథాన్ని తెలియజేయడం సంప్రదాయంగా వస్తోంది. ఇప్పుడు నేను జీవితం పట్ల, కవిత్వం పట్ల నాకున్న అభిప్రాయాలను చెప్పాలనుకుంటున్నాను.

నేను పుట్టింది పైరుపచ్చల ఒడిలో. ఓనమాలు చుట్టింది వట్టి మట్టిబడిలో. మూడో తరగతి వరకు ఆ వీధిబళ్ళో ఏం చదువుకున్నానో గుర్తు లేదు. సిరిసిల్ల (తాలుకాకేంద్రం)లో నాలుగో తరగతిలో చేరడానికి వెళ్తానని మొండిపట్టుపట్టాను. "పదినాగళ్ల వ్యవసాయం మనది, మనకు చదువులెందుకు బాపూ!" అంటూ మా అమ్మ పరమగారాబంగా అడ్డుపడింది. అభిమానం దెబ్బ తిన్న క్షణికావేశంలో ఊరవతలి మోటబావిలో దూకి ఆత్మహత్యకు తలపడ్డాను. ఆ తరువాత ఎలా బయటపడి బతికి బట్టకట్టానో నా స్మృతుల పుట మీద చెరగని అక్షరాలుగా మిగిలిపోయింది. అప్పటి కది మా ఊరికే పై చదువు. మెట్రిక్యులేషన్ వరకు చదివి నేను తాలుకా తాశీల్దారు కావాలని నాన్న కోరిక. చదివింది చాలు దర్జాగా వ్యవసాయం చేయించుకుంటూ తన కళ్ళముందు ఎదగాలని అమ్మ తపన. ఇది బాల్య రేఖా చిత్రం.

పల్లె నాకు పాట నిచ్చింది. పట్నం మాట లిచ్చింది. నడక నేర్పింది పల్లె. పరుగు నేర్పింది పట్నం. చిన్ననాడు పల్లెలో విన్న జానపద గీతాలూ, హరికథలూ నా ఆదిగురువులు. పట్నంలో, నగరంలో చూసిన సినిమాలు, నాటకాలు నా తదుపరి అధ్యాపకులు. నా తొలి నాళ్ళ పాటలకూ, పద్యాలకూ, గేయనాటికలకూ ఇవే ప్రేరకాలు.

తరువాతి కాలంలో నే నన్న కింది నాలుగు పంక్తులు నా సాహితీ వ్యక్తిత్వాన్ని చతుర్ముఖంగా చాటుతాయి;

"నడక నా తల్లి
పరుగు నా తండ్రి
సమత నా భాష
కవిత నా శ్వాస"

నా దృష్టిలో తల్లి లాంటిది సంస్కృతి. తండ్రి లాంటిది నాగరకత. సంస్కృతి నిగ్రహరూపిణి. నాగరకత వేగస్వరూపిణి. తల్లి ప్రపంచాన్ని ఇంట్లో చూస్తుంది. తండ్రి ఇంటిని విశ్వం అంచుదాకా తీసుకెళ్ళాలని చూస్తాడు. ఈ రెంటి సమన్వయమే సమగ్ర జీవన సాఫల్యం.

ఆ మధ్య "కవిత నాశ్వాస" అన్నాను. ఆ తరువాత "కవిత్వం నా మాతృభాష" అన్నాను. నా ఇటీవలి కవితా సంపుటికి 'కవిత నా చిరునామా' అని నామకరణం చేసుకున్నాను. కవిత్వానికీ నాకూ వున్న అనుబంధం అంతటిది. బాల్యంలోనే కవిత్వంలా మాట్లాడేవాణ్ణట. పదో'యేటనే మొక్క జొన్న చేలో నిలబడి మొక్కల్ని విద్యార్థులుగా సంబోధించి పాటలు, పాఠాలు చెప్పేవాణ్ణట. పాట నన్ను ఎలా అల్లుకుపోయిందో, వివిధ వయోదశల్లో నా వ్యక్తిత్వాన్ని ఎలా పలికించిందో గుర్తుంచుకునే ఓ సారి ఇలా అన్నాను.

"చిననాటి నుండి వ్రాసినదేదో వ్రాసితిని
పలుక గలిగిన దెల్ల పాటగా చేసితిని".

అంతేకాదు. పాటకూ నా ప్రాణానికీ వున్న అవినాభావ సంబంధాన్ని ఇలా ప్రకటించుకున్నాను.

"ఎన్ని తెన్నులకై తకన్నె విహరించినను
పాటలోనే నాదు ప్రాణాలు గలవందు"

'నవ్వని పువ్వు' గేయనాటికల సంపుటినుంచి 'నాగార్జున సాగరం', 'కర్పూర వసంతరాయలు' లాంటి సుదీర్ఘ గేయ కావ్యాల వరకు ఈ పాటే నన్ను పలికించింది, నడిపించింది. కవిగా నాకు సొంత గొంతును తొడిగించింది.

హనుమాజిపేట గ్రామంలో చిగురెత్తిన నా పాట హైదరాబాదు నగరంలో తీగసాగి, హస్తినాపురం అంచులదాకా పాకిపోయింది ఈ ప్రతిష్ఠాత్మక జ్ఞాన పీఠ పురస్కారంతో. చిత్రమేమిటంటే హనుమాజిపేట, హైదరాబాదు, హస్తినాపురం - ఈ మూడు పదాలు హకారాదులే. నాలోని కవి నమస్కరిస్తున్నాడు ఈత్రయికి మనసా, వాచా, కర్మణా.

నాలుగో తరగతి నుండి బి.ఏ. వరకు నేను చదివింది ఉర్దూ మీడియంలో. నిజాం ఏలుబడిలో తెలుగు ఐచ్ఛిక విషయంగా మాత్రమే ఉండేది. ఆ రోజుల్లో తెలుగు మీడియం గగనకుసుమం కదా! కళాశాల దశలో ఎకనామిక్స్‌ను "మాషియాత్"గా, సోషియాలజీని "ఉమ్రానియాత్"గా చదువుకున్న ఫారసీ ప్రాబల్యం వున్న ఉర్దూ నేపథ్యం నాది. అప్పటికి నా ఇంగ్లీషు తెలివి అంతంత మాత్రమే.

"ఉర్దూనే విద్యార్థిగ ఊపిరిలా పీల్చుకున్న
నాలో తెలుగును మలచిన నాలుక"కు

నే నెప్పుడూ కృతజ్ఞుణ్ణే. అయితే ఉర్దూచదువు నాలో ఉప్పొంగే తెలుగు కవితకు ద్రోహం చేయలేదు - దోహదమే తప్ప. ప్రవాహాన్ని పాత్రలో చూపే ఉర్దూ గజళ్ళలోని సంక్షేపగుణం నా పలుకుమీద లలితముద్ర వేసింది. బి.ఏ.లో ద్వితీయ భాషగా నేర్చుకున్న హిందీ నా వాఙ్మయ జీవితంలో వాదోడుగా నిలిచింది. తెలుగు, సంస్కృతం, హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు భాషా సాహిత్యాల అధ్యయనం నా వాణికి వైవిధ్యాన్ని సమకూర్చింది. ఒక వ్యక్తి ఎన్ని భాషలు ఎక్కువగా నేర్చుకుంటే అతడు అంతగా నాగరకత సంపన్నుడవుతాడు. ఎంతగా వద్దని మడిగట్టుకున్నా పరభాషలోని పదాలు మన భాషలో చొరబడకుండా వుంటాయా! లాటిన్, ఫ్రెంచి, జర్మన్, గ్రీకు, స్పానిష్, ఇటాలియన్ లాంటి భాషల పదాలను కాదని బతకగలుగుతుందా ఇంగ్లీషు - ఓ పదిశాతం 'ఆంగ్లో సాక్సన్' పదాలతో. ఫారసీ, అరబ్బి, ఉర్దూ, హిందీ మొదలైన అన్య భాషాపదాల ఉడుపులు విసర్జిస్తే తెలుగు కండ బట్ట బయలవుతుంది ఓ సన్నని బెండులా. ఈ వాస్తవాన్ని కాస్తా గమనిస్తే చాలు అర్థమవుతుంది అన్యభాషల పట్ల అసహనం ఎంత అవివేకమూలకమో. ఈ విషయాన్ని స్పృశిస్తూ ఓ కవితలో ఇలా అన్నాను.

" దేశం కాగితంలో
ప్రాంతాలు అడ్డగీట్లు.
గీట్ల గట్ల నడుమ
భాషలు ప్రవహిస్తాయి గంగలా, గౌతమిలా.
అవతలి మాట అంటుకుంటుందని
ఇవతలి గట్టుకు ఉలికిపాటు.
నీళ్ళకు లేని కుళ్ళు బుద్ధి గట్టు కెందుకున్నట్లు?
శ్వాసలాంటిదే భాష.
ఒంట్లో పుడుతుంది
ఊహలకు గొంతుకలు చుడుతుంది.
మనిషినీ నేలనూ కలిపి కుడుతుంది.
అక్షరాల పర్వతాలు పొంగించే
ఆవేశం నాభాష"

ఇంతకూ ఏ భాషైనా కలిపికుట్టేదే కానీ విడగొట్టేది కాదు. మూగ గుండెకు మాటల్ని తొడిగేదే కాని మృగత్వాన్ని రేపేది కాదు. బహుభాషావతరణం మానవుని అభివ్యక్తి స్వేచ్ఛకు ప్రబల నిదర్శనం. ఆదిమానవుడు తన అభిప్రాయాలను సమర్థంగా ప్రకటించడానికి తనకు ఇష్టమైన శబ్దవాహికను ఎన్నుకున్నాడు. అదే క్రమంగా యాస (డైలెక్ట్) లోంచి భాషగా పరిణామం చెందింది. అసలు ఎన్ని యాసలుంటే ఆ భాష అంత ప్రవాహరూపిణి అన్నమాట. నాల్కల మీద నడవని భాష స్థితభాష. ఆధునిక భారతీయ భాషలన్నీ ప్రస్థాన భాషలు, ప్రవాహ భాషలు. భారతదేశ రాజ్యాంగంలో పీటవేసుకున్నవి పదిహేను భాషలైనా భాషా శాస్త్రవేత్తలు 179 నాగరిక భాషలను, 544 యాస భాషలను గుర్తించారు. ప్రాచ్యసంస్కృతి బహుముఖ వికాసానికి భారతీయ భాషలు నిర్వహించిన భూమిక అక్షర జగత్తుకు శాశ్వత జ్ఞాపిక. అపార వైవిధ్యమే భారతీయ వాఙ్మయానికి వాసినీ, రాశినీ సమకూర్చింది. వైవిధ్యం ఉన్నంత మాత్రాన వైరుధ్యం ఉందనుకోరాదు. తరచి చూస్తే అన్ని భాషల అంతరంగ మొకటే "ఇండియన్ లిటరేచర్ ఈజ్ వన్ దో రిటెన్ ఇన్ మెనీ లాంగ్వేజస్" అన్న డా. రాధాకృష్ణన్ ఈ మౌలికాత్మనే సూత్రీకరించారు.

ప్రాథమికదశలో సాధారణంగా అందరు యువకవుల్లాగే ప్రణయాంచలాలు అందు కోవడానికి పాటల్ని ఎగరేశాను. తెచ్చి పెట్టుకున్న వియోగ వ్యథతో దీర్ఘనిశ్వాసాలు ప్రసారం చేశాను. ఓ పక్క ఇలా జరుగుతున్నా మరో పక్కన బాల్య యవ్వన సంధిలో సగటు మనిషినా నాల్క అంచును వదల్లేదు. హైస్కూలు విద్యాభ్యాసం చివరి రోజుల్లో అప్పటి రజాకార్ల దురంతాలను నిరసిస్తూ స్వరాజ్య సమరాన్ని ఉద్ఘోషిస్తూ పాటలూ, పద్యాలూ రాశాను. ముసురుకుంటున్న మూడో ప్రపంచయుద్ధం విషపు మబ్బుల్ని ఉప్పున ఊదేయాలని ఎంత కవిత్వం విసిరేశానో ఆ రోజుల్లో.

" ఈ జగత్తు ఏనాడు చితికి పోనుందో ఇంకా నాకు భయంగానే వుంది.
ఏ నగరం హిరోషిమా కానుందో ఇంకా సంశయంగానే వుంది".

అంటూ 1952లో బి.ఏ. విద్యార్థిగా నేను ఆందోళన ప్రకటించాను. తదనంతర కాలంలో

"నిరంతరాంధకారం యుద్ధం
శాశ్వత సూర్యోదయం శాంతి
పిలిచి పీట వేసిన మృత్యువు యుద్ధం
వలచి పొడిగించిన జీవితం శాంతి"

అన్న పంక్తుల్లో విశ్వశాంతికి వెన్నూతగా వేళ్ళు నాటుకుపోయింది.

పునరుక్తి అనుకున్నా సరే పదే పదే అంటాను. మనిషంటే శాశ్వత సత్యమని, అందుకే మనిషితనం నా ఇతివృత్తమనీ, నా 'మంటలు మానవుడు' కవితా సంపుటిలో మనిషిని మారుతి అని, మార్కండేయుడనీ అనడం ఆ పురాణ మూర్తులను పునః ప్రతిష్ఠించడం కోసం కాదు. కాలాన్నీ కాలుణ్ణీ జయించిన మనిషి చిరంజీవిత్వాన్ని, పురోగామిత్వాన్ని ఉద్ఘోషించడానికే ఆ సంజ్ఞను నేను వాడేంది.

సరిగ్గా నూరుపుటల్లో కుదించుకున్న 'నా విశ్వంభర' కావ్యం ఒక మానవోపనిషత్తు.

" ఈ కావ్యానికి నాయకుడు మానవుడు. రంగస్థలం విశాల విశ్వంభర. ఇతివృత్తం - తేదీలతో నిమిత్తం లేని, పేర్లతో అగత్యం లేని మనిషి కథ. ఈ కథకు నేపథ్యం ప్రకృతి. మనిషి ధరించే వివిధ భూమికలకు మూల ధాతువులు మనశ్శక్తులు."

నిజానికి మనిషి కంటే ప్రకృతి సుందరమైంది. ప్రబల శక్తి బంధురమైంది. అయినా మనిషంటూ పుట్టకపోతే ప్రకృతి నిరర్థకంగా పడి వుండేది. ఈ అభిప్రాయాన్నే నా 'విశ్వంభర' కావ్యంలో ఇలా అందించాను..

"నేను పుట్టక ముందు
ఎంతగా మబ్బు లెదురు చూశాయో
చూపుల సోపానాలపై సాగి వచ్చి
తమను పిండుకునే తపన ఏదని.
ఎంతగా నక్షత్రాలు నిరీక్షించాయో
గణిత సూత్రాలతో తమ గతుల్ని
మణులుగా కూర్చే మననమేదని.
ఉషస్సులెంతగా ఉద్వేగపడ్డాయో
విచ్చుకున్న తమకంటే కడలిలో
పిచ్చిగా మురగెత్తే విముక్తాత్మ లేవని.
వెన్నెల లెంతగా విహ్వలించాయో
తాము విసిరేసిన వలువల ఒడిలో
తలదాచుకునే మిథునాత్మ లేవని."

పంచభూతాలను ఒకవైపు, మనిషిని ఒక వైపు పెట్టి తూచితే మనిషివైపే మొగ్గు. ఆకాశం ముందు మనిషి అంగుష్ఠ మాత్రుడే. అయినా రోదసినీ నేల మీదికి వంచుతున్నాడు. గాలితో, నీటితో, వెలుతురుతో ఇష్టమైన చాకిరీ చేయించుకుంటున్నాడు. కళాత్మకంగా, వైజ్ఞానికంగా, ఆధ్యాత్మికంగా అంచెలంచెలుగా ఎదిగిపోతూ అదృశ్య శక్తులను కాలం తెరమీదికి తెస్తున్నాడు. అగమ్య శక్తులను పగ్గాలు వేసి లాగి తన కళ్ళముందు వుంచుతున్నాడు. ఈ నిరంతర సాధనలో మనిషి పడ్డా నిలబడ్డాడు. క్షతుడైనా తిరోగతుడు కాలేదు. నేల మీద రాలిన పండుటాకు మళ్ళీ కొమ్మలోకి చేరుకోలేదు. విరిగిపడ్డ గిరిశిఖరం మళ్ళీ తన మూలానికి అతుక్కోలేదు. ప్రకృతికీ మనిషికీ వున్న తేడా ఇదే. అయితే మనిషి మర్త్యుడు కదా గాలిలా వెలుగులా చిరకాలం జీవించలేడు కదా అనొచ్చు. వావు పుట్టుకలున్న మనిషికాదు నా లక్ష్యం. అనుస్యూతంగా, అనాహతంగా సాగిపోయే మనిషితనం నావక్తవ్యం. ఇది అంతరిస్తున్నట్టు భ్రాంతి కలిగిస్తుంది, కానీ నిరంతరం. మృతిలాంటి పొగ లేపుతుంది కానీ, అమృతం. నిత్యచైతన్యమూర్తిగా సాగే మనిషి ప్రస్థానంలో అడుగడుగునా అవరోధాలు. నడుం విరిగిన రోడ్లు, కాళ్ళను పెళ్ళగించి వేసే సుడి గాల్పులు. ఇన్నిటిని తట్టుకున్న మనిషే సంపూర్ణ సాధకుడు.

" ఎన్ని సార్లు చెక్కితే ఒక శిల్పం
ఎన్ని సార్లు తీర్చితె ఒక చిత్రం
కబుర్లేవొ చెప్పకె ఓ కాలమా
ఎన్నిసార్లు చస్తే ఒక జీవితం".

"కవిర్మనీషీ పరిభూః స్వయంభూః", "నా నృషిః కురుతేకావ్యం" లాంటి వైదికోక్తులను విన్నప్పుడల్లా ఉలిక్కిపడిపోతాను. ఆ స్వయంభూత్వం, ఆ ఋషిత్వం కవి ననుకునే నాలోవున్నాయా అని, సమాధానం చెప్పుకుంటాను ఎందుకులేవని. పుట్టలాంటి శరీరంలోంచి పొడుచుకొచ్చిన ప్రతికవీ స్వయంభువే. భట్టతౌతుడు అనే ఆలంకారికుడు కవికిచ్చిన నిర్వచనం ఈ సందర్భంలో గమనించదగింది. అతడన్నాడు - "దర్శనాత్ వర్ణనాచ్చా ధరూఢా లోకే కవిశ్రుతిః" అని. ప్రపంచంలోని ఏ మహాకవికైనా అక్షరాల వర్తించే సూక్తి ఇది. ఈ నిర్వచనాన్ని చిన్నమాటల్లో చెబితే కవికి దర్శనం, వర్ణనం అనేరెండు శక్తులుండాలి అని. దర్శనమంటే తోలుకళ్ళతోనో గాజు కళ్ళతోనో చూసే చూపు కాదు - అంచుల్నీ లోతుల్నీ అందుకునే చూపు. అంటే 'విజన్' అన్న మాట. వర్ణనమంటే దాన్ని సమర్థంగా ప్రకటించే నేర్పు. అదే 'ప్రొవిజన్'. అంటే కమ్యూనికేషన్. ఈ రెండు ఉపజ్ఞలు బలంగా వున్న కవికి పుస్తకం అట్ట మీద తన పేరు ముద్రించుకోవలసిన అవసరం లేదు. కవిత కింద తన సంతకం అక్కర్లేదు. రాసిన ప్రతి కవిత ప్రతిభావంతుడైన కవి విశిష్ట వ్యక్తిత్వానికి నిలువుటద్దం. ఈ అభిప్రాయాన్నే ఓ తెలుగు రూబాయిలో ఇలా చెప్పాను.

" ఆ మబ్బు సంతకం వున్నది చినుకుల్లో,
ఈ మాను సంతకం వున్నది చిగురుల్లో,
ఏ దస్తావేజులను చూసి ఏం లాభం?
నా మనసు సంతకం వున్నది కవితల్లో "

ధన్యవాదాలు.

# నన్ను నన్నుగా చేసిన శ్రీమదభినవగుప్తుడు

శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ*

శ్రీమదనభివగుప్త పూజ్యపాదుడు నన్ను నన్నుగా చేసిన మహామహేశ్వరుడు. ప్రస్తుతః నేను, నా జాన్మాంతర పరిపాకమువలన నేను నేనే కాని నన్ను నేనెరుగను. అయినను నన్ను నన్నుగా చేసినది శ్రీ మదభినగుప్తుడె. నన్నెరింగించినది అభినవుడే. నేను నానాగురువులను సేవించినా,అభినవమహాగురువు నారాధించి "సంప్రదాయ దరిద్రత" లేదని భావింతును. నే నభినవశిష్యుడ నని యంతర్విశ్వాసముతో నుందును. నేనా ప్రత్యయముతో, వ్రాసిన పీఠికలు, భావోపహారములు, కామపీఠములు, వాకోవాక్యములు, వ్యాసముల రచనలు, నా సభా ప్రసంగములు, నా పలుకులు, గ్రంథములన్నియు నభినవభావ ప్రభావితులె. అభినవుడు మంత్ర, యంత్ర, తంత్ర తత్త్వ రహస్య విదుడు. నాట్య సాహిత్య రస సిద్ధాంత ప్రవర్తన మహాదేశికుడు, అభిజ్ఞ లోకమునకును గోచరము కాని నానావిశేషముల రహస్య విదుడు. అభినవ శిష్యుల భావములనేవి సరిగా తెలియుటకు నాకు శక్తి యున్నదా! అయిన నేనభినవగుప్త పూజ్యపాద భావానుయాయిని. అభినవబోధాదిత్య వికసిత హృత్సరోజుడనయిన కాగలిగితి ననుకొందును. "మీరు పఠింపుడు. తెలియకున్నను పఠింపుడు. పఠితము మిమ్ము విడవదు, విడవదు" అని అభినవసూక్తి. నే నభినవభావమును విడువను.

సంతోఽనుగృహ్ణీత కృతం తదీయాం గృహ్ణీత పూర్వం విధిరేష తావత్
తతోపి గృహ్ణాతు భవన్మతిం నా సద్యోఽనుగృహ్ణాతు చ తత్తదృష్ట్యా.

అనావధానముగా చదివినను అభినవానుగ్రహ ముండును. అభినవుడు సర్వరహస్యముల గుర్తించిన పండితపరమేశ్వరుడు, అనేక గురువుల సేవించిన వాడు. "సర్వశిష్యస్య నోపదేశ దరిద్రతా" భావ దారిద్ర్యం లేనివాడు. నా అభినవుడు "నిశ్శేషశాస్త్ర సదనం" "సర్వశాస్త్రరమసమజ్జన' శుభ్రచిత్తుడు. సాహిత్య సాంద్ర రసభోగపరుడు. తత్త్వ పరామర్శ ధన మనస్కుడు. సౌజన్య సింధువు. సర్వ విద్యాసరిత్పతి. నిజ హృదయ రసవిలసద్వికసస్వర నిర్వ్వర చమత్కార మాతనిదే. శివామృతము సేవించిన శివభావుడు. శివహస్తుడు. జడ మజడ మొనరించి సర్వము రసీకరింపగల శివీకరింపగల సంవిద్వైదుష్య మభినవునిదె. ●●● శ్రీ కల్యాణ దేశికానుగ్రహమున మంత్ర తంత్ర దర్శన రసభావ చింతన శీలుడ నయిన నాకు అభినవుడు శిరఃపీఠాధిపతి. వ్యాఖ్యానసింహాసనాధీశ్వరుడయిన నాకు అభినవు డెంతటివాడో నేనంతటి వాడను కావలెనని యభిలాషము కలదు. ఎన్ని జన్మలకయిన నంతటివాడను కావలెనని లోలో ననుకొందును. "ఈ కాంక్ష యుక్తము" అని యొక మిత్రశీలుని బహిర్హాసము లేని మాట. రుద్రభక్తి, మంత్రసిద్ధి-సర్వతత్త్వవశిత్వము ప్రారబ్ధకార్య నిష్పత్తి, కవిత్వము - సర్వశాస్త్రార్థవేతృత అభినవునకు కలవు. ఇవి కావలెనని యందరనుకొందురు. నేనాంతరములో ననుకొంటిని. అభినవుడు అనావిష్టుడై నన్నావేశించెను. శిష్యుడ నయితిని. దారాసుత ప్రభృతి బంధకథ లేని వానిని ఉన్న వారును సేవించిరి. నేను సేవింతును.

---

*'యువభారతి నందిని' త్రైమాస పత్రిక - సంపుటి -1. సంచిక -1. అక్టోబరు 1980.

అభినవగుప్తుడు విశ్వమయ విశ్వాతీత పరమశివుని చెప్పినవాడు. నాకట్టి శివుడు కావలెను. ఇది నాకు జన్మతః కాంక్ష. అభినవునిలో నేను గుప్తశివుని చూచితిని. మా సంప్రదాయములో శ్రీ చక్ర శ్రీదేవీ శ్రీ మంత్రము లారాధ్యములు. వీని భావర్థమును నా కభినవుడు చెప్పును. నేను నా భాషలో లోకమునకు చెప్పుదును. సర్వభావపరిష్కారమున కభినవానుసరణ మావశ్యకము. తా నేర్చిన సాహిత్య పరిష్కృతికి అభినవభాషాభావ సంస్కృతి కావలెనని నా నిశ్చితము. గుప్తముగా ప్రకటముగా నేనభినవారాధకుడనయితిని. నా ఆరాధనము వ్యక్తము చేయవలెను. మౌనముగా ఉండలేను. నా లక్షణ గ్రంథాలు, మంత్రతంత్ర గ్రంథాలు ఇంక నింక నన్నియు నభినవభావ ప్రభావితములె. సాహిత్య సభలలో నుపన్యసించునపుడు సభ్యులిది సవముగా నున్నదనగా నే నహంత విడనాడి యిది యభినవ మనెడివాడను. అభినవగ్రంథములను నావలె భావించువా రెందరు కలరో! సాహిత్య తాపసులకు దర్శనభావము దూరము. దర్శనభావులకు సాహిత్య వాసన లేదు. రెండును కలవారికి ప్రత్యభిజ్ఞ లేదు. ప్రత్యభిజ్ఞ నాకు కావలెను. ప్రత్యభిజ్ఞా దర్శన పరమార్థము అభినవునిదే. ప్రత్యభిజ్ఞామృతము నాకిష్టము. నా యిష్ట మభినవు డిచ్చెను. నేను నన్ను గుర్తించుకొంటిని. నన్ను నన్నుగా చేసినది అభినవుడే యను విశ్వాసము నాకు గూఢముగా నుండెను.

నాకుగా నే నొక భాషను సిద్ధము చేసికొంటిని. నాభాష "అభినవభాష" అను వేలూరి శివరామశాస్త్రి కథనము నందరు సహింపలేదు. ఒక సభలో గీత లోని యజ్ఞాలు పలుకునపుడు, సారస్వతసభలో సాహిత్యదర్శనము పలుకునపుడు , కావ్యగోష్ఠిలో మహార్థము పలుకునపుడు, నా అభినవభాష వర్షించితిని. అందరును ముఖవ్యాదానముతో విని భాష ధారా పాత వేగము అభినయము స్వరము భావించుచు అనక తప్పక "బాగున్నది యనిరి. సంస్కృత పదముగనె యున్నది సరిగా నర్థమగుట లేదు. ఇది యేమో!" ఇట్టి భావము మా రాయడు శాస్త్రికిని కొన్ని క్షణములుండెను. అభినవ గ్రంథము చూచీచూడగనె రాయడు రాయడు కావున నా భాష సంగతి స్పష్టము చేసెను. "ఇది యొక క్రొత్త సాహిత్య శైలి" అని వేలూరి అనుట నా అభినవతపస్య. భాషా వక్రతను నేను దేవ్యారాధనముగా భావింతును. ధ్వన్యాలోకము రాయడు సన్నిధిలో చదివితిని. లోచన విషయముల తెలిసికొంటిని, ఇంక నభినవుని తెలియవలెనని అభినవ భారతి నన్నికన్నులతో చూచితిని. ఇంకను జిజ్ఞాసతో అభినవదర్శన గ్రంథములను తదనుయాయి గ్రంథములను వ్యాసంగము చేసితిని. అంతట నభినవముద్ర యున్నది. నా హృదయముపై రసనపై గుప్తముద్ర యున్నది. ఇట్లు నన్ను తనవానిని చేసి నే నితరభావ ప్రభావితుడను కాకుండునట్లుగా రక్షించినది యభినవుడె. కాని, యభినవు డెక్కడ? అతినవుడ నయిన నే నెక్కడా? అభినవుడు మహామహేశ్వరుడు. నేనా మందబుద్ధి యశఃప్రార్థి. నా అభినవగుప్తపాదుని స్వరూప మెట్లుండునో? ఇట్లుండును.

ఆనందాందోలితాక్షః స్ఫుటకృతతిలకః భస్మనా భాల మధ్యే
రుద్రాక్షోల్లాసికర్ణః కలితకచభరః మాలయా, లంబకూర్చః
'రక్తాంగే యక్షపంకోల్లసదసితగలో లంబముక్తాపరీతః
క్షేమం వాసో వసానః శశికరధవలం వీరయోగాసనస్థః.

ఇట్టి స్వరూపశోభ కలవాని నమస్కరింతును. నే నిట్టి యాకారమున నుండలేను. సంపద లేదు. అర్హత లేదు. ఇంతటి వానికి శక్యము కానిది లేదు. సర్వవిధముల సర్వేశ్వరుని వ్యాఖ్యానించిన అభినవుని వ్యాఖ్యావైభవము నాకు అభిమానాస్పదము. ఉపాదేయసంపాతము - తదన్యప్రతీకనము - స్ఫుటవ్యాఖ్య విరోధపరిహారము. -

సంపూర్ణత - లక్ష్యానుసరణము శ్లిష్యవక్తవ్యాంశ వివేనము - సంగతి - సంపూర్ణత - లక్ష్యానుసరణము శ్లిష్యవక్తవ్యాంశవివేనము - సంగతి - పౌనరుక్త్యపరిహారము - సంగ్రహము. ఇట్లు వ్యాఖ్యానించుట అభినవ ప్రజ్ఞ. ఇతరులవి అనభినవగుప్తములు. తంత్ర గ్రంథ వ్యాఖ్యానములు కాని, నాట్యాభినవభారతి కాని, సహృదయాలోకలోచనము కాని ఈ వైశిష్ట్యముతో ఉన్నవి. అభినవకవిత్వము పటుత్వ మహత్వ పాండిత్య వైద ద్వైత శోభతో నుండును. ఇట్టి కవితాశోభ నెవరును సంపాదింప లేరు. నాకా కవితాప్రతిభ ఈ జన్మలో లభింపదు. ఆయిన నా కది యభీష్టము. అభినవుని విశిష్ట మహాకావ్యము నాకంద లేదు. కొన్ని స్తుతి కావ్యములు కలవు. వానిని పలికి సభలలో ఊగుతలలు చూతును. అక్కడక్కడ సాహిత్య లక్షణ గ్రంథాలలో దర్శన ప్రాభవము నిరూపించి "అన్యదర్శన వైదగ్ధ్య ప్రదర్శ నేన సహృదయాన్ ఖేదయితుం న వయ. గురుభిః శిక్షితపూర్వాః" అనును. ఒకప్పు డొక సచేతనుడు "సాహిత్యము రసము నాట్యము పరమార్థమని యను మీకు వేదాంతాద్వైత వాదములలో నభిమాన మేల?" అనెను. నా కభినవుడు సమాధాత. సాహిత్యములో రసాద్వైతము స్థాపించినది యభినవభట్టారకుడే. 'రసాదృతేన కశ్చనార్థః" రసాదృతమనసులో నన్యము లేదు. సర్వము రసీకృతము. సర్వము శివీకృతము. సర్వము బ్రహ్మీకృతము. నాట్యరససాహిత్యములు భిన్నములు కావు. సర్వము దర్శనవాసితము, సర్వము దర్శనరూపితముగా భావింపవలెనని అభినవుని యుపదేశము- అభినవభావతాపమున కాగలేని మహిమభట్టు అభినవగుప్తుని "కేచన విద్వన్మానినః" అని యనెను. అభినవుని వైదుష్య మసాధారణము. అది నాకిష్టము. అభినవుడు స్వాత్మ ప్రత్యయము కల కృతి సుకృతి. సర్వతోదిక్కవిశేషవిషిష్టుడు.

> పూర్ణవ్యాకరణావగాహనశుచిః సత్తర్కమూలోన్మిషత్
> ప్రజ్ఞా కల్పలతా వివేకకుసుమై రభ్యర్చ్య హృద్దేవతాం
> పీయుషాసవసారసుందర మహాసాహిత్య సౌహిత్యభాక్
> విశ్రామ్యామ్యహమీశ్వరాద్వయకథాకాంతాసఖః సాంప్రతం.

అని యనగలవా డభినవుడె. ఇట్టి స్థితికై నా యారాధన. అభినవదర్శన వివేకము సాంపాదించుటకు కలకలము చాలదు, సకలకలత కావలెను.

> యోఽధీతీ సకలాగమేషు పదవిద్యో యోగశాస్త్ర శ్రమా
> యోవాక్యార్థసమన్వయే కృతరతిః శ్రీ ప్రత్యభిజ్ఞామృతే
> యస్తర్కాంతర విశ్రుతి శ్రుతతయాద్వైతాద్వయజ్ఞానవిత్
> సోఽస్మిన్ స్యాద్వవధానవాక్ కలకలప్రాయం పరేషాం వచః

అభినవాత్మ ప్రత్యయ మందుకొనుటలో నస్మాదృశుడు వామనుడు. అయిన నుద్బాహుడ నయితిని, అభినవపదారాధనమున కభినవుడె నా కుపదేశ మిచ్చెను.

> సంకోచ కించి దిహ కించిదథ ప్రసార్య
> ప్రక్షిప్య కించిదిహ కించిద ధాప్యవాస్య

విద్వాన్ జనో భవతు సంప్రతి శాస్త్ర కృచ్ఛ
సమ్యక్ప్రచారణ విధిః స హి జన్మ తస్య

అభినవగుప్తమహార్థము నెట్లు గ్రహించినను వైదుష్యము కలుగును. కాని, యందరు సర్వము గ్రహింపలేరు. అభినవుడు మాణిక్యాచలము. స్థిరముగా జగద్వ్యాప్తమయిన చంద్రకీర్తి యున్నది. లోకము తనకు వలయునంత గ్రహించును. "ఈ మాణిక్య పర్వతమును తీసికొనవలెను. అన్యుల కీయలేను, ఇంత ఏల, " అని తలచి లోకము ముక్కలు ముక్కలుగా గ్రహించును. అయిన నచలమున కచల కీర్తి యున్నది. దాని కేమి? "లోక స్యైవ పునఃఖండనా". అభినవార్థమము నే మాత్రము గ్రహించినను అదియొక గొప్ప. ఆ పర్వత సన్నిధిలో నేనొక అణువు నయితి నని తలచి యానందింతును. నేనీ యానందముతో నేబది గ్రంథముల వ్రాసితిని. నే నేయింటికి మారినను అభినవసన్నిధిలో నుంటినని యున్న యింటికి "అభినవభారతి" పేరు పెట్టుకొంటిని. ఇది నాకు బిరుదము కాదు. అంతటి ప్రజ్ఞా ధైర్యము నాకు లేదు. నేను నా తండ్రి వలె తార్కికుడను కావలసినది. రాయుడు దగ్గర వ్యాకరణ విదుడను కావలసినది. కల్యాణదేశిక సమక్షమున అద్వైత విద్యాపథికుడను కావలసినది. కాని అభినవ భావ శిష్యుడనై రసనాట్య విమర్శన వీధీ విహారి నయితిని.

రస రహస్య నిదర్శన సంస్రవన్నవన్నవామృత సారరసోల్బణాం
సుకృతినో రసయంతు భవచ్ఛిదే స్ఫుట మిమాం రస నాట్య విమర్శినీం.

అని అహం ప్రత్యయము సూచించుకొంటిని. నాగ్రంథములలో గుప్త భావార్థమును సంగతపరచిన గాని నా నా యాత్మకు తృప్తిలేదు. 42 వత్సరాలుగా నా చేయు ప్రవచమున గూడ గుప్త భావార్థములె యున్నవి. భరతానందులకు తన భావమునె అభినవు డాపాదించినాడని యుబలాటమున కను వారుందురు. అభినవుని కాదనిన నయశము కలుగునని తలచువారు నుందురు. అభినవభావమున నున్న నేను ఇట్లనువారు కానివారని భావింతురు. అంద రభినవులు కారు.

మానవులు పలుకు వైఖరీ వాక్కునకు మూలము మధ్యమ. తన్మూలము పశ్యంతి, సర్వమూలము పరావాక్కు, పరాదేవీ వాగుపాసనము సాహిత్యములో మంత్ర విద్యలో నుండుటను నా కభినవుడు నేర్పెను. ఆలోక వ్యాఖ్యానములో లోచనకారుడు, వాక్చతుష్టయోపాసనము నిర్దేశించినాడు. ఆ వాక్కు దేహములో విశ్వములో ప్రసరించు విధానము తెలిసిన అభినవుడు విశద విమర్శన మొనరింపగా నది నా హృదయవాణి యయినది. శబ్దజ్యోతిగా భాసించినది. ఆయావేళమున "శబ్దబ్రహ్మ" సహస్రశ్లోకములుగా వ్రాసితిరి. ఒకప్పుడు తెలియని యుపేయము ఉపాయస్ఫురణమున భాసించును. అభినవుడు నాకుపాయ ముపదేశించిన ట్లారాధింతును. నన్ను పలికించిన భాష నుపయోగింతును. "వ్యంగ్య వ్యంజకా భ్యామేవ హి సుప్రయుక్తాభ్యాం మహాకవిత్వలాభో మహాకవీనాం" - తావేవ శబ్దార్థే ప్రత్యభిజ్ఞేయే" - అను ఆనందవచన గుప్తార్థము నభినవగుప్తుడె విశదీకరించెను. వ్యంగ్యముఖముగా వ్యంజక ముఖముగా కవిత లుండవలయుట నానందాభినవులు స్పష్టము చేసిరి. లక్ష్యముల నిచ్చిరి. తన్నిర్ణయానుసారముగా సాహిత్యభాష యుండవలయునని సచేతనులు భావింతురు. నేను సచేతస్సుహృదుడనుగా సాహిత్య భాషారాధనము చేయుదురు. నా కభినవుడు మూలము. లోకులకు తెలియు భాష వలయును అనువారు "లోకులు తెలియుటకు యత్నింప

వలయును" అని యనవలయును. పూర్వార్థాన్వయమున్నను నవ్యతాసిద్ధికై వ్యంగ్య వ్యంజక సమాశ్రయణ మావశ్యకము. ఇది యందర కుపాదేయము. భిన్న మయిన సాహిత్యవ్యవస్థను సువ్యవస్థిత మొనరించుట కభినవాదేశ మావశ్యకము. ఇదానీంతనులు లక్షణము ననుసరించి లక్ష్యము నిర్మించిన వ్యవస్థ కలుగును.

అలంకారశాస్త్ర మని రని కావ్యమున నలంకారము లధికముగా నుండవలెనని తలచుట బాలభావము. అలంకరింపదగిన దాని నలంకరించు నది యలంకారము. వ్యంగ్య మలంకార్య మున్ననె యలంకార మన్వర్థమగును. అలంకార నిబంధనము సమీక్ష యిట్లు నిర్దిష్టము. తత్పరముగానె యలంకారమునకు వివక్ష తగును. అలంకార మంగిగా నుండరాదు. సముచిత సమయమున సముచితాలంకార గ్రహణము. అలంకారమున కత్యంత నిర్వహణ మయుక్తము. నిర్వ్యూఢాలంకారము నంగముగా నుండవలెను. ఈ షట్ప్రకార సమీక్ష కన్న వేరొకటియు నభినవోన్మీలిత మయినది. "యథావసరేత్య క్తస్యాపి పునర్గ్రహణం" రసపరిపోషణమునకు త్యక్తమును గూడ గ్రహించుట నుదాహరించి యందు ప్రత్యభిజ్ఞాపరమార్థము సంగతపరచెను, శివరససాక్షాత్కారమున కుపాయమవలంబించి, గురూపదిష్ట యోగమంత్రా వలంబనమున కుండలినీ ప్రబోధము పొంది, శిరస్సహస్రసార చంద్రకలామృత చ్ఛటాప్రసారమున నున్మనీభావ ముగ్ధ మనస్కుడై సర్వేంద్రియ సర్వపాద దూషితుడయినను విద్యాదేవీ మంత్రాక్షర సంజల్పనమున ప్రాణశక్తి ప్రతిరోధము లేకపోగా, మననమున త్రాణ మిచ్చు మంత్రానుసంధానమున శూన్యసమాధ్యనంతరము అనిర్వాచ్యశివరససాక్షాత్కారము పొందుట నభినవుడు గుప్తరహస్యముగా నావిష్కరించెను. ఇట్లు ప్రత్యభిజ్ఞార్థము స్ఫుట మొనరించుటకె త్యక్త గ్రహణము నిర్దేశించెనో, అభినవుడు నాకిష్టమయిన పరమార్థమును

> యద్యతత్త్వ పరిహార పూర్వకం తత్త్వమేషి తదతత్త్వ మేవహి
> యద్యతతత్త్వమథ తత్త్వమేవ వా తత్త్వ మేవ నను తత్త్వ మీదృశం.

అంటూ సూచించినాడు. కావ్యసామగ్రి కలాపము లన్నియు స్వసంపత్తి సముచితములయిన ఉపాయములు. నేనన్నిట నిచ్చెన వేసికొని యిట్లు దర్శింతురు. ఈ ప్రత్యభిజ్ఞాస్వరూపమును అభినవపరమగురు విట్లు నిరూపించెను.

> తైస్తై రుపయాచితై రుపనతస్తన్వ్యాః స్థితోప్యంతికే
> కాంతో లోక సమాన ఏవ మపరిజ్ఞాతో న రంతుం యథా
> లోకస్యైష తథాన వేక్షిత గుణః స్వాత్మాపి విశ్వేశ్వరో
> నైవాయం నిజవైభవాయ - తదియం ప్రత్యభిజ్ఞోదితా

ఇందలి గుప్తార్థమును గుప్త గురువె చెప్పవలెను. నాయక గుణాకర్ణనమున ప్రవృద్ధానురాగ కామిని దినానిశ మయశయై దేవతోపయాచిత దూత ప్రేషణ మొనరించినది. ప్రణయ లేఖలు పంపినది. ప్రియుడు వచ్చి సవిధమున నున్నను జనసాధారణముగనే యామె చూచినది. అన్యచిత్తత వలన తన హృదయము పూర్ణ మొనరించుకొనలేదు. ఇట్లే విశ్వేశ్వరు డాత్మలో సతతము భాసించుచున్నను, తన్నిర్భాసనము హృదయమునకు పూర్ణత నీయదు. విశ్వజ్ఞత్వాది విశేషయోగమున పరామర్శింప నందువలన విశ్వేశ్వరుడు ఘటాదిసదృశముగనె యుండును. .... కామిని ప్రియుని విశేషముల పరామర్శించిన క్షణమున నేదో పూర్ణత ననుభవించును. ప్రత్యభిజ్ఞానమున

పారమైశ్వరోత్కర్ష వలన హృదయాంగమీ భావము కలుగగా పూర్ణతాత్మక స్థితి పొందును. ఇట్లు ప్రత్యభిజ్ఞ పరాపరసిద్ధి ప్రసాదించును.

ఈయభినవోపదేశము నాకు నవదేహము భావదేహ మిచ్చినది. సహృదయ దేహము భావము కలిగిన గాని అభినవార్థము తెలియదు. సహృదయత్వ మెట్టిదో యాతడు పరిష్కరించెను. "యేషాంకావ్యానుశీలనాభ్యాసవశా ద్విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభవన యోగ్యతా తే సహృదయ సంవాదభాజ స్తే సహృదయాః" కావ్యానుశీలనాభ్యాసమున హృదయము స్వచ్ఛమై వర్ణనీయతాదాత్మ్యము వలన సంవాదము కలది యయినపుడు సహృదయత కలుగును. ఇది యభినవ భాషలో నిట్లున్నది. కావ్యానుశీలనము శబ్దపాఠ మర్థ పర్యాలోచనము. అభ్యాసము పునః పునః అనుసంధానము. దాని వలన భావుకుని మనస్సు విశదీకృత మగును. మణిముకురము వలె మన సత్యంతము స్వచ్ఛమగును. అప్పుడు వర్ణనీయతన్మయీభవన యోగ్యత యుదయించును. తాదాత్మ్యాపత్తిరూప మయిన సామర్థ్య ముదయించును. ఇట్లు సమర్థులు సహృదయులు. శుద్ధాంతఃకరణులు, తత్త్వావధారణ నిపుణులు. ప్రశస్త హృదయులు.

యోఽర్థో హృదయసంవాదీ తస్య భావో రసోద్భవః
శరీరం వ్యాప్యతే తేన శుష్కం కాష్ఠమివాగ్నినా

ఈ సహృదయత్వము నింకను అభినవు డితర గ్రంథములలో విశదమొనరించెను. అమలస్ఫటికము నానావిధ వర్ణముల రూపము ధరించును. శివుడు సుర మానుషి పశు పాదప రూపములు ధరించును. జలప్రవాహ ప్రతిబింబిత చంద్రుడు కదలుచున్నట్లుండును. శివుడు తనుకరణభువనములం దట్లె భాసించును. పరమేశ్వరుడు సర్వాంతరతముడై యున్నను అందరకు స్వానుభవైకరూపమున ప్రత్యక్షముగా గోచరింపడు. ప్రతిభాముకుర మయిన బుద్ధి దర్పణములో అహంప్రతీతి విషయముగ భాసించును.

ఆదర్శే మలరహితే యద్వద్వదనం విభాతి తద్వదయం
శివశక్తిపాత విమలే ధీతత్త్వే భాతి భారూపః

శివానుగ్రహరూప మయిన శక్తిపాతము – స్వకిరణవిస్ఫారము కలుగగా ప్రతిభాముకురము మార్జిత మగును. స్వాత్మ భారూపమున భాసించును. ప్రత్యభిజ్ఞావాదుల తత్త్వము నాట్య సాహిత్య సంగతము. ఈ తత్త్వావేశ మున్ననె సహృదయత. లేకున్న నున్నదని తలచుట సహృదయమ్మన్యత. వాడు సహృదయాభాసుడు. ఆస్వాదాభాసమె యాతని వంతు. సహృయత్వమునకు యత్నించుట సాహితీతపస్సిద్ధి. నే నీ సిద్ధికి గుప్తు నారాధింతును.

వీతవిఘ్న మయిన రససంవేదనము నభినవుడె చెప్పెను. మీమాంసకనైయాయిక సాంఖ్యవాదులు రసమాలోచించిరి. అది యాలోచనము కాదని యభినవుని రస సిద్ధాంతము నిరూపించెను. ఆ సిద్ధాంతమె వ్యాప్తమయినది. – 'శబ్ద సమర్ప్యమాణ హృదయ సంవాద సుందర విభావాను భావసముచిత ప్రాగ్వినివిష్ట రత్యాదివాసనానురాగసుకుమార స్వసంవిధానంద చర్వణా వ్యాపార రసనీయ రూపో రసః –' ఇట్టి తత్త్వావిష్కరణమునకె అభినవపదారాధన మొనరించితిని. ఈ పరిష్కారమునె పండితరాయలు కొన్ని మాటలు చేర్చి నిరూపించెను. అభినవ రససిద్ధాంతమును కాదనలేని పండిత రాయలు ప్రత్యభిజ్ఞ లేని అద్వైతి. నేను శాంకరపథికుడనె. అభినవుడు బ్రహ్మాద్వైతము నేమేని యనినను నాకు వేదన లేదు.

సాధారణీకరణమును రసానుభూతికై నిర్దేశించుట సర్వాతీతభావన మిచ్చును. సాధారణ్యము వలన నంతట నిర్విరోధస్వరూపాస్వాదము కలుగును. విశ్వసాహిత్య ప్రతుల కందర కుపాదేయము. సర్వరసభావములు పర్యంతాస్వాదమున శాంత రూపములనుట శాంతము మహారసమనుట సిద్ధరస మనుట సర్వసాహిత్యక సముత్తేజనము.. అభినవుడు తైజసచక్షువు. ద్రష్ట, సర్వస్రష్ట శబ్ద ప్రతిబింబనము గుర్తించిన మహాయోగి. ఇట్టివాని సిద్ధాంతము లోక భాగ్యము.

అభినవభారతి అధ్యాయాద్యంత శ్లోకులను ఒకచోట చేర్చి భావించినచో మన మనోగుప్తములు సాక్షాత్కరింపగలవు. అభినవ భారతీ వ్యాసంగ వివశుడనై 'నటసూత్రమ్' పేరుతో సంస్కృతములో సూత్ర గ్రంథము నిరూపించితిని. ఆలోకలోచనములు కలిపి వేయి సూత్రముల సూత్ర గ్రంథము నిరూపించితిని. ఆలోకలోచనములు కలిపి వేయి సూత్రముల సహృదయాలోకలోచన గ్రంథముగా నిరూపించినట్లు నట సూత్రమునకు అభినవుడె అభినవ భాష్యము వ్రాయించుచునన్న విశ్వాసము కలదు. అభినవ భావములను 'నవాలోకః' పేరుతో శ్లోకసహస్రమె వ్రాసితిని. అభినవాలోక లింకను గలవు. నేత్రాలోకము వ్రాసితిని. స్వచ్ఛందాలోకము, తంత్రాలోకము, అభినవాలోకము వ్రాయు సంకల్పము కలదు. ఈ వయసులో (75) నా ఓపిక సహకరింపవలెను. అభినవయోగ మందుకొనలేకుంటిని. ఇదే ప్రసక్తిలో నింకను వ్రాయ వలసి యున్నది. సంధిసంధ్యంగ రూపములయిన ఇతివృత్త ఖండశకలములు - లక్షణాలంకార దశ పక్షి - ప్రబంధ వ్యంజకత - రస విరోధ పరిహారములు- మొదలయినవి నన్నూయెల ఊగించుచున్నది. లోక సహృదయులు నావలె చూచిన అభినవత్వము గోచరింపగలదు. విశ్వాతీతముగా ఆ మహామహేశ్వరుడు మనకు సంవిద్గురువుగా సంవిదనుభవము సంపాదించును......... నా అభినవుడు కామ రూపాభినవుడు కాడు. కాశ్మీరాభినవుడు. వ్యాకరణము తర్కవిద్య దర్శనము నాట్యము కావ్యము విమర్శనము కాశ్మీరావిర్భూతము. కాశ్మీర శ్రీనగరము నా శిరసి శ్రీ నగము. అభినవుడు కాశ్మీర పర్వ గుహా తేజస్సు తన్ను తన వానినిగా చేసినది అభినవుడె. నే నితర భావుక భావ భావితుడను కాలేదా! ఏమో! నా భాషను నేను చూచి నేను అభినవానందుడ ననుకొందును. నాకు శ్రీమదభినవ గుప్తపాద మహామహేశ్వరుడు గోచరించునా! అస్తు .

శ్రీ మదభినగుప్తోపదేశ మిట్లు భావనీయము కలదు.

త్వం త్వమేవాహమేవాహం త్వమేవాసి నా చాస్మ్యహం
అహం త్వమిత్యాభే న స్తః యత్ర తస్మై నమోనమః

అంతర్దేహే మయా నిత్యం త్వమాత్మా చ గవేషితః
న దృష్టస్త్వం న చైవాత్మ యచ్చ దృష్టః త్వమేవతత్

భవద్భక్తస్యసంజాత భవ ద్రూపస్య మేఽధునా
త్వామాత్మరూపం సంప్రేక్ష్య తుభ్యం మహ్యం నమో నమః

త్వత్స్వరూపే జృంభమాణే త్వంచాహం చాఖిలం జగత్
జాతే తస్య తిరోధావే నత్వం నాహం నవై జగత్.

•••

# అజ్ఞేయతావాదం లోంచి నాస్తికవాదంలోకి...

– శ్రీ నార్ల వెంకటేశ్వరరావు *

చాలా చిన్న తనంలోనే నేను వీరేశలింగం గారి సంపూర్ణ గ్రంథాలను చదవడం సంభవించింది. అందువల్ల ఆయన ప్రభావం నాపైన చాలా బలంగా పడింది. పైగా ఆ రోజులలో చెఱుకువాడ నరసింహంగారు బ్రహ్మ సమాజకులు. ఆయన దగ్గర నేను చదవలేదు గాని, మా మేనమామ ఆయన ప్రియ శిష్యుడు. అందువల్ల చెఱుకువాడ వారి ప్రభావం నాపై పరోక్షంగా పడినట్లు చెప్పవచ్చు. అన్నట్లు నా ప్రసక్తి వచ్చినప్పుడు ఆయన " ఈ నార్ల నాకు ఏకలవ్య శిష్యుడు" అంటూ వుండేవారు. ఆనాటి నుండే నేను విగ్రహారాధనకు వ్యతిరేకిని. అప్పటికే నాకు పురాణాలపై, పౌరాణిక పురుషులపై విశ్వాసం పూర్తిగా నశించింది.

అటుపిమ్మట 1928-30 సంవత్సరాలలో కాకినాడలోని పిఠాపురం మహారాజా వారి కాలేజీలో నేను ఇంటర్మీడియట్ చదివాను ఆ కాలేజీలోని అధ్యాపకులు దాదాపు పూర్తిగా బ్రహ్మ సమాజికులే. వారిలో ప్రత్యేకించి ఎన్నదగినవారు కాలేజీ ప్రిన్సిపాల్ డాక్టర్ వేమూరి రామకృష్ణారావు గారు, ఇంగ్లీషు లెక్చరర్ పెద్దాడ రామస్వామిగారు. ప్రతి ఆదివారం స్థానికపు బ్రహ్మ సమాజ మందిరంలోని ఏకేశోపాసనకు నేను వెడుతూ ఉండేవాడిని. అప్పుడప్పుడు బ్రహ్మ మందిరానికి రఘుపతి వెంకటరత్నం నాయుడు గారు వచ్చి మత సంబంధమైన బోధనలు చేస్తూ వుండేవారు. దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు ఆదివారం నాడు కాకినాడలో ఉంటే తప్పక ప్రార్థనలకు వస్తూ ఉండే వారు. నాకు ఆయన పట్ల, ఆయన కవిత్వం పట్ల అప్పటినుంచి నాకు ప్రేమ గౌరవా లేర్పడ్డాయి.

బ్రహ్మ సమాజం ప్రభావంతో నేను, నా సహ విద్యార్థులు మరికొందరు 'సోదర సమితి' అనే సంస్థను ప్రారంభించాము. దానికి అధ్యక్షుడు గాని కార్యవర్గ సభ్యులు కాని వుండేవారు కాదు. ఒకే ఒక కార్యదర్శి వుండేవాడు. ఆ కార్యదర్శిని నేనే. బాల్య వివాహాలకు వ్యతిరేకంగా, వితంతు వివాహాలకు అనుకూలంగా మేము ప్రచారం సాగిస్తూ వుండేవాళ్ళం. గణపతి నవరాత్రుల సందర్భంలో అప్పటిలో కాకినాడలోని వీధి వీధిలో పందిళ్ళు వేసి, భోగం మేళాలను పెడుతూ వుండేవారు. వాటికి వ్యతిరేకంగా కూడ మా ప్రచారం సాగేది. ఒకసారి జ్ఞాపకం – కులాంతర భోజనాన్ని ఏర్పాటు చేశాం. ఇది కళాశాలలో ఒక పెద్ద రగడకు దారి తీసింది. అయితే, ప్రిన్సిపాల్ రామకృష్ణరావుగారు మమ్ములను సమర్థించినందువల్ల మాకు వ్యతిరేకంగా ఉద్యమాలు లేవదీసిన వారే హాస్టల్ విడిచి వెళ్ళిపోవలసి వచ్చింది.

బ్రహ్మ సమాజ ప్రభావం నుంచి నేను వేసిన ఒక ముందడుగు అజ్ఞేయతా వాదం (Agnosticism ) లోకి. దీన్ని నేను ముందడుగుగా భావిస్తున్నా, మరికొందరు వెనుకంజగా సంభావించవచ్చు. ఏమైనా నా దృక్పథంలో ఈ విధమైన మార్పు రావడానికి కారణం Thinkers Library పుస్తకాలతో పాటు Bertrand Russel గ్రంథాలను నేను విశేషంగా చదవడం. అప్పటిలో కాదు గాని , ఆ తరువాత ఒకానొక సందర్భంలో నా వైఖరి విశదపరచడానికి నేను వ్రాసిన ఒక పద్య మిది –

కలడు కలడటంచు కలహించు నొక్కడు,<br>
లేడు లేడటంచు లేచు నొకడు;<br>
తనకు తెలియదనుట తత్త్వవేత్తకె చెల్లు!

ఈ అజ్ఞేయతావాదంలోనుంచి క్రమక్రమంగా నేను నాస్తికవాదంలోకి వెళ్ళాను. కాకినాడలో నేను చదువు కుంటున్న రోజులలో అక్కడ గోరాగారు బోటనీ లెక్చరర్‌గా పనిచేస్తూ ఉండేవారు. అప్పటికే ఆయన నాస్తిక వాది.

---

*యువభారతి ' నందిని' త్రైమాసపత్రిక – సంపుటి-1 సంచిక -3 , ఏప్రిల్ 1981 (శీర్షికః ప్రభావం)

అయితే, ఆయన ప్రభావం అప్పటిలో నాపై పడలేదు. అటు తర్వాతనైనా ఆయన వల్ల నేను ప్రభావితుడైనట్లు చెప్పలేను. ఆయన నాస్తిక వాదంతో గాంధేయవాదానికి ముడిపెడుతూ వుండేవాడు. ఇది నాకు బట్టతలకు మోకాటికి ముడి పెట్టడానికి చేసే ప్రయత్నంలా కన్పడుతుంది. ఏమైనా నాస్తికవాదిగా మారటానికి ఏవో కొన్ని గ్రంథాలు కాక నాలో క్రమంగా జరిగిన భావ వికాసమే కారణమని చెప్పగలను. ముఖ్యంగా 60 ఏళ్ళు దాటిన తర్వాత నేను నాస్తిక వాదిగా మారడాన్ని చూచి కొందరు "ఒక్కొక్క సంవత్సరం పైబడిన కొద్దీ నార్లకు మరింతగా మతి పోతున్నది" అంటున్నారనుకోండి. కాని, నేను మాత్రం మానవ జాతి భవిష్యత్తు నాస్తిక వాదంతో ముడిపడి వున్నట్లు పూర్తిగా విశ్వసిస్తున్నాను. మతాల ప్రభావం తగ్గనిదే హేతుదృష్టి పెంపొందదు. శాస్త్రీయ దృక్పథం వర్ధిల్లదు. నాస్తికత్వం మాట విడిచిపెట్టండి, శాస్త్రీయ దృక్పథం మాట కూడా విడిచిపెట్టండి. ఈనాడు శ్రీ వీరేశలింగం, స్వామి దయానంద, రాజారామమోహనరాయ్ అడుగు జాడల్లోనైనా మనం నడవటం లేదు. వీరు ముగ్గురూ విగ్రహారాధనను, పౌరాణిక గాథలను, ఇతర మూఢ విశ్వాసాలను పూర్తిగా ఖండించినవారే. ఈనాడు వీరు మన మధ్యకు వస్తే, మనలను చూచి గర్వపడరు. పైపెచ్చు సిగ్గుపడతారు.

ఇదివరలోకంటే ఇప్పుడు మనలో శాస్త్రీయ విజ్ఞానం విశేషంగా పెరిగింది. అయితే, ఆ విజ్ఞానం మన జీవిత సరళిని అణు మాత్రంగా నైనా ప్రభావితం చేయడం లేదు. ఉద్యోగ ధర్మం కోసం వేసుకు వెళ్ళిన బట్టలను ఇంటికి రాగానే తీసివేసి, చిలక కొయ్యకు తగిలించడం కద్దు. ఇంగ్లీషులో చెప్పాలంటే, మనం Scientific Techniques ను స్వీకరిస్తున్నాము, Scientific spirit ను తోసి వేస్తున్నాము. దీనిలో మన జాతి ప్రగతికి, దాని భవిష్యత్తుకు ఎంతో ప్రమాదం గర్భితమై వున్నది.

కొంతకాలంగా హేతువాదానికి, శాస్త్రీయ దృక్పథానికి, మానవతా వాదానికి సంబంధించిన గ్రంథాలనే నేను విశేషంగా చదువుతున్నాను. ఇట్టి గ్రంథాలను కనీసం కొందరైనా మన తెలుగులో వ్రాయడం, ప్రచురించడం నాకు ప్రత్యేకించి సంతోషాన్ని కలిగిస్తున్నది. పాచీన సాహిత్యాన్ని గురించి ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్న యువభారతి నేనూ, నా బోటి వారు కోరుకునే నూతన దృక్పథానికి, జీవిత విధానానికి ప్రోది చేయగల గ్రంథాలను ప్రచురిస్తే నా మటుకు నేను ఎంతగానో పొంగిపోగలను

●●●

# నాకు రెండూ కావలసినవే

– శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి

గాంధర్వం చ కవిత్వం చ
శూరతా దానశీలతా
అభ్యాసేన న లభ్యంతే
చత్వార స్సహజా గుణాః.

ఇది సూక్తి. చాలా కాలం నాటి సంగతి, సికిందరాబాదులో రవీంద్ర నాథ టాగోరుకు సన్మానం జరిగింది. ఆ సభలో ఆయన తెలుగు వారిని ప్రశంసిస్తూ, ప్రతి ముగ్గురిలో ఒకడు కవి యై యుంటాడు. అన్ని కళల కంటె కవితాకళ ఇక్కడ వ్యాప్తి పొందినంతగా మరెక్కడా పొందలేదన్నాడు. ఒక సదస్యుడనుగా నేను విన్నాను. అప్పటికే నేను ఇంగ్లీషులోను, తెలుగులోనూ పద్యాలు అల్లుకుంటూ ఉండేవాణ్ణి. ఇరువురు మిత్రులతో గూడి నేను మాట్లాడినప్పుడు ఆయన మా మువ్వురిలో నన్ను జూచి నవ్వుతూ 'కవిత్వం వ్రాస్తున్నావు కదూ!' అన్నాడు. అపరిచితుడనైన నాకు ఆశ్చర్యమేసింది. రెండు 'Couplets' రెండు గీతాలు వినిపించినాను. నేను ఒంటరిగాడనై యింటి వద్ద ముమ్మర మైన సేద్యాన్ని పర్యవేక్షించుకొనే భారం వలన విశ్వభారతిలో చేరే భాగ్యానికి దూరమైనాను. అది వేరే మాట. ఆ రోజులలో నేను పదిమందిని కలుసుకున్నా అందులో ఒక్కడు గూడా కవిత్వం చెప్పేవాడు దొరకలేదు. ఆనాడు టాగోర్ అన్నమాట అతిశయోక్తియో మరేదో అయినా ఈనాడు అది స్వభావోక్తిగా ఋజువగుతున్నది. అయితే కవిత్వ శబ్దానికి నిర్వచనమూ మారిపోయిందనుకోండి. ఒకటి మటుకు నిజం; ఆంధ్రంలో కవితాకళా సౌందర్యం యే భాషలో కన్నా తక్కువ లేదు. తక్కువ ఉన్నది అనే వాడు అమూలాగ్రం ఆంధ్రసాహిత్యాన్ని నిష్పక్షపాతంగా అధ్యయనం చేయనివాడే. తెలుగులోకంటే ఇంగ్లీషులో వ్యంగ్యంపాలు ఎక్కువ కానేకాదు. కథాకావ్య భాగం ఎక్కువ అవటం చేత తెలుగులో వాచ్యం ఎక్కువ అని అన్పిస్తుంది. అంతే అయోమయత్వాన్ని సంస్కృతం వలెనే తెలుగు పద్యం ఒప్పుకోదు.

నేనొక తీగను, నేను కదులుతున్నాను. డొంక కదులుతున్నది. అభ్యాసాన్ని వదిలివేస్తే కవిత్వం రెండు భాగాలు (1) వ్యుత్పత్తి (2) ప్రతిభ. వీటిల్లో ఏది సహజం? ప్రతిభ. వ్యుత్పత్తి ఎన్నడూ సహజం కాదు. అది గురుశుశ్రూషా ప్రభావం లేదా అత్యంత శ్రద్ధాపూర్వక పూర్వసాహిత్య పఠన ప్రధానం. నాలో వ్యుత్పన్నతను గురించియే "గురుకులక్లిష్టః" అని మురారి కవి పేర్కొన్నది. వ్యాస వాల్మీకి కాళిదాసులకు గురువెవరో తెలియదు. కాళిదాసును మినహాయిస్తే తతిమ్మా ఇర్వురకు వేదమే పూర్వసాహిత్యం. సర్వ పశుపక్షి మానవ స్వభావరహస్యాల సమ్యగ్దర్శనం పరమేశ్వర దయాస్పర్శనం వారిని మహాకవులనుగా తీర్చి దిద్దినవి. ఏ దేవతానుగ్రహానికి అఱ్ఱులు చాచక నా స్వయంకృషిలో నేనింత వాడనైనాను అని మురారి ధీమాగా చెప్పినాడు.

నాపూర్వుల మనస్సు వలెనే నా మనస్సు కూడా శివపంచాక్షరీ మంత్ర పారాయణాధీనము. మా తాతగారు శాస్త్రపండితులు. ఆయన కవిత్వం చమత్కార సంభాషణము వఱకే పరిమితమైనది. " "పూవుబోడి, నాకు నీ బోడిపూవుతో పని లేదు" అని ఆయన అన్నట్లు వినికిడి. మా తల్లిగారు విదూషీమణి, తండ్రిగారు విద్వత్కవి.

64 కళలు. అనేక శాస్త్రాలు. ప్రతివస్తు నిర్మాణము ఒక శాస్త్రమే. వీనిలో ఒక్కొక్కటి ఒక్కొక్క మనిషిలో విధిగా చోటుచేసుకొని బీజరూపేణ ఉంటుంది. అది ఆనువంశికంగా కావచ్చు, జన్మాంతర సంస్కారం వలన

---

*యువభారతి " నందిని ' త్రైమాస పత్రిక - సంపుటి -1, సంచిక - 2, జనవరి 1981. శీర్షికః ప్రభావం)

విజ్ఞానమయకోశ నిక్షిప్తంగా కావచ్చు. ఆ కళ ఆ శాస్త్రం పరిస్థితుల, పరిసరాల ఆనుకూల్యంతో క్రమశిక్షణ ద్వారా మొలకెత్తి మొగ్గ దొడిగి వికసించి ఒక్కొక్కరిలో విశ్వవ్యాప్తంగా పరిమళిస్తుండగా, ఒక్కొక్కరిలో పరిస్థితి పరిసరాలు అనుకూలింపక ఐశ్వర్యము కూడా సోమరితనాన్ని పుట్టించి కళా శాస్త్ర బీజాలకు అంకురత్వాన్ని ప్రసాదించక పోవచ్చు.లేదా అంకురాన్ని ఎదుగనీయక ఒక చిన్న మొగ్గను మాత్రం తొడిగించి ఆపివేయవచ్చు. దాదాపు ఈ చివరిదే నా స్థితియని చెప్పవచ్చు.

'లండన్ నగర పరిసరాలలో ఒక సుప్రసిద్ధ రచయిత ఉండేవాడు .మొన్నటిదాకా ఆయన పేరు ఆయన ఉన్న పరిసరం పేరు జ్ఞప్తిలో ఉన్నవే. ఈ మధ్య మఱచిపోయినాను. 1925లో ఒకరోజు నేను ఆయనకు అతిథిని, ఆయనవి వచన గ్రంథాలు ఎక్కువ. పద్యరచనలు తక్కువ. ఆయన చెప్పినాడు -

"పద్యరచన రైఫిల్, ఏ షాట్ కూడా గురితప్ప కూడదు. ప్రతి Stanza హృదయానికి తగిలినప్పుడే వాడు కీర్తిమయుడు ఒక్క కాల్పులో ఏ మాత్రం గురితప్పినా ఆ "Gunner" ను ప్రశంసింపరు. రెండు, లేక నాలుగు పాదాలలో కవికి కీర్తియో, అపకీర్తియో తేలిపోవును. గద్యంలో అలాకాదు సావకాశంగా "Long run" లో కథ, ఔచిత్యం, నిర్వహణ, Climax పాటించి కీర్తి పొందవచ్చును. నీవు కవివి కాదలిస్తే దీనిని మఱచిపోవద్దు" అని. ఈ మాటలు నాకు ఎప్పుడు హృదయస్థములే. సరిగా దీనిని తరువాత చాలా రోజులకు మిత్రుడు విశ్వనాథ సత్యనారాయణ ఎన్నో వివరాలతో నాకు చెప్పినాడు. అక్షర, గణ, శబ్ద, వాక్యాల రసోపస్కారకత్వాన్ని ఆయన వద్దనే విన్నాను. "Sound echoing sense" కూడా విని, నన్నయ, తిక్కన, పోతనల కవిత్వాలు చదివి ప్రభావితుడనైనాను. ఈ మొత్తం పేరే శిల్పం. మా యిద్దరి మధ్య వృత్త ఔచిత్యం వద్ద విభేదం వచ్చింది. అది ఎప్పుడూ అంతే. నాకు Dearest Friends విశ్వనాథ సత్యనారాయణ, కాటూరి వెంకటేశ్వరరావు, నాయని సుబ్బారావు, నా కవిత్వం ఈ ముగ్గురకు వినిపించేవాడను. రామాయణ కల్పవృక్షం చదివి ఎక్కడ సమాసం వేయవలెనో, ఎక్కడ వేయకూడదో తెలుసుకున్నాను. తిక్కన భారతం చదివి అలతి అలతి పదాలలోనే అన్ని రసాలు ఒప్పించవచ్చునని తెలుసు కొన్నాను.

శ్రీనాథుని రచనలు చదివి పద్య నిర్మాణంలో ప్రభావితుడనైనాను. ఇన్నీ ఒక ఎత్తు వ్యంగ్య వైభవం ఒక ఎత్తు. వాల్మీకి రామాయణంలోని కొన్ని భాగాలు, కాళిదాసు మేఘసందేశ, కుమార సంభవాలు, కొన్ని ఆంగ్లేయ వచన, పద్య రచనలు చదివి ఈ సందర్భంలో ప్రభావితుడనైనాను. ప్రస్తుతం నాపైన పేర్కొన్న నాద వ్యంగ్యం మీద దృష్టి గుణీభూత వ్యంగ్యం మీదికి , పరాశక్తి మీదికి మళ్ళింది.

శబ్ద, అర్థ చమత్కారాలు రెండు ఒకే పద్యంలో ఉంటే పాఠకుడు శబ్దానికి ముగ్ధుడై అర్థాన్ని గ్రహింపలేక పోవచ్చునని కొందఱు అంటారు గాని నాకు రెండూ కావలసినవియే. వసు చరిత్ర చదివి ఈ నిర్ణయం చేసుకొన్నాను, కానీ పద్యం రాగయుక్తంగా చదివితే శ్రోతదృష్టి అర్థం మీదికి అనుకున్నంతగా మళ్ళటం లేదు. ఇదొకటి దాఖలా - Free verse చదివినప్పుడు ఈ స్థితి వేరు.

ఒక్కొకప్పుడు సందర్భము ననుసరించి మాత్రా ఛందస్సులోను, ఛందస్సు లేకుండాను వ్యావహారిక భాషలో కవిత వ్రాస్తున్నాను. వినిన విజ్ఞుడు ఇక్కడ ఈ లోపం ఉన్నదంటే దిద్దుకుంటున్నాను. వీలయినంత వఱకు నా కవిత్వానికి నేనే విమర్శకుడను. నిర్విరామంగా నన్ను నేను పొగడుకొనగలను, తుంటరిగా తెగడుకొనగలను. కాగా ఈ "Chances' ఇతరులు తీసుకొన్నా ఏమనుకోను.

ఈ విధంగా నన్ను నేను దిద్దుకొంటూ 73వ సంవత్సరంలో నున్నాను.

●●●

# నవధాన్యాల పంట

కళా ప్రపూర్ణ డా. రావూరు వెంకట సత్యనారాయణరావు*

నా చిన్నతనంలో మావూళ్ళో పాలేళ్ళు సాయంత్రం పూట బిందెలలో తొట్టెలలో నీళ్ళు నింపి పోయేవారు. అవి పొద్దు పోయేదాక పెరటిలోనే వుండేవి.ఒకనాడు చంద్రు డుదయించి కొంచెం పైకి వచ్చాడు. బిందెలన్నిటిలో నాకు చందమామ కనబడింది.

అన్ని బిందెలలో ఉన్నాడు
ఒక్కడే చందమామ

అని గంతులు వేస్తూ పాడుకుంటున్నాను. మా అమ్మగారు విన్నది. చందమామ ఒక్కడే కాదురా! బిందెలలో పొయ్యక ముందు నీళ్ళూ ఒక్కటే అన్నది. ఆ మాట కూడా పాటలో కలిపాను. మళ్ళీ పాట కలిపాను.

" బిందెలన్నిటిలో
ఉన్న నీళ్ళూ ఒక్కటే
బింది అన్నిటిలో
ఊగే చందమామా ఒక్కటే "

ఈ పాటలన్నీ రాయడానికి చందమామా - బిందెలు - నీళ్ళు - దానిని పాడిగించడానికి కారణమైన మా అమ్మ. ఇవన్నీ నన్ను ప్రోత్సహించినాయి. మా అమ్మ కొంత భావ మందించి తోడ్పడింది. అప్పటినుంచి చందమామ నా వెంటపడుతూనే వున్నాడు. నాకు వెన్నెల దుప్పట్లు కప్పూతూనే వున్నాడు. నేను జీవితంలో విషాదాన్ని తొలగించుకోడానికి, మనస్సును రాగరంజితం చేసుకోడానికి వెన్నెల రాగం కాని ఒక రాగంగా, భోగం కాని ఒక భోగంగా తోడ్పడుతూనే ఉంది.

చాలా కాలం నేను పల్లెటూరిలో వుండటం వల్ల వెన్నెలను కన్నుల నిండా దోచుకున్నాను. మనసు నిండా కుప్పపోసుకున్నాను. దానిని నెమరువేసుకుంటూనే వున్నాను. దడిమీద చంద్రుడు, బడిమీద చంద్రుడు, గుడిసె మీద చంద్రుడు, చెట్టుమీద చంద్రుడు, యిలా ఎన్నెన్నో చిత్రాలు మనస్సులో వేలాడకట్టుకున్నాను. చెరువులో చంద్రుడు, చేనులో చంద్రుడు, నదిలో చంద్రుడు, అంబుధిలో చంద్రుడు,వీరందరు వచ్చి తరువాత ఆ గాలరీలో చేరారు. సంధ్య వెన్నెలలో నాకు స్వాగత వాక్యాలు వినబడుతాయి. అర్థచంద్రుడిలో నాకు యెన్నో భావార్థాలు కనబడుతాయి. పున్నమి చంద్రుడు నన్ను ఎంతో ప్రోత్సహిస్తాడు. ఒక నెలలో నేను చంద్రుడుదయించి నప్పుడు మా పెరటి చెట్టుకొమ్మ మీద ఆసీనుడనై అస్తమించిన తరువాత దిగటం నేర్చుకున్నాను. ఒకప్పుడర్థ రాత్రి లేచి కూర్చొనడం, ఒకప్పుడర్థ రాత్రి కొమ్మ దిగడం, ఒకప్పుడర్థ రాత్రి కొమ్మ యెక్కి కూర్చోటం. చంద్రుడు ఒకప్పుడు నా పాలు, నిద్ర ఒకప్పుడు చంద్రుని పాలు అయ్యేది. ఎందువల్లనంటే నాకు బాగా నిద్ర వచ్చినప్పుడు చంద్రుడు నిద్రపోతున్నట్టు కనబడేవాడు.

నన్ను రచనకు ప్రోత్సహించినది ఎవరని ప్రశ్నించు కున్నప్పుడు ప్రకృతి అని చెప్పవలసివస్తుందేమో! గురువుల వల్ల కవులు ప్రభావితు లవుతూ వుంటారు. కనిపించని గురువు ప్రకృతి. కనిపించకుండానే యేవేవో భావనలు వినిపిస్తూనే వుంటుంది. కనుక ప్రభావితం చెయ్యటానికి తగిన శక్తి కూడా వుంది.

ఇక వ్యక్తులలోనికి వస్తే నాకు గురువులు చాలా మంది వున్నారు. ఛందస్సు చెప్పింది మా చిన్నప్ప గారు రామశేషగిరిరావుగారు. గేయాలు రాయమని ప్రోత్సహించింది థర్డ్‌ఫారంలో మిత్రుడు రామానుజాచారి. ఎంకి పాటల సుబ్బారావు గారు నన్ను పాటలే రాయమని ప్రోత్సహించినట్లు కలలు వస్తువుండేవి. పద్యరచన విషయంలో విశ్వనాథవారు.

---

* యువభారతి ' నందిని ' త్రైమాస పత్రిక - సంపుటి -1, సంచిక - 4, జులై, 1981. శీర్షిక: ప్రభావం)

ఆయన సమాసాలతో రాసిన పద్యాలు చూసి అలా కొన్నాళ్ళు రాశాను. ఆయనలోని కొత్త పోకడలు గమనించి భావానికి ప్రాధాన్యమిచ్చి పద్యాన్ని నవోఢలాగ నడిపించడానికి ప్రయత్నించాను. ఇంతలో కృష్ణాపత్రికలో ప్రవేశం జరిగింది. కృష్ణరాయల ప్రభావం నా మీద పడింది . వ్యాసరచన ప్రారంభమైంది. వెన్నెల నన్ను వెంటాడుతూనే వుంది. కృష్ణాపత్రికలో ప్రతివారు సారస్వతానికి, రాజకీయాలకు సంబంధించిన రచనలు తప్పనిసరిగా రాయవలసి రావడం వల్ల కవిత్వం కొంచెం వెనక బడింది. ఒక్కసారి అనుకోకుండా రాజకీయ విమర్శలలో నుంచి హాస్యం తొంగి చూసింది. నేను లొంగిపోయాను. అప్పుడలా లొంగినందుకు ఇప్పుడు పొంగి పోతున్నాను. నేను చేపట్టిన ప్రక్రియలలో హాస్యం ప్రముఖ పాత్ర వహించింది. అయితే యీ హాస్య రచన చేసేటప్పుడు మాత్రం చంద్రుడు చాలా దూరంగా ఉంటున్నాడు.

తరువాత మనస్సు నవలా రచన మీదకు పోయింది. అక్కడ చంద్రుడు ప్రత్యక్షం. 'సౌదామిని' పేరుతో నవల రాయడం జరిగింది. కాని కారణాంతరాల వల్ల అది ఆపుచేయవలసి వచ్చింది. తరువాత నవలకు నన్ను ప్రభావితుణ్ణి చేసింది ఆనాటి ఏకవీర, నారాయణరావు. ఈ నవలకు నెలవంక నామకరణం జరిగింది. అక్కడితో నవలలకు ఉపక్రమణ జరిగి చాలా నవలలు వెనుకబడినవి.

నాటక రచనకు నన్ను ప్రోత్సహించనది శ్రీ పింగళి నాగేంద్రరావు.. రచనతో పాటు ఆంధ్ర నాటక ప్రక్రియలో ఎక్కువ మక్కువ యేర్పడింది. కృష్ణాపత్రికలో వుండగనే కథలు రాయటం కూడా ప్రారంభమయింది. ఈ రచనలకు మునిమాణిక్యం కొంతవరకు నన్ను ప్రభావితుణ్ణి చేశారు. అలాగే కృష్ణాపత్రికలోనే విమర్శలు కూడా రాయడం జరిగింది. దానికి కృష్ణాపత్రిక సంప్రదాయమే నన్ను ప్రభావితుణ్ణి చేసింది.

ఇకపోతే రేడియో నాటికలు, వీటికి నాటకరంగ కృషే ఆలంబనమైంది. ఇంకొక్క విషయం - సినిమా రచన చివరిది. ఇందులో మొదటిది పూర్తి హాస్యరస చిత్రం. ఇది రాసేటపుడు 'Wood House' వచ్చి అప్పుడప్పుడు నాలో భేటీ వేస్తుండేవాడు. రెండు మూడు హాస్యరస ప్రధాన చిత్రాలు, రెండు మూడు సాంఘిక చిత్రాలు, పది పౌరాణిక చిత్రాలు రాశాను. నాటకరంగమే నన్ను ప్రభావితుణ్ణి చేస్తూ వచ్చింది. ఇలా నా సాహిత్య క్షేత్రంలో నవధాన్యాలు పండినాయి. ఇదంతా ఒక వెన్నెల ప్రకరణం. అసలు ఒక మానవుణ్ణి కవిగా మార్చే ప్రభావం ఆ నలువరాణిదే అంటారు. ఆమెకు తలొంచి నమస్కరిస్తాను.

•••

# నేనూ – నా రచనలు

శ్రీమతి ఇల్లిందల సరస్వతీ దేవి*

ప్రతి రచయితను గురించి పాఠకులు ఏవో కొన్ని అభిప్రాయాలు ఏర్పరచుకుంటారు. ఆ అభిప్రాయాలకు పరోక్షంగా రచయితే బాధ్యుడు – కొంత వరకు రచనలూ మరి కొంతవరకు వ్యక్తీను.

పాఠకులకు రచనలు చదివినంత మాత్రాన తృప్తి గలగదు. ఆ రచనల పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోవాలన్న కోరిక బలీయంగా ఉంటుంది. దానిలో రచనలు చేయటానికి గల ప్రేరణా ప్రోత్సాహమూ ప్రోద్బలమూ 'ఏమిటి? ఏవి?' అని.

ఎంతో మంది అడిగారు – మరెంతో మంది ప్రశ్నించారు.

కళలకు ప్రేరణా ప్రోత్సాహమూ ఇచ్చినవి అందరికీ గర్వించ తగినవిగా ఉంటాయా? ఉండవంటే కళాకారులూ అంగీరించరు– చరిత్రా అంగీకరించదు.

ఏ మానవుడి జీవితమూ పుట్టినప్పటినుంచీ సుఖసంతోషాలలో ఓలలాడదు – ఏ కొందరికో తప్ప. వడ్డించిన విస్తరి అంతకంటే కాదు. ఏదో లోపము– ఏదో అసంతృప్తి – ఎదగటానికి ముందుకు పోవటానికి ఏదో అవరోధము లేక ఉన్నట్లు అనుభూతి – మనసులో వేదన – తీరని అరాటము – వీటితో వేగి పోతుంది. ఈ తీరని వేదన రచయిత కలములో రసవంతమైన కావ్యంగా కమ్మటి కథగా గాథగా మారి సాహిత్య చరిత్ర కెక్కటము ఎవరికీ తెలియని విషయము కాదు.

రచయిత స్థాయి ఏతరగతికి చెందినా ఆవేదన మాత్రము అందరికీ ఉండేదే.

కోస్తా జిల్లాలలో పుట్టి తెలంగాణాలో అడుగుపెట్టి, బాల్య వివాహం కారణంగా మెట్రిక్యులేషన్ కూడా పూర్తి చేయని నాకు ఇక్కడ సాగించిన చదువు కళాశాల ప్రవేశము సాంసారికమయిన అవరోధాలవల్ల ఆగిపోయింది. ఆనాటి తెలంగాణ వాతావరణము సాంఘికంగా రాజకీయంగా చీకటి చీకటిగా ఉండి ఒంటరితనానికి లోను చేసింది. ఆ మానసిక వేదనే గ్రంథ పఠనానికి పురికొల్పింది.ఇంట్లో ఉన్న గ్రంథాలు కనబడినవీ చేతికందినవీ చదివి, శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయము నుండి, Y.M.I.S., నుండీ తెలుగు, ఇంగ్లీషు గ్రంథాలు తెప్పించుకొనేటట్టు చేసింది. వాటిలో స్ట్రాండ్, ట్రూస్టోరీ, మై మేగజైన్, పంచ్ వంటి ఆంగ్ల మాస పక్షపత్రికలు, భారతి, గృహలక్ష్మి, వినోదిని, చిత్రగుప్త, జయలక్ష్మి వంటి తెలుగు మాస వార పత్రికలు ఊపిరి సలపనంత వేగంగా చదవటం దానితో అలవాటయింది.

కందుకూరి, పానుగంటి రచనలు చదివినప్పుడు నాకూ కొంత వ్రాయాలన్న ఉబలాటం కలిగి, ప్రహసనం లాంటివి ఒకటి రెండు వ్రాసి పత్రికలకు పంపడం, అవి అచ్చయితే చూసుకుని సంతోషించటం జరిగింది.కానీ ఆ సంతోషం తాత్కాలికమే అయింది. ఎందుకంటే, చదువుతున్న కొద్దీ అనేక సమస్యలు ఎదురయ్యాయి. వ్రాయటానికి తొందరపడ్డానేమో ననిపించింది.

రచయిత తన కిష్టము వచ్చిన సమస్యను తన కిష్టమయిన విధంగా వ్రాయవచ్చా? ఇదొక పెద్ద సమస్యగా రూపొంది కలాన్ని ముందుకు సాగనివ్వక మరిన్ని గ్రంథాలు చదివేటట్టు చేసింది. వాటిలో తెలుగు, ఇంగ్లీషు వ్యాసాలు – ముట్నూరువి, విశ్వనాథవి కూడా ఉన్నాయి. నన్నయ్య గారి ప్రసన్న కథా కలితార్థ యుక్తి వ్యాసాలు భారతిలో ఎన్ని సార్లు చదివానో చెప్పలేను. చదివిన కొద్దీ రచయితకు

---

*యువభారతి 'నందిని' త్రైమాసపత్రిక – సంపుటి–2, సంచికలు 1 ,2, అక్టోబరు 81 & జనవరి – 82. శీర్షిక: ప్రభావం)

చాలా బాధ్యతలున్నా యనిపించింది.

ప్రతి రచయితకూ వారి వారి వివేకాన్నీ సంస్కారాన్నీ అభిరుచినీ బట్టి ఏవేవో ఊహలు ఉంటాయి. ఆ ఊహలను తన పరిధిలో ఆర్జించిన అనుభవాలను బట్టి కాలానుగుణమైన అభిప్రాయాలను ఏర్పరచుకోవటం సహజం. కాని ఆ అభిప్రాయాలను ధృవీకరించుకునే ముందు భిన్న భిన్న కాలాల లోని భిన్న భిన్న అభిప్రాయాలను వినటం వల్ల గాని చదవటం వల్ల గాని సేకరించి తనవాటితో కలబోసి చూడాలి. అప్పుడు కాలానికి తగిన అభ్యుదయాన్ని కలిగించేది ఏదని నిష్పక్షపాతంగా విచారించాలి. విచారించగా వచ్చినదాన్నే ధృవీకరించాలి. అయితే దీనిని బట్టి బయట పెట్టేటప్పుడు రచయిత కనబడాలా? కనబడకూడదా?

'సార్థక నామునైన' రచయిత తను బయట పడడు. ఆ అభిప్రాయాన్ని పాఠకుడికి కలిగేటట్లు సంఘటనలతో సూచిస్తాడు. అది ప్రతి రచయితకూ ఒక గడ్డు సమస్య. సంయమములేని రచయిత వాచ్యంగా చెప్పేస్తాడు. దేశం-కాలం-పాత్రం- రచయితకే జ్ఞానం ఉండాలన్న అనుభవజ్ఞుల మాట చాలా సత్యమైనది. మన దేశంలో ఉన్న మతాలు, విశ్వాసాలు, ఆచారాలు, ఆరాధ్య దైవాలు మొదలైన విషయాలను తెలుసుకోవాలి. సాంఘిక ఆర్థిక రాజకీయ సాంస్కృతిక పరిస్థితులూ వాటి పరిణామాలు గ్రహించాలి. తాను ఏ కాలంలో ఉన్నాడు? ఎవరి కోసం రచించాలను కుంటున్నాడు? ఏ పాత్రను ప్రవేశపెట్టబోతున్నాడు? వేలాది పాఠకుల అభ్యుదయాన్ని కాంక్షిస్తున్నాడా లేదా? లేక కేవలం తన వినోదం కోసమే రచిస్తున్నాడా?

రచయితకున్న బాధ్యతలను గుర్తించి రచయితలు బహుగ్రంథ పఠనానుభవంతో వ్రాస్తారా అంటే నాకు సంబంధించినంతవరకు అట్లా జరగలేదనే చెప్పాలి.

వ్రాస్తూ చదవటం - వ్రాయాలన్న తపనతో చదవటం - ఏ విషయాన్ని గుర్తించయినా వ్రాయాలంటే దానిని గురించి ఆమూలాగ్రంగా తెలుసుకుని గాని వ్రాయకపోవటం - బద్ధకించకుండా అందరిని అడిగి తెలుసుకొని, అన్నీ చదివి, ఎంత ఆలస్యమయినా సరే - వ్రాయాలి - శక్తి కొద్ది బాగా వ్రాయాలన్న తపనతో ముందుకు సాగిపోవటం - జరిగింది.

1949కి ముందు సందిగ్ధముతోనే కాలం గడిచింది. దక్కన్ రేడియో ఆలిండియా రేడియో అయినప్పుడు దానికి ప్రసంగాలు, కథానికలు, వ్రాయవలసి వచ్చినప్పుడు కలం చేతబట్టుకుంటే కాగితమ్మీద సాగక సందేహాలపుట్ట ఎదుట నిలిచి భయపెట్టేది. ధైర్యం తెచ్చుకుని వ్రాయటం మొదలు పెట్టగానే పుస్తక పఠనానుభవం కొంత ఉపయోగపడ్డది. కాని మరికొంత ముందుకు సాగగానే అదీ చాలదనిపించింది.

1956 లో జర్నలిజం కోర్సులో రచనలకు మెరుగులు పెట్టాలనే కాంక్షతో చేరాను. ప్రొఫెసర్ ఓడేత్ జర్నలిజంలో గురువులు, వారు చెప్పిన గ్రంథాలన్నీ లైబ్రరీలో ఉన్న మేరకు చదివాను. ఎథిక్స్ ఆఫ్ జర్నలిజమ్ చదివిన తరువాత నీతి నియమాల కు ఆకర్షింపబడ్డాను. గురువు లాదేశించిన గ్రంథాలు చదివిన తరువాత రచయిత బాధ్యతలు, రచనల ఉద్దేశ్యము, దేశకాల పాత్రల అవగాహన, వ్యక్తులు, వాళ్ళ స్వభావ పరిశీలన, మొదలైనవి బాగా అర్థమవుతూ వచ్చాయి.

ఈ విషయాలన్నీ అంచులెరగని సముద్రమంత విస్తృతమైనవి. ఎంత తెలుసుకున్నామనుకున్నా అసమగ్ర మనిపిస్తాయి. దాని తరువాత రచించినవే "నారీ జగత్తు", "వెలుగు బాటలు", "జీవన సామరస్యము" సంపుటాలలోని వ్యాసాలు వనితాలోకం పేరున వారపత్రికలో వెలువడ్డాయి.

1958 నుంచి 66 వరకూ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యత్వము వల్ల భిన్న భిన్న రంగాలలోని వ్యక్తులను గురించిన పరిశీలనాజ్ఞానం అదివరకు ఉన్న దానికి మెరుగులు పెట్టింది. అప్పుడే కృష్ణాపత్రికలో ఇయంగేహేలక్ష్మీ అన్న శీర్షికన కొన్ని వందల వ్యాసాలు వ్రాసింది. ఈ వ్యాసాలలో సాంఘిక రాజకీయ సాంస్కృతిక చారిత్రక విద్యా వైజ్ఞానిక ప్రభావం ఉన్నది. ఈ వ్యాసాల సంపుటులే కళ్యాణ కల్పవల్లి, వ్యాస తరంగిణి.

భావసమైక్యత అన్నది స్త్రీ పురుషుల మధ్యనేకాదు – అన్ని రంగాలలో అవసరము. రాజకీయంగా, సాంఘికంగా– సాంస్కృతికంగా ఒకరినొకరు గుర్తించి అర్థం చేసుకొని గౌరవాభిమానాలను పరస్పరము పెంపొందించుకుంటేనే ప్రపంచశాంతి, తెలుసుకోనందువల్ల వచ్చే నష్టాలు అపారం. కుటుంబ విచ్ఛేదనాలు రాజకీయంగా ప్రబలే ఉద్యమాలు – వట్టి రుస రుసలని చెప్పటానికి కోస్తా రాయలసీమలలో ఆంధ్రులకు సరిగా తెలియని తెలంగాణా తేజోమూర్తుల జీవిత సంగ్రహాలను వ్రాశాను.

రచనలలో సామాజిక స్పృహ ఉండాలన్నదే నా ధ్యేయము. రియలిజంలో ఐడియలిజమ్ వైపుకే నా కలం మొగ్గు చూపుతుంది. ఆశావాదమే మానవపురోభివృద్ధికి బలాన్నిస్తుందన్న నమ్మకముంది. సామరస్యమే విశ్వకళ్యాణాన్ని సిద్ధింప చేస్తుందన్న విశ్వాసము. రచనలు ప్రభు సమ్మితాలు కాకుండా మిత్ర సమ్మితంగా –కాంతా సమ్మితంగా ఉండాలన్న ధ్యేయంతో మానవస్వభావంలోని వైచిత్రిని భావ దారిద్ర్యం లేకుండా ఎత్తి చూపించాలన్న ఉద్దేశ్యంతో రచింపబడినవే "స్వర్ణ కమాలాలు" నూరు కథల సంపుటి. మనస్తత్వ శాస్త్రాన్ని చదువుకుంటే ఎన్నో చిత్రాతి చిత్రాలు గోచరిస్తాయి. ఆ తత్వము మానవులదేనా అని అనిపిస్తుంది. కాని, ఆ మలుపులన్నీ స్వభావంలోవేనని గ్రహించిన తరువాత వ్యక్తులను గురించిన అవగాహన విస్తృతమవుతుంది. ఈ సత్యము తెలుసుకున్న తరువాత రచయితగా నా దృక్పథం మారింది వ్యక్తులపట్ల సానుభూతి పెరిగింది. ఈ అనుభవంతో కొన్ని నవలలు వ్రాశాను.

పిల్లలకు కథలు చెప్పవలసిన అవసరము వచ్చినప్పుడు ఎన్ని కథలు సేకరించి చెప్పినా చెప్పినవే చెప్పక తప్పలేదు. ఆ సందర్భములో "పిల్లలకు కథలెలా చెప్పాలి"? ఈ విషయాన్ని తెలిపే ఆంగ్ల గ్రంథాలు కొన్ని చదివిన తరువాత ఎటువంటి కథనైనా కొత్త పద్ధతిలో పిల్లలకు ఉత్సుకతను రేకెత్తిస్తూ ఉత్సాహాన్ని కలిగిస్తూ పదిరోజుల పాటు ఎలా చెప్పాలో తెలిసింది. పిల్లలతో మాట్లాడుతున్నట్లుగా వ్రాయటమే బాల సాహిత్యానికి అవసరమైన శైలికి గ్రాహ్యమయింది. ఈ పద్ధతిలో "గాంధీ తాతాయ్య, ఇందిరా ప్రియదర్శిని" జీవిత చరిత్రలు,కథల సంపుటాలు రెండూ, "బాలవీరులు" అనే నాటికా సంపుటి వ్రాశాను.

ఎప్పుడూ ఏదో చదవాలన్న తపన – ఆ అనుభవాన్ని పురస్కరించుకొని ఏదయినా వ్రాయాలన్న ఆవేదన – ఆ వ్రాసింది పదిమందికి ఏదో విధంగా ఉపయోగపడాలన్న ఆకాంక్షతో కొంత ప్రయత్నం చేశాను.

వ్రాయాలన్న ఉత్సాహమే గాని ఏం వ్రాయాలో ఎలా వ్రాయాలో సరిగా తెలియని నాకు మనోవికాసం కలిగించి మార్గం చూపిన ఉస్మానియా యూనివర్సిటి ప్రప్రథమ జర్నలిజమ్ శాఖాధ్యక్షులయిన ప్రొఫెసర్ ఓడెత్‌గారికి నా కృతజ్ఞతలు.

నాలో పండితురాల్నీ కవయిత్రినీ చూడాలని ఆశించిన మావారికి అసంతృప్తిని కలిగించినా, రచయిత్రిగా కొంత వ్రాయాలని ప్రయత్నించాను గదా అన్న తృప్తి, ఆ వ్రాసింది కేవలం అన్నమయ ప్రాణమయ కోశలకే చెందుతుందేమోనన్న సంకోచం......

•••

# కల్చర్ – అకల్చర్

శ్రీ చుండి జగన్నాథం*

ప్రభావం చాలా గొప్పది. మనిషిని మనిషిగా నిల్పి, ఎదగ నిచ్చేది ప్రభావమే. దుష్ ప్రభావాల సంగతి నేను ప్రస్తావించడం లేదు. అవి అందరికీ కొద్దో గొప్పో తగిలే వుంటవి. ఉత్తమమైన, గుణ సంపదను పెంచే, ధైర్య స్థైర్యాలను పురిగొల్పే, వైరాగ్య లేక నిష్కామ భావాలను ప్రోత్సహించే ప్రభావాల ధాటికి, ఆ చెడుగులన్నీ పరారై పోయి, మంచి సంస్కారం కలుగుతుంది. ఇలువంటి సంస్కారం ప్రభవించినంతసేపే స్త్రీ పురుషుల జీవనాలు శోభించగలవు. నా విషయం అంతేనని తోస్తుంది.

మొదట నన్నాకర్షించింది శ్రీ ములుమూడి నారాయణరావు గారు. నెల్లూరులో రాజాగారి ఉన్నత పాఠశాలలో అధ్యాపకుడై వుండి, రిటైర్ అయినారు. ఆయన చిన్న తనంలో (అప్పటికి వారు నా కంటే పెద్దవారు) పుస్తకాలయందు చూపిన శ్రద్ధ విపరీతమైనది. వార్థాటి యువకులలో ఎక్కువగా వికసించవలెననే సంకల్పంతో అనేక Elocution Competitions పెట్టించి, మా బోంట్లను ప్రోత్సహించేవారు. ఆయన పుస్తకాల పిచ్చి నాకు పట్టింది; ఇప్పటికింకా వదల్లేదు; వదిలే ఛాయ లెక్కడా కన్పించవు. ఇందువల్ల ఒక విధంగా నష్టపడ్డాను; మరొక విధంగా లాభపడ్డాను. మామూలు పాఠశాలల చదువుల మీద నిర్లక్ష్యం ఏర్పడింది; కడకు ఆ తెరువుకే పోవద్దనుకున్నాను. అందువల్ల డిగ్రీ లేని వ్యక్తిగా రూపొందినాను. ఐనప్పటికీ, నా మాటలు విన్న వారు నాకేవో పెద్ద డిగ్రీలు, డాక్టరేట్లు వున్నాయని భ్రమపడి, వాటిని గూర్చి కుతూహలంగా అడిగేవారు. ఏదో విధంగా నా వాకచక్యమంతా ప్రదర్శించి, వారికి విశేషం ఆశాభంగం కలుగకుండా సమాధానం చెప్పే వాడను. ఇక లాభం సంగతి. ఆ గ్రంథాలలోని సంపద అమూల్యమైనది. నాకు అదే జీవగర్ర.

రోమా రోలా రచించిన రామకృష్ణ పరమహంస, వివేకానందస్వామి, జీవితాలు నన్ను ముగ్ధుని చేసినవి. ఆ ప్రభావం ఇప్పటికీ పోలేదు. నాస్తిక-అజ్ఞేయ వాదాలతో - వాదులతో గాఢమైన పరిచయం కలిగినప్పటికీ నాస్తికులపై - నాస్తికతత్వంపై అమితమైన ఆదరణ భావం వున్నప్పటికీ, అన్ని మతాలు మనవే అనే స్థావరంలో నిలకడ కలిగింది. ఆ ప్రాతిపదికపై ఒక ఉద్యమాన్ని సాగించవలెననే సంకల్పం ఇటీవలనే కలిగింది. మిత్రులు సహకరిస్తే, త్వరలో దాని కొక రూపం వస్తుంది.

గాంధీ మహాత్ముడు, లెనిన్, ట్రాట్స్కీలు నాకు పరమపూజ్యులు. టాల్‌స్టాయ్, రస్కిన్ సరేసరి. అమెరికన్ సత్యాగ్రహి తోరో, అబ్రహాంలింకన్, అంకిల్ టామ్స్ కేబిన్ ప్రజా సాహితిలో రంగనాయకమ్మగారు అనువదించారు. అప్ ఫ్రం స్లేవరీ ( దీనిని ఈ మధ్యనే మానికొండవారు అనువదించారు).

ఈ ప్రభావాలు కాక, రుక్మిణీ కల్యాణం, గజేంద్ర మోక్షం, ప్రహ్లాద చరిత్ర, వామన చరిత్రం, రామాయణంలో బాలకాండ, భారతంలోని కొన్ని ఘట్టాలు నన్ను మలచినవి.

ఇటీవల కల్చర్, సంస్కృతి అంటూ వుంటే నాకొక పెద్ద ప్రశ్న ఉదయించింది. వేషభాషల కల్చర్‌గాక సంస్కారం కల్చర్ ఎక్కడున్నది?

మున్ముందు అది వస్తుందని నా విశ్వాసం. పరిస్థితులు ప్రపంచాన మనల్ని ఆ దిశకే తోసుకపోతున్నవి.

మన కల్చర్ అనబడే దానిలో ఇద్దరి చరిత్ర వాస్తవంగా సంస్కార పూరితం అని నేననుకున్నాను – ఒకరు జనకుడు, మరొకరు శుకుడు.

యోగరతోవాభోగరతోవా । సంగరతోవా సంగ విహీనః ।
యస్య బ్రహ్మణి రమతేచిత్తం । నందతినందత్యేవ ।

---

* యువభారతి 'నందిని' త్రైమాస పత్రిక – సంపుటి – 2, సంచిక –3, ఏప్రిల్ 1982. (శీర్షిక: ప్రభావం)

ఈ పద్ధతిని అవలంబించేవారే వారిద్దరు । ఒకసారి కీ॥ శే॥ వేలూరి సహజానంద అన్నారు. 'సన్యాసి హిందువు కాడు'.

మన కల్చర్ అనబడే దానిలో ఉత్తమోత్తమ సంస్కారాలు కొన్ని కనిపించినా ఆ కల్చర్ చాలా వున్నదని గ్రహించాను. ఆ అకల్చర్ నిర్మూలన కాకుంటే మనం ఎదగలేము.

ఉదా॥ పాండురాజు భార్యలలో ఒకరు సహగమనం చేసి, తన కంటే పెద్ద తోడి భార్యకు పిల్లలందరి పెంపకాన్ని అప్పగించడం త్యాగమయమే కాని, అసలా సహగమన పద్ధతి దుష్టమైనది గదా! పాండవులు నియోగం వల్లకలిగినా ఒక్క తండ్రి బిడ్డల కంటే ఎక్కువగా సంచరించు కున్నారు. ఇది ఉత్తమ లక్షణం. కుంతి కర్ణుని కన్నప్పుడు నిజం చెప్పలేని సమాజం గర్హనీయం. చివరకు, కృష్ణుని ద్వారా, ఒక కార్యార్థం దానిని వెల్లడిజేయడం ప్రశస్తం - అందులో అవకాశవాదం వుందని క్రిటిక్కులు కొందరు ఘోషించినా సరే!

రామాయణంలో ఏకగర్భవాసులు గాని సంతానం అన్నదమ్ముల కంటె ఎక్కువగా మెలగడం ఉత్తమ లక్షణం. మాట నిల్పుకోడానికై రాజ్యత్యాగం చేయడం, పాదుకా పట్టాభిషేకం సామాన్యమైనవి కావు. కాని శంబుక వధ జరిగి వుంటే అత్యాచారం. సీతమ్మ వారిని చెర విడిపించి అగ్నిలో దూకించడం కరుడు గట్టిన పురుష పక్షపాత లక్షణం. ఆ తర్వాత ఆమెను అడవికి పంపడం మహాఘోరం. కాని, ఇందుకై సిగ్గుపడక, రోత పడక, దానిని ఖండించక అదంతా మన కల్చర్ క్రింద జమ కావడం మనకు సిగ్గుచేటు.

అన్ని మతాల వారికి పవిత్రమైన గ్రంథ సముదాయాలలో ఈ విధంగానే కల్చర్ - అకల్చర్ మిశ్రమం ఉండనే వుంటుంది.

ప్రాజ్ఞులైన వారు క్షీరనీరన్యాయంగా హంసలవలె ప్రవర్తించి మనకు సేవ చేయవలసి యున్నది.

వామన చరిత్రలో చూడండి. బలి రాజ్యంలో సర్వారంభముల్ పండినవి. కాని, ఇంద్రుని పదవికి భంగం రాకూడదనే కారణాన, భగవంతుడు మాయ చేసి బలిని అణచి, కడకు అతణ్ణి రక్షించడం తనలో కల్పుకుని - ఏమిటీ నాటకం? ప్రజలకు బలినిచ్చి, తనలోకి ఇంద్రుణ్ణి దేవతలను దేవుడు తీసుకుపోరాదా?

దేవతల - రాక్షసుల గుణగణాలను పరీక్షగా చూస్తే దేవతలెక్కువని అనిపించరు. కాని ఎందుకో దేవతలు సన్మార్గులనీ, రాక్షసులు దుర్మార్గులనీ వాడుక వచ్చింది.

ప్రహ్లాద చరిత్రంలోని ప్రహ్లాదుడు మన గాంధీని గుర్తుకు తెస్తున్నాడు. కాని, చారిత్రకంగా చూస్తే, 'హిరణ్యకశిపుడు' అనే నాటకంలో కీ॥ శే॥ ఆయంచర్ల గోపాలరావుగారు ప్రహ్లాదుని పాత్రను ఇంకో విధంగా చిత్రించాడు. ఇందులో ఏది నిజం ? ఏది కల్పన?

గజేంద్ర మోక్షం గజేంద్రునికే గాక మనకందరికీ మోక్షమిచ్చేదే కాని, ఆఖరున, ఆ రాజు తప్పిదం లేకుండానే మౌని శపించినందువల్ల ఇంత గొడవ జరిగిందని అనడం ఏం సబబు?

పరీక్షిత్తు చరిత్రలో పరీక్షిత్తు చేసింది తప్పే. ఋషి కుమారుడు శపించిందీ న్యాయమే. కాని, అది తొందరపాటని గ్రహించిన తండ్రి ఆ శాపాన్ని ఉపసంహరించవలె గదా?

ఇటువంటి కథలెన్నో వున్నవి. సుమతి శతకంలో 'కోమలి నిజమున్ ఎగతాళి చేయడానికి ఎంత ధైర్యం కావలెను? సమాజం ఆనాడు ఆ స్థితిలో వుండెను. ఆ పద్యాలన్నీ కూడా మనం సగర్వంగా చదువుకొని ఆనందిస్తూ వుంటాము. ఎవరు ఆక్షేపించరు. పై నుంచి వచ్చిన దానిని దేనినైనా ఆక్షేపించదగునని ఎవరికీ తోచదు. మన సమాజంలో కూడా పాషండ లక్షణాలు ఇంకా వుండబట్టే గదా ఇది సాగిపోతున్నది!

మానవులందరు అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, తల్లిదండ్రులు పుత్రులు పుత్రికలు అనే ధోరణిలో మన సంస్కారం వర్ధిల్లవలసి యున్నది.

సాహిత్యం అందుకు దోహదకారి కావలెను. మన సాహిత్యంలో వున్న ఉత్తమ రచనలన్నింటినీ రక్షించి మనకందించి ఉత్సాహపరచే యువభారతి వారికి వందన శతసహస్రము లర్పించినా తక్కువే.

మన పాదాలపై మనం నిల్చి గర్వంగా తలయెత్తుక తిరగడానికి తెలుగు వారికి ఈ సంస్థ గొప్పగా తోడ్పడుతున్నది. మనం ఎదిగి మానవులమై సంస్కారంతో, నిజమైన సంస్కృతితో మెలగడానికి ఇంకా గొప్పగా తోడ్పడవలెనని నా బోంట్ల కోర్కె. ఈ కోర్కె నెరవేరుగాక!

•••

# పెద్దలు తీర్చిన నా జీవిత మార్గము

**– శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి (మనుమడు)***

మానవుడు పుట్టుక చేతనే గొప్ప వాడో, బుద్ధి మంతుడో కాడు. పరిసరముల ప్రభావమే మానవుని చరిత్రను నిర్ణయించుననుటకు కొందరి చరిత్ర ఉదాహరణము. అట్టివానిలో నాదొకటి.

నా జననము క్రీ.శ. 21-11-1912 క్షీరాబ్ధిశయన ద్వాదశి మధ్యాహ్నము పండ్రెండు గంటలకు, స్థలము తమిళనాడులో, ఉత్తర ఆర్కాటు జిల్లా, తిరుపత్తూరు టౌను, నేటి జాలారుపేట, రైల్వేస్టేషనుకు సమీపము. ఇందులకు కారణము మా మాతామహుడు, శ్రీ ప్రొఫెసర్ శేషగిరిశాస్త్రి గారు ఆ యూరిలో తాతవెళ్ళి గ్రామము మున్నుగా కొన్ని గ్రామములకు మిరాదారుగా నుండుటయే. వీరు పుదూరు ద్రావిడులు, ఇంటి పేరు పాకువారు. గృహభాష తమిళము. ఈ పుదూరు ద్రావిడులు, ఏ చోళ రాజుల కాలములోనో ఆంధ్రదేశమున గుంటూరి వరకును, తమిళనాడులోను, మహారాష్ట్ర దేశమున పునా నగరమునకు వేద పండితులుగా అగ్రహారాదులను సంపాదించినారు.

శ్రీ శేషగిరి శాస్త్రిగారు పదునెనిమిది భాషలలో పండితులు, వేదాధ్యయన మొనరించి సామగాన మందు ప్రఖ్యాతి నందినవారు. కర్ణాటక, హిందుస్థానీ, ఐరోపీయ సంగీతములలో ప్రవీణులు. చక్కని వైణికులు, మదరాసు ప్రెసిడెన్సి కాలేజీలో సంస్కృతమునకు ప్రొఫెసరుగాను, OMS Library కి, క్యూరేటరుగాను, మదరాసు విశ్వ విద్యాలయ ప్రారంభకులలో నొకరుగాను నుండినవారు సర్ సి.పి. రామస్వామయ్యరు వంటివారు వీరి శిష్యులు. మా తల్లి గారు సరస్వతమ్మ వీరి కడపటి కుమార్తె. మాకు బాల్యము నుండియు తన పుట్టింటి ప్రాభవమును చెప్పుచు మమ్ము ఆశ్చర్యపరచుచుండెడిది.

మా పితామహుడు వేదము వేంకటరాయ శాస్త్రి గారు కళా ప్రపూర్ణేత్యాది బిరుదాంకితులు. మాది పరంపరగా వైదిక కుటుంబమైన వేదము వారని ఇంటి పేరేర్పడినది. తండ్రిగారు వెంకటరమణ శాస్త్రి, వెంకటరమణన్, వెంకట్రామ్ అని మదరాసు మిత్రుల చేత వ్యవహృతుడు. ముద్రణ కళానిష్ణాతుడు. కాని పెద్ద 'శాండో'. ద్రవ్య విషయములలో ప్రజ్ఞచాలదు. అమాయకుడు. తాతగారి ముద్రాక్షరశాలను నిర్వహించుచుండి వ్యాపారమే చెడిపోయినది.

1919లో మేము నివసించు ఇల్లుగాక మరి రెండిండ్లను అద్దెకు పుచ్చుకుని జరుపుచుండిన తాతగారు అచ్చాఫీసు విక్రయించిరి. 1922లో నెల్లూరికే కాపురము తరలించిరి. దుందుభి సంవత్సరము, నేటికి అరువది యేండ్ల క్రింద. నెల్లూరు చేరగానే పురీ శంకరాచార్య స్వాముల వారు తాతగారికి అఖండ పండిత సన్మానము చేసిరి. శ్రీ డా.I కట్టమంచి రామలింగారెడ్డి గారన్నట్లు తాతగారికి 'సరస్వతీ ప్రసన్నమేగాని లక్ష్మీ ప్రసన్నము లేదు'. ఆర్థిక దురవస్థ తీరలేదు.

ఇట్లుండగా ఆ సంవత్సరమే నవంబరు 4వ తేది మా నాయనగారు ఆకస్మికముగా తమ 37వ యేట మరణించిరి. మేము నలుపురము. ముగ్గురు కుమారులము, ఒక్క కొమారిత నేను పెద్దవాడను. నాకు పదునొకండవ సంవత్సరము. తాతగారికి భరింపరాని దుఃఖము, నాకు మొదటి దెబ్బ. నాకేమో బాల్యమైనను తలాలున కండ్లు విప్పినట్లయినది. కుటుంబములో ఎంతలో ఎంత మార్పు. అంత పెద్ద అచ్చాఫీసు మాయమైనది. లాలించుచుండిన తండ్రి లేడు. నా బాల్య విద్యాభ్యాస పోషణాదులన్నియు తాత గారైన వెంకటరాయశాస్త్రి గారి చేతి మీదుగానే జరిగినవి. జరుగవలసి వచ్చినది. కాని బాల్యము నుండియు తాతగారితోనే ఎక్కువ చనువు. తాతగారు పోయిన చోటికంతయు నన్ను

---

పిలుచుకొని పోవు వారు –మదరాసు నుండి విజయనగరము వరకు. శ్రీపాద కృష్ణమూర్తిగారు తాత గారి శిష్యులు, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు వారి శిష్యులు. వీరి శిష్యులు వేలూరి శివరామశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి వర్యులు. వీరే గాక ఆంధ్ర ద్రావిడ కర్ణాటక మలయాళాది దేశముల నుండి తాతగారిని నిరంతరము దర్శించుటకు వచ్చుచుండిన మహనీయుల నెందరినో ఇంటిలోనే చూచు భాగ్యమబ్బినది. తాత గారు గుడిలో దేవుని ముందు తప్ప, ఇతరత్ర ఎవరికిని సాష్టాంగపడగా నేను చూడలేదు. శంకరాచార్య పీఠస్థులైన ఆచార్యవర్యులు కూడా తాతగారిని పరుగున వచ్చి కౌగలించుకొని సాష్టాంగపడుటను మాన్పియున్నారు.

కాని నేను మధ్యాహ్న మార్తాండుని ప్రతాపము చూడలేదు. అస్తమయ భానుని తేజమును చూచితిని. నాకు జ్ఞానోదయమగునప్పటికే వారికి వృద్ధాప్యము. నేను వారికి పట్టి మనుమడను గాను, సన్నిహిత కార్య సహాయుడను. వారి గది లోనే సహవాసము. వారి మంచమే నా పడుక. వారి లైబ్రరీ, పర్సు అంతయు నా స్వాధీనము. నా స్థాయికి దిగి నన్ను వినోదింపజేసెడివారు.

ఇంటిలో ఎంత తమిళము మాటలాడుచుండినను చదువంతయు తెలుగే. చిన్నప్పుడే తెలుగు పద్యముల చదువుట అలవాటైనది. నా చేత చదివించి వినెడి వారు నాయనమ్మయు, తాతగారును. నాయనమ్మ శేషమ్మ అల్లాడి సదాశివశాస్త్రి గారి కుమార్తె. బాల్యములో వీధి బడి చదువువంటి చదువు ఆమెది. గ్రామపు లెక్కలు, పాతికలు, పరకలు, ముప్పాతికలు –ఎక్కములు, ప్రభవలు– ఇంతెందులకు – పెద్ద బాలశిక్షను వ్రాసిన మా పుదూరు సీతారామశాస్త్రిగారు మా నాయనమ్మను చూచియే వ్రాసినారా అన్నట్లుండెడిది. వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారికి పుట్టింటి వైపు బంధువు. ఎన్ని విషయములో బోధించెడిది. తాతగారు చదువులలో మునిగి యుండగా వ్యవహారమంతయు నాయనమ్మది.

మా తల్లి సరస్వతమ్మకు తమిళాంధ్రములలో ప్రజ్ఞ సమానము. ఆ కాలపు నవలలలో చదివి మరచినది, చదువక విడిచినది లేదు. కొన్ని వందల సామెతలు ఆమెకు జిహ్వాగ్రగతములు. చక్కని జ్ఞాపక శుద్ధి , సున్నిత హాస్యము ఆమెకు సొమ్ములు.

తాతగారు ఇంతటి పండితులని తెలియుటకు ముందే, మదరాసు వి.పి.హాలులో తాతగారి సమక్షములో గోవిందరాజుల సుబ్బారావు నటించిన ప్రతాపరుద్రీయమును చూచితిని. వెంటనే కుతూహలము రేగి, నెల్లూరికి పోయినపుడు కందాడై దొరస్వామయ్యంగారు మొదలైన వారెవరో గ్రహించితిని. తాతగారి యొద్ద వారు ఒద్దికలు జరుపుచుండుట చూచి, చదువకయే శాకుంతలాది మహానాటకముల సంభాషణలను, పద్యములను కంఠస్థము చేసికొంటిని. నాకు కూడ చిన్నవేషము లిచ్చి నన్ను రంగము మీద నిల్పెడివారు. తాతగారు అమరము, శబ్దమంజరి, హితోపదేశ పంచతంత్ర రఘువంశాదులను నేర్పి గ్రంథ ముద్రణ విధానము, ప్రూఫులు దిద్దు విధానము, పుస్తక వ్యాపారము 1929 నాటికి, నా పదునేడవ యేటికే , తాతగారు గతించునప్పటికీ ఒక పాటి తెలియునట్లు చేసిరి.

నాటి SSLC ఐనది. తాతగారు చనిపోయిన దినము శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు, వారితో వారి ఆంధ్రపత్రికా కార్యాలయమే మా యింటి వాకిటికి వచ్చినది. మదరాసులోని విద్యావంతులు ప్రముఖులెందరో ఆ దినము మధ్యాహ్నము వరకు మా సందులోనే యుండిరి. విచిత్రమైన యనుభవము.

పదునేడవ యేటనే కుటుంబ భారము నెత్తిమీద పడినది. ఏదో చెప్పరాని మానసిక పరిస్థితి. అనుక్షణము ఏదో చెప్పుచుండి, ఎడబాయని, ప్రపంచ విఖ్యాతుడయిన పండితుడు తాత, 'ఎవడికుంటాడ్రా ఇటువంటి తాత' అన్న తాత ఇక లేక పోయినాడు. కాని నాయనమ్మ శేషమ్మ అమ్మ సరస్వతమ్మ గారలు. ఇంటిలోను నెల్లూరు నుండి అడ్వొకేటు చినతాతగారు వేంకటాచలము గారును, తాతగారి ఋణములను పదివేల రూప్యముల దాక తీర్చిన రెడ్డి సంఘ కార్యదర్శులు శ్రీ గునుపాటి ఏనాదిరెడ్డి

గారును, బెజవాడ రామచంద్రారెడ్డి గారును చెంత నుండి చూచుకొనుచుండిరి. సలహాలిచ్చి ధైర్యము చెప్పుచు ప్రోత్సహించు చుండిన పెద్దలు నెల్లూరిలో శ్రీ తూములూరు శివరామయ్యగారు, తాతగారి శిష్యులు పలువురు, మదరాసులో శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు గారు అల్లాడి కృష్ణస్వామిగారు మొదలైనవారు. అప్పుడప్పుడు పోయి శ్రీ ఒంగోలు వెంకటరంగయ్యగారు, మామిడిపూడి వెంకటరంగయ్యగారు మున్నగు వారితో మాటలాడుచు ఎన్నో విషయములు గ్రహించెడివాడను. తాతగారి శిష్యులలో శ్రీమాన్ రామదాసయ్య గారు, గుట్టము సుబ్బరామయ్యగారు, ధరణికోట వెంకట సుబ్బయ్యగారు, యువకులలో మహాప్రజ్ఞానిధి, దర్శనశాస్త్రి ఓరుగంటి వెంకటేశ్వరులు. వీరితో సంభాషణ ఆనందకరమైన విద్యాగ్రహణము, కావ్య నాటకాలంకారాది చర్చ, తాతగారి వైదుష్య ప్రతిభల ముచ్చటలు చెప్పుకొనుట.

అన్నింటిని మించి నన్ను పూర్తిగా చరిత్ర కారునిగా మార్చినది మా చిన తాతగారైన వెంకటాచలము గారి తోడి సన్నిధి. తాతగారు 1929లో చనిపోగా వీరు 1931లోను, వారి సోదరులు రెండవ చిన తాతగారు 1952లో తమ 86 వ యేటను పోయిరి. వేంకటాచలము గారు వృత్తి చేత న్యాయవాదులు. కాని గ్రీకు, లాటిను. పర్షియను, పహ్లవి, ఆవెస్తా, ఆంధ్ర ద్రావిడ కర్ణాటక మలయాళాదులలో పండితులు. వైదిక వాఙ్మయ చరిత్రను ఈజిప్టు సుమేరియా, బాబిలోనియా, గ్రీసు మున్నగు దేశాల చరిత్రలతో పోల్చి సమన్వయించి, అపార పరిశోధన చేసి, జర్మని ఫ్రాన్సు మున్నగు దేశాల పండితులతో ఉత్తర ప్రత్యుత్తరములు సలిపెడివారు. తమ చదువంతయు తాము గ్రంథస్థము చేయలేక పోవుట వలన తమతోనే అంతరించు నేమో యని దిగులు పడి నా కెంతో బోధించెడివారు. తాతాగారొక సముద్రమైన చిన తాతగారొక సముద్రముగా కనబడిరి. రెండవ చిన తాతాగారొక ఆశ్చర్యకరమైన వ్యక్తి. వారి సంస్కృతాంధ్రాంగ్ల పాండిత్య ప్రతిభలు ఎందరికో ఉత్తేజకరములు.

చిన తాతగారు 1931 లో గతించిరి. అటు వెనుక ఆరేండ్లు మా పుస్తక వ్యాపారము చూచుకొనుచు మదరాసు నుండి విజయనగరము వరకు సంచరించి పెద్దల నెందరినో సందర్శించితిని. 1936లో రాజమండ్రిలో పర్లాకిమిడి నుండి అప్పుడే వచ్చిన శ్రీ గిడుగు రామమూర్తి గారిని సందర్శించి, ప్రతిదినము, కొంతకాలము వారి గోష్ఠిలో గడపి చాలా లోకజ్ఞానము సంపాదించితిని. వారికేదో నా మీద అవ్యాజ వాత్సల్యముదయించి 'మీ తాతగారిని మీరు చక్కగా ఎరుగుదురా? అని యడిగిరి. వారి యుద్దేశమేమో తెలియక, బాల్యమే కాబట్టి 'ఆహా! ఎఱుగకేమి? నాకు పదునేడేండ్లగు వరకు, ఉండిరిగదా' అంటిని. ఆ ఎరగడం కాదండీ, ఎంతటి పండితులో ఎరుగుదురా? ఎరగరు, ఎరగరు, మేమెరుగుదుము. అంతటి పండితుడు లేడు. ఆయనలో ఒక నెరసు దొరకెనా అది గొప్పగాని, ఇతరులు ఏపాటి?' అని యన్నారు. తాతగారెంతటి పండితులో దీని వలన వ్యక్తమైనది నాకు.

అటు తర్వాత, మరల కళాశాలలో ప్రవేశించి 1938లో బి.ఏ., 1940లో ఎమ్.ఏ పరీక్షలలో ఉత్తీర్ణుడనై, డా॥ నేలటూరి వెంకటరమణయ్యగారి పెద్ద కుమార్తెను వివాహమాడితిని, వీరు నాకు బంధువులే గాక క్రైస్తవ కళాశాలలో అధ్యాపకులు కూడ. ఈ కాలమున వీరు మదరాసు విశ్వవిద్యాలయములో చారిత్రక పురాతత్వాది శాఖలలో ఆచార్య కె.ఎ. నీలకంఠశాస్త్రి గారితో రీడరుగా నుండిరి. నేను 1940-1943లలో వీరియొద్ద కల్యాణి చాళుక్యుల చరిత్రమీద పరిశోధన చేసితిని. సంస్కృతాంధ్ర ద్రావిడ కర్ణాటక భాషలు, వాని శాసనములు చక్కగ పఠించి, లిపి శాస్త్రజ్ఞానము కూడ సంపాదించు నవకాశము దొరకినది. ఈ పరిశోధన నిమిత్తము సంచరించి 1941లో మైసూరులో శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ గారి వంటి వారితోను, 1942లో హైదరాబాదులో శ్రీయుతులు సురవరం ప్రతాపరెడ్డి గారు, మాడపాటి హనుమంతరావు గారు, ఆదిరాజు వీరభద్రరావు గారు మున్నగు పెద్దలతోను పరిచయము చేసికొంటిని.

ఈ సందర్భములో స్మరింపదగిన మిత్రుడు, సహాధ్యాయి, ముట్నూరి వెంకటరామయ్య, నేను ఆరేండ్లు కళాశాల చదువుమాని సంచరించుచుండిన కాలమున నితడు ఎమ్.ఏ. పాసై, ఆచార్య నీలకంఠశాస్త్రి, డా॥ వెంకటరమణయ్యల కడ తెలుగు చోళుల మీద పరిశోధన చేసి, నేను 1936లో మరల కళాశాల చేరిన వెంటనే ప్రతి సాయంత్రము నాతో చదువుచుండెడివాడు. మరియొక మిత్రుడు, బాల్య సహాధ్యాయి. డా॥ ఒరుగంటి రామచంద్రయ్య, తమిళ చరిత్రకారుడు, రచయిత డా॥ మా. రాజమాణిక్యం పిళ్లై ఆప్తమిత్రుడు, పరిశోధనలో దిగిన తర్వాత శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారితో అత్యంత మైత్రికుదిరినది. అందులోను ఆంధ్రపత్రిక కార్యాలయమునకు నేను పోని దినమేలేని కాలము అది.

మాఘుడు శిశుపాలవధలో శ్రీకృష్ణ నారదులు కలిసి మాటాడుకొను సందర్భములో వారు ఒకరు నలుపు ఒకరు తెలుపైనను, ఒకరి ప్రభావము, కాంతి, మరియొకరి మీద పడి ఒక్కటే రంగుగల వారి వలె కనబడిరని వ్రాసినాడు. "పరస్పరేణ, ఛురితామలచ్ఛవీ తదైక వర్ణావివతౌ బభూవతుః" అని. ఆ విధముగా ఇందరి ప్రభావము నా మీద పడుటచేత నాకు దినదినమునకు 'రంగు మారి' క్రొత్త చాయ రాసాగినది.

1943 నుండి 1945 వరకు రెండు కళాశాలలలో బెల్గాం లింగరాజ కళాశాల, సేలం కళాశాలలో అధ్యాపకుడను చరిత్ర బోధించి, మానుకొని, యథాపూర్వము, 1936లో నుండినట్లు మరల తాతగారి గ్రంథముద్రణ వ్యవసాయమునకు పూనుకొంటిని. మదరాసు విశ్వవిద్యాలయములో నేను చేసిన పరిశోధనపై నొక నివేదికను సమర్పింపగా దానిని ఆచార్య నీలకంఠ శాస్త్రిగారు ముద్రణమునకు సిఫారసు చేసిరి గాని మదరాసు విశ్వవిద్యాలయము వారు సిఫారసుల గుంపులోదీనిని కూడ కలిపి క్రమముగా విస్మరించినారు. అటు వెనుక నా Index cards ను కొంత పరిశోధనను ఆధారముగా గ్రహించి శ్రీ శాస్త్రిగారు తామే, హైదరాబాదు శ్రీ యాజ్దానీగారి ప్రధాన సంపాదకత్వమున వెలువడిన రెండు సంపుటములకు కల్యాణీ చాళుక్యుల మీద నొక ప్రకరణమును వ్రాసి అందు నా పేరు పలుచోట్ల ఉదాహరించి శిష్యుని మీది అభిమానమును చూపినారు. నా సిద్ధాంతములను పెక్కింటిని అంగీకరించినారు. ఆ సందర్భమున విషయము యొక్క లోతుపాతులను నేను చక్కగా గ్రహించి, ఇంకను లోతుగా ఆంధ్ర ద్రావిడ కర్ణాటక చరిత్రలతో సమన్వయించి దక్షిణ భారత చరిత్రతో ఉత్తరాపథ చరిత్రను పరస్పర సంబంధములను వివరించి వ్రాయుట ఆవశ్యకమనియు అది కొంతకాలము పట్టినను దేశ క్షేమార్థము తప్పనిసరి యనియు గ్రహించి మరల లోతుగా పరిశోధనకు దిగితిని.

ఇంతవరకు జీవితములో నొక ఘట్టము. ఇంట నేర్చిన విద్య సంస్కృతాంధ్రములు, కళాశాలలో చదివినది దేశ చరిత్ర. పరిశోధన కొఱకభ్యసించినది కన్నడమును శాసన పఠన విద్యయు, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు గారి ప్రోత్సాహము చేత 1932 నుండియు భారతి పత్రికకు వ్యాసములు వ్రాయుచుంటిని. 1945 నుండి ఉద్యోగాపేక్ష వదలినను, విద్యార్థిదశలో కూడ తాతగారు గతించిన నాటినుండియు గ్రంథ ముద్రణ వ్యవసాయము జరుపుచునే యున్నందున మరల దానిని పునరుద్ధరించుట శ్రమ యనిపింపక జీవితములోనే ఒక స్థాయికి వచ్చినట్లనిపించినది. లెక్క లేని ప్రయాణములు చేసి ఇంటికి తిరిగి వచ్చిన వానివలె, మనస్సునకు నెమ్మది కలిగించినది.

నేను మరల పుస్తక వ్యాపారములో దిగుట మాబంధువులైన శ్రీ వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రి గారికి అంత ప్రియముగా నుండలేదు. ఎందరో నన్నాదరించుచు, సహకరించుచు, సానుభూతి చూపుచుండగా వీరొక్కరు మాత్రము ప్రసన్నులు గాక యుండిరి. కాని నాకడ తాతగారు చదివి మరల ముద్రింపదలచి ఎంతో Marginal notes వ్రాసియుంచుకొన్న సంస్కృతాంధ్ర వాఙ్మయమున్నది. వాని ముద్రణమునకు కంకణము కట్టుకొంటిని.

1943లో తాతగారి జీవిత చరిత్రను ప్రామాణికముగా వ్రాసి డా॥ సి.ఆర్. రెడ్డిగారి

యుపోద్ఘాతముతో ప్రకటించితిని. శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారి వంటి పెద్దలు శ్లాఘించిరి. నాటకరంగానుభవమును, కొంత రంగవ్యామోహమును ఉండినందున 1945 లో భువన విజయ వస్తువును గ్రహించి శ్రీ కృష్ణరాయ విజయమను నాటికను వ్రాసితిని. తర్వాత వ్యామోహమను సాంఘిక నాటికను 1952లో వ్రాసి ముద్రించి ఆడించి సహృదయుల సదభిప్రాయములను పొందితిని. హైదరా బాదుకు 1942నుండి పోవుచున్నందుకు ఫలితముగా అక్కన్న మాదన్నల చరిత్రకు విషయ సంగ్రహము చేయగలిగి 1953లో వ్రాసి ప్రకటించి, మదరాసు తెలుగు భాషా సమితి వారి బహుమతి నందితిని. 1956లో Moreland and Chatterjee అను వారి ఆంగ్ల హిందూ దేశచరిత్రను, బాల్యమిత్రుడు, పండితుడు శ్రీమాన్ నేలటూరి భక్తవత్సలయ్యంగారు (వివేకానంద కళాశాలాంధ్ర శాఖాధ్యక్షుడు) తోడి రచయితగా, అనువదించి, మదరాసు విశ్వవిద్యాలయము వారి బహుమతిని మిత్రునితో పంచుకొంటిని. 1957లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 'నన్నెచోడుని కవిత్వము' అను విషయము మీద నిర్వహించిన పోటీలో విజయము గాంచి రు.2500/- (ఇప్పుడు రు,3500/-) బహుమతిని అందుకొంటిని. ఇంత దూరము సాగించిన సాహిత్య సేవ ఫలితముగా ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యత్వము కూడా లభించి పదేండ్లు సాగినది.

ఈ విధముగా 'పుట్టిన దాదిగా తనదుపుణ్యమె దాదిగ' ఎందరిచేతనో ఉత్తేజితుడనై, ప్రాచీన పండిత మార్గములో చారిత్రక సమన్వయ మార్గమును జోడించి, రాజుల చరిత్రగాక ప్రజల చరిత్రను పరిశోధించి సంపాదించుటకు కృషి చేయుచున్నాను. ప్రస్తుతము వయసు డెబ్బది జరుగుచున్నది. తాతగారు పరిశీలించి మరల ముద్రింప దలచి జ్ఞాపికలు వ్రాసియుంచుకొన్న సంస్కృతాంధ్ర గ్రంథజాలము నా యొద్ద నున్నది. వాని ప్రకటనమును యథాశక్తి చేయుచున్నాను. 'యుక్తి యుక్తం వచోగ్రాహ్యం బాలాదపి శకాదపి' అనుటయే నా జీవిత ధ్యేయము.

●●●

# వస్తు కవితలో నన్నిచోడుని చిత్రకళా నైపుణ్యం

- డాక్టర్ అట్లా వెంకటరామిరెడ్డి

వస్తువులను వర్ణించడం వస్తుకవిత. ఈ వర్ణనలో కూడ నన్నిచోడుడు వస్తు బాహ్యరూప వర్ణనకే ప్రాధాన్యం ఇచ్చాడు. వస్తువులను అనేక రూపాలలో, అనేక వర్ణాల (రంగుల) తో చిత్రించి ప్రత్యక్షీకరింపజేయగల నేర్పు నన్ని చోడునికి ఉంది. అతడు తన చిత్రకళానైపుణ్యాన్ని రేఖా చిత్రాల, వర్ణ చిత్రాల రూపంలో వస్తు కవితలో నిక్షిప్తం చేశాడు. ఇది అతని ప్రత్యేకత.

**రేఖా చిత్రాలు :**

పార్వతి తన వియోగభారాన్ని కొంత తగ్గించుకోవచ్చునని భావించి, పరమేశ్వరుని చిత్రాన్ని ఏ విధంగా ప్రయత్నించి గీసిందో వివరిస్తూ, నన్నిచోడుడు తన చిత్రకళాపరిచయాన్ని ఇట్లా సూచించాడు.

" . . . చిత్ర సాధనంబులుగొని, పలక ఘట్టించి, మెఱుంగిడి, త్రివటించి, తిట్టంబు కొలదికిందెచ్చి, ఋజ్వాగతంబున రేఖ నూల్కొలిపి, పత్రకబిందుక నిమ్నోన్నతాపాంగ మానోన్మానంబు లలవఱచి, సలక్షణంబుగా చిత్రించి, వన్నువగొలిపి కందెలు దెఱచిన

కలకల నవ్వునట్లు, తమకంబున కన్గవవిచ్చి భ్రూలతల్
వాలయగ చూచునట్లు తనివోవగతెల్చియు కౌగిలింప చే
తులు పచరించు నట్లదటుతో రతికేళికి నవ్వళించు న
ట్లెలమి నటించుచుండె సతికీశ్వరు రూపెదురంబ్రసన్నమై.
(5-118, 119)

చిత్ర లేఖన సాధనాలను అమర్చుకోవడం, బిందువులతో, కొలతలతో రేఖా చిత్రం గీసే విధానాన్ని తెల్పడం, నవ్వు, చూపు, చేత అనే మూడు భంగిమల్లో జీవకళ ఉట్టిపడుతున్నట్లు వర్ణించడం నన్నిచోడుని చిత్రకళా పరిచయాన్ని గాఢంగా సూచిస్తున్నాయి. పై పద్యం ప్రభావంతోనే పింగళి సూరన తన ప్రభావతీ ప్రద్యుమ్నంలో ఇటువంటి సందర్భంలోనే ఇటువంటి పద్యాన్నే రచించాడు. (ప్రభావతీ ప్రద్యుమ్నం 1-138).

**వియోగభావభంగిమ :**

నన్నిచోడుడు పార్వతి వియోగభావాన్ని వ్యక్తంచేసే రేఖా చిత్రాన్ని ఎంత సులభంగా చిత్రించాడో చూడండి :

"వగచిన చిత్తము, నలదురి
మొగిచిన కనుగవయు, నుదుట మోపిన కేలున్,
వెగచిన కంఠము, నుడుగక
నెగచిన నిశ్వాసతతియు నీరజ ముఖికిన్. (5 - 108)

కనుమోడ్పు, నుదుట చేయిచేర్పు, పైకెత్తిన మోము - ఈ మూడు భంగిమలు చాలు పార్వతి వియోగతీవ్రతను వ్యక్తం చేయడానికి. చిత్రకారుడెవరో తెలియదు కాని దాదాపు ఇదే భంగిమలో ఉండే ఒక యువతి వర్ణచిత్రం ఈ నాటి కొన్ని సినిమా హాళ్ళల్లో అలంకరింపబడి ఉండడం మనం చూస్తూనే ఉన్నాం. అంటే ఈ భంగిమతెలిపే వియోగభావానికి ఆ రేఖాచిత్రం పరాకాష్ఠగా ఉండేటట్లు నన్నిచోడుడు ఊహించి చిత్రించగలిగాడనీ, అది అతని పరిశోధనాత్మక చిత్రకళానైపుణ్యానికి మచ్చుతునక అని చెప్పవచ్చు.

**వర్ణచిత్రాలు :**

నన్నిచోడుని రేఖాచిత్ర చిత్రణమే కాదు, వర్ణచిత్ర చిత్రణం కూడ ఎంతకమనీయంగా ఉంటుందో దర్శించండి. ఒకే రంగుతోగాని, రెండు, మూడు రంగులతో గాని వేసిన వర్ణ చిత్రాలు ఎట్లా ఉంటాయో వాటిని మించి నన్ని చోడుడు తన వస్తు వర్ణనలో చిత్రించాడు.

**ఏకవర్ణచిత్రం :**

ఒకే రంగుగల దృశ్య చిత్రణం ఇది :

"హరు వివాహమునకు కరమనురక్తుడై
వరుస జగములెల్ల వసుమయంబు
సేసెనో రయమున చిత్రభానుడనగ
వసు సమూహి ( గప్పె వసుధ యెల్ల (8 - 191)

చిత్రభానుడు (సూర్యుడు) చేసిన చిత్రం వల్ల భూలోకమంతా బంగారుమయమయింది. బంగారు(రంగు)ను అభిమానించే వాళ్ళకిది ఆనందాన్నిస్తుందనడంలో సందేహంలేదు.

## ద్వివర్ణచిత్రాలు :

రెండు రంగుల కలయికతో వేసిన చిత్రాల లాగా ఉండే వర్ణనం గమనిద్దాం. ఇందులో అనుకూల వర్ణ చిత్రణం, విరుద్ధవర్ణ చిత్రణం అని రెండు రకాలు.

### (1) అనుకూల వర్ణచిత్రణం :

"అన్నలువ పితామహుడని
మన్నింపక పట్టి పూయ మలయజమున సు
చ్ఛన్నుడయి కనకగిరిపై
వెన్నెల తెలు పడరినట్లు వేధ వెలింగెన్. (9 - 66)

వసంతాలాటలో హిరణ్యగర్భుడైన బ్రహ్మపై చందనపు పూత పూయడం ఉపమేయదృశ్యం. బంగారు పర్వతంపై వెన్నెల పడడం ఉపమాన దృశ్యం. ఈ రెండూ రమణీయమైనవే. బంగారు రంగుపై పడ్డ వెన్నెలకు చందనపు రంగురావడం సహజం. (ఇది బంగారానికి తావి అబ్బినట్లుగా ఉంది.) ఈ రెండు రంగులు ఒక దానిలో ఒకటి కలిసిపోయేటంత అనుకూల వర్ణాలు. వీటితో పై దృశ్యవర్ణన హృదయంగమమయింది.

### (2) విరుద్ధవర్ణ చిత్రణం :

మురువక్షము నో వ్రచ్చుచు
హరిచక్రము పిఱుద వెడలె నరుణద్యుతితో
తరుణార్కబింబమసితా
విరళాబ్దమునందు వెడలి వెలుగు విధమునన్. (12 - 84)

ఇక్కడ నలుపు ఎరుపుల సమ్మేళనం ఆకర్షణీయంగా ఉంది. మురాసురుని వక్షస్థలం నలుపు. అది చీల్చబడింది. రెండైన రొమ్ము మధ్య భాగం నుండి దూసుకువెడలిన, రక్తసిక్తమైన చక్రం, దగ్గరగా ఉన్న రెండు మేఘాలమధ్య నుండి వస్తున్న సంధ్యా సూర్యునివలె ఉంది. ఉపమేయదృశ్యం బీభత్సంగా కనిపిస్తుంటే, ఉపమానదృశ్యం రమణీయంగా ఉంది. రమణీయ దృశ్యం బీభత్సాన్ని సైతం ఆకర్షణీయం చేసింది. ఈ రెండు రంగుల రెండు దృశ్యాలు, స్థలకాలనేపథ్యాల్ని బట్టి సహృదయునిపై ఎటువంటి ప్రభావాన్ని వేస్తున్నాయోకదా !

## త్రివర్ణ చిత్రం :

చాల ప్రియుడగు శశి నిశాసంగతాను
రాగరసమున సంధ్యానురాగమడరి
కవయ నా చంద్ర రజనీ ముఖముల నడరు
ఘర్మ బిందులనంగ చుక్కలు వెలింగె. (8 - 91)

ఎరుపు, నలుపు, తెలుపు రంగుల కలయికతో పై దృశ్యం చిత్రితమైంది. రాత్రి నలుపులోను, చంద్రనక్షత్రాలు తెలుపులోను, అడరిన (ముదిరిన) సంధ్య ఎరుపులోను కనిపిస్తాయి. శశి నిశలను వ్యక్తులుగా వేయడం కొంతక్లిష్టం కావచ్చు. ఏమైనా ఉపమానరూపమైన సంధ్యారాత్రులు, చుక్కలు, చంద్రుడు అద్భుతమైన దృశ్యంగా దర్శనమిస్తాయనడంలో సందేహం లేదు.

పై దృశ్యాలన్నీ కుంచెకు అందేటట్లుగా చిత్రింపబడ్డం చేత, నన్నిచోడునికి చిత్ర కళాభినివేశం ఉండడంవల్లనే అలాంటి వర్ణ వర్ణనం సాధ్యమైందని చెప్పవచ్చు. చిత్రకళ ఒక దృశ్యానికి ప్రాధాన్యమిచ్చి దానికి తగిన నేపథ్యాన్ని సమకూర్చుతుంది. కవితాకళ అలంకార సహాయంతో ఉపమేయ దృశ్యాన్ని, ఉపమాన దృశ్యాన్ని ఏకకాలంలో సమకూర్చగలుగుతుంది. ఇది చిత్రకారుడైన కవి యొక్క చమత్కారం. ఈ దృశ్యాలకు కూడ దేశ కాల పాత్ర అవస్థాది రూప నేపథ్యం ఉండనే ఉంటుంది. అలంకార సాయంతో చిత్రింపబడే దృశ్యాలకు ఉపమాన ఉపమేయరూపమైన నేపథ్యాలు రెండు ఉండడం సాధ్యమౌతుంది. స్వభావోక్తి ద్వారానైతే ఒకే దృశ్యం రేఖా చిత్రంగా రూపొందవచ్చు. ఉపమ, ఉత్ప్రేక్షల(వంటివాటి) ద్వారానైతే రెండు వర్ణ దృశ్యాలు చిత్రింపబడతాయి. నన్నిచోడుడు ఈ మూడు అలంకారాలతో రేఖా చిత్రాలను, అనేక వర్ణ చిత్రాలను చిత్రించి, కవితా కళలో చిత్రకళను మిళితం చేసి వస్తు కవితకే వన్నెతెచ్చాడు.

# ఆధునిక తెలుగు నాటకం – ప్రయోగాలు

డాక్టర్ పి.వి. రమణ

ఆధునిక నాటక మంటే సాంఘిక నాటక మేనన్న ప్రతీతి ఈ నాడు ఏర్పడి ఉంది. ఆధునికాంధ్ర సాహిత్యంలో సామాన్యుల్ని గూడా ప్రత్యక్షంగా ఆకట్టుకొనేది, ఆలోచింపచేయకలిగేది సాంఘిక నాటకమే. సమకాలీన సమాజ స్వరూపాన్ని, మనుషుల మనోభావాల్ని వాస్తవికంగా, కళాత్మకంగా రంగంపై ప్రయోగించి చూపెట్టడమే సాంఘిక నాటక ప్రవృత్తిః ఇందువల్లనే సాంఘిక నాటకం ఆధునిక జీవనంలోని వెలుగు నీడల్ని అత్యంత శక్తిమంతంగా ఫోకస్ చేయగలదన్న అవగాహన ప్రజల్లో ఏర్పడి వుంది. సామాజిక, సమస్యామయ జీవనాన్ని వాస్తవిక దృక్పథంతో వ్యాఖ్యానించే ప్రయోగాన్నే "ఆధునిక నాటకం" గా మనం పరిగణించుకొంటున్నాం. "Drama is the most migorous form of literary art, prose fiction is the loosest" అన్న "హడ్సన్" వ్యాఖ్యానంలోని అంతరార్థమూ ఇదే; ప్రజల్లోకి చొచ్చుకుపోగలిగేది, ప్రజానమన్యల్ని ప్రతిబింబించగలిగేదీ సాంఘికనాటకమొక్కటే నంటాడు "ఆర్థర్ మిల్లర్".

ఆధునిక నాటకాన్ని గూర్చి వివేచన చేసే ముందు అసలు 'ఆధునికత' అంటే ఏమిటో అవగాహన చేసికోవాలి. గతంలో కంటే భిన్నమైన దానిని, సమకాలీన జనజీవనాన్ని నవ్యపోకడతో అభివ్యక్తం చేసే పద్ధతిని ఆధునికం అని స్థూలంగా వ్యవహరించుకోవచ్చు. కేవలం స్వరూపంలోనే గాక, ప్రక్రియ స్వభావం లోనూ, ప్రవృత్తిలోనూ గూడా నవ్యత్వం కన్పించాలి. "Modernity is a question not of date but of out look" అని వ్యాఖ్యానిస్తాడు "సర్ రిచర్డ్ లివింగ్‌స్టన్". "చరిత్రలో ఆధునికం కాల సంబంధి కావచ్చుకాని, సృజనాత్మక ప్రవృత్తి ప్రధానమైన సాహిత్యంలోకాని, మరే కళలోగాని ఆధునికత కాలరీతిగా మాత్రమే గాక, గుణవాచిగా కూడా ఉంటుంది. గతంలోకంటే గుణంలో భిన్నత్వం గోచరించినప్పుడే అది ఆధునికం అవుతుంది" అంటూ నిర్ధారిస్తారు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం. పై ఇరువురు సాహితీ మూర్తుల వివేచనల్లో తేలేదేమిటంటే ఆధునికం అనేది కేవలం భాహిరకమైన స్వరూపానికి చెందిందిగానే గాక, గతంకంటే వైవిధ్యమైన ఆంతరిక సృజనాత్మక ప్రవృత్తిని సాహితీ ప్రక్రియ కలిగి ఉన్నప్పుడే అన్వర్థమవుతుందన్న విషయమే. సమాజ పురోగతికి, సర్వమానవ వికాసానికి ఈ ఆధునికత చైతన్యస్ఫోరకంగా ఉండాలి. ఏ ప్రక్రియ పరిణామ వికాసానికైనా ఈ ఆధునికతా దృక్పథం అంతస్సూత్రంగా చైతన్య స్పందననందిస్తూనే ఉంటుంది. కేవలం సిద్ధాంతం కోసమో, దృక్పథం కోసమోగాక, ప్రతిపాద్య వస్తు ప్రయోజనాన్ని ప్రకాశింప జేసేవిగానూ, ప్రేక్షకుల హృదయానికి హత్తుకుపోయేట్లుగానూ ఆధునిక ప్రయోగం ఉండాలి.

ఇహ, నాటక ప్రక్రియకు సంబంధించి ఈ ఆధునికతను మూడువిధాలుగా పరిగణించవచ్చు. ఒకటి వస్తురూప శిల్పాలలో ఆధునికత, రెండు వస్తువును రంగస్థలంపై ప్రయోగించటంలో నూతనత్వం,, మూడవది పాత్రల అంతర ప్రవృత్తుల్ని ప్రతీకల ద్వారా మరింత బలీయంగా అభివ్యక్తం చేసే కళాత్మకపోకడ. మొదటగా పేర్కొన్న వస్తురూపశిల్పాలలో నూతనత్వం విషయంలో "కన్యాశుల్కం" ఆనాటికీ ఈనాటికీ గురుపీఠంలానే నిలుస్తుండటం ఆశ్చర్యం. ఆనాటి సమకాలీన సమాజ సమగ్ర స్వరూపాన్ని రంగస్థలంపై సహజాతిసహజంగా గురజాడ ప్రదర్శించగలిగారు. 'కన్యాశుల్కం' లోని పాత్రలు సమాజంలోని విభిన్న ప్రవృత్తులకు ప్రతీకలు. సామూహిక

జీవనం లోని అంతర్వేదనలకు ప్రాణం పోసుకున్న రూపాలు; అందుకే కన్యాశుల్కం నాటకానికి ప్రాచీనత, ఆధునికత లేబిల్సు అంటించటానికి ఎవరూ సాహసించరు. మూఢ విశ్వాసాలతో, దురాచారాలతో, కరుడు గట్టిన సాంప్రదాయాలతో రోగగ్రస్థమైన శిథిల సమాజపు సంవేదనలకు, సంఘర్షణలకు విడిది క్షేత్రం "కన్యాశుల్కం". పాశ్చాత్య నాటకరంగ ప్రయోగాలలో జీవధాతువును కోల్పోయిన ఈ నాటి తెలుగు నాటకంగా గాక, 'కన్యాశుల్కం' సర్వసమగ్ర, స్వయంసమృద్ధ ప్రయోగాత్మక ఆధునిక నాటకంగా ఈ నాటికీ కీర్తించబడుతూ ఉండటం విశేషం. ఏ ప్రయోగమైనా పరిణామదశలకు జీవవ్యాఖ్యానాలుగానే ఉండాలిగాని, సాంప్రదాయాన్ని తృణీకరించాలన్న ఏకైక ఆరాటంతో తన సహజ వ్యక్తిత్వానికీ, అస్తిత్వానికీ చేటు తెచ్చుకోకూడదు. "The fact that the passion for the drama is the universal necessities a further introductory remark; It makes the theatre one of the traditional and at the same time mostly subtly symbolic of all the Literary media drama continually advances to meet the needs of particular age..." బ్రిటిష్ చరిత్రను పర్యావలోకనం చేస్తూ "నికోల్" చేసిన వ్యాఖ్యలు పై విషయాన్నే బలపరుస్తాయి; గత వారసత్వాన్ని సంరక్షించుకొంటూనే ఆధునిక కాలాన్ని ప్రతిబింబించేట్లుగా, నాటకం పరిణామం చెందాలి. నిజానికి "కన్యాశుల్కం" వంటి .. నాటక రచన చేపట్టటానికి గరజాడకు సాంప్రదాయకంగా ఆ ప్రక్రియలో ఎటువంటి భూమికాలేదు. ఉన్న ఒకే ఒక్క సాంఘిక రూపకం "నందకరాజ్యం". ఒకే వర్ణంలోని ఇరుశాఖల అంతఃకలహాలను, ఆధిపత్యపోకడలను వెల్లడించే ఇతి వృత్తంతో కూడిన ప్రకరణ సమాన రూపకం అది 'తేటగీతి' పద్యాలతో నిండిన రచన అది."కన్యాశుల్కం" నాటకానికి ఏ విధంగానూ స్ఫూర్తినిచ్చే శక్తి లేని ప్రకరణం అది మరి గురజాడ ఇంతటి ప్రయోగ నిర్వహణకు ఎట్లా పూనుకొన్నాడు? అతన్ని ప్రేరేపించిన, లేదా ప్రభావం చూపిన ఆలంబన కేంద్రాలేవి? స్వభాషలో, స్వదేశంలో ఏవీ లేవు కనుకనే అతని దృష్టి బయట ప్రపంచం వైపు మళ్ళింది. ఆస్కార్ వైల్డ్, షెరిడన్, గాల్స్‌వర్దీ వంటి పెక్కు పాశ్చాత్య నాటక రచయితల ప్రభావం గురజాడ మీద ప్రసరించింది. "కన్యాశుల్కం" వంటి సమగ్ర స్వరూపం గల ప్రక్రియ ఆవిర్భవించటానికి ఆ కాలం నాటి సాంఘిక, ఆర్థిక, మత రాజకీయాలలోని సంక్షోభ స్థితిగతులే కారణమై ఉంటాయనటం నిస్సందేహం."Each emotional taste, each social or religious need is the root of a different genre which blossoms more or less happy" అని పేర్కొన్న "పాల్ వాల్‌ఫెమ్" గూడా పై విషయాన్నే నిర్ధారిస్తాడు. 'కన్యాశుల్కం" ఆవిర్భావానికి ఆనాటి సామాజిక శిథిలజీవనమే కారణమై ఉంటుంది.

ప్రతిసాహితీ ప్రక్రియను అత్యంత ప్రతిభా వంతుడైన రచయిత తన విశిష్ట రచనా శక్తితో వికాసవంతం చేస్తాడని తెలియజేస్తాడు "ఫెర్డినాండ్ బ్రూనేటర్". హిమవన్నగ సదృశుడైన గురజాడ ఆధునిక నాటక ప్రయోగాన్ని వికాస వంతంచేసి విస్తృతపర్చటమేగాక, ఆ తర్వాత నాటక రచయితలకు మార్గదర్శకుడైనాడు. ఆనాటి సమస్త జీవితాన్ని గురజాడ దర్శించిన తీరు అద్భుతం: ఆవిష్కరించిన టెక్నిక్ గురజాడకే చెల్లు. ఇక్కడ ఒక విషయాన్ని ప్రత్యేకించి పేర్కొనాలి. "For history has shown that when ever a people have revitalised themselves they have done so both by giving back to the sources of their own culture and by looking arround to invite influence from out side..." అంటున్న "రెనెవెలెక్" మాటలు అక్షర సత్యాలు, గురజాడపట్ల అన్వర్థాలు. పాశ్చాత్య సాహిత్య ప్రక్రియలను, సిద్ధాంతాలను, పోకడలను మనవారు స్వీకరిస్తే, భారతీయ సాహిత్య దార్శనిక శక్తి పాశ్చాత్యులకందించే తీరు మనరచయితలకు అలవడాలి. సమాజ సంస్కరణ, మానవ ప్రగతి ప్రధాన ధ్యేయాలుగా ఉపాసించిన గురజాడ తన నాటక ప్రయోగంలోనూ ఈ భావాలకే ప్రాధాన్యమిచ్చాడుగాని, నేటి నాటక రచయితల్లా పాశ్చాత్య ప్రయోగ ఆర్భాటంలో, ఆరాటంలో తను

చెప్పదల్చుకొన్న విషయాన్ని ఛిన్నాభిన్నం చేయలేదు. గురజాడ భావ పవనాలకు పునాది ఇక్కడి నేలే. ప్రక్రియా పరిణామ వికాసంలో ఆధునిక నాటకం ఎన్ని ప్రయోగాలు చేసిందో పరిశీలించే ముందు "కన్యాశుల్కం" నాటక ప్రయోగ అభివ్యక్తి వైవిధ్యాన్ని, పరిణామ రూపాన్ని అధ్యయనం చేయటం ఎంతో అవసరం; కనుకనే ఇంత విస్తృతంగా సమీక్షించాల్సి వచ్చింది. ఎక్కడనుంచి సిద్ధాంతాలను, ప్రయోగ నూతన పద్ధతులను అరువు తెచ్చుకొన్న తన పరిసర వాతావరణం, ఇక్కడి మానవ ప్రవృత్తుల సహజత్వం నాటకంలో ఆవిష్కరింపబడాలి. గురజాడ ప్రయోగంలోని గొప్పతనం "నేటివిటీ" కి ప్రాణం పోయడమే. "ఓబూతు నాటకం", "డియర్ ఆడియన్స్ సిన్సియర్లీ యువర్స్" వంటి ఆధునిక నాటకాల్లో, పాత్రల మనో ప్రవృత్తుల్ని అభివ్యక్తం చేసే సన్నివేశాల్లో పేరాగ్రాఫులకు పేరాగ్రాఫులు ఆంగ్ల వాక్యాలను మనం గమనించినప్పుడు, పాశ్చాత్య నాటక ప్రభావం, ప్రయోగ విధానం తెలుగు నాటకాన్ని ఎంత ముంపుకు గురిచేశాయో అవగాహనమవుతుంది; పెక్కు పాశ్చాత్య రచనల ప్రేరణతో "కన్యాశుల్కం" నాటకాన్ని గురజాడ సృష్టించినా, తన చుట్టూ ఉన్న సమకాలీన వాతావరణాన్ని,విలక్షణ ప్రవృత్తుల్ని ఆ నాటకంలో నింపాడు. కాబట్టే ఆనాటకం ఇప్పటికీ అగ్రశ్రేణిలో నిలువకలిగింది; ఎపిక్ ప్రమాణాలతో, క్లాసిక్ గౌరవాన్నిచూరగొన్న "కన్యాశుల్కం" ఇప్పటికీ తెలుగు నాటకరంగంలో వస్తుపరంగా ఆధునికమే. "Though art is my master I have a duty to society" అని స్పష్టీకరించిన గురజాడ, తన సాహిత్యాన్ని సమాజ సంస్కరణకే ఆయుధంగా ఉపయోగించటాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. ఒక విధంగా, సాహిత్యాన్ని సమాజ సంస్కరణకు ఆయుధంగా ఉపయోగించింది వీరేశలింగం పంతులుగారే. తెలుగు జాతి పునరుజ్జీవన ఉద్యమానికి కంకణం కట్టుకొని పెక్కు ప్రహసనాల్ని పంతులుగారు రచించారు - స్త్రీ విద్యా ప్రచారోద్యమం, సంఘ సంస్కరణోద్యమం పంతులుగారి జాతి పునరుజ్జీవన లక్ష్యంలోని ప్రధానమైన అంగాలు. పాశ్చాత్య సాహిత్య సంపర్కంతో పంతులుగారు వ్రాసి ప్రదర్శింపజేసిన ప్రహసనాలు ఆనాటి ప్రయోగ వివేచనలతో అంచనా వేసుకొంటే ఆధునికమైనవిగానే భావించాలి. షెరిడన్ "డ్యుయెన్నా", "రైవర్స్" నాటకాల్ని అనుసరించి "రాగమంజరి" (1885) "కళ్యాణకల్పవల్లి" నాటకాలను రూపొందించారు పంతులుగారు. షేక్స్పియర్ "కామెడీ ఆఫ్ ఎర్రర్స్" ను "చమత్కార రత్నావళి" గా రూపొందించటమే గాక 1880 లో రాజమండ్రిలో ప్రదర్శింప జేశారు. ఈ అనుసరణల నన్నింటిని తెలుగు వారి స్వభావ తత్త్వాలకు, జీవన విన్యాసాలకు అనుగుణంగా రూపొందించడం చేతనే అవి విజయవంతమవటమే గాక, పంతులుగారి సంస్కరణోద్యమం గూడా స్ఫూర్తినింపుకోవడం జరిగింది. "పాశ్చాత్య ప్రక్రియలకు, ఆధునిక సాహితీ రూపాలను మనం స్వీకరించినా, భారతీయ ఆదర్శాలతో, సంప్రదాయాలతో వాటిని మేళవించుకోగలగాలి" అన్న అరవిందుని నిర్వచనానికి పంతులుగారు భాష్యంగా నిలచారు. ఆంగ్ల సాహిత్యం నుండి ఆధునిక ప్రక్రియలను, రూపాలను స్వీకరించినా, తెలుగుజాతి పునరుజ్జీవనోద్యమ లక్ష్య సాధనకే వాటిని ఉపకరణంగా వినియోగించారన్న సత్యాన్ని మనం మరువరాదు. "పంతులుగారి సాహిత్యం సమాజం ఆనందించటానికి పుట్టింది కాదు. ఆలోచించటానికి ఆవిర్భవించింది." అన్న ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారి వివేచన ఎంతో విశిష్టమైనది. ఒక విధంగా ఆంగ్ల సాహిత్య ప్రభావం భారతీయులలో ఒక నూతన పరిశీలనా దృష్టిని ప్రసాదించటమేగాక, ఆధునిక ఆలోచనా సరళిని గూడా చేకూర్చి పెట్టింది. ఇంత వివరణ ఇవ్వటంలోని ఆంతర్యం ఏమిటంటే, పాశ్చాత్య సాహిత్యాన్ని, ప్రయోగాల్ని పంతులుగారు, గురజాడ స్వీకరించినా, వారి లక్ష్యం నాటి సంఘ పునరుజ్జీవనమే. వారి రచనలూ అప్పటికి ఆధునికాలే; భవిష్యత్ నాటక వికాస పరిణామానికి వెలుగు వేదికలే.

"మన వారు ఇతర దేశస్థుల గ్రంథములను చదవరు;

చూడరు. అందులో నుండు స్వారస్యమును గ్రహింపరు. ఇటులైన నాటకాభివృద్ధి ఎట్లు జరుగును.." అని స్వర్గీయ కోలాచల శ్రీనివాసరావుగారు "మానాయమానం" పీఠికలో వ్రాస్తారు. (1915-16) ఇట్లా వ్రాసి దాదాపు ఎనిమి దశాబ్దాలు గడిచిపోయినై. వీరేశలింగం యుగంలోనే పుట్టిన తెలుగు నాటకం స్వరూపంలోనూ, స్వభావంలోనూ మరింత విస్తృతినీ, వికాసాన్ని పొందటానికి పాశ్చాత్య నాటకరంగం ఉపయోగపడింది; తెలుగు నాటకంలో ఆధునికత ప్రవేశానికి, ప్రయోగ వైవిధ్యానికి పాశ్చాత్య నాటకరంగం దిక్సూచిగా నిలిచింది. ఇతివృత్తం, సాంఘికమైనా, చారిత్రికమైనా, పౌరాణికమైనా ఆంగ్లనాటకరంగ ప్రయోగప్రభావం ఉండటం ఈ కాలపునాటకాలలో ప్రత్యేకత.సంస్కరణ ప్రబోధం కూడా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో గోచరిస్తుంది. ధర్మవరంవారి "విషాదసారంగధర" కోలాచలం "రామరాజుచరిత్ర", "శిలాదిత్య", దువ్వూరి రామిరెడ్డి "కుంభరాణా", శ్రీపాద "బొబ్బిలి" మొ॥ నాటకాలపై పాశ్చాత్య నాటక ప్రభావం ఎంతగానో ఉంది; ఇవన్నీ ఆనాటికి వస్తురీత్యా; ప్రవృత్తుల రీత్యా, ప్రయోగరీత్యా ఆధునికతను అందిపుచ్చుకొన్నవే. విశ్వనాధవారి "నర్తనశాల", "వేనరాజు" మొ॥ నాటకాలపై గూడా ఆంగ్లనాటక ప్రభావం గమనిస్తాం. విషాద నాటక స్వరూపాన్ని ఈ పై నాటకాలన్నీ విస్తృతవంతం చేశాయి. ప్రదర్శనలో ఎంతో విజయవంతమైనాయి; అంటే ఆంగ్లనాటక ప్రభావంతో; ప్రయోగాలతో రూపుదిద్దుకొన్న తెలుగు నాటక ఆధునిక స్వరూపాన్ని తెలుగు ప్రేక్షకులు ఆదరించారన్న మాట; ఒక్క తెలుగు నాటకరంగాన్నే గాక, ప్రక్కన ఉన్న కన్నడ నాటక రంగాన్ని కూడా ఆంగ్ల నాటక కర్తలైన షేక్స్పియర్, షెరిడిన్, గోల్డుస్మిత్, ఇబ్సన్, షా వంటి వారు వికాసవంతం చేశారన్న విషయాన్ని ప్రొఫెసర్ వి.కె. గోపాల్ వెల్లడిస్తారు. ఇప్పటివరకూ ప్రస్తావించబడిన నాటకాలన్నీ ఆంగ్లనాటక పోకడలను జీర్ణించుకొని అభినవంగా, ఆధునికంగా దర్శనమివ్వటమే గాక, సాంఘిక సమస్యల్ని గూడా అవసరమైన చోట్లలో ప్రస్తావిస్తూ వచ్చాయి. సాంఘిక సమస్యలకు, సంఘర్షణలకు ప్రతినిధులై నిల్చే తర్వాతి నాటకాలకు ఈ నాటకాలు స్ఫూర్తి కేంద్రాలై విలసిల్లాయని భావించుకోవాలి. ఈ ఆధునికత అంతా, అంటే సంఘర్షణలకు, సమస్యలకు ప్రతినిధులై నిల్చే పాత్రల రూపకల్పనా పోకడ అంతా పాశ్చాత్య నాటకరంగం నుండి తెచ్చుకొన్నట్టిదే. ప్రత్యక్షంగా కాకపోయినా ఆంగ్లనాటక ఆడంబర ప్రదర్శనా విధానం పార్శీ, మరాఠీ కంపెనీల ద్వారా తెలుగు నాట కూడా వర్ధిల్లింది. ఇహ ఆంగ్ల నాటక ప్రయోక్తలు అవలంబించిన అట్టహాస స్టేజి ప్రాపర్టీ అలంకరణ పోకడను గూడా అనుసరించిన తెలుగు నాటకం ఆధునికంగానే ఆనాడు చూపరులను విభ్రమపర్చింది. ఇక్కడ ఒక్క విషయాన్ని గమనించాలి. వసురాయకవి "వేణీ సంహారం" (1883) నాటకం ముందు వీరేశలింగం పంతులు, నాదెళ్ల పురుషోత్తమకవి మొ॥ వారు ప్రదర్శించిన నాటకాలన్నీ గూడా పద్యాలూ, పాటలూ లేని వచన నాటకాలే. ధర్మవరం వారి "చిత్రనళీయం" నాటకంలో పాటలు ప్రవేశించినై. ఆనాడు ఇదొక ఆధునికత.

నేటి స్త్రీ సమస్యాత్మక ఆధునిక నాటకానికి ప్రేరణగా నిల్చిన నాటకాలను బళ్ళారి రాఘవ, పి.వి. రాజమన్నార్‌లు రూపకల్పన చేయటం జరిగింది; ఆనాడేకాదు, ఈనాడు కూడా వీరు వ్రాసిన నాటకాలు వస్తువు రీత్యానే గాక, ప్రయోగరీత్యాగూడా ఎంతో ఆధునికమైనవే; "It has become common to view drama to the post Ibsen period as falling into two broad catagories; on the one hand there was a strong and persistant tradition of the "Doll's house" type of the play called for convenience social problem plays and on the other a number of diverse styles of drama that represent counter realism" అని వ్యాఖ్యానిస్తాడు రోనాల్డ్ పికాక్. ఇబ్సన్ నాటక ప్రభావం దేశ దేశాలపై ప్రసరించినట్లుగానే 1930 ప్రాంతంలో తెలుగు నాటకంపై గూడా ప్రగాఢంగానే పడింది. బళ్ళారి రాఘవ "సరిపడని సంగతులు", పి.వి.

రాజమన్నార్ తప్పెవరిది" నాటకాలు ఈ కోవలోనివే. దాంపత్య జీవనంలోని సుఖశాంతులకు భార్యాభర్తల మధ్య ప్రేమానురాగాలు, పరస్పర అవగాహనలు ప్రధానమన్న సత్యాన్ని వెల్లడిస్తాయి నాటకాలు. ప్రయోగంలో భిన్నత్వమున్నా, వస్తునిర్మాణ శిల్పంలో నూతనత్వం వెలార్చుకొన్నా ఈ సమస్యపైనే ఇప్పటికీ తెలుగు నాటకాలు అధికంగా రావటం గమనార్హం. బళ్ళారి రాఘవ, రాజ మన్నార్‌లు ఇరువురూ ఆనాడు నాటకరచనలో చూపెట్టిన ఆధునికత ఈనాడూ నవీనంగానే మిగిలిపోవటం ఆ సమస్య తీవ్రతను తెలియజేస్తున్నవి.

మానవ స్వభావలోతుపాతుల్ని అంచనా కట్టగలిగిన నాటక రచన మహాశిల్పి ఆత్రేయ సృష్టించిన యన్.జి.వో; భయం; కప్పలు, విశ్వాశాలలు, ఈనాడు మొదలగు నాటకాలు, తెలుగు నాటక వికాసోదయంలో మైలురాళ్ళు. మధ్య తరగతి మిథ్యా సాంప్రదాయ రోగిష్టి జీవితాన్ని ఎన్.జి.వో నాటకంలో శక్తిమంతంగా చిత్రిస్తాడు ఆత్రేయ; సంఘసంస్కరణ నుండి, సమస్యా ప్రస్తావన స్థితినుండి, ఒక వర్గక్షోభామయ జీవితాన్ని ప్రస్తావించబడటం. తెలుగు నాటకంలో ఆరంభమైంది ఇక్కడనుండి; కులవ్యవస్థ అంతచ్ఛిద్రాన్ని అతి సహజంగా "కులంలేని పిల్ల" లో చిత్రిస్తాడు పినిశెట్టి; రైతు కూలీలు సంఘటిత శక్తిగా ఏకోన్ముఖమై సాగించిన పోరాటాన్ని సుంకర, వాసిరెడ్డిలు "మాభూమి", "ముందడుగు" నాటకాల్లో ఎంతో బలంగా, సహజంగా చిత్రించారు; ఈ నాటకాలపై రష్యా నాటక ప్రభావం అతి ప్రగాఢమైంది. 1940 – 55 సం॥ రాల మధ్య వర్గ వైషమ్యాలు, ఆర్థిక అంతరాలు, భూస్వాముల అమానుషకృత్యాలు, దోపిడీ మనస్తత్వం, శ్రమజీవుల ఆక్రందనలు, పాలేరుల అసహాయ రోదనలు ఆదిగాగల నాటకాలు అసంఖ్యాకంగా వచ్చాయి; బోయి భీమన్న "పాలేరు" వీటిలో ముఖ్యమైనది; తెలుగు నాటక రంగంలో ఇదొక పరిణామదశ. "19వ శతాబ్ది నాల్గవ పాదమూ, 20వ శతాబ్ది మొదటి పాదమూ కలిసిన కాలం 'నాటకయుగం' గా ప్రతిపాదించిన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారి వివేచన, సిద్ధాంతీకరణ తెలుగు సాహిత్యంలో నాటక ప్రక్రియకు ప్రత్యేక అస్తిత్వాన్ని, వ్యక్తిత్వాన్ని చేకూర్చిపెట్టాయి; ఇంతవరకూ నేను ప్రస్తావించుకొంటూ వచ్చిన తెలుగు నాటకం – ఆధునిక స్వరూప పరిణామ వికాసమంతా ఒక దశగా గమనించగలిగితే 1965 నుండీ తెలుగు నాటకం యొక్క వినూత్న పోకడను మరో విధంగా గుర్తుంచుకోవాలి; "పెయింటింగ్ ఫర్ గోడాట్" నాటక ప్రయోగంతో బ్రిటిష్ రంగ స్థలంపై ఒక పెను విప్లవం ఆరంభమైందని, "ది బ్రిటిష్ జర్నల్ ఆఫ్ సోషియాలజీ" గ్రంథంలో విలియమ్స్ పేర్కొంటాడు, అల్లాగే "మరో మహంజోదారో" నాటక ప్రదర్శనతో తెలుగు నాటక రంగంపై గూడా ఒక పెనుతుఫాన్ ఆరంభమైందనే చెప్పాలి; రచయిత ఏమి చెప్తున్నాడన్న భావంకన్నా, నాటకాన్ని ఏ విధంగా, ఎన్ని ప్రయోగ పోకడలతో ప్రదర్శించాలీ అన్న ఆలోచన దర్శకుల్లో ప్రాధాన్యం వహించింది.; మానవ జాతిలోని వర్గ వైవిధ్యాలను, వాటి అంతరాలను, విభిన్న ప్రవృత్తులను ఈ నాటకంలో శాస్త్రజ్ఞుడి పాత్ర ద్వారా విశ్లేషణ చేయించిన తీరు, వస్తువులు, ఉపకరణలు లేకపోయినా, అవి రంగంపై ఉన్నట్లుగా పాత్రధారులు అభినయించిన పద్ధతి తెలుగు నాటకరంగానికి వినూత్నమైంది; తన కాలం నాటి సామాజిక, సాంస్కృతిక వైవిధ్య జీవితాన్నంతా ఒక బిబ్లియోగ్రఫీలాగా 'బెర్నార్డ్‌షా' తన నాటకాల ద్వారా అవగాహన చేయించాడని "స్టాన్లీవెల్స్" పేర్కొంటాడు; శ్రీ ఎన్.ఆర్ నంది గూడా 'మరో మహంజోదారో' నాటకం ద్వారా రసమకాలీన సమాజ జీవన సంఘర్షణంతా రంగంపై ఫోకస్ చేయిస్తాడు; కలవారి దురహంకారాన్ని, మధ్యతరగతి జీవుల అవకాశవాద కృత్రిమ జీవితాన్ని, బడుగు జీవుల అసహాయ రోదనల్ని శ్రీ నంది ఈ నాటకంలో ప్రస్తావిస్తాడు; "కన్యాశుల్కం" తర్వాత అంత విస్తృత పరిధిలో సంఘాన్నంతా సామూహికంగా రంగంపైకి తీసుకొచ్చిన నాటకం "మరో మహంజోదారో "He touched the life of his time at so

many points" నాటకానికి బహిన్వరూపం ఎంత ప్రధానమైనదో, ఆంతరిక స్వరూపంగూడా అంతే ప్రధానమైనది. ఈసత్యాన్ని తెల్సుకొన్నది ఆదిలో గురజాడ; ఆ తర్వాత ఆత్రేయ; ఇప్పుడు శ్రీ నంది. సమగ్ర వస్తువు, సన్నివేశ చిత్రణలో నిష్ఠ, సామాజిక ప్రయోజన దిశగా నాటకలక్ష్యాన్ని నిర్ణయించుకోవడం, నూతన కళా ప్రయోగంతో ప్రదర్శించడం-- ఈ నాటక విజయానికి తోడ్పడ్డాయి. "మానవుడి స్వార్థంతో, క్షుద్రత్వంతో, అమానుషవైఖరులతో, అవకాశవాద పోకడలతో శిథిలమైపోయిన ఒకానొక జీవన వ్యవస్థ తాలూకు అవశేష ప్రవృత్తుల్ని, సమాధినుండి లేపి, ప్రజలకు పరిచయం చేస్తున్న శాస్త్రజ్ఞుడి వ్యాఖ్యానంతో నాటకం ఆరంభమవుతుంది. అయితే ఒక గొప్ప నాగరికత భ్రష్టమై, భగ్నమై, శిథిలమై పోయిన అనంతరం మళ్ళీ ఒక కొత్త జీవసృష్టి ఆరంభమవుతుందన్నది శాస్త్రజ్ఞుడి ఊహ; కనీసం ఆరంభమైనా అవాలన్నది అతని ఆశ. అయితే ఈ తరం కూడా అవే అమానుష వైఖరులతో, క్షుద్ర ప్రవృత్తులతో శిథిలానికి చేరువలో ఉన్నదన్న విషయాన్ని వ్యంగ్యంగా అభివ్యక్తం చేస్తాడు శాస్త్రజ్ఞుడు; ఈనాటకంలో ప్రవేశపెట్టిన "ఎలియనేషన్" విధానం ప్రేక్షకుల్ని ఆకట్టుకొంది; నూతన ప్రయోగం ఆకర్షణీయంగా ఉండి, ఇతివృత్త లక్ష్యాన్ని ప్రేక్షకులకు మరింత సులభంగా చేరవేసింది; ఏ ప్రయోగమైనా నాటక ఆంతర్యాన్ని ప్రభావితం చేసేదిగా ఉండాలిగాని, ఇతివృత్తాన్ని మింగివేసే ఆర్భాటపు తంతుగా ఉండగూడదు; "The drama has a higher purpose; It should not preach directively, but it should teach subjectively; It strikes at unequal standerds and unjest systems. It has a supreme faith in man" అంటున్న "ఆర్థర్ జోన్స్" పలుకులలోని విశిష్టతకు ఈ నాటకం దర్పణం. "తన ఆశయాల్నీ, భావాల్నీ పాత్రలకి అంటగట్టడు; వాటి వాటి ప్రవృత్తులకనుగుణంగా అవి ప్రవర్తిస్తూ ఉంటాయి" అని 'ఇబ్సన్' నాటకాలను సమీక్షిస్తూ 'నికోల్' వ్రాస్తాడు; ఈ నాటకంలో కూడా శ్రీ నంది సృష్టించిన పాత్రలు కృతకంగా ఉండవు; మైనపు బొమ్మల్లా కదలాడవు; సహజంగా వీటి మనస్తత్వాలకనుగుణంగా సంచరిస్తూ ఉంటాయి; ఏ ప్రయోగమైనా ఇతి వృత్తాంశానికి అన్వయంలోనూ, అవగాహనలోనూ కొత్త వెలుగుల్నీ, కొత్త ఆలోచనల్ని ప్రేక్షకులకు అందీయగలగాలి; పాశ్చాత్యం నుండి ఆ ప్రయోగం దిగుమతి చేసుకొన్నదైనా అది నాటకాంశం నుండి విడివిడిగా, పొడిపొడిగా దర్శనమీయరాదు. అట్లా జరిగితే నాటక ధ్యేయం దెబ్బతింటుంది; రూపపరంగా జరిగినా, శిల్పపరంగా ఆవిష్కరింపబడినా, ప్రదర్శనా టెక్నిక్‌పరంగా ప్రవేశపెట్టబడినా ఆ ప్రయోగం స్థూలంగా నాటక సందేశంతో సంవదింపబడాలి. కానప్పుడు విపరిణామానికి దారితీస్తుంది; నాటకానికి ప్రధాన డైమన్షన్ అయిన ప్రేక్షకుణ్ణి అవగాహనా దూరుణ్ణి చేసి అయోమయంలో పడవేస్తుంది. ప్రేక్షకుణ్ణి జాగృతం చేసే స్వీయ అనుభూతుల సమాహార కళే నాటకం అన్న విషయం మర్చిపోకూడదు. ప్రేక్షకులే నాటక ప్రయోగానికి ప్రేరకులు, పోషకులూను.

దురదృష్టవశాత్తు పాశ్చాత్యనాటకరంగం నుండి ఆలోచనా రహితంగా, ఒక వ్యామోహ అంధానుకరణ దృష్టితో పెక్కు సిద్ధాంతాల్ని ప్రయోగవైవిధ్య పోకడల్ని తెలుగు నాటకరంగంపై ఆదరాబాదరా జొప్పించటం జరిగింది. అయితే క ప్రగతికి ఈ ప్రయోగాలేవీ ప్రమాణాలు కాలేకపోవటముటుంచి తెలుగు నాటక అస్తిత్వానికే చేటు తెచ్చాయి. ఈ ప్రయోగాలపట్ల పాశ్యాత్య దేశాల నాటకకర్తలూ, ప్రయోక్తలూ నేడు పెదవి విరుస్తున్నారు, నాటక ప్రమాణాలు నాశనమైనాయని ఆనాడూ, ఈనాడూ వేదనను వెలిబుచ్చారు. "వీళ్ళవలంబించే పద్ధతి వల్ల కథా వస్తువు బిగువు, పాత్రల పెద్దరికం, నిండుతనం దెబ్బ తిన్నదనీ, కళాత్మకంగా నాటకం దెబ్బతిని పోయిందనీ "బెర్టోల్డ్ బ్రేష్ట్ " ఆవేదనను వెలిబుచ్చితే, "సార్వ.జనీన సత్యమేదీ ఈ ప్రయోగనాటకాలలో కన్పించదనీ పాక్షిక సత్యాన్ని మాత్రమే వీళ్ళు ప్రదర్శిస్తున్నారని, జీవన

పారమార్థిక ప్రబోధం కంటే, వినోద ప్రాధాన్యమే ఈ ప్రదర్శనల్లో అధికమైపోయిందని" కార్గినన్ తన అసంతృప్తిని ప్రకటిస్తాడు." కేవలం బాధాగ్రస్తుల జీవిత చిత్రణ తప్ప, సమగ్ర జీవిత స్వరూపం ఈ ప్రయోగాల్లో కన్పించదని" ఆర్థర్ మల్లర్ గూడా వేదన చెందుతాడు. "నాటకం కొఱకు రంగస్థలం ఉండాలి గాని, రంగస్థలం కొఱకు నాటకాన్ని ప్రయోగాల్తో నింపరాదు" అని 'షా' గూడా విచారం వెలిబుచ్చి, ఈ ప్రయోగాల వల్లే ఆంగ్లనాటక రంగం అధ్వాన్నస్థితికి చేరుకున్నదని ప్రకటిస్తాడు.

ఏ సాహిత్య ప్రక్రియా వికాసానికైనా కాలానుగుణ వైవిధ్యం, పురోగమన స్వభావం అవసరమే. అయితే ఆ పురోగమన ధోరణి సాహిత్య సహజ స్వరూపాన్ని, స్వభావాన్ని వికృతం చేయగూడదు. నేడు తెలుగు నాటకరంగంపై కమ్ముకుపోయిన ప్రయోగాలు వస్తువుతో సహజీవనం చేసి, దాన్ని శక్తి మంతం చేసే బదులు, వస్తువుతోనే ఘర్షణ పడటం, నాటక సందేశాన్ని, విలువను ఛిన్నాభిన్నం చేయటం జరిగింది. ప్రదర్శనను ఆకర్షణీయంగా, అట్టహాసంగా జరిపించాలన్న నాటక ప్రయోక్తల ఆశయం, నాటక ప్రవృత్తి వివేచనలో కనుమరుగైంది. విశిష్టసమాలోచన జరగకుండా, రంగస్థల స్థితిగతుల్ని పరిశీలించకుండా, తెలుగు నాటక ప్రవృత్తికి ఇవి అనుగుణంగా ఉన్నాయా అన్న వివేచన లేకుండా అనేక పాశ్చాత్య సిద్ధాంత, ప్రయోగాల మిశ్రమ ప్రవృత్తుల్ని తెలుగు నాటకం నిండా రచయితలూ, ప్రయోక్తలూ నింపివేయటం విడ్డూరం. ఏ ఎక్స్పిరిమెంటైనా ట్రెడిషన్‌ను విచ్ఛేదం చేసేదిగా ఉండరాదు. ఇవ్వాల్టి ప్రయోగం రేపటికి సాంప్రదాయం అవుతందన్న సత్యం అవగాహన కావాలి. అంటే ప్రయోగం ప్రగతికి దారి తీయాలి. అల్లాకానప్పుడు ఆ ప్రయోగం పాలపొంగే అవుతుంది. ఒక నాటి తెలుగు నాటకంపై పాశ్చాత్య నాటక ప్రయోగ ప్రభావాలను పరిశీలించాలి.

వాస్తవికమైన ఇతివృత్తాన్ని, సహజత్వంతో, స్పష్టతతో చిత్రీకరింపచేయటం రియలిజం. ఒకే విశ్వాసంతో, ఒకే ధ్యేయంతో ఒకే చట్రంలో బిగింపబడే కథా వస్తువు (సత్యమే జయిస్తుంది., ధర్మమే నిలుస్తుంది అని నిరూపించే నీతి దాయక ఇతివృత్తాలు) ప్రవృత్తికి విరుద్ధంగా కాలానుగుణవాస్తవ సమస్యా దృక్పథం, పురోగమన స్వభావం తనకు పాదకాలుగా స్వీకరించింది ఈ రియలిజం. ప్రొటెస్టు థియేటర్‌గా యూరోప్‌లో ఈ వాదం పరిగణింపబడేది. సామాన్యుల జీవనానుభవాల్ని, వాళ్ళకు పరిచితమైన భాషలోనే తెలియజెప్పాలని ఈరియలిజంవాద ఆద్యులు "స్క్రైబ్" "సార్డో" లు ప్రకటిస్తారు. కన్యాశుల్కం, ఎదురీత, యన్.జి.వో., పల్లెపడుచు, అన్నా చెల్లెలు వంటి నాటకాలు ఈ వాద ప్రతినిధులే.

ఈ రియలిజం కుదులోనుండి పుట్టుకొచ్చిందే నాచురలిజం (స్వభావ వాదం). రచయిత వెల్లడించే భావాన్ని దృశ్యాన్ని మరింత సహజంగా ప్రదర్శింపజేయాలన్నదే ఈ స్వభావ వాద ధోరణి. వాస్తవిక సంఘటనకు తగ్గట్టుగా, చిత్రీకరణలోనూ, వేషభాషల్లోనూ సహజత్వముండాలని ఉవ్విళ్ళూరుతారు వీరు. ఈ వాదానికి మూలపురుషులు హెబ్బెల్, ఎమిలీ జోలా ( జర్మన్, ఫ్రాన్స్) బెలాస్కో (అమెరికా) ఆస్ట్రొవిస్కీ, ఛెకోవ్, స్టాన్స్లవిస్కీ (రష్యా) మొదలగువారు ఈ వాదానికి ప్రాముఖ్యం కల్గించారు. పారిశ్రామిక యుగానంతరం, రూపుదిద్దుకున్న 'మెలోడ్రామా' విధానం నుండి వికాసం జెందిన వైవిధ్య రూపాలే ఈ వాస్తవ, స్వభావ స్వరూపాలు. "కాలాన్ని బట్టి నాటక స్వరూపం మారుతుందన్న" జాన్ ఇ. కన్నింగమ్ భావానికనుగుణంగానే ప్రదర్శనలో మరింత ఆకర్షణీయత కొఱకే ఈ వైవిధ్యరూపాలు. అందుకే "టాల్ స్టాయ్" నాటకాలు గోర్కీకి, డెస్టొవిస్కీకి పాతబడిపోయిన నాటకాలుగా కన్పించినై. టాల్‌స్టాయ్‌ని భూస్వాముల రచయితగా పేర్కొంటాడు డెస్టొవిస్కీ. వాస్తవిక వాదానికి ద్వారాలు తెరచిన "ఇబ్సన్" నాటకాలకు కాలదోషం

పట్టిందంటాడు చెకోవ్. ఈ స్వభావ వాద ప్రసిద్ధుడైన జర్మన్ నాటక రచయిత "హాప్ట్‌మాన్" జన సమూహాన్ని రంగ స్థలంపై పాత్రధారులుగా నిలబెడతాడు. ఈ స్వభావవాదం తెలుగు నాటక రంగాన్ని ఆవహించడమే గాక, అస్తిత్వాన్ని చేకూర్చి పెట్టింది. ఆనాటి మాభూమి, ముందడుగు, అన్నపూర్ణ మొ॥నాటకాలేగాక, ఆత్రేయ, డా. కొర్లపాటి, పినిశెట్టి, అనిశెట్టి, గణేష్‌పాత్రో, ఆదివిష్ణు, భమిడిపాటి రాధాకృష్ణ, కొడాలి గోపాలరావు, రాచకొండ, సంజీవి, కప్పగంతుల, తారకరామారావు, కె.యస్. టి. శాయి, రాఘవ, యండమూరి, దివ్య ప్రభాకర్, మొదలగువారి నాటకాల్లో ఈ స్వభావ వాదం ఊపిరి పోసుకుంటుంది. అయితే రాను రాను ఈ సహజ చిత్రీకరణ వాదం పాశ్చాత్య నాటక విమర్శకుల దృష్టిలో అవహేళనకు గురైంది. "కిచన్‌సింక్ డ్రామాస్" గా విమర్శకులు వీటిని అపహాస్యం చేశారు. ఈ సహజ చిత్రీకరణ ఉబలాటం వల్ల సన్నివేశగంభీరత లోపించి, నాటక ప్రాచుర్యం సన్నగిల్లిపోయిందని వ్యాఖ్యానించారు నాటకరంగ ప్రముఖులు.

పాశ్చాత్య దేశాల నాటక ప్రదర్శనల్లో బలం పుంజుకున్న మరొక సిద్ధాంత వాదం " సింబాలిజం" (ప్రతీక వాదం). కేవలం అభినయ, సంభాషణల ద్వారానే గాక, ప్రతీకల ద్వారా గూడా ప్రేక్షకులకు నాటక సందేశాన్నందించాలంటారు ఈవాద ప్రముఖులు. ఇందులో ప్రసిద్ధుడు"మేటర్‌లింక్". వెలుగునీడల జీవన వాస్తవాల్ని ప్రతీక ఉపకరణాల ద్వారానే బహిర్గతం చేయాలంటాడితడు. జీవిత అగోచరఘటనాఘటనల అభివ్యక్తీకరణకు, ప్రేక్షకుల అవగాహనకు ఇంతకు మించిన నిగ్గుదీసే ప్రయోగరూపకల్పనే లేదంటాడు "మేటర్‌లింక్". దీన్ని వ్యాప్తిలోకి తెచ్చింది. "అడాల్ఫ అప్పియా". తెలుగు నాటకాలలో ఈ ప్రతీక ప్రయోగాల్ని అసంఖ్యాకంగా గమనిస్తాం మనం. వాస్తవాన్ని నగ్న వాస్తవంగా కాక, సంకేతవాస్తవంగా చూపటం, డాక్టర్‌కు మారుగా స్టెతస్కోప్, కాల విరామసూచనకు లైట్లను ఆర్పి తిరిగి వెలిగించటం, తెలుగు నాటకాలలో ఇప్పుడు సర్వసాధారణం. ఆత్రేయ "భయం", ఆర్.వి. చలం, "ఇది నాటకం కాదు", పి.వి. రమణ "వెంటాడే నీడలు" యండమూరి "రఘుపతి రాఘవ రాజారాం" మొ॥ నాటకాలు ఈ ప్రతీకవాదానికి చక్కని ఉదాహరణలు. విక్టోరియా నీతుల్ని, ఆచారాల్ని, ప్రశ్నిస్తూ ఇబ్సన్, స్ట్రిండ్ బర్గ్, గార్స్ వర్దీ మొ॥ వారు వాస్తవిక వాద నూతన నాటకానికి పోషక కర్తలై నిలిస్తే, సామాజిక వాస్తవాన్ని మరింత సహజంగా, మరింత స్వాభావికంగా చూపెట్టటానికి 'షా' మొదలగువారు పూనిక వహించారు. సామాజిక వాస్తవాన్ని మరింత ఎఫెక్టివ్‌గా, లోతుగా చెప్పాలని ఈ ప్రతీకవాదులు పాటుపడ్డారు. అందుకే "సాంఘిక సంస్కరణకు పరిణామం చెందే రంగస్థలం యొక్క ప్రాధాన్యం 'షా'కు తెల్సినంతగా మరెవ్వరికీ తెలియదంటాడు "మార్టిన్ ఎల్లిహాండ్".

చూపదల్చుకొన్న విషయాన్ని, చెప్పదల్చుకొన్న సందేశాన్ని మామూలు ధోరణికి మించి, ప్రత్యేక ప్రాధాన్యమిచ్చి రంగస్థలంపై ప్రయోగించాలన్న ప్రయోగమే వ్యక్తీకరణవాద సిద్ధాంతం. భౌతిక ఘర్షణల కన్నా, మానవుని ఆంతరంగిక యోచనలకు శక్తిమంతమైన రూపం ఇవ్వాలన్నదే, ఈ సిద్ధాంత ప్రచారకుల లక్ష్యం. మానవ స్వభావ వైవిధ్యాల సమన్వయ స్వరూపాన్ని అభివ్యక్తం చేయాలని రియలిస్టిక్ రచయిత ఆరాటపడితే, మానవ ఆంతరిక ప్రవృత్తుల్ని ప్రత్యేకంగా వివేచించి చూపాలని వ్యక్తీకరణ వాద రచయిత అభిలషిస్తాడు. మానవ ప్రవృత్తులకు ప్రాకృతమైన పరిణామధర్మాల్ని ఆపాదించి చూపటం ఈ ప్రయోగాల్లో గమనిస్తాం. ఆశలడుగంటిన వ్యక్తికి మారుగా ఎండిన చెట్టును చూపటం, చెట్టును స్త్రీగా ఉపలక్షించి దానికి రెండు స్తనాలు పెట్టడం మొదలైన టెక్నిక్‌లన్నీ ఈ వాద ప్రయోగాల్లో చూస్తాం. చిత్ర లేఖన కళతో ప్రాచుర్యం పొందిన ఈ సిద్ధాంతం నాటక ప్రక్రియను ఆవహించింది. "స్ట్రిండ్ బర్గ్" ఈ ప్రయోగంలో ఆద్యుడు, ఆద్యుడు తన "డ్రీమ్ ప్లే" నాటకంలో కాల, స్థల

నియమనిబంధనలన్నింటిని త్రోసిపుచ్చాడితడు. ఒక పాత్రను మరో పాత్రలోకి పరకాయ ప్రవేశం చేయించి, వైవిధ్య ప్రవృత్తుల్ని అన్వయించి, అవగాహన చేయించటం గూడా ఇతడు ప్రవేశపెట్టాడు. ఈ పద్ధతిని ఆర్.వి. చెలం "ఇది నాటకం కాదు" ఆదివిష్ణు" "సిద్ధార్థ" మొదలగు నాటకాల్లో మనం గమనిస్తాం. ఎర్నెష్ట టాలర్, జార్జి కైజర్‌లు ఈ సిద్ధాంతాన్ని ప్రాచుర్యానికి తీసికొచ్చిన వారిలో ముఖ్యులు. గణేష్ పాత్రో "అసుర సంధ్య" నాటకంలో గూడా ఈ ప్రయోగ ఛాయల్ని చూస్తాం. సామాన్య జనసంకేతిక ప్రతినిధిగా రంగస్థలం మీద ఒక పాత్ర ప్రత్యేకంగా ఉండటం గూడా ఈ సిద్ధాంత వాద రచయితల నాటకాల్లో అక్కడక్కడా సాధారణం. ఈ పాత్రకు పేరుండదు. స్టేజి మీదున్న ఈ పాత్ర ఒక్కోసారి ప్రేక్షకుల్తో ముఖాముఖి సంభాషిస్తుంది. ప్రేక్షకుల్ని గూడా పాత్రలుగా సంభావింపజేసి, ఈ ఇరువురి మధ్యా ఉన్న అంతరాన్ని చెరిపివేయటం ఈ వాదంలోని ప్రత్యేకత. రంగస్థలంపై కొన్ని సీన్లు అంధకారంలో ఉండి, మరో వైపు వెలుగు మూలల్లో ప్రదర్శనం జరిగి పోతూ ఉండటం గూడా ఈ వాదంలోని టెక్నిక్. ప్రదర్శనలో ఆలస్యంగా పాల్గొనే పాత్ర ధారి, సమయం వచ్చేంత వరకు ప్రేక్షకుల్లో కూర్చోవటం, ఆ తర్వాత ప్రేక్షకుల్లో నుండి రంగస్థలం పైకి వెళ్ళటం గూడా ఈ సిద్ధాంత వాద నాటకాల్లో గోచరిస్తుంది. "హాట్‌మన్" రచనల్లో గూడా ఈ ప్రయోగం ప్రాణం పోసుకొంటుంది. టాలర "మాన్ అండ్ మాసస్" వైల్డర్ "అవర్ టౌన్" ( Our Town ) సీన్‌వొకాసి "ది ప్లవ్ ఆండ్ ది స్టార్స్" "సిల్వర్ టాస్సీ" నాటకాలు ఈ ప్రయోగంలో ప్రసిద్ధాలు. "సిల్వర్ టాస్సీ" ఛాయలు గొల్లపూడి "లావాలో ఎర్రగులాబీ" నాటకంలో గమనిస్తాం. ఈ సిద్ధాంత ప్రయోగనాటకాలలో శిల్పం తక్కువై, ప్రయోగం తర్కం, ఎక్కువై రసాభాస దశకు చేరాయని పలువురు విమర్శకులు వ్యాఖ్యానించారు.

మరో ప్రాచుర్యం పొందిన సిద్ధాంతం "అబ్సర్డిజం" ఈ వాదానికి ప్రాణం నింపినవాడు "అవినిస్కో". రంగస్థలంపై ప్రతిదీ ప్రదర్శన యోగ్యమేనంటాడితడు. జీవితం ఏ తర్కానికీ, ఏ నియమానికీ కట్టుబడి ఉండదని, ఏ సత్యమూ స్థిరమైనది గాదనీ ఈ సిద్ధాంత కర్తలు వాదిస్తారు. ఈ అవాస్తవిక, అసంబద్ధ ప్రపంచంలో మానవుడే తన గమ్యాన్ని తాను అన్వేషించుకోవాలని గూడా వీళ్ళు ప్రవచిస్తారు. మానవుని ఊహకు అతీతంగా నడిచే జీవితంలో ఎవరికి తోచిన సత్యాన్ని వాళ్ళు స్వీకరించాలని తెల్పుతూ పిరాండిలో, శామ్యూల్ బెకెట్, ఆల్బర్ట్ కామూ మొ॥ వారు ఒక ఉద్యమ రీతిలో ఈ సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు. పాత్రలకు మారుగా కుర్చీలను సింబల్స్‌గా రంగస్థలంపై ప్రవేశపెట్టాడు "బెకెట్"; నటులే వారి వారి మనోభావాల కనుగుణంగా సంఘటనను మలుచుకొంటూ నాటకాన్ని నడిపిస్తారు. "సిక్స్ క్యారెక్టర్స్ హౌంట్ ఫర్ యాన్ ఆథర్" అన్న "పిరాండిలో" నాటకంలో, పాత్రలు వాటి వాటి అనుభావాల కనుగుణంగా సత్యాన్వేషణ సాగిస్తూ సంఘర్షించుకొంటాయి. ప్రేక్షకుల ముందుకొచ్చి నిలబడతై. తెలుగు నాటకరంగంపై ఈ వాదం ప్రగాఢమైన ప్రభావం చూపింది. ఆర్. వి. చెలం "ఇది నాటకం కాదు" సంజీవి "సమాధానం కావాలి" మొ॥ నాటకాల్లో ఈ ముద్రను గమనిస్తాం. రియలిజంను రూపుమాపాలన్న ధ్యేయంతోనే పాశ్చాత్య దేశాల్లో ఈ సిద్ధాంతం ఆరంభించబడింది. శ్రీ దోనేపూడి రాజారావు, ఈ అబ్జర్డిజంను తెలుగున ప్రతిష్ఠించిన ప్రాచార్యులు.

ఈ సిద్ధాంత వాదాల్లో, ప్రసిద్ధి పొందిన మరొక ప్రయోగం "అధివాస్తవిక వాదం" సత్యమనేది మనిషి చేతనా చేతనా అవస్థలోనే బహిర్గతమవుతుందనీ, దైనందిన జీవిత వాస్తవ ప్రదర్శనకు గూడా ఈ అవస్థా స్థితే ప్రేరకమనీ వీళ్ళు భావిస్తారు. "ఆండ్రీ బ్రెటన్" ఈ వాద ప్రచారకులలో ప్రసిద్ధుడు. నిట్టల కృష్ణమూర్తి "కృష్ణ పక్షం" ఇంద్రగంటి

శ్రీకాంతశర్మ "స్మృతి" పి.వి.రమణ "వెంటాడే నీడలు" మొ॥ నాటకాలు ఈ వాద ప్రభావంలోనివే.

అబ్సర్డిజం ఛాయలు కన్పించే మరో సిద్ధాంత వాదం "డాడాయిజం". రియలిజంను ఒట్టి వెత్తగా కొట్టి పారేస్తారు వీళ్ళు. "డాడా" అంటే శూన్యం. మానవజీవితం మనిషి యొక్క కర్తృత్వ శక్తిని రూపుమాపేటంత భయంకర దశకు చేరుకొన్నదనీ, సామాన్యుడు ప్రశ్నించలేనంత శక్తి హీనుడిగా తయారైనాడని వీళ్ళు తెల్పుతారు. సాంఘిక నియమాలు, నమ్మకాలు వట్టి బూటకమంటారు వీళ్ళు. సమాజంలోని వైరుధ్యాలను, విభిన్న ప్రవృత్తులను పాత్రలు తమకు తాముగా అన్వయించుకొని రంగ స్థలంపై పరస్పరం ఘర్షణకు దిగుతాయి. సమాజాన్నే రంగస్థలంగా వాడుకొని, తమ గమ్యాన్ని తామే అన్వేషించుకొంటాయి పాత్రలు. ఎస్టాబ్లిష్‌మెంట్‌కు, పాసిజానికి వ్యతిరేకంగా వచ్చిన సిద్ధాంతమిది.

నాటకరంగంపై ప్రభావం చూపిన మరో సిద్ధాంత వాదం "అస్తిత్వ వాదం" నీతికి, నియమాలకూ వ్యతిరేకంగా, నిరంతర అన్వేషణాకాంక్షతో తన గమ్యాన్ని తానే నిర్ధారించుకోవాలని చెప్తుందీ సిద్ధాంతం. సంఘం కొఱకు వ్యక్తికాక, వ్యక్తి వాంఛాబద్ధంగానే సంఘముండాలంటారు వీళ్ళు. మనిషి తన గమనాన్ని తానే మలచుకోవాలంటుందీ సిద్ధాంతం. వ్యక్తి ఆలోచనల్లో ప్రవర్తనల్లో వ్యవస్థజోక్యాన్ని సహించరు వీళ్ళు. ఈ పాత్రల్లో కార్యకారణ బద్ధత శూన్యం, ఈ వాదానికి మూలపురుషుడు 19వ శ॥నికి చెందిన "కీర్క్‌గార్డ్" అంటారు. "సాత్రే" ఈ సిద్ధాంతానికి ఊపిరినింపాడు. తెలుగులో చలం నాటకాలు ఈ సిద్ధాంత ప్రాకారంలోనివే. హరనాథరావు "క్షీరసాగరమథనం" బి.వి.రామారావు "తమసోమా జ్యోతిర్గమయ" బుచ్చిబాబు "ఆత్మవంచన" నాటకాల్లో ఈ తరహా పాత్రల్ని గమనిస్తాం. యుద్ధాలకు, పెట్టుబడిదారీ వ్యవస్థ బీభత్సానికీ వ్యతిరేకంగా ఈ వాదం పుట్టిందంటారు. 'సాత్రే' తన "ఫ్లైస్" నాటకంలో మనుషుల్ని క్రిమికీటకాలుగా చిత్రిస్తాడు. అన్ని నియమాలకూ, విలువలకూ విరుద్ధంగా సంచరిస్తాయి. ఈ నాటకంలోని పాత్రలు జీవితమనేది అవాస్తవిక తర్కాలకూ, కలగాపులగ సందేహాలకూ ఆలవాలమైన "సంత" అన్న ధోరణిలో ఈ సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు దీని స్రష్టలు.

నాటక దర్శకుడైనా, రచయితైనా రంగస్థలం ప్రయోజనానికి అనుగుణంగా గ్రామమేకమై సాగిరావాలి గాని, వాళ్ళ ప్రయోజనాలకోసం రంగస్థలం పాత్రగా మారిపోరాదు. ఇల్లా మారిపోతే రంగస్థల ప్రాముఖ్యం సన్నగిల్లుతుంది. దర్శకుడి చేతిలోనో, రచయిత చేతిలోనో నాటకం క్రీడా బంతిగా మారిపోతుంది. దర్శకుడినే సర్వం సహాధికారుణ్ణి చేసే మరో ప్రయోగం "థియేట్రికలిజం". రంగస్థలంపై జరిగే ప్రతి సంఘటన, పాత్రల కదలిక, అంతా దర్శకుడి అభిలాషకను గుణంగా జరిగిపోతుంది ఈ ప్రయోగంలో. ఈ వాదానికి మూలపురుషుడు "రైన్ హార్డెట్" ఇతడు వియన్నా దేశీయుడు. స్వర్గీయులు డాక్టర్ రాజారావు కె. వెంకటేశ్వరరావు , శ్రీ దేశిరాజు, హన్మంతరావు, మిశ్రో, బాబి, నేతి పరమేశ్వర శర్మ, కన్నెగంటి నాసరయ్య, గొంది రమేష్‌బాబు మొ॥ ప్రసిద్ధ తెలుగు నాటక దర్శకులు అనుసరించిన పద్ధతి ఇదే. నాటకంలోని ప్రతి అంశం వీరి అదుపాజ్ఞలకు లోబడే ప్రదర్శింపబడుతుంది.

నాటక ప్రదర్శనను రంగస్థలానికే పరిమితం చేయక, సంఘటనావశ్యకతను బట్టి బహిరంగ ప్రదేశాల్లోనూ, భవన ప్రాంగణాల్లోనూ ఏర్పాటు చేసే పద్ధతికి "మేయర్ హోల్డ్" అంకురార్పణ చేశాడు. ఈ ప్రయోగం వల్ల రష్యన్ నాటకరంగానికి ఒక వినూత్న స్థాయిని చేకూర్చి పెట్టాడతడు. ఒకే మారు పలువురు నటీ నటుల్ని రంగస్థలంపై ప్రవేశపెట్టి స్వయం చలిత యంత్రాల వలె వారి చేత అభినయింపజేసి, ఒక కర్మాగార వాతావరణాన్ని సృష్టించే వాడు మేయర్ హోల్డ్ ప్రదర్శన అంతా ఒక కంపోజిషన్ ఆర్కెస్ట్రా పద్ధతిలో

సాగిపోయేది. ఒకేసారి పన్నెండు రంగస్థలాలలో ఏభై మంది నటీ నటులచే అరవై దృశ్యాలతో అభినయింపజేసే ఎ.ఆర్. కృష్ణ జీవనాటకం "మాలపల్లి" తెలుగునాట అపూర్వ సంచలనాన్ని సృష్టించిన విషయం మనకు తెల్సు. మేయర్ హోర్డ్ ప్రభావంతో ఉత్తేజితమయ్యే శ్రీ ఎ.ఆర్. కృష్ణ ఈ అపురూప ప్రదర్శనను తెలుగు నాటక రంగానికి పరిచయం చేశారు.

రంగస్థలంపై 'ఫోర్త్‌వాల్' సాంప్రదాయాన్ని భగ్నం చేసి, ప్రేక్షకుల ఊహకు అనుగుణంగా సెట్స్ వేసి నాటక ప్రదర్శన జరిపించిన వ్యక్తి "ఇర్విన్ పికేటర్". దీనికి "ఎపిక్ స్టైల్" అన్న పేరు పెట్టాడితడు. నాటకాలలోని కథా దృశ్యాలకు ప్రతీకలుగా ఈ దృశ్యాల వెనుకగా సినిమా రీళ్ళు, కార్టూన్లు, బొమ్మలు స్లైడ్ల ద్వారా చూపేవాడు పికేటర్. డాక్యుమెంటరీ థియేటర్ అనీ, "లివింగ్ న్యూస్ పేపర్" అనీ ఇతని ప్రదర్శనలను పిలిచేవారు. ఆనాటి రాజకీయ పోకడలను అభినందించటానికీ, అభిశంసించటానికీ ఈ నాటకాలను ఒరవడిగా పెట్టుకొన్నాడు పికేటర్. ఈ 'ఎపిక్' పద్ధతినే ఇంచుమించుగా అనుసరించినవాడు 'బెర్టోల్డ్ బ్రేష్ట్" జర్మన్ సైనిక నియంతృత్వానికీ, అది కల్గించిన మారణహోమానికీ వ్యతిరేకంగా, జీవితమంతా అవిశ్రాంత పోరాటం జరిపిన వ్యక్తి బ్రేష్ట్. మార్క్స్ లెనిన్ బోధనల్తో ప్రభావితమైన ఇతని నాటకాల్లో అన్నార్తుల ఆకలి ఘోష, దగాపడిన తమ్ముల ఆర్తనాదాలు ప్రధానంగా ప్రస్తావించ బడతై. ఈతని ప్రయోగ ప్రభావం కూడా తెలుగు నాటకరంగంపై ప్రగాఢంగా ఉంది. రుద్రవీణ, గువ్వగూడెక్కె, పంచతంత్రం, ఏకలవ్యుడు, మొ॥ తెలుగు రూపకాల్లో శ్రీ దేశిరాజు ఈ ప్రయోగపద్ధతినే చేపట్టాడు.

"గ్రోటో విస్కి" పోలిష్ లేబరేటరీ థియేటర్ అన్న మరో ప్రయోగ విధానానికి అంకురార్పణ చేశాడు. సీనరీలను, లైట్లను, ఆహార్యాన్నీ, శబ్ద యంత్రాలను కూడా ఇతడు తన నాటక ప్రదర్శనల్లో నిషేధిస్తాడు. అందుకే తన ప్రయోగానికితడు "పూర్ థియేటర్"గా నామకరణం చేసుకుంటాడు. రియలిస్టిక్ థియేటర్ ప్రదర్శనా నియమాలను, పద్ధతులను నేల మట్టం చేయాలన్నదే ఆశయంగా చెప్పుకొంటాడీతడు.

నాటకం అనేది సామాజిక కారణాల వల్ల, సమాజం మధ్యలోనే ఉత్పన్నం కావాలన్న విశ్వాసంతో "అవంటే గార్డే" అన్న ప్రయోగానికి కొందరు రూపునిచ్చారు. ప్రదర్శనకు ఒక నిర్ణీత ప్రదేశం గానీ, నియమబద్ధ పద్ధతులుగానీ అనావశ్యకమనీ, బహిః ప్రదేశాల్లో, ప్రజల మధ్యలోనే అది రాణిస్తుందనీ వీళ్ళ వాదం. "ఆల్‌ఫ్రెడ్ జారీ," "ఉబురాయ్" అనే ఇద్దరు ఈ ఉద్యమానికి ప్రచారం చేసిన వారిలో ముఖ్యులు; అయితే ప్రజలు ఈ ప్రదర్శనలను ఆదరించకపోగా, పెద్ద ఎత్తున నిరసనలు తెలియచేశారు. తెలుగులో గూడా ఈ విధమైన బజారు ప్రదర్శనలు ఇప్పుడిప్పుడే ఊపందుకుంటున్నాయి. ఇటువంటి గారడీ తరహా ప్రదర్శనలు నాటక ప్రమాణాలను దిగజార్చటమే గాకుండా, నాటకం పట్ల ప్రజల్లో ఉండే గౌరవాభిమానాలను గూడా నీరు కార్చి వేస్తాయి. డా. అత్తిలి కృష్ణ మొదలగువారు ఈ తరహా ప్రయోగాలకు సారథులైనారు.

ఒక సామాన్య వ్యక్తికి, చారిత్రాత్మకమైన వ్యక్తిగా ఊహారూపమిచ్చి, ఆతని చేష్టల్నీ పోకడల్నీ ఈ సామాన్యవ్యక్తి ద్వారా ప్రదర్శింపజేసే మరో ప్రయోగం గూడా పాశ్చాత్య రంగస్థలంపై రూపు దిద్దుకుంది. "అస్పోరన్" "తాహర్" అనే నాటకాన్ని ఈ పద్ధతి లోనే వ్రాస్తాడు. తెలుగులో గూడా "మహమ్మద్ బిన్ తుగ్లక్" "త్రిజాకీ యమదర్శనం" మొ॥ నాటకాలు ఈ కోవలోనే సృష్టించబడ్డాయి.

"లెఫ్ట్ వింగ్ థియేటర్" అన్న మరో ప్రయోగం పుట్టీ పుట్టగానే పుబ్బలో కల్సిపోయింది. తాడిత పీడిత ప్రజల దీనావస్థలను, చిన్న చిన్న థియేటర్లలో చిన్న చిన్న ప్రదర్శనల ద్వారా చూపెట్టారు వీళ్ళు. ఆ తర్వాతది ఫ్రీ థియేటర్ మూవ్‌మెంట్‌లో కల్సిపోయింది. మాటలలో

అభివ్యక్తం చేయలేని వాటిని, మాధ్యమ మార్గాల ద్వార వాస్తవేతర పద్ధతుల్లో ప్రదర్శింపజేయాలన్న ఆశయంతో రూపుదిద్దుకున్న మరో ప్రయోగం "నియోరియలిస్టు ఉద్యమం". వీరు సింబాలిజం,, ఎక్స్‌ప్రెషనిజంలకు అధిక ప్రాధాన్యమిచ్చారు. ఇంకా థియేటర్ ఆఫ్ క్రూయాలిటీ, థియేటర్ ఆఫ్ యాంగర్, థియేటర్ ఆఫ్ జస్టిస్ వంటి అనేకానేక రంగస్థల ప్రయోగాలు అవతరించి ప్రేక్షకుల్ని ఉక్కిరిబిక్కిరి చేశాయి. అంతేగాకుండా నాటక ప్రదర్శన అంటేనే మొహం మొత్తేట్లు చేశాయి. అందుకే ఈ ప్రయోగ సంరంభ కోలాహలంలో నాటకం నిర్జీవమై పోయిందనీ ప్రేక్షకుల నిరాదరణకు గురైందనీ పలువురు నాటక రంగ పెద్దలు ఆనాడే వ్యాఖ్యానించారు. ఈనాటికీ తమ అసంతృప్తినీ వ్యక్తం చేస్తూ ప్రయోగాలపట్ల తమ తీవ్ర వైముఖ్యాన్ని ప్రదర్శిస్తున్నారు ఆధునికంగా ప్రసిద్ధులు. అయితే తెలుగు నాటక రంగంపై ఈ తరహా ప్రయోగాలు ఇప్పుడు ముమ్మరమవటం ఒక విషాదం.

"ఈ ప్రయోగకర్తలు కొన్ని అనుభవాల్ని గడించటానికీ, చిత్రించటానికీ, శక్తి చాలక రంగస్థలాన్ని గజిబిజిలో నింపివేశారు. ఈ ప్రదర్శనల్లో సమాజ పాక్షిక వీక్షణ తప్ప, సమగ్ర వీక్షణం కన్పించదు. వీళ్ళు చెప్పే దంతా అసమగ్రంగా, అసహజంగా, వంచనాత్మకంగా ఉంటున్నది" అంటూ బ్రెఖ్ట్ ఈ ప్రయోగాల పట్ల తన అసంతృప్తిని వ్యక్తం చేస్తాడు. "నాటకంలో వస్తువు, శిల్పం తక్కువై, ప్రయోగం, తర్కం అధికమై ప్రదర్శన ఒక రసాభాసగా తయారైంది. ఆంగ్లనాటకం ఈ దుస్థితిలోనే ఉంది. నాటకం కొరకు రంగస్థలం ఉండాలి గాని, రంగస్థలం కొఱకు నాటకాన్ని ప్రయోగ విన్యాసానికి గురి చేయరాదు. "షా" పరివేదన చెందిన తీరు ఇది. "నూతన పోకడలతో వస్తున్న అమెరికా నాటకం పట్టి చెత్తగానే గాదు, పరమచెత్తగా ఉంది" అంటూ ఆధునిక అమెరికా డ్రామాను గూర్చి మేరి మెకార్తీ చేసిన ప్రకటన మన తెలుగు నాటక ప్రయోగ ఉబలాట వాదులు దృష్టిలో ఉంచుకోవాలి. "వీళ్ళింకా ఫిడేళ్ళను శ్రుతి చేసుకొనే దశలోనే ఉన్నారు. రాగాలాపన ఇంకా ఆరంభించలేదు." అని ఈట్స్; "వీరంతా అన్వేషణా దశలోనే ఉన్నారు. అని విలియమ్స్; ' ఒక పండుగ దినాన్ని గాక, ఏదో ఒక సామాన్య దినాన్ని చూసిన అనుభూతినే ఈ ప్రయోగనాటకాలు కల్గిస్తున్నాయి" అని కోరిగన్, "సార్వజనీన సత్యం ఈనాటకాలలో కన్పించదు. పాక్షిక సత్యం మాత్రమే వీళ్ళు ప్రతిపాదిస్తున్నారు. ఈ నాటకాలలో మానవ జీవన పరమార్థప్రాధాన్యం కంటే, వినోద ప్రాధాన్యమే అధికం అంటూ" కారిన్గన్, కేవలం బాధాగ్రస్తుల జీవిత చిత్రణకే ఇవి పరిమితమవుతున్నాయి. సమగ్ర నాటక స్వరూపం వీటిల్లో కన్పించదు " అంటూ ఆర్థర్ మిల్లర్, "సామాజిక సమస్యలను గూడా ఇవి విస్తృతంగా ప్రతిబింబించాయని చెప్పలేమనీ, వీళ్ళవల్ల లభించే పద్ధతి వల్ల కథా వస్తువు బిగువు పాత్రల ఔన్నత్యం దెబ్బ తిన్నదనీ, నాటకం కళాత్మకంగా దిగజారిపోయిందనీ "బ్రెఖ్ట్" లోగడ సినిమాల్లో నాటకం ఉండేది. ఇప్పుడు నాటకంలో సినిమా చూస్తున్నాం" అని ఎ.ఆర్ కృష్ణ ఈ విధంగా పలువురు నాటకరంగ ప్రముఖులు ఈ సిద్ధాంత గందరగోళ ఉధృతిలో, విభిన్న ప్రయోగాల వెల్లువలో నాటక స్వరూప స్వభావాలు మళ్ళీ పునరుద్ధరించలేనంతగా దిగజారిపోయిన పరిస్థితి పట్ల తమ నిరసనను, నిస్పృహను వెల్లడించారు. "రియలిజంను చెప్పుగాని, మరీ సంకుచిత రియలిజంను భూతద్దంలో పెట్టి చూపకు. నిర్భాగ్యుని సమస్యలే సమస్త సంఘ సమస్యలుగా నాటకమంతా నింపకు, ఈ విధమైన చిత్రణ వల్ల నాటక సమగ్రత్వం దెబ్బ తింటుంది" అంటూ బ్రెఖ్ట్ డ్రామాకు వ్రాసిన పరిచయవాక్యాల్లో "లోమన్" తెలియజెప్తాడు. కృతక డైలాగులలో శూన్య శుష్క నినాదాలతో, కేవలం బీదతనాన్నీ, యువకుల అసంతృప్తినీ, డాక్యుమెంటరీ పద్ధతిలో చూపుతున్న ఈ నాటకాలు, ఎంతగా రంగుహంగుల ఆర్భాటాలతో, ప్రయోగాల జిమ్మిక్స్‌తో రంగస్థలాన్ని, నింపి వేసినా విజయం చెందలేవు అంటూ పలువురు నాటకరంగ పెద్దలు వ్యాఖ్యానిస్తున్నారు.

అనేకానేక సంక్షుభిత సమస్యలతో, అంతర్గత నిత్య సంఘర్షణలతో, మానవుడు తనకు తానుగా వేసుకొంటున్న అమానుష వైఖరుల సంకెళ్లలో ఉడికి ఉడికి పోతున్న ఈ సమాజం యొక్క సమగ్ర స్వరూపాన్ని, విస్తృతంగా పొందుపరిచే నాటకం ఇప్పుడు రావాలి. కేవలం సమస్యల ప్రస్తావనే గాక, వాటికి తగ్గ పరిష్కార సూచనల్ని గూడా నాటక రచయితలు అందించాలి. అంతర్బహిస్సంఘర్షణలతో సతమతమయ్యే నేటి మానవుడు నాటకాన్ని కేవలం వినోదం కొఱకో అభిమానంతోనో చూడడు. తనను చుట్టిముట్టిన సమస్యల సంక్షోభం నుండి బయటపడే పరిష్కారమార్గం నాటకంలో అందుతుందేమోనన్న ఆరాటం ప్రేక్షకుడిలో ఉండి తీరుతుంది. ఈ విషయాన్నే "ఎడ్మిన్బర్గ్" గూడా ప్రస్తావిస్తాడు. సామాజిక వాస్తవాల్ని తెలియజెప్పే నాటక రచయితపై నేడు పరిష్కారాంశాల్ని గూడా సూచించే అదనపు బాధ్యత ఉంటుదన్నమాట.

దృశ్య ప్రక్రియలోని అన్ని వైవిధ్యరూపాల్లోనూ, పరిణామగతంగా సిద్ధించిన పరిపూర్ణ స్వరూపం నాటకం. ప్రజల ఆదరాన్ని, అభిమానాన్ని అపూర్వంగా చూరగొన్న విశిష్ట విస్తృత స్వరూపం నాటకం, ఇప్పుడీ సమగ్ర నాటకాన్ని, విదేశీ ప్రయోగ వ్యామోహాలతో ఛిన్నాభిన్నం చేయగూడదు. కేవలం పట్టణాలూ, పరిషత్తులకే పరిమితమై పోయి, ప్రజల ఆదరణకు దూరమై అడుగంటిన నాటకాన్ని ప్రయోగాల జిమ్మిక్స్‌తో, వీధి ప్రహసనం, గారడీ వినోద క్రీడల స్థాయికి దిగజార్చరాదు, ఈ తిరోగామి తిమిరం నుండి నాటకాన్ని వెలుగులోకి తేవాలి.

ఈ ప్రయోగ వ్యామోహపోకడలకు తోడు, "వీధి నాటకం" పేరిట బజారు ప్రదర్శనలు ఉవ్వెత్తున సాగుతున్నాయి. దేశంలో, తెలుగు నాటకూడా డాక్టర్ అత్తిలి కృష్ణారావు సారధ్యంలో ఈ ప్రదర్శనలు మంచి ఊపందుకున్నాయి. ఈ 'స్ట్రీట్ ప్లే" సృష్టికర్త పోలెండు దేశీయుడైన "మియర్" రంగస్థలమేదీ లేకుండా, రంగ పరికరాలు, ఆహార్యం లేకుండా నటులే తమ హావభావాలతో సన్నివేశాన్ని సృష్టించి, అంగవిన్యాస ప్రదర్శనల ద్వారా, నడిబజారుల్లో, జనం ఉండే కూడలి ప్రదేశాలలో వీధినాటకాన్ని ప్రదర్శించటం జరుగుతూ ఉంది. డాక్టర్ అత్తిలి కృష్ణారావు ఆధ్వర్యంలో "యుగసంధ్య'అనే వీధి నాటకాన్ని 1974లో ఆంధ్రా యూనివర్సిటీ కాంపస్‌లో, యూనివర్సిటీ నాటక విభాగం వారు ప్రదర్శించారు. తర్వాత "ఊరేగింపు" "టామా టామా" "జంతర్‌మంతర్-మామూల్కు" "జనగీతం" ఇత్యాది ప్రదర్శనలు గూడా డా॥ కృష్ణ నిర్వహించారు. ఇటువంటి వీధి ప్రదర్శనల వల్ల ప్రజలలో ఎంతో చైతన్యం కలుగుతున్నదనీ, సామాజిక ప్రయోజనం సిద్ధిస్తున్నదనీ డా. అత్తిలి కృష్ణ ప్రకటించినా ఈ ప్రదర్శనలు నాటక ఉన్నతిని ఔచిత్యాన్ని, సమగ్ర స్వరూపాన్ని దిగజార్చేవిగా ఉన్నాయని, ఇందువల్ల 'నాటకం' అంటే కేవలం ఒక "బజారు వినోద క్రీడలా" అపహాస్యానికి గురైందని పలువురు నాటక విమర్శకులు, ఆందోళన చెందుతున్నారు. "ఇటువంటి ప్రదర్శనల్లో, వస్తువు, శిల్పం కనుమరుగై, ప్రయోగ విన్యాసం అధికమై కళాత్మకత దిగజారిపోయింది." అని "విలియమ్స్" తన ఆవేదనను వ్యక్తపరుస్తాడు. వీధి ప్రహసనల పరిణామ దశలను దాటి, పరిపూర్ణ స్వరూపాన్నీ, పరిణతి ధ్యేయాన్ని పండించుచున్న "నాటకం" తిరిగి మళ్ళీ అపరిపక్వ "వీధి" దశకుతిరోగమనం చెందటం బాధాకరం. తనను చుట్టుముట్టిన సమస్యల సంక్షోభం నుండి తరుణోపాయమైన లభిస్తుందేమోనన్న ఆశతో "నాటకం" చూడటానికి వచ్చిన ప్రేక్షకుడు ఇటువంటి వినోద, జిమ్మిక్స్‌ల వీధి ప్రదర్శనను చూసి జుట్టుపీక్కోవటం మినహా చేయగలిగేది ఏముంటుంది? ఇటువంటి భావాన్నే "ఎడ్మిన్ బర్గ్" గూడా వ్యక్తం చేస్తాడు. బెంగాల్ నాటకరంగంలో 'బాదర్ సర్కార్' ప్రయోగించిన ఈ "వీధి నాటకం" నేడు తెలుగు నాటకరంగంపై గూడా విచిత్ర పోకడలతో విన్యాసం చేస్తున్నది. ఆధునికమానవుని "ఈజీగోయింగ్" మనస్తత్వానికి ఈ ప్రదర్శనలు

ప్రతిరూపాలు. శ్రీకళా విజయమోహన్‌కూడా ఈ "థర్డ్ థియేటర్" ప్రయోగ రంగంలో నేడు ప్రముఖులు సమాజమే మాకు వేదిక, వేరే వేదిక అవసరం లేదంటూ కృష్ణ మోహన్ "నాటక కళ రహస్యాలను, ధర్మాలను అధ్యయనం చేయటానికి నావంటి వారే భారతదేశానికి రావాలని ఆరాటపడుతుంటే మీరు మా దేశానికి ఇందునిమిత్తం రావటం ఆశ్చర్యంగా ఉంది" అంటాడు బెర్నర్డ్‌షా, బళ్ళారి రాఘవతో; 1928 సం॥రంలో 'రాఘవ' లండన్ వెళ్ళి 'షా' ను కలిసినపుడు ఆయన ఆశ్చర్యంతో అన్న పలుకులివి. ఇంతేకాదు "షేక్స్పియర్ నాటకాల్ని నీవు ప్రదర్శించి మెప్పు పొందావు. నీవు లండన్‌లో పుట్టి ఉంటే ఇంగ్లండ్ నిన్ను షేక్స్పియర్ అంత ఉన్నతుణ్ణి చేసేది" అంటూ బళ్ళారి రాఘవని ప్రశంసిస్తాడు "షా". పాశ్చాత్య నాటక రంగ సిద్ధాంతాలలో, ప్రయోగాలలో, ప్రదర్శనల టెక్నిక్స్‌తో తెలుగునాటక రంగాన్ని కప్పి వేసి, ఇంతకన్నా వేరే గత్యంతరం లేదన్న భావంతో కాలం గడుపుతున్న మన రచయితలు, దర్శకులు 'షా' వాక్యాలను ఒక్కసారి మననం చేసికోవటం అవసరం. బ్రిటిష్ డ్రామా ప్రభావంనుండి వెలికివచ్చి, స్వయం ప్రకాశవంతమైన "అమెరికన్ డ్రామా" వికాసదశను చూసి "American Play wright had found his legs, American writers began to seize hold of American subjects with more than an infantile grip" అని డీన్ హొవెల్స్" చురకలంటిస్తూనే సంతృప్తిని వ్యక్తం చేస్తాడు. "American Drama and its Critics" అన్న గ్రంథంలో; ఈ వివేకం మన తెలుగు నాటక రచయితలలో ఉదయించగలదనే ఆశిద్దాం.

ఎన్ని కొత్త ప్రయోగాలు ఆవిర్భవించినా, మరెన్నింటినో విదేశాల నుండి దిగుమతి చేసుకొన్నా "తెలుగునాటకం" సాజాత స్వభావం, పూర్తిగా రూపు మాసిపోదు అన్న సత్యానికి ఈ దశాబ్దంలో ప్రసిద్ధిపొందిన కొన్ని నాటకాలను పర్యాలోకించినపుడు తార్కాణం లభిస్తుంది. "స్త్రీలు, కష్టాలు, కన్నీళ్ళు, పురుషాహంకారం, స్వార్థం.." ఈ ప్రవృత్తులే నేడు ఆధునిక తెలుగు నాటకంలో ప్రాధాన్యత వహిస్తున్నాయి. కాకపోతే సమన్వయ ప్రయోగించిన తీరులో నూతనత్వం గోచరిస్తుంది. "డియర్ ఆడియన్స్ సిన్సియర్లీ యువర్స్" అన్న నాటకాన్ని పరిశీలించుదాం. స్త్రీ పురుషుల మధ్య ఉండవలసిన అన్యోన్యతను, విశ్వాసాన్ని, సమాన విలువ ఆశయాన్ని ఈ నాటకం ప్రధానంగా ప్రస్తావించినా, ప్రయోగించిన విధానంలో ఎంతో ఆధునికత ఉంది. "పర్సనల్ డ్రామాలో సన్నివేశాలు చాలా ఇన్‌కొహెరెంట్‌గా, అసంబద్ధంగా, ఎబ్సర్డ్‌గా కన్పించవచ్చు. దయ చేసి లింక్ చేసుకోండి" అని నాటకంలోని రచయిత పాత్ర చేత ప్రకటింపజేస్తాడు. క్రమపరిణామం చెందే 'కథ' ఈనాటకాలలో లేకపోయినా, ప్రస్తావించిన సమస్య, మనః ప్రవృత్తుల మధ్య ఏక సూత్రత ఉంది. భావాత్మక సంవేదనాధార నాటకాన్ని సంఘటనలతో సంపుటీకరణ కావిస్తుంది. నాటకం ఆరంభమైన కొద్ది సేపటికి " నాకు పెండ్లయింది, ఆరు సంవత్సరాల క్రితం, ప్రేమించి పెండ్లి చేసుకొనే అవకాశం లభించలేదు. మన సెల్ఫ్ ఇంటలిజెన్స్ నాటకాల్లో ఆదర్శాలు రాసినా ధనలోభం వల్ల పదిహేను వేలు కట్నం తీసికొన్నాను, ఆమె పేరు, ఐమీన్ నా వైఫ్ సుశీల భార్య అనే దాని కంటే ఒక చర్మ యంత్రం అనొచ్చు.. రెండు రోజుల క్రితం ఆమెతో చాలా విచిత్రంగా, అవాస్తవికంగా, అసహ్యంగా, విపరీతంగా ప్రవర్తించాను...." అంటూ రచయిత పాత్ర ధారి ప్రేక్షకులతోనే ముఖాముఖి తన స్వీయ అనుభవాన్ని వ్యక్తం చేస్తుంటాడు. నాట కాంతం లో మనం గ్రహించేది " సుశీల" ఆత్మాహుతి, కాదు, హత్య, దారుణమైన హత్య, భర్త అనబడే రచయితతో ఆ రచయితే ఈ నాటకంలో ప్రధాన పాత్ర ధారి "వాస్తవంగా ఇలా జరగనప్పుడు మీకు ఎందుకు చూపించాను. తప్పక చెప్పటం కోసం, తప్పుని తప్పని చెప్పటం ఎందుకు? మరోసారి ఇలా చెయ్యకుండా వుండేందుకు? ఎంతమంది పురుషులు ఇది చూసి మారారు? ఎవ్వరూ మారరు, నేను మారాను కనుకనే " ఈ విధంగా

తన జీవితంలో జరిగిందీ మనసులో రగులుతున్నదీ ప్రేక్షకులకు తెలియజేస్తూ, మార్పుని ఆశిస్తాడు. రచయిత. "నా సుశీల నైతిక నిష్ఠను..' పాడు చేశావ్ అని భార్య పరపురుషుడి అధీనమైందనీ ఆక్రోశిస్తూ ఆవేదన చెందే రచయిత మరో వివాహిత స్త్రీ ప్రియుడిగా ఈ నీతుల్ని, ఆదర్శాల్ని పట్టించుకోడు. మనిషిలో ఉన్న "డ్యూయల్ రోల్ని" ఈనాటకం బయటకు గుంజుతోంది. విలువలనేవి స్త్రీ పురుషుల పట్ల పక్షపాత ధోరణిలో ఉండరాదని, తల్లికి, భార్యకి, కూతురికి స్త్రీగా ఒకే ఒక్కనీతి అనుసరింపబడాలని ప్రబోధిస్తుంది నాటకం, 'ఫిమేల్' విషయంలో నైతిక ధర్మాలు ఆస్తి హక్కు స్థితికి మానవుడు దిగజారాడన్న సందేశంతో పాటు "ఇన్ హ్యూమన్ బిహేవియర్"తో బాధపడే మానవ ద్వంద్వ ప్రవృత్తిని వెల్లడిస్తుంది నాటకం, పెండ్లి కాకముందు భార్య ఎవరినైనా ప్రేమించిందీ అన్న అనుమానం, పెండ్లైన తర్వాత ప్రియుడి చేతలోకి జారిపోయిందన్న వ్యథ నేటి యువకుల్లో ఎనభై శాతం మందిలో ఉన్న దన్న భావాన్ని గూడా రచయిత పాత్ర ద్వారా వెల్లడిస్తాడు. "టుమిడిస్ రైటర్ ఈజ్ ఏన్ ఇర్రెసెస్టబ్లీ లాజికల్ వైజ్డ్ హిపోక్రాట్. ఒక్క గుక్కలో చెప్తే అతను ఫియర్ ఆఫ్ లవ్ అనే కాంప్లెక్స్ లేక మెంటల్ అబ్నార్మిలిటీతో బాధపడుతున్నాడు. ఆఫ్కోర్స్, వైనేయుమేనొక చీన్ థింకింగ్ మి' ఏజ్ ఉన్ ఏడ్రైస్, ఆర్. ఎబిల్, బట్ ఫిల్ అండ్ ఫియర్ టుసీ దట్ లిటరల్లీ వర్జినిటీ, ఆర్ చేస్టిటీ ... విత్ ఎ థాట్ లెస్ గరల్ ఆర్ ఎ వుమెన్, ఐరిమైన్ - సిన్సియర్లీ యువర్స్......." నాటకాంతంలో "సుహాసిని " పాత్ర ద్వారా చెప్పించిన వ్యాఖ్యానం ఇది; ఆంతరిక ప్రవృత్తి పరిచయాన్ని ఆంగ్లపదాలలో చేయించటం ఇక్కడ ప్రత్యేకత; నాటకం "అబ్సర్డ్ థియేటర్" పోకడ లో ప్రాణం పోసుకొంది. పిరాండిలో "Six charecters hunt for an author" అన్న నాటక లక్షణాలన్నింటినీ ఈ నాటకం వంట పట్టించుకొంది. పిరాండిలో పాత్రలు దర్శకునికి ఎదురుతిరుగుతై, పాత్రలే పరస్పరం రంగస్థలంపై కలహించుకొంటాయి. శ్రీ ఇసుకపల్లి మోహన్రావు వ్రాసిన ఈ ప్రయోగాత్మక నాటకంలో గూడా రంగస్థలం నుండి వెళ్ళిపోవటానికి హీరోయిన్ పాత్ర ప్రయత్నిస్తుంది. ప్రయోక్తకు అడ్డు తగులుతుంది. ప్రేక్షకుల్లో నుండి రంగస్థలం పైకి పాత్రలు ప్రవేశిస్తాయి. ఇటువంటి ప్రయోగం వల్ల నాటక ప్రదర్శనల్లో నూతనత్వం, ఆకర్షణీయ ధోరణి తీసుకువచ్చానంటాడు. పిరాండిలో " For this purpose Pirandillo required his third and most starting innovation. The reality Pirandillo ask us to grant his characters, allows him as we have seen to use the father to disti to gration confidence in our identity.." అని ప్రకటిస్తాడు. పిరాండిలో " సిక్స్క్యారెక్టర్స్ హంట్ ఫర్ యాన్ ఆథర్" అన్న నాటకంపై వ్యాఖ్యానిస్తూ రోనాల్డ్ గాస్కెల్ ఈ ఆధునిక ప్రయోగంలో వస్తువు మీది దృష్టి కన్నా , దాన్ని ప్రజల మధ్యకు తీసుక వెళ్ళే ఆకర్షణీయ ప్రయోగం పట్లనే రచయితలు, దర్శకులు ఆరాటపడడం జరిగింది. "The theatre to attempt' a constant rediscovery of self at each historical movement of time" అని ప్రకటిస్తాడు అవినెస్కో "నోట్స్ అండ్ కౌంటర్ నోట్స్" అన్న గ్రంథంలో అవినెస్కో అభిప్రాయం గూడా కాలానుగుణంగా "థియేటర్॥ ప్రదర్శనా పోకడల్లో ఆధునికత్వం రావాలనే.

శ్రీ ఇసుకపల్లి మోహనరావు వ్రాసిన మరో ప్రసిద్ధ నాటకం " ఓ బూతు నాటకం", భార్య లేచిపోయిన రామజోగి కూతురు వరలక్ష్మి, అవివాహిత. యవ్వన ప్రాంగణం లోకి అడుగుపెట్టిన వరలక్ష్మిని, సెక్స్ సంబంధ మాటలతో ఉద్రేకపర్చి లోబరుచుకోవాలని విఠల్, దాసుల ప్రయత్నం. ఆలింగనంతోనే నీరు కారిపోయే శక్తిహీనుడు దాసు, కాలు జారకపోయినా, 'కుట్ర' అని నిందిస్తూ రోదించే ఛాందస తండ్రికి ఎదురు తిరుగుతుంది వరలక్ష్మి. "శీలం పోయిన స్త్రీ పురుషులిద్దర్ని చెట్టుకు కట్టి కాల్చి పడేయండి... స్త్రీ పురుష భేదాలు ఒక్క శరీరాకృతిలోనే

తప్పు, ఆలోచనలలో కాదని గుర్తుంచుకోమంటున్నాను" అంటూ ప్రత్యేకించి పక్షపాతంతో స్త్రీలనే తప్పు పట్టే ధోరణిని విడనాడమని చెప్తుంది". డు యు థింక్ దట్ ఐసెల్ మైసెల్ఫ్ టు ఎమాన్ ఫర్ ది మియర్ సోషల్ స్టేటస్ ఆఫ్ ఎవైఫ్ ఎండ్ ది రైట్ టు బి సపోర్టెడ్ ఎండ్ పెన్షండ్ ఇన్ ఓల్డేజ్ అవుటాఫ్ హిజ్ ఇన్‌కమ్..... నో ఐ వుడ్ నెవర్ బివైన్ పదట్; తేరగా నా శరీరాన్ని అనుభవించటానికి శీలం అడ్డురాదే..." అంటే ఇంత ధారాళంగా, ధాటిగా ఆంగ్లంలో భావ ప్రకటన చేస్తుంది ఇంటర్ చదివిన వరలక్ష్మి; ఆంగ్లంలో ప్రసంగం చేస్తే గాని ఆధునికత్వం అబ్బదన్న విశ్వాసమేదో శ్రీ మోహనరావుకు ఏర్పడి ఉంటుంది. నాటకంలోని వస్తువు "బీ పెన్ ట్రాక్" వంటిదే అయిన ప్రదర్శించిన ప్రయోగంలో ఎంతో నవ్యత ఉంది. ఆకర్షణీయత ఉంది. "నువ్వు యవ్వనపు దిగంబర లైంగికాలోచనవి" "స్త్రీ మూడు దశలనుండి పొందుతున్న రసానుభూతుల కృతజ్ఞతా మందహాసానివి" "ప్రపంచ సారస్వతం నవ్విన నవ్వులోని ఓ ఐ డ్రాప్" నిశ్శబ్దం కడుతున్న ఈ క్షణాలు సమాధుల్ని చూస్తూ నంగిగా నేనుండలేను.." వంటి వాక్య నిర్మాణం కవితా గంధంతో పరిమళిస్తూ ఉంది." Prose is the language of information, poetry the language of emotion, the best prose on the stage, he feels is inferior to the least Poetry" జీన్‌పాల్ సాత్రే రచనల గూర్చి వివేచన చేస్తూ "అమెరికన్ డ్రామా అండ్ క్రిటిక్స్" అన్న గ్రంథంలో ఆండర్సన్ చేసిన వ్యాఖ్య ఇది. శ్రీ మోహనరావు కవితా శిల్పశైలికి అన్వర్థమవుతాయి ఈ మాటలు. శ్రీ అనంత హృదయరాజ్ వ్రాసిన నాటకం " అం అః " ఈ దశాబ్దంలో ప్రసిద్ధి పొందిన మరో నాటకం. "ఏ రాజకీయమైనా, ఏ చట్టమైనా కష్టజీవులకు సహకరించాలి. ఏ రాజ్యాంగమైనా వాళ్ళ అభ్యున్నతికి తోడ్పడాలి... నవభారత నిర్మాణానికి నా పిల్లలు ధర్మ కోసం పోరాడుతున్నారు. కర్షకుడు, కార్మికుడు వాళ్ళే నారెండు కళ్ళు " అని "భారతి" చేత ప్రకటింపచేస్తారు రచయిత; ఈ పాత్ర భారతదేశానికి ప్రతీకగా తీసుకోబడింది. దోపిడీ సమాజంపై, అభ్యుదయ, చైతన్య భావ యువకుల సాయుధ విజయంతో నాటకం ముగుస్తుంది. నాటకంలో అన్ని పాత్రల చేత అర్థగంభీరమైన, పాత్రోచితమైన సంభాషణలు పలికించిన రచయిత చివరలో తన కొడుకైన యస్.పి.తో "యస్.పి.సాబ్, బికాజ్ ఆఫ్ యువర్ బార్బేరియన్ బిహేవియర్ - యు డిస్ట్రాయ్ ది డిగ్నిటి ఆఫ్‌లా అండ్ ఆర్డర్, యు ఆర్ ట్రీటింగ్ పీపుల్ యాజ్ తీవ్స్, బట్ యునోదే ఆర్ ట్రీటింగ్ యూ యాజ్ కిల్లర్స్, యస్ యు ఆర్ నథింగ్ బట్ ప్రొఫెషన్ కిల్లర్స్" అని భారతి పాత్ర చేత రౌద్రావేశంగా పలికింపజేస్తాడు. మనం ఆవేశంగాని, ఆవేదనగాని ఇంగ్లీషులో వ్యక్తం చేస్తేనే ఎమోషన్ రాదులన్నంత భావదాస్యంలో మనం మునిగిపోయి ఉన్నాం. ఇదిగో ఇటువంటి భాషాదేశ్య విద్యావ్యవస్థనే ఆంగ్లేయులు మనకందించి పోయింది. ఈ పనికిమాలిన స్వ ప్రకాశరహిత విద్యా వ్యవస్థనే ఇంకా మనం కొనసాగిస్తున్నాం. ఇటువంటి భావాలతోనే శ్రీ అనంతహృదయరాజ్ "భారతి" ఆగ్రహజ్వాలను ఆంగ్లభాషలో రగిలింపజేసి ఉంటారు.

" 'ఉరి' శిక్షకాదు" అన్న నాటకరచయిత' డీన్ బిద్రూ", ప్రయోగాత్మక నాటకంగా రచయితే ప్రకటించారు. టైటిల్ మీద, పాత కక్షలు ఒక్కసారి హృదయం నుండి వెళ్ళుకొచ్చి ఎంతో అన్యోన్యంగా చూసుకునే భార్య లక్ష్మిని, మిత్రుడు మనసును డాక్టర్ రాజశేఖర్ హత్య చేస్తాడు. జరిగిన ఈ దురాగతానికి, దారుణానికి తానే ఆశ్చర్యపోతాడు, విలపిస్తాడు. ఈ 'హత్య' నేనే చేయించానంటుంది. "ఆత్మ", నా పగ చల్లారింది. ప్రతీకారం తీర్చుకొన్నాను" అని "మనసు"తో చెప్పి ఊరట చెందుతుంది ఆత్మ కోర్టులో హత్యారోపణపై డా॥ రాజశేఖర్‌పై విచారణ జరుగుతున్న సన్నివేశంలో; ఇట్లా "మనసు - ఆత్మ"లు రంగస్థలం పైకి పాత్రల రూపంలో ప్రవేశించటమే గాక, సన్నివేశ గమనంలోనూ వ్యాఖ్యానాలతో

సహకరించటం ఈ నాటకంలోని ప్రత్యేకత, రాజశేఖరం తాతను హత్యచేసిన వారి వారసులను, రాజశేఖరం ప్రమేయం లేకుండానే రాజవేఖరంను ఉపకరణంగా చేసుకొని అతని 'ఆత్మ' హత్య చేసి పగతీర్చుకొన్నట్లుగా ఈ నాటకంలో చిత్రీకరణ జరిగింది. " నాజీవిని చంపిన ఆత్మల్లారా, నేను మిమ్మల్ని విడిచి పెట్టను" అంటూ రాజశేఖరం 'ఆత్మ' పాత్ర ధారణచేసి రంగస్థలంపై ప్రకటిస్తుంది. ఈ తరహా అంతరాత్మ బోధనలు, హెచ్చరికలు, రూపం ధరించి రావటాలు తెలుగు నాటక రంగానికి కొత్తగాక పోయినా, అతి ప్రధానమైన కథా గమనానికి ఆయువుపట్టైన 'కోర్టు' సీనూలో తానూ ఓపాత్రలాగా రంగస్థలంపైకి ప్రవేశించి, సంఘటనలపై వ్యాఖ్యానాలు చేయటం ఇదే ప్రథమం, అయితే ఈ "ఆత్మ" ఉనికి రంగస్థలంపైని "మనసు" పాత్ర ప్రేక్షకులు మినహా మరొక పాత్రకు గోచరం గాని నాటకీకరణ ఈ నాటకంలో గమనిస్తాం. " ఈ నాటకం విజయం, lighting effects మీద ఆధారపడి ఉంటుంది. కనుక lighting arrangements ఎలా చేయాలో తెలియచేస్తున్నాను...." అని డైరక్టర్ పేజీలో రచయితే సూచన చేస్తాడు. సాంకేతికమైన ప్రజ్ఞా ప్రాభవాలతో ప్రయోగించ వలసిన నాటకం ఇది. "For these new dramatists have largely turned away. from the Ibsern / chekov treditions and have demonstrated a willing-ness to experiment, which can only serve to extend the potentialities of drama...." అని జీన్‌పాల్ సాత్రే ఎగ్జిస్టెన్షయిలిజం అండ్ హ్యూమనిజం" అన్న గ్రంథంలో ఫిలిప్ మారెట్ వ్యాఖ్యానిస్తాడు. 1951లో పాశ్చాత్య నాటకరంగాన్ని ఓ ఊపు ఊపిన "చైనా" నాటక ప్రయోగాన్ని దృష్టిలో పెట్టుకొని 'మారెట్' వెల్లడించిన అభిప్రాయమిది. ప్రపంచనాటక రంగాన్నే తన నాటకాలతో ప్రభావితం చేసిన ఇబ్సన్, నేడు పాతబడి పోయినాడు, విలక్షణమైన ప్రయోగాలలో, నవ్యమైన వస్తువులో ఎప్పటికప్పుడు పరిణామం చెందుతున్న నాటకరంగంలో ఇటువంటి మార్పు సహజమే. ఇబ్సన్ "పిల్లర్స్ ఆఫ్‌ది సొసైటీ" నాటకాన్ని చూడటానికి తనకో సీటుని రిజర్వ్ చేసి ఉంచమని, 'మాస్కో ఆర్ట్ థియేటర్ నటుణ్ణి కోరిన "చెకోవ్" ఆ తర్వాత ఇబ్సన్ వ్రాసిన "Hedda gabber" నాటకంలో నటిస్తూ ఇబ్సన్ నాటక రచయితే కాదని ప్రకటిస్తాడు. "I want to have a look at this amazing norvegian play and will even play for the privilage, Ibsen is my favouraite authour for know" అన్న ఛెకోవ్ వాక్యాల్ని, "Ibsen was not a play wright" అన్న ఛెకోవ్ వ్యాఖ్యకు "స్టానిస్లవిస్కీ" రికార్డ్ చేసి ఉంచాడు. అందువల్ల ఆధునికత అనేది కాలం, మానవ మనో ప్రవృత్తులు, సమాజ పోకడ ఇన్నిటిపై ఆధారపడి ఉంటుందన్నది సత్యం. "Ibsen does not know life in life it does not happen like that, Ibsen would have asked that the Theatre should present life as it happens. LIfe did not mean to him, however where it meant to chekhov....." ఇబ్సన్ వ్రాసిన మరో నాటకం "ఐల్డ్‌డక్" రిహార్సిల్ సందర్భంలో ఛెకోవ్ చేసిన మరో వ్యాఖ్యానమిది, ఒకప్పటి ఒక గొప్ప కళారూపం మరోనాటికి మరుగునపడిపోవచ్చు. ఇది సహజం, 'ఛెకోవ్ అసలు నాటకరచయితే కాదంటాడు. 'గోర్కి', అయితే ఈ విధమైన మార్పుకు కారణం నాటకంలోని వస్తువుకన్నా, దాన్ని మలచే శిల్పం మీద, ప్రదర్శించే ప్రయోగం మీద ఆసక్తి అధికం కావటమే. సామాజిక వ్యవస్థ, సమస్యలు, సన్నివేశాలు అవే అయినా ప్రదర్శించే ప్రయోగంలో, అలోచించే ప్రవృత్తుల్లో మార్పు రావటమే ఆధునికంగా మనం భావించవచ్చు.

ఆధునికనాటకం ఎన్ని రకాల ప్రయోగాలను నిర్వహించిందో, ఆ ప్రయోగాలలో ఎన్ని ప్రమాణాలను వారసత్వంగా పాదుకొల్పిందో స్థూలంగా చర్చించటమే ఈ వ్యాస లక్ష్యం. సంస్కరణ కాలంలో నాటక ప్రధాన లక్ష్యం సందేశం, సందేశ కాలంలో నాటక ప్రధాన ధ్యేయం ప్రయోగం, సమాజంలోని వివిధ ప్రవర్తనల వైవిధ్యమే, రచనల్లోనూ ప్రతిబింబించింది. ఇక్కడ ఒక విషయాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. నాటకమంటే కేవలం ప్రయోగమే

కాదు. ప్రయోగం కేవలం అభివ్యక్తికి సంబంధించింది. రూపకాన్ని ఆకర్షణీయంగా ప్రదర్శించటానికి తోడ్పడే ప్రయోగం యొక్క ప్రయోజనం పరిమితం, అంతకు మించి దానికి ప్రత్యేక పరిగణన ఈయటం అనవసరం. అందుకని ఆధునికత, ప్రయోగం అనేవి ఒక్క రూపానికే గాక, గుణానికి, అంటే నాటక వస్తు లక్ష్యానికి గూడా అన్వయించుకోవాలి. అప్పుడే ఆధునికత అనే దానికి సమగ్రత లభిస్తుంది. రూపాల్లో ఎన్ని వైవిధ్య పోకడలు పోయినా, ఆంతరిక స్వభావంలో నాటకం తన విలువలలో తాను మిగలగలగాలి. అంటే ప్రయోగ వ్యామోహంలో ప్రక్రియ లక్ష్యం బలి కాకూడదూ అని; ఏమైనా వస్తునవ్యత (Topical invention) ప్రవృత్తి పరిణామం (change of function) ప్రతిఘటన ప్రక్రియ (Computer Statement) అనే మూడు పరిణామ మార్పులూ నేటి ఆధునిక నాటక విశ్లేషణలో మనకు కన్పిస్తున్నాయి. సామాజిక వ్యవస్థను సమీక్షించటంలోనూ, సన్నివేశాలను సృష్టించటంలోనూ, విలక్షణమైన, గతానికీ వైవిధ్యమైన ఒక నూతన స్పందన, అవగాహన నేటి నాటకరయితలలో గోచరమవుతున్నది. పాత్రలచిత్త వృత్తుల కల్పనలో, భావావస్థల్లో, స్వభావావస్థల్లో, చివరను రచయితే సందేశంలో ఈ నూతన పరిణామ పోకడను మనం గమనించగలం.

అయితే నేటి ఆధునిక కవిత్వం పట్ల ఏర్పడి ఉన్న అస్పష్టత, ఆధునిక నాటకం పట్ల గూడా ప్రేక్షకుల్లో ఏర్పడి ఉన్నదనేదిసత్యం. అర్థంగాక పోవటమే ఆధునిక కవిత్వ చైతన్యం అని కవులు అనుకొన్నా చెల్లి పోతుందేమో కాని, నాటకం విషయంలో ఈ అస్పష్టతలు, సంక్లిష్టతలు పనికి రావు. ఎందుకంటే ప్రేక్షకుల్తో ముఖాముఖి తలపడే కళాక్రీడ నాటకం, "Difficulty may be does just motivity" అంటూ అస్పష్టతకు నూతనత్వం కూడా కారణం కావచ్చునంటాడు; "ఇలియట్", కాని ఏంజెప్పున్నాడు. ఎవరిని ఉద్దేశించి చెప్పున్నాడు, ఎల్లా చెప్పున్నాడు, అన్న ప్రధాన లక్ష్యాలతో ప్రమాణాలతో నాటక విజయం, ప్రయోజనం ఆధారపడి ఉన్నప్పుడు శిల్పంలో గాని, సంభాషణల్లో గాని, ప్రయోగంలో కాని అస్పష్టతకు ఆస్కారం ఉండగూడదు. ఆధునిక తెలుగునాటకం కేవలం పరిషత్తులకే పరిమితమై ఉండటానికి ప్రధాన కారణం ఈ అస్పష్టతా, దురవగాహననే నన్న విషయం మరిచిపోరాదు.

•••

# ఆధునిక కవిత – కవయిత్రులు

డాక్టర్ ఎం. లావణ్య సరస్వతి

సరస్వతీసతి కంఠహారంలో మణిపూసలై మెరుస్తున్న సారస్వత మూర్తులైన కవయిత్రుల నెందరినో కన్నది తెలుగుతల్లి. అతి ప్రాచీన కాలం నుంచి సంస్కృత ప్రాకృతాది భాషల్లో కవితల నల్లిన విదుషీమణులు తెలుగు గడ్డపై జన్మించారు. తెలుగు సారస్వతాన్ని పండించి తిమ్మక్క, మొల్ల, రంగాజమ్మ, ముద్దు పళని లాంటి వారు అజరామరమైన ఖ్యాతి గడించారు. ఆ సంప్రదాయాన్ని అంది పుచ్చుకుంటూ ఆధునిక కవయిత్రులు వెలుగొందు -తున్నారు. ఆధునిక కవితా వ్యవసాయంలో తమ శక్తి మేరకు కృషి చేస్తున్నారు.

ప్రాచీనాంధ్ర కవిత్వంలో కవయిత్రుల సాహిత్య సృష్టి తత్కాలీన కవితా మార్గానికి అనుకూల మయిందనే చెప్పాలి. సాహిత్య వస్తువు, నిర్మాణం, శిల్పం, లక్ష్యం మొదలైన వాటిలో కవయిత్రుల కావ్యాలు పురుషుల కావ్యాలకంటే భిన్నమైనవి కావు. శృంగార ప్రబంధ రచనతో సహా కవయిత్రుల రచనలు సాగాయి. (ముద్దుపళని రాధికాసాంత్వనము శృంగార భూయిష్ఠంగా ఉన్న దన్న కారణంతో 1911లో రాష్ట్ర ప్రభుత్వం దీని ముద్రిత ప్రతులను స్వాధీనం చేసుకున్నదట).

ఆధునిక కవితను పరిశీలిస్తే మరికొన్ని అంశాలు గమనార్హాలు అవుతున్నాయి. 20వ శతాబ్ది ప్రారంభం నుండి ఆధునిక కాలంగా సాహిత్య విమర్శకులు భావిస్తున్నారు. దాదాపు వంద సంవత్సరాల కాలం ఇప్పుడు పరిశీలనకు వస్తున్నది. ఈ శతాబ్ది కాలంలో ముఖ్యంగా చెప్పదగిన మార్పు సంఖ్యలో కనబడుతుంది. ప్రాచీనాంధ్ర కవయిత్రులు పదిహేను ఇరవై మంది దాదాపు 9శతాబ్దాలలో కనబడితే ఈ శతాబ్దిలో 300 మంది పైగా కవయిత్రులు తేలుతున్నారు. ఇది రాశిలో వచ్చిన మార్పు. దీనికి ప్రధాన కారణం స్త్రీలలో విద్యావంతుల సంఖ్య అధికం కావడం. ఇక వీళ్ళ సాహిత్యంలో కూడా వస్తుపరంగా, ప్రక్రియా పరంగా, శైలీ పరంగా వైవిధ్యం చోటు చేసుకుంది. స్త్రీల మానసిక వికాసం పైనా, సంఘంలో స్త్రీ స్థానం పైనా, స్త్రీల సాహితీ సృష్టిపైనా ఆధునిక సమాజ ప్రభావం ప్రసరించింది. ఈ యుగ ప్రారంభంలోనే భండారు అచ్చమాంబ, పులుగుర్తి లక్ష్మీ నరసమాంబ, కాంచనపల్లి కనకమ్మ, గుడిపూడి ఇందుమతీదేవి, చిల్కపాటి సీతాంబ, కనుపర్తి వరలక్ష్మమ్మ, పాణకా కనకమ్మ, చేబ్రోలు సరస్వతీ దేవి, గిడుగు లక్ష్మీకాంతమ్మ, దేశిరాజు భారతీదేవి, స్థానాపతి రుక్మిణమ్మ, పుట్టపర్తికనకమ్మ, బుర్రాకమలాదేవి , ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ వంటి వారు ఎందరోకవయిత్రులుగా రచయిత్రులుగా ప్రసిద్ధి పొందారు. ఆంధ్ర మహిళా సమావేశాలు , స్త్రీ సభలు, స్త్రీ సమాజాలు ప్రారంభ మయ్యాయి. గుంటూరులో స్త్రీ సనాతన ధర్మమండలి, ఏలూరులో స్త్రీ ప్రార్థనా సమాజము రాజమహేంద్రవరము కాకినాడ విజయవాడల్లో స్త్రీసమాజాలు నెలకొల్పబడ్డాయి. ఈ శతాబ్ది పూర్వార్ధంలోనే స్త్రీల అభివృద్ధికి కృషి జరిగింది. మొనలికంటి రామబాయమ్మ, మోటా రాజబాయమ్మ, కందుకూరి రాజ్యలక్ష్మమ్మ మొదలైన వారు స్త్రీ అభ్యుదయానికి పాటు పడ్డారు. స్త్రీల కోసం ప్రత్యేకంగా పత్రికలు ప్రారంభమయ్యాయి. తెలుగు జనానా, శ్రీబాలిక, ఆంధ్రలక్ష్మి, గృహలక్ష్మి వంటి పత్రికలు స్త్రీ విద్యా ఉద్యమానికి దోహదం చేశాయి. హిందూ సుందరి పత్రికలో ఒకప్పుడు 84 మంది మహిళలు రచనలు చేశారట. ఇది 1902లో స్థాపించబడింది. ఆధునిక యుగాన్ని కవయిత్రుల కవితా అధ్యయనాన్ని ప్రధానంగా రెండు విభాగాలు చేయవచ్చు. ఒకటి స్వాతంత్ర్య పూర్వయుగం, రెండు స్వాతంత్ర్యానంతర యుగం. ఇవి రెండు కూడా రెండు విభిన్న ధోరణులను చూపుతాయి. ఇది కవయిత్రుల జనన కాలాన్ని బట్టి కాదు కవిత్వ అవతరణ కాలాన్ని బట్టి చేసిన విభజన. ఒకే కవయిత్రి స్వాతంత్ర్యానికి పూర్వం

చేసిన రచనలకు అనంతర కాల రచనలకు కూడా భేదం ఉండవచ్చు. ఈ భేదం ముఖ్యంగా వస్తువులో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఉదాహరణకు కనుపర్తి వరలక్ష్మమ్మ గారి ద్రౌపదీ వస్త్ర సంరక్షణము, సత్యాద్రౌపదీ సంవాదము లాంటి కావ్యాలకు ఓటు పురాణానికి ఎంతోభేదం ఉంది కనుక స్వాతంత్ర్యనంతర సాహిత్యాన్ని వేరుగా స్వాతంత్ర్య పూర్వ సాహిత్యాన్ని వేరుగా పరిశీలిస్తే కవితల్లో, కవిత్వతత్వంలో కవయిత్రుల ధోరణిలో వచ్చిన మార్పు స్పష్టపడుతుంది.

ముందుగా స్వాతంత్ర్య పూర్వ కవయిత్రుల కవితలను కొన్నింటిని పరిచయం చేస్తాను.

**కనుపర్తి వరలక్ష్మమ్మ : (ఎ)** సత్యాద్రౌపదీ సంవాదము ద్విపద కావ్యం, మహాభారతానికి అనుకరణ. పాటకు అనువైన రచన. సతీ ధర్మాలు, భర్త అనురాగం పొందడానికి అవసరమైన స్త్రీ ప్రవర్తన, సహనము, అనురాగము, సహృదయతల ఉపదేశం దీనిలో ప్రధానం.

**(బి)** ద్రౌపదీ వస్త్ర సంరక్షణము. ద్విపద. ఇది పురాణానుసరణే.

ఈ రెండు కావ్యాల వల్లా రెండు అంశాలు తెలుసుకోవచ్చు. 1. ఇతి వృత్తాలు పౌరాణికం, 2. రుక్మిణి సత్య ద్రౌపది పతివ్రతా ధర్మాలను ప్రదర్శించడం.

సమకాలీన ఇతివృత్తంతో నవభారతేతి హాసము అను ఓటు పురాణము రచించింది. ఓటు విలువను చమత్కారంగా తెలిపే రచన ఇది. కావ్య శిల్పం కవితారీతి అంతా ప్రాచీన పురాణాల మార్గందే.

**కవిరాణి చిల్కపాటి సీతాంబ :** ఆమె ఆశు కవితకూడా చెప్పగలదట.

**పద్మినీ పరిణయము :** శృంగార కావ్యం, ప్రబంధరీతిలో రచన సాగింది. మనుచరిత్ర వసుచరిత్ర విజయవిలాసాల ప్రభావం అక్కడక్కడ కనబడుతుంది. నాటకాలు కూడా రచించింది. ఒక నవల కూడా రచించిందట. విష్ణుమాయా విలాస నాటకము దిలీప నాటకాలలో సందర్భానుగుణంగా కొన్ని పద్యాలను కూడా రచించింది.

**కాదా చిత్కపద్యాలు;** అనేది ఈమె కవితల సంకలనం. అక్కడక్కడ పత్రికలలో అచ్చయిన పద్యాలు. దీనిలో వస్తువులు కూడా యశోద పుత్ర వాత్సల్యం, తిరుమణి మంటపవర్ణన, రాధాకృష్ణ విలాసము వంటివిగా కనిపించును. కష్టజీవి, చిన్ని గృహలక్ష్మి, వంటివి సమకాలీన వస్తువులు.

**కవితా విశారద కాంచనపల్లి కనకాంబ : జీవయాత్ర** – ఆధ్యాత్మిక కావ్యము. జీవుడనే మారుపేరు కల నిరంజనుడను రాజకుమారుని తీర్థయాత్రల వర్ణన.

అమృత సారము – అద్వైత ప్రధాన కావ్యం.

తోమా లియ – ఆయా సందర్భాలలో రచించిన పద్యాల సంకలనం: ప్రముఖుల జయంతుల వర్థంతుల సందర్భాలలో వివిధ సాహిత్య, స్త్రీల సభలలోను రచించిన, పఠించిన పద్యాలు దీనిలో ఉన్నాయి.

హంస విజయము – నాటకం. పద్యాలు కూడా ఉన్నాయి. వేదాంత బోధకమైన పద్యాలు ఉన్నాయి. అభిజ్ఞాన శాకుంతలం – అనువాద నాటకం.

**కవికలహంసి చేబ్రోలు సరస్వతీ దేవి :**

సరస్వతీ రామాయణం, రామాయణం, ఉత్తర కాండ

శ్రీ సరస్వతీ శతకము, భక్తి వేదాంత రచనలు ఎక్కువ.

**సరస కవయిత్రి గంటి కృష్ణ వేణమ్మ:**

గిరిజాకల్యాణము, పౌరాణికం, ప్రబంధ ఫక్కీలో రచన. సైరంధ్రి....

రాజరాజేశ్వర శతకము : ఇటీవలి కాలంలో అచ్చయింది.

**గిడుగు లక్ష్మీకాంతమ్మ :**

లేఖ దూతం మేఘ దూతం వలె సందేశాత్మక కావ్యం. వస్తువు సాంఘికం ఆమెకు భర్తకు మధ్య జరిగిన లేఖల రూపంలోని కవితారాయబారాలే ఈ పద్యాలు.

లక్ష్మీ శారదాకుమారీ నీతి : కుమార్తెలను అత్తవారిళ్ళకు పంపేటప్పుడు పద్య రూపంగా చెప్పిన నీతులు: గృహిణీ ధర్మాలు, "కష్టసుఖాలు, అతివల బాధ్యతలు దీనిలో వస్తువులు. ' నా కూతుల తమ యత్త వారిండ్లకు పంపు నెడ నేను వారి కెక్కుడు ధనధాన్యము లీయలేకున్నను, నాయాశీర్వచన పురస్సరంబులగు నైతిక మార్గముల నుద్బోధించు వాక్యములను పద్యరూపమగు కాన్కగనిచ్చిన వారి మానసవీథులందు శాశ్వతముగా నిలచియుండి సఫలీ[1] కృతము కాగలవను ఉద్దేశ్యముతో నేనీ పద్యములు వ్రాసితిని".[1]

లక్ష్మీశారదాసుభాషితం : నీతి బోధకం. శతకం లాంటిది. **జంటకవయిత్రులు** వదిన మరదళ్ళు లక్ష్మీశారదలు. లక్ష్మీకాంతమ్మ మరదలు జొన్నల గడ్డ శారదాంబతో కలిసి ఈ కవిత్వరచన చేశారు.

**మధురకవయిత్రి స్థానాపతి రుక్మిణమ్మ :**

పూలమాల : కవితా సంకలనం. ప్రాచీన కవితామార్గం లోనే రచనసాగింది. ఇందులో కొన్ని పౌరాణిక ఖండికలతో పాటు కొన్ని సాంఘిక వస్తు భరితాలు కూడా ఉన్నాయి.

చందమామ, ఆంధ్రభూమి, వంటివి ఒకటి రెండు భావకవితా మార్గంలోని ఖండికలు.

కాదంబిని : ఖండ కావ్యము, దీనిలోనూ, మధుపాత్ర పువ్వులు, కన్నీరు, వంటివి భావకవితా వీచికలే.

అమృత బిందు : వేదాంత ధోరణిలోని రచన. చారుదత్త వత్సరాజు, నాటికలు

**దేశిరాజు భారతీదేవి :**

కాంతాశతకము : మహిళలకు ఉపదేశాత్మకం. ఇందులో దైవభక్తి, దేవుని వర్ణన, ఆరోగ్య ప్రాధాన్యము, స్త్రీ విద్య వినయసంపద, పతివ్రతా ధర్మము, సత్ప్రవర్తన, గృహిణీ ధర్మాలు ప్రధానాలు.

ఖద్దరు ప్రశస్తి లాంటివి సమకాలికాలు. వీటికి తోడుగా స్త్రీలకు కొన్ని కట్టుబాట్లను కూడా రచయిత్రి సూచించడం జరిగింది.

నవరత్నమాల : ప్రశంసావద్యాలు, గృహలక్ష్మి పత్రికాధిపతులను గూర్చి

ఇలా చాలా మంది రచయిత్రులు ఆ కాలంలో రచనలు చేశారు. మచ్చుకు మాత్రం కొందరు రచయిత్రుల రచనలను పేర్కొనడం జరిగింది. స్థలాభావం వల్ల ఇక్కడ కొందరివే రచనలు చూపాను. అయినా ఆనాటి స్త్రీల రచనల తత్త్వాన్ని పరిచయం చేసుకోవడానికి ఇవి దోహదం చేస్తాయి. ఈనాటి స్త్రీల యొక్క సాహిత్యాన్ని పరిశీలిస్తే ఆనాటి సాహితీ ప్రవాహపు ఉరవడిలోనే వీరూ పయనించినట్లు గమనించవచ్చు. భావకవిత్వపు ఛాయల్లోనూ రచనలు చేసిన కొద్ది మంది ఉన్నారు. కాని స్త్రీ జనాభ్యుదయ మార్గంలో సభలు, సమావేశాలు, ఉపన్యాసాలు, పత్రికలలో వ్యాసాలు, చర్చలు జరుగుతున్న ప్రభావంగా స్త్రీలకు నీతులు ధర్మాలు, విద్యావశ్యకతలు బోధిస్తూ కొన్ని రచనలు వచ్చాయి. స్త్రీ గుణ గణాలను పతివ్రతా ధర్మాలను వ్యక్తం చేస్తూ రచనలు సాగాయి. వీరి రచనా విధానాన్ని వస్తువును, రీతిని పరిశీలించగా ప్రస్ఫుటంగా కనిపించే రీతిని, లక్షణాలను బట్టి కావ్యాలను క్రింది విధంగా క్రోడీకరించవచ్చు.

1. **పౌరాణికాలు :** పురాణ ప్రశస్తి, పురాణ వస్తువులను స్వీకరించడం చూడవచ్చు. ఉదా: అంబరీష విజయం, లక్షణాపరిణయం, రాజరాజేశ్వరీ శతకం, నరసింహ శతకం.
2. దైవభక్తి ప్రేరకాలు **:** భక్తి శతకాలు, నోములు వ్రతాల ప్రశస్తి, పతివ్రతల కథలు అనేకం రచింపబడ్డాయి.
3. స్త్రీ ధర్మ ప్రబోధాలు **:** స్త్రీలకు నీతులు, పతివ్రతా ధర్మాలు, కుటుంబధర్మాలు బోధించే రచనలు, తరుణీ శతకం, కాంతిశతకం లాంటివి.

*1. స్వర్ణ కంకణ గ్రహీతలయిన కవయిత్రులు - వారి కావ్యాలు. లో పేజీ 329లో ఉల్లేఖించబడింది. రచయిత్రి డా॥ జి. సుమిత్రాదేవి.*

4. **స్త్రీ విద్యా బోధకాలు :** ఆనాటి కవయిత్రుల కావ్యాలలో ప్రతిబింబించిన స్త్రీల సమస్య ఇది ఒక్కటేనని చెప్పవచ్చు. స్త్రీలు తమ సమస్యలను తాముగా చెప్పుకున్న సందర్భం పూర్వార్ధంలో ఇది ఒక్కటే. స్త్రీలు ఆనాడు విద్యావకాశాలు ఎక్కువగా లేక విద్యాభిమానం ఉన్నా కూడా నిస్సహాయంగా ఉన్నారు. వీరేశలింగం గారితో ప్రారంభమైన స్త్రీ విద్యా ఉద్యమానికి స్త్రీలు పొందిన స్పందన వారి రచనల్లో విస్తృతంగా చూడవచ్చు. తాము రచిస్తున్న కావ్యవస్తువు ఎటువంటిదయినా సందర్భం వచ్చినపుడు స్త్రీ విద్యను గూర్చి కవయిత్రులు ప్రస్తావించక విడువలేదు.

మచ్చుకు కొన్ని ఉదాహరణలు : కొటికలపూడి సీతమ్మగారు 'అహల్యాబాయి'లాటి చారిత్రక కావ్యంలో కూడా "స్త్రీలు విద్య నేర్వజెడిపోదురను మాట కల్ల" అని అంటారు.

వేమూరి శారదాంబగారు 'మాధవశతకం'లో స్త్రీల అవిద్యను ప్రస్తావించారు. గొల్లల చల్లవాడుకను గోడల మీద గీతలుగా గీసుకోవడం, చాకలి బట్టల లెక్కను తాడుకు ముళ్ళుపెట్టి, వూడదీసి లెక్కించడం లాంటి అవిద్యా చిహ్నాలు తొలగి పోవాలని ఆశించారు.

5. **దేశభక్తి :** ఇది ఆనాటి జాతీయోద్యమ ప్రభావంతో వచ్చిన కవిత్వం. పురుషులతో పాటు స్త్రీలు కూడా దేశభక్తి దాయకాలయిన రచనలు చేశారు.

6. **గాంధేయ కవిత :** గాంధీ ప్రశస్తి, అహింసా, ఉప్పు సత్యాగ్రహము, రాట్నము, ఖద్దరు ప్రశస్తి లాంటివి. ఆనాడు కవయిత్రుల కలాల నుండి కూడా జాలువారాయి. శ్రీమతి రాజేశ్వరి లవణసాగర మథనము ఈ కోవకు చెందిన రచనలలో ఒకటి.

7. **భావకవితారీతి :** చావలి బంగారమ్మ, విశ్వ సుందరమ్మ, లక్ష్మీ కాన్తమ్మ, రాజ్యలక్ష్మి, మొదలైన వారెందరి రచనలలోనో భావకవితా ఛాయలు కనబడతాయి. అయితే భావకవుల ప్రభంజనం కొంత పురుషుల్లో సద్దుమణిగాక కవయిత్రులు అందిపుచ్చుకున్నట్లు తోస్తుంది. నిరీక్షణ విరహిణి, వియోగిని, కొండవీడు, పసుల కాపరి బాలిక ఇలాంటి శీర్షికలన్నీ భావకవుల మార్గాలే. స్మృతి గేయరచన కూడ వీరు అనుసరించారు.

మొత్తం మీద ఈ సాహిత్యాన్ని చూస్తే ఛందస్సు ప్రాచీన సంప్రదాయ మార్గానిదని గమనించవచ్చు. బ్రహ్మ సమాజ ప్రభావం జాతీయోద్యమ ప్రభావం కవయిత్రుల మీదకూడా ప్రసరించింది. ప్రబంధ రీతి, శైలి, వర్ణనల ప్రభావం చాలా కావ్యాలలో కనబడుతుంది. ప్రాచీన సాహిత్య సంప్రదాయాలను అనుసరిస్తున్న రచనలే అధికంగా వచ్చాయి.

## స్వాతంత్ర్యానంతర సాహిత్యం

కనుపర్తి వరలక్ష్మమ్మగారి ఓటు పురాణము లేక నవభారతేతి హాసము. ఇది ఓటు విలువను చాటి చెప్పే రచన. ఇది ప్రాచీన ఫక్కీలో నూతుడు, శౌనకాదిమునులు కథ చెప్పడం, వినడం లాగానే ప్రారంభించి చెప్తారు. అయితే విషయం సమకాలీనం. అప్పుడే వచ్చిన స్వాతంత్ర్యం ఎన్నోకష్టనష్టాలు ఎదుర్కొని, ఎందరో జీవితాలను త్యాగాలు చేసి సాధించిన స్వాతంత్ర్యం దాని విలువ ఆనాటి తరానికి తెలిసినంతగా తరువాత తరాలకు తెలీదేమో. ఏదైనా కష్టపడి సంపాదించినది విలువైనది. ఊరికే వచ్చినది విలువ తక్కువదే. అయితే ఈ కావ్యం చెప్పే సత్యాలు ఆనాటికి ఈనాటికీ కూడా వర్తించేవే. దేశంలో ఐకమత్యం అత్యవసరం అదిలేకపోతే అనర్థం తప్పదు. మనలో మనకున్న చీలికలే మనలను ఇతరులు నష్టపరిచేందుకు అవకాశం ఇస్తాయి. కొయ్యను చీల్చడానికి కొయ్యే సహకరిస్తుందని ఈ కవయిత్రి చక్కని ఉపమానంతో చెప్తారు.

గండ్రగొడ్డలి పదునెంత కల్గియున్న కొయ్యపడిలేక

కొయ్యను కొట్టగలదె. దీనిలో అనంతమైన భావుకత, సునిశితమైన పరిశీలన ఉన్నాయి.

**ఊటుకూరి లక్ష్మీ కాన్తమ్మ :** సంస్కృతంలో కూడా కావ్యాలు వ్రాసిన పండితురాలు ఈమె. హిందీ నుంచి కొన్ని అనువాదాలు కూడా చేశారు. 'కన్యకమ్మ నివాళి', 'మా తెలుగు మాంచాల' 'లజ్జా కిరీట ధారిణి' 'కాంతి శిఖరాలు', ' ఒక చిన్న దివ్వె' 'మనసాహితి – మధుభారతి' లాంటి రచనలెన్నోచేశారు. 'సరస్వతీ సామ్రాజ్యమ్' ఇటీవలి వీరి రచన. 1960 నాటి రచన 'లజ్జా కిరీట ధారిణి'. భారత స్త్రీకి వినమ్రత అనేది కిరీటం లాగా తలచి వినయం, సౌశీల్యం కలిగిన వనితలను ఎందరినో గూర్చి వీరు చెప్పిన కవితల సంకలనం ఇది. 1978 లోని 'కాంతి శిఖరాలు' గీతాంజలి ధోరణి లోని భావ కవితా సంకలనం. ఆత్మాశ్రయ భక్తి భావగీతిక ఈ రచన. 'ఒక చిన్న దివ్వె' (1980) ఈ నాటికీ గాంధీజీపై రచయిత్రికి గల గౌరవాన్ని సూచిస్తుంది. మహాత్మునికి కృత్యంజలి ఈ కావ్యం 'మనసాహితి – మధుభారతి' తెలుగు సంస్కృతీ సాహిత్యాల పట్ల కవయిత్రికి ఎంత అభిమానమో ఈ రచన తెలియజేస్తుంది.

'తెలుగు మాట తెలుగు పాట
తెలుగు సంస్కృతి యన నాడలు పులకించును'

అని కవయిత్రి పరవశం కమనీయంగా వెలువడిన రచన ఇది.

నాయని కృష్ణకుమారి : అగ్నిపుత్రి, ఏం చెప్పను నేస్తం అన్న కవితా సంకలనాలు వెలువరించారు. వస్తు వైవిధ్యం, వచన కవితారీతి ఈవిడ ప్రత్యేకత. హింసానిరసన మానవతావాదం,రాష్ట్ర ఐక్యత, సంప్రదాయ గౌరవం సంస్కార ప్రీతి, వాస్తవిక సమాజ చిత్రణ, విప్లవ నిరసన శాంతి ప్రియత్వం, లాంటి ఆధునిక కవితా లక్ష్యాలన్నీ కృష్ణకుమారి గారి కవితలో దర్శన మిస్తాయి.

'కళ్ళు రెండూ విప్పి
చుట్టూ పరికించి చూడు ' అన్నతత్త్వం స్పష్టంగా కనబడుతుంది.

'మనసు ముసలమ్మ
వేలు మీద గోరుచుట్టుకు మందు వేసుకునే మాటమానేసి
మండగా తెగ్గోసుకునే
మనసు ముచ్చట్లు' కవయిత్రి వెలువరిస్తారు.

పాడే కొయిల'లు లో బాలల దినోత్సవాన్ని రసవత్తరంగా వర్ణించారు. ఆ బాలల దినోత్సవంలో నిర్భాగ్యులు దురదృష్టవంతులు అయిన బాలల చిట్టి చేతులను వెదకడం ఈవిడ భావౌన్నత్యానికి నిదర్శనం. ఆ చేతులు

"ఏది పడితే అది అమ్ముకునే
అతి చిన్న ఆరిందా చేతులు" అని వర్ణిస్తారు.

"మసి బూసి మారేడుకాయ చేసే మహా ప్రభువులు మంత్రాంగాలు నడుపుతున్నారు......." అంటారు. ఒకచోట బాధ్యతల్నిమరచి హక్కుల కోసం తన్నుకోవడం నిరసించారు. 'అగ్నిపుత్రి' లోకంటే 'ఏం చెప్పను నేస్తంలో ఈ కవయిత్రిలో పరిణత స్పష్టంగా కనబడుతుంది.

**చుండూరు రమాదేవి :** స్త్రీ సహజమైన కోమల భావ లహరితో రచనలు చేయడం వీరి లక్షణం. 'దాంపత్య' మనే కావ్యంతో దాంపత్య ధర్మాన్ని మంజులంగాచెప్పడం చూడవచ్చు.

'విరులలో వాసనల్ విరిసిన యట్లు
మాటలో అర్థంబు మణిగియున్నట్లు
తంత్రిలో నాదంబు దవిలియున్నట్లు
గీతిలో భావంబు గిలుబుకొన్నట్లు
ఒండొరుల భావంబు లొక్కటై పొలు పొంద
అదిగదా దాంపత్య మాదర్శమై యుండు'

కోమల భావాభివ్యక్తి ఉన్నా వస్తు విషయంగా

చెప్పుకోదగ్గ విశేషాలు లేవు. 'విరుల సరులు', రాఘవేశ్వర శతకం' వీరి మరి రెండు రచనలు.

**పుట్టపర్తి కనకమ్మగారు :** స్త్రీ స్వభావాన్ని చూపే రచన చేసిన మరొక కవయిత్రి ఈవిడ. స్త్రీ సౌకుమార్యము, కోమలత్వములతో పురుషుడికి ఛాయా మూర్తిగానే నిలబడుతున్నది. ఆమెకు ప్రత్యేక భావాలు, హృదయ స్పందన ఉన్నా కవులకు కనబడలేదా? తెలీదు. కాని కనకమ్మగారు విస్మృత స్త్రీల వెంట తనకలాన్ని నడిపారు. తన ప్రత్యేకతను నిలుపుకున్నారు. బుద్ధుడు భార్యను వీడి వెళ్ళాడు. భగవంతుడిగా కీర్తి ప్రతిష్ఠలు పొందాడు. మరి యశోధర మాటేమిటి. ఆమె మరుగున పడిపోయింది. ఆ యశోధర మా కవయిత్రికి కావ్యవస్తువయింది.

"అతడు బ్రహ్మర్షియని జగం బధిక భక్తి బాడినది.....
వాడి వత్తలైన భవదీయ చరితమేమయ్యెనమ్మ"

అని వీరు ప్రశ్నించారు. అలాగే ద్వితీయ వనవాస 'దుఃఖిత సీత' మరొక వస్తువు.

హృదయమే లేని రాముండు ప్రేమమయిని
విడిచినాడు చాకలివాని నుడుల కొగ్గి
హృదయముండిన సీత జీర్ణించుకొన్న
దాత్మదుఃఖంబు దయితుని యశము కొరకు.

భర్త, భర్తకీర్తి ప్రతిష్ఠలు భార్యలకు గర్వకారణం. కనుకనే సీతమ్మ తన భర్త యశస్సు కొరకు తన దుఃఖాన్నంతా గుండెల్లో దాచుకుంది అంటారు ఈ కవయిత్రి. ఏదయినా విస్మృత స్త్రీల కోణంలో నుంచి ప్రాచీన వస్తువులను దర్శించి ఒక ప్రత్యేకతను ఈవిడ చూపారు.

**ముక్కామల అనంత లక్ష్మి :** శ్రీనివాస శతకము 1977 నాటి రచన. ఈ రచన కవయిత్రులలో ప్రాచీన ధోరణి ఇంకా కొనసాగుతున్న దనడానికి మచ్చుతునక. ప్రాచీన ఛందస్సునే వీరి కొనసాగించారు.

నోము పూజలనను మ గోముతో చేతురే
సాటివాని కింత సాయపడరు
ఎంచదయను మించు మంచి గుణము లేదు
శేష శైల వాస శ్రీనివాస

ఇలా ఒకటి రెండు సందర్భాలలో దయ, మానవత్వం గూర్చి చెప్పారు. మత కల్లోలాలను, వర్ణ విభేదాలను నిరసించారు. కాని ప్రధానంగా ఇది భక్తి శతకమే.

**పరుచూరి భువనేశ్వరీ దేవి – అన్నపూర్ణాదేవి :** వీరు జంట కవయిత్రులు. (వీరితో ఈ కాలంలోని జంట కవయిత్రుల సంఖ్య నాలుగయింది.) ద్రోణం రాజు లక్ష్మీ బాయమ్మ - పోణకా కనకమ్మ; గిడుగు లక్ష్మీ కాంతమ్మ - జొన్నల గడ్డ శారదాదేవి; వాస్తవికత తొంగిచూచే రచనలు వీరు చేశారు.

"కడుపు నిండార త్రాగంగ గంజి లేదు
కట్టు కొనుటకు చింపిరి బట్ట లేదు
నిద్రవచ్చుచో జానెడు నేల లేదు
దీన హరిజన **స్థితి యిదె** తెలుగుబిడ్డ'

'తెలుగుబిడ్డ' అన్న కవితలో గాంధీజీ హరిజనోద్యమ ప్రభావంతో హరిజనులపై సోదరభావాన్ని వ్యక్తం చేయడం కనబడుతుంది. (వస్తువును బట్టి ఇది పూర్వయుగానికే చెందుతుంది. రచనా కాలం తెలీదు)

**అయ్యదేవర బాలా త్రిపుర సుందరమ్మ :** హాస్య రచనలు కూడా స్త్రీలు చెయ్యగలరని చూపించారు. వ్యంగ్యం, హాస్యము మిళితం చేస్తూ 'బాబూ బ్రదికితిమి' అనే కవితలో టీచర్ ట్రైనింగ్ గూర్చి ఇంగ్లీషు పద ప్రయోగంతో పాత ఛందస్సులో సునాయాసంగా చేసిన రచన ఈమె శక్తిని చక్కగా చూపుతున్నది.

ఏ బ్యాచినడుగునో, యెవరినో యను భీతి
గొలుపు క్రిటిసిజముల్ తొలగిపోయె
వ్రాసిన దానినే రామకోటిగ వ్రాయు
నబ్జరు వేషను అంతరించె,
పాడిన పాటనే పాడించు నీ నోట్సు
ఆవులెసన్సుల హంగులుడిగె,
తలవని తలపుగా తగిలెడు టీచింగు
వర్కు బాధలు కూడ ప్రాతవడియె,

వేళపాళలు లేని డ్రిల్ వెనుక బడియె
గడిచె డాక్టరు సర్టిఫికెట్ల బాధ.
బ్రదికితిమి, జీవుడా! శాంతపడగదోయి !
గడచిపోయెను ట్రైనింగు గండ మహహ !

తురగాజానకీరాణి, కొత్తపల్లిలలిత స్మృతి కవితలో రససిద్ధి కలిగించారు. జ్యోతిర్మయి 'భావన', 'దీప్తి' కవితా సంకలనాలలో మానవతా దృష్టిని వెలిబుచ్చి సామాన్య మానవుడి కష్ట సుఖాలకే తమ కవితను అంకితమిచ్చారు. ఎస్. పద్మావతి గారు 'మనిషి – మనస్వి' లో ఆలోచన – అనుభూతి కలగలిపిన రచనలు చేశారు. శారదా అశోక వర్ధన్, వాసా ప్రభావతి కవితలలో వస్తువైవిధ్యాన్ని ప్రదర్శిస్తూ సమకాలీన సమాజాన్ని చూపించారు.

వి.బిలక్ష్మి కలంలో వ్యంగ్యం, తీవ్రత, హేతువాద ధోరణి కవితారూపం పొందాయి. వాస్తవిక సమాజంలోని అవకతవకలు అందంగా కవితామయం చేయడం ఈ కవయిత్రి ప్రత్యేకత.

'స్లోపాయిజన్' అన్న ఖండికలో ఈనాటి రాజకీయవ్యవస్థను వ్యంగ్యంగా చూపించారు.

"పాత నాయకులు చేసిన పనులు
కొత్త మంత్రులు చెరిపేయడమే మార్పు.

అలాగే ఫెస్టివల్ అడ్వాన్సులు కూడా స్వానుభవంతో కవితా వస్తువులయ్యాయి.

"చిన్న కుటుంబం సినిమాకి వెళ్తే మాత్రమే
బొటా బొటీగా సరిపోయే ఫెస్టివల్ అడ్వాన్సు.

ఉద్యోగినులయిన స్త్రీలు కవిత్వం వ్రాయడానికి పూనుకోవడం వల్ల ఇలాంటి ప్రస్తావనలు వాస్తవానికి దగ్గరగా వచ్చాయి.

రేవతీ దేవి 'శిలాలలిత' అస్తిత్వ వాద ధోరణిని అనుభూతి ప్రాధాన్యాన్ని చూపుతుంది. కొండేపూడి నిర్మల చక్కని చిక్కని కవిత్వం రచించే కవయిత్రి. జయప్రభ 'వామనుని మూడో పాదం' స్త్రీల ప్రత్యేక ముద్రగల కవిత్వాన్ని ప్రదర్శిస్తుంది. స్త్రీల కోణంలోనించి సంఘటనలను సమర్థవంతంగా దర్శించారు ఈ కవయిత్రి. పావని మినీకవిత్వ ధోరణిలో మెరుపులాటి భావాలను మెరిపించారు. అల్పాక్షరాలలో అనల్పార్థ రచనలో కూడా స్త్రీల ప్రావీణ్యాన్ని చూపారు. ఈ విధంగా కవయిత్రులు మహాకావ్య నిర్మాణం నించి మినీ కవితల దాకా తమ కవితా ప్రస్థానాన్ని కొనసాగించారు. అయితే ఆధునిక సాహిత్యాన్ని మొత్తంగా పరిశీలిస్తే స్త్రీలు నవలలను రచించడంలో అత్యున్నతమైన స్థానాన్ని ఆక్రమించారు. రాశిలో అధిక సంఖ్యలో నవలలు వ్రాసి స్త్రీకి నవలకి అభేదమున్న స్థితిని చేరుకున్నారు. నవల అంటే నిజంగానే ఒక అర్థం స్త్రీయే కదా. ఆ పదాన్ని సార్థకం చేశారు. ప్రతి చిన్న సంఘటనను, సమస్యను, అనుభవాన్ని నవలకు వస్తువుగా గ్రహించారు. ఇంత సూక్ష్మాతి సూక్ష్మమైన వస్తు వైవిధ్యం కవితల్లో ప్రదర్శించలేదు. దీనికి కారణాలు అనేకం ఉండవచ్చుగాని ప్రధానంగా చెప్పదగ్గవి మాత్రం నవల అధిక జనాదరణీయం కావడం, సామాన్య, మధ్యతరగతి, సాధారణ విద్యావంతులైన పాఠకులకు సహితం అందుబాటులో ఉండడం, వేగంగా చదివించే శక్తి ( readability ) కలిగి ఉండడం, వివిధ పత్రికలు ప్రచురించి ఆదరించడం లాంటివి అని భావించవచ్చు. ఈనాటి అసంఖ్యాక నవలా రచయిత్రుల మధ్య నవలా రచయితలుగా పేరు పడ్డ పురుషులు కొందరు ఉన్నారు. కాని కవులుగా ఆధునిక కాలంలో పేరు పడ్డ

పురుషుల మధ్య కవయిత్రులుగా ప్రసిద్ధి పొందిన స్త్రీలు మాత్రం నవలా రచయితలతో పోల్చి చూచినపుడు స్వల్పమని అంగీకరించకతప్పదు. కవయిత్రులుగా స్థిరపడిన స్త్రీల సంఖ్య చాలా తక్కువ. ఇలా కొందరు కవులు వాస్తవ సమస్యలను అందులోనూ స్త్రీల సమస్యలను కవితావస్తువులుగా రమణీయ కావ్యాల నల్లారు. స్త్రీల సమస్యలకు సాహిత్యంలో స్థానం లభించటం ఆధునిక భావకవితా యుగంలోనే ప్రారంభం అయింది.

**సారాంశం – ఉపసంహారం**

ఈ పరిశోధన వ్యాసంలోని పై పరిశీలనల వల్ల తేలే అంశాలనిలా క్రోడీకరించవచ్చు.

1. స్త్రీల సమస్యలను ముందుగా బయలు పరచిన వారు పురుషులు.
2. ఆ సమస్యలను కవితల్లో పొదిగి నలుగురి లోకి రసమయంగా తెచ్చినవారు పురుషులు.
3. ప్రాచీనకాలంతో పోల్చి చూస్తే ఈ యుగంలో స్త్రీలలో విద్యావంతుల సంఖ్య అధికం.
4. అయితే వారిలో తమ సమస్యలను తాము కవితా రూపంలో చెప్పినవారు తక్కువ. కవయిత్రులున్నారు. కవితలు వ్రాశారు కాని తమ సమస్యలను వస్తువులు చేసికాదు.
5. స్త్రీలకు తమ సమస్యలను వ్యక్తం చేయడానికి కవిత్వం కాక ఈ యుగంలో లభించిన నూతన వచన ప్రక్రియలు నవల, కథానికా అధికంగా తోడ్పడ్డాయి.
6. ప్రసిద్ధులయిన స్త్రీలున్నారు. కాని కేవలం కవిత్వం వల్ల కవయిత్రులగా ప్రఖ్యాతి పొందిన స్త్రీలు అరుదు.

యుగకర్తలలాగా ప్రభావ పూరితమైన కవితలు స్త్రీలు చేయలేదేమో అనిపిస్తుంది. అంటే సాహిత్య యుగం మీద తమ ప్రభావాన్ని చూపి తన వెంట కవిత్వాన్ని కవులను నడిపిన ఘనత ఇంకా స్త్రీలు పొందలేదు. నవలల్లో తమ ప్రత్యేక ముద్రని వేశారు. మత్తు జల్లే మార్కు నవలలు, ఊహా ప్రపంచాల నవలలు, వంట యింటి నవలలు, రంగనాయకమ్మ మార్కు, యద్దనపూడి మార్కు ఇలా ఏదో ఒక ప్రత్యేక ముద్ర సాహిత్యం మీద వేసినట్లు కవిత్వవిషయంలో జరగలేదు. అధిక సంఖ్యలో కవితా ఉద్యమాల వెల్లువల ప్రభావంతో వాటికి దగ్గర పోలికలతో కవిత్వం వ్రాశారు కాని కవిత్వంపై బలమైన ముద్ర వేయలేదు. దీనికి బలాన్ని ఇచ్చే ఒక వాస్తవ విశ్లేషణని ఇక్కడ ఒకటి చూపుతాను. కేసరిగారు నిర్వహించిన స్వర్ణ కంకణ గ్రహీతలలో 1934 నుండి 1986 వరకు 38 మంది బహుమతులు పొందారు. వీరిలో పన్నెండు గురు మాత్రమే కవయిత్రులు. "వారి లోనూ పాత తరానికి చెందిన వారే ఎక్కువగా ఉండటం గమనార్హం. 1934–55 మధ్య బహుమతి పొందిన 14 గురిలో 9 మంది కవయిత్రులుండగా తరువాతి కాలంలో బహుమతి పొందిన 24 గురిలో ముగ్గురే కవయిత్రీగా గోచరిస్తారు. 1956 నుంచి నవలా రచయితలుగా, కథకులుగా ప్రసిద్ధి పొందిన వారికే బహుమతులు వచ్చాయంటే ఆ రంగంలో స్త్రీల ముందంజ వెల్లడవుతున్నది"[1].

*1. "గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీతలైన కవయిత్రులు – వారి కావ్యాలు". – డా. జి సుమిత్రాదేవి. పీఠిక పేజీ 5.*

●●●

# తెలుగు ఋతువులు – విశ్వనాథ, శేషేంద్ర

– శ్రీ పి.ఎ.వి. వల్లభాచార్యులు

తెలుగులో ఋతువర్ణనలు ప్రధానంగా వున్న కావ్యాలు చాలా వచ్చాయి. కానీ ఆధునిక కాలంలో వెలువడిన యిలాంటి కావ్యాలలో రెండింటిని మాత్రమే యీ ప్రసంగవ్యాసంలో చర్చిస్తాను. అవి కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి 'తెలుగు ఋతువులు', యుగ కవి శేషేంద్ర "ఋతుఘోష".

ఈ రెండు పుస్తకాల గురించి చర్చించబోయే ముందు మనం ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఈ ఇద్దరూ ప్రాచీన సాహిత్యాన్ని కూలంకషంగా అధ్యయనం చేసినవారే. మనకు ఆదికావ్యంగా వున్న ఆంధ్రమహాభారతంనుండీ ఋతువర్ణనలు వస్తూనే వున్నాయి. నన్నయ వసంతవర్ణనం నాదమయమై పులకరింపచేస్తుంది – చూడండి –

"కమ్మని లతాంతములకు మ్మొనసి వచ్చు మధుపమ్ముల సుగీత నినదమ్ము లెసగెం జూ
తమ్ముల సత్కిసలయమ్ముల సుగంధి ముకుళమ్ములను నానుచు ముదమ్మొనర వాచా
లమ్ములగు కోకిలకులమ్ములరవమ్ము మధురమ్మగుచు విన్చె ననిశమ్ము సుమనోభా
రమ్ముల నశోక నికరమ్ములును చంపక చయమ్ములును కింశుకవనమ్ములను నొప్పెన్"

ఈ పద్యం లోని ద్విత్వమకారనాద సాంతత్యం వల్ల భ్రమరధ్వానస్ఫూర్తితో, నాదమాధుర్యంతో ఒకానొక హృద్య వాతావరణం కల్పితమవుతుంది. శబ్ద శక్తితో బొమ్మలు గీసే విద్య నన్నయది. అనంతర కాలంలో వెలువడిన ఎన్నోకావ్యాలలో ఋతువర్ణనలున్నాయి. ప్రబంధాలలో అదో తప్పనిసరి నిబంధనా అయిపోయింది. అయితే ఋతువుల సౌందర్యంతో పాటు బ్రతుకుల పాట్లు కూడా చెప్పిన కవి ఒకడున్నాడు. మనిషిలోని మనోవికారరేఖను కూడా ఆయన బయట పెట్టాడు. ఆయనే కృష్ణదేవరాయలు.

ఎండాకాలంలో దాహంతో అల్లార్చుకు పోతూ చలివేంద్రం దగ్గరకు 'అమ్మా', 'అక్కా' అని పిలుస్తూ దీనంగా వచ్చి కొద్దిగా నీళ్ళు తాగడం తోటే వడ దెబ్బ నుండి తేరుకొని నీళ్ళు పోసే యువతులను – అంతకు ముందే 'అమ్మా' అనీ, 'అక్కా' అనీ పిలిచామన్నది మరచి – వారి అంగాంగ సౌందర్యాన్ని నీళ్లతో పాటు గ్రోలే మనిషి దుశ్చింతనను యిలా చెప్పాడు రాయలు.

"తొడిబడ నమ్మలక్కలని తూలుచు దీనత దోయిలొగ్గుచున్
వడమటి తేరఁదేర నల వాక్యము లెన్నక మేను గుబ్బలన్
గడుకొను కక్ష దీధితు లెగాదిగ గన్గొను చిట్టకంపుఁద్రాఁ
గుడుగని సన్నలన్నగిరి కొందఱు పాంథుఁ బ్రపాపాలికల్"

వర్షాకాలంలో వంట ఎంత ప్రయాసతో కూడినదో చూడండి –

ఇల్లిల్లు దిరుగ నొక్కింతబ్బుశిఖి, యబ్బె – నేనింటిలో, బూరి యిడి విసరక
రాజదు రాజిన రవులు కొల్పాసలె, – గాని కల్లదు గూడు దానఁ, గలిగె
నేని కూరగుటమందైన, బెన్పొగ నుఖ – భుక్తి సేకూర, దా భుక్తి యిడిన
బ్రాగ్భోక్తలకె తీఱు బహుజనాన్నము, దీఱ – నారుల కొదవుఁ బునః ప్రయత్న (ము)

ఒక్కో ఋతువుకూ ఒక్కొక్క వైశిష్ట్యం వుంది, సౌందర్యం వుంది. భోగమూ వుంది – కష్టమూ వుంది. పద్య విద్యలో నన్నయ, రాయలు రెండు మార్గాల వారు, వారి చూపు వేరు. నన్నయ ప్రకృతి వర్ణనానికి పరిమితమయ్యాడు. రాయలు ప్రకృతితో పాటు ప్రజలపాట్లు చూశాడు. ప్రబంధాలలో పుష్పలావికలుంటారు. ఆ పూలతోటలు వారివి కావు. పూలుకట్టే దారాలే వారివి – ఆ సంగతి తరువాత చూద్దాం. ఇదంతా ప్రస్తుత కవిద్వయ ఋతు సంహారాలకి నేపథ్యం.

**తెలుగు పండిన గుండె విశ్వనాథ :** విశ్వనాథ సత్యనారాయణ గారి కావ్యం 'తెలుగు ఋతువులు'. దీనిలో అధిక భాగం అర్థం కావాలంటే తెలుగు గ్రామీణ జీవనంతో పరిచయం వుండాలి. పంటలు, తోటలు, కాల్వలు యివన్నీ అనుభవించి వుండాలి. ఇవి కేవలం తెలుగు ఋతువులు, తెలుగుతనం పండించుకున్న గుండెలో విరిసినవి. మొదటి ఋతువు వసంతాన్ని విశ్వనాథ ఎలా ప్రారంభించారో చూడండి.

పరిచయానుద్రిక్త పరిరంభసమయాన
    ప్రియురాలి యెద చెమరించినంత
శీతోదక స్నాన జాత సౌఖ్యము పైని
    ముకుపుటాన చెమర్పు పుట్టినంత
పేరంటమునకేగు పిన్నబాలిక వాలు
    జడమల్లెమొగ్గ కన్పడిన యంత
వంగిన వేప కొమ్మం గావిచిగురీన
    పజ్జ యీనెకు బూత పట్టినంత

ఒక దినాన హఠాత్తుగా జికిలి కూహు
కుహువు ప్రొద్దెక్కి దూరపు గొన నుండి
సాగి వినవచ్చినంత వసంత మరుగు
దెంచెనను మధురోహ స్ఫురించె లోన.

కవికి వసంతం వచ్చినదనే మధురోహ "స్ఫురించి" నదట! మనం నగరాల్లో వసంతాన్ని గుర్తు పట్టడానికి ఎక్కడో దాక్కున్న మావిపూత కనిపించాలి. నిజానికి మనకు వసంతమైనా, శిశిరమైనా తేడా లేదు. కానీ కలుషితం కాని పల్లె పట్టులలో ప్రకృతిలో చిన్న మార్పు సైతం వివిచ్యమానంగా కనిపిస్తుంది. అయితే విశ్వనాథకు వసంతం వచ్చినదనే భావన ఎలా కలిగింది? ప్రకృతిలో చిన్నిమార్పు చూసిన తరువాతనా? కాదు ! చిరపరిచితమైన కౌగిలి – అందువల్ల అది అనుద్రిక్తం కూడా. అలాంటి కౌగిలిలో ప్రియురాలి ఎద చెమరించినదట. ఆ "చెమరింపు" తనకు సోకగానే వసంతమరుగుదెంచెనను మధోరోహ 'స్ఫురించె' లోన ! ప్రకృతి నుంచి దూరమై పోతున్న మనిషికి యీ చెమరింపు తెలియదు. ఎంతో ప్రగతిని సాధిస్తున్నానని భావిస్తూ తనకు తానే దూరమై, పరాయివాడై పోతున్న మనిషి గుండె ఎండిపోతుంది. ఈ చెమరింపే మనిషిని మనిషిగా నిలిపేది. "కాలే నావరణాత్యయాత్ పరిణతం యత్స్నేహసారేస్థితం" అని భవభూతి చెప్పిన దాంపత్య లక్షణానికి యీ చెమరింపే జీవధార. విశ్వనాథ "వేయిపడగలు' లోని చివరిమాట "నీవు మిగిలితివి, నాజాతి శక్తి మిగిలినది" అనడంలోని దాంపత్య ధర్మ రహస్యం కూడా యీ ఎద "చెమరింపే". అదే కావ్య ప్రాదుర్భావ హేతువు కూడా. ఈ "చెమరింపు" శృంగారం వల్లనే కానక్కర లేదు. కరుణం వల్లనైతే రామాయణం వస్తుంది. నిర్వేదం వల్ల నైతే భారతం భాసిస్తుంది. అందుకే విశ్వనాథ "తెలుగు ఋతువులు" కావ్యాన్ని "అనుభూతి కేంద్రకం"గా

ప్రారంభించారు. ఈ అనుభూతి ఆత్మనుండి శరీరానికి దిగి వచ్చేసరికి "శీతోదక స్నానజాత సౌఖ్యము పైని ముకుపుటాన చెమర్పు"గా కనిపిస్తుంది. పరిసరాలను పరిశీలించే సరికి "పేరంటమున కేగు పిన్న బాలిక వాలుజడమల్లెమొగ్గ"గా, "వేప కొమ్మ చిగురు పట్టడం"గా కనిపిస్తుంది. సుదూర తీరాలనుండి కోకిల స్వరం వినవస్తుంది. దానితో కవి లోకంలో పడతాడు. ఇక యిక్కడి నుండి తెలుగు పల్లెల వైభవమే! పద్యాశ్వాలను వింత వింత నడకలు నడిపించడంలో విశ్వనాథ ఎంత గడుసు రైతుగా కనిపిస్తాడో యీ కావ్యంలో అంతకంతా తెలుగు రైతుగా గోచరిస్తాడు. తన అసంపూర్ణ ఆత్మకథలో విశ్వనాథ అంటారు "మాగాణి పొలాల్లో తిరగని వాడు మహా కవి కాలేడు" అని!

పల్లెటూళ్ళలో కొబ్బరి చెట్లకు పూతరాలిపోకుండా వుండడానికి మొదలున అడుగెత్తులో గొడ్డలితో గాట్లు పెడతారు. కావేసిన మామిడి పళ్లు చెద పట్టకుండా పూట పూట తిప్పుతుంటారు. మల్లె పాదులకు చీమలు పట్టకుండా తెల్లని కచ్చిక బూడిద జల్లించి చల్లుతారు. బత్తాయి కాపు చెడకుండా వుండటానికి ఆరారగా నీరు పెడతారు. ఆకుచుడతారు. ఇవన్నీ విశ్వనాథ అనుభవంలోనివే, వాటినే ఎలా చెప్పాడో చూడండి.

రాల్పూత నారికేళమున నిల్పగ దిస్స
కటి దిగ్గి గొడ్డలి గాట్లు పెట్టి
కావిడ్డ నెఱజాతి మావి పండులు చెదల్
ముట్టకుండగ బూట పూట త్రిప్పి
వెల్లకచ్చిక బూది జల్లించి గండుచీ
మలు పాయ మల్లె పాదులను జల్లి
అవియు బత్తాయి రెండవ కాపు చెడకుండ
నారార నీర్వెట్టి యాకు చుట్టి

యే పెరిగి చెట్టు చెట్టున కాపుదించి
పండి పగిలిన పనసలు భద్ర పఱచి
ఏ మఱక వేయి విధముల బ్రాముకొనియె
దేఁటి తేనియవలె తెన్గు తోట మాలి.

ఇందులో మనకు అర్థం కాని దేదీ లేదు. ఇవన్నీ తెలుగుతోటమాలి "సస్యరక్షణ చర్యలే". వసంతంలో పూచిన మరో మధుర భావనను అందుకోండి -

ప్రొద్దు గ్రుంకెడు దేవే ముగ్ధ భావ ప్రచా
లిత ప్రియా హస్త గుంఫిత ములగుచు
రేయి వడ్డనవేళ ప్రియురాలి చొళ్లెమ్ము
పైని ముద్దులు గుల్కు బంతియగుచు
పరానిశా మధుర సంభ్రాంతి గాఢ గృహీత
ప్రేయసీధమ్మిళ్ల మృదువులగుచు
మఱునాటి ప్రొద్దున మండువాలో నిర్ద
ళితములై యిల్లు బాళింతలగుచు

`పగలు రెండు జాముల వేళ పంచపాత్ర
వారిపై తేలియాడు పూవడవలగుచు
నిబుతి దిగ్వాయు పతి వసంత ఋతు శోభ
లీను మాలాంద్రు మల్లెపూలెసకమెసగె.

శృంగారాన్ని అసహ్యించుకోవడం, అది పనికిరాదనడం జీవితాన్ని నిరాకరించడమే. బహుముఖీనమైన మానవ జీవనంలో అదీ ఒక భాగం. జీవితం ఆర్థికమైనదే కాదు - హార్దికమైనది కూడా! వసంతంలో - మల్లెపూలు వచ్చే సాయం సమయంలో - పెరటి మెట్ల మీద కూచుని - వాటిని మాలకడుతున్న కొత్త పెళ్లి కూతురి మదిలో మెదిలే 'ముగ్ధభావ' ప్రచాలనాన్ని నిర్ణయించేది కేవలం హృదయం మాత్రమే! ఇక్కడ మనకో పద్యం గుర్తుకు వస్తుంది. మావెలలేని ముగ్ధ సుకుమారమరంద మాధురీ జీవిత మెల్ల మీకయి..... ఆపయి చీపురు తోడ చిమ్మి మ్మావల పారవోతురు గదా" అనేది. ఈ పద్యంలోని సమస్త భావాన్ని విశ్వనాథ "నిర్దళితములై" అనే ఒక్కమాటలో బిగించాడు. "నిర్దళితములై" అనడంలో ఆ "నిర్దయ" ధ్వనిస్తూనే వుంది. ఇదీ "పద్యవిద్య" అంటే ! అంతేకాదు - విశ్వనాథ మల్లెలు - 'నరజాతికి నీతి యున్నదా" అనవు - నిర్దళితములైనా 'ఇల్ గుబాళింతలే" అవుతాయి. ఇవి "సుమనస్సులు" కదా!

గ్రీష్మంలో సమస్త ప్రాణులు శోషించిపోతాయి. గ్రీష్మతాపంలో క్రుంగిపోతున్న కాకి, తొండ, కుక్క, దూడ, చివరికి నల్లి కండ్ల పాము కూడా విశ్వనాథ పద్యంలో సేద దీరుతున్నాయి.

గొంతు క్రిందటి యుండ గుడ గుడలాడగా
నలువాదెలచె తృషయైన కాకి
ప్రక్కజన్ చీమల బారు చూడక, నిక్కి,
నిలువక, తలవాల్చి సొలయు తొండ
పందిట లేచుచు పండుకొంచును, నాల్క
చాచి, రొప్పుచు, చొంగ జార్చు కుక్క
కొఱకక పులు, ప్రక్క కుదురక, తపియించి
యమ్మేయనుచు, బిట్టు నడలు దూడ

నలిగిపోయిన పురికొసవలె, వడ, కడ
గండ్లపడి, స్రుక్కి చను నల్లికండ్ల పాము
అల్పప్రాణులపై పరమాధికారి
శేఖరుడు గ్రీష్మని ప్రతాప చిహ్నములయ్యె

వేసవికాలంలో " ఇనుడస్తమించినాడని పేరు ఎదురెండ కొట్టిన వడ గూబ గుంయ్ మనియె, సొక్క జాబిలి వలి గ్రుక్క త్రిప్పుకొను వేళకు రేయి రెండు జాల్రాకులాడె, ఆపసోపాలు పడి నిద్రయనుచు ఊప్పిరాచునంతలో దీర్ఘ దీర్ఘమగు పగలు, గదుముకున్న రేయి చివళ్లు పొడిపి పొడిపి అడె ధారుణి సర్వమ్ము పట్టుకొనియె". ఇంత బాధలోను గ్రీష్మం అందంగానే వుంటుంది." చిబుకము చివరవేసిన సెగగడ్డకు బాల గుండ్ర మొగమ్ము కోలవారు" తుంది. " కడ ఎండలకు గ్రాగి వడలి పోయిన బాల కడుమాపులకు కాని పొడవు సాగు" తుంది. ఇవన్నీ "నిష్టావర్షదమోఘ మేఘపటలీ"

పద్యం వ్రాసి "పాషాణ పాక ప్రభువు" అనిపించుకున్న విశ్వనాథ పద్యాలే. అలాటి విశ్వనాథ 'మార్కు' పద్యం వర్షారంభంలో వుంది.

అంతః ప్రగర్జన్మహాంభోధర్మము లు
నశని పాతోగ్ర ఘోరాంబుదములు
మత్త సామాజవదుద్వృత్త జీమూతముల్
నీలనమ్ర స్నిగ్ధ నీరదములు
శంపా ప్రగాఢ భాస్వత్పయోధరములు
ప్రౌఢధారానమద్వారిదములు
వాయుహత ప్రధావ ద్వారివాముల్
వృష్టిమన్ని కటకపీటదములు

ప్రాతరవరుద్ధ బాలసూర్యాతపములు
సాయమవరుద్ధ సూర్య తేజః క్షతములు
ఆదిశుచిక్లప్త తాపాపనోదనములు
ముసురుకొని వచ్చి మానేత ముట్టడించె.

అప్పుడు "పులితోక వలె వియత్తలవనిందోచె మనోజ్ఞమై ఇంద్ర ధనుస్సు ముక్క"! వర్షర్తు వర్ణనలోనే విశ్వనాథ సామెతలను ఎలా వాడుకున్నారో చూడండి -

వెన్నకొట్టిన వారి వెస రాల గొట్టుమ
న్నట్లు మేఘుడు హేళి కడ్డువచ్చె
మున్ను వచ్చు చెవుల కన్న గొమ్ముల వాడి
యనరికిని వగలు పతికమయ్యె
మొఱిగిన కుక్క తాకటవదన్నట్లు గ
ర్జించిన మొగిలు వర్షించకుండె
దనము మంచిదటంచు పవలె దొంగిలినట్లు
కాలి బాటల గూడ గడ్డి మొలిచె...

వానాకాలంలో రాయలు వంటా వార్పూ, సంగతి వివరిస్తే విశ్వనాథ ఆహితాగ్ని పాట్లు వర్ణించాడు. పొయ్యి నిప్పు సెగకు ఆరీ ఆరకుండా తడిపొడిగా వున్న అంగవస్త్రం కట్టుకొని, తడి ఆరకపోవడం వల్ల అగ్నికుండంలో నల్లపడి వున్న విభూతి ధరించి, వానవల్ల ఎక్కడ ఆరిపోతుందో అని ప్రాణానికి ప్రాణంగా రక్షించుకోగా ఎక్కడో మూల రవ్వగా వున్న మూడగ్నులను చేయి అడ్డంపెట్టి వూదుకొని వూదుకొని అగ్నిజ్వాల వెలార్చే సరికి "వచ్చి చేయంగల విన్నపములైనా" సోమయాజి విహితకర్మకు ఆటంకం రానీయడు. ఆ సోమయాజి "కమిట్మెంట్"ను ఏమందాం మనం?

బహుశా ఋతువులన్నిటిలో అందమైనది శరత్తేనేమో! 'ఱెక్కలు చాచి తీరిక గాగ గాలిలో తేలపోయెడు

నంచవోలె" వస్తుంది శరత్తు అంటాడు విశ్వనాథ. కొల్లేటి నుండి కొంగలు వచ్చి విడిదుల్లో దిగుతాయి.

మిన్నను పాముల చిన్నదాని గళాన
నత్తగుల్లల పేరనగా మెరసి

అతివయు వేగ ధూతాప్స రోంగనలచీ
రల చెంగులనగ గూళ్లలుగ నెగిరి

గగన వార్నిధి తరంగములు నేలను దీర
ముల గట్టు నురుసు తెట్టెలుగ తోచి

సంకల్ప గో ఖురాంచలమున వెడదయై
ధరణికి డిగ్గిన సరణి వచ్చి

కూడి టెక్కలు తప తప కొట్టుకొంచు
కాలు మోపెడు తటినారికేళ విటపి
గముల కొల్లేటి నుండి కొంగలు సహస్ర
ములుగ విడిసె మాలా బద్ధములుగ వచ్చి.

శరత్తులో బురద ఎండి గట్టి పడుతుంది. ఆ బురదలో దిగిన గొడ్ల కాలిగిట్టల గుర్తులతో డొంకదారి బిగిసిపోతుంది. కొసలు దేరిన ఆ బాట కాలిలో గుచ్చుకుంటుంది. "కాల గ్రుచ్చుకొనె డొంకలు గొడ్ల గిట్టలు దిగిన గుర్తుల తోడ బిగసి యెండి". నూర్పిళ్లు పూర్తవుతాయి. రేగిపళ్లు అమ్మకానికి వస్తాయి. ఒక లంబాడి పడుచు "క్రొత్త నూర్చినవడ్లకు సరికి సరి రేగు పండ్లమ్మ వచ్చె". మెట్ట నోలాల్లో వికుంఠ లక్ష్మి ప్రదర్శనం పదపదాన సాగుతుంది.

ప్రొద్దు టింతల వాయువులు తావికై మెల్ల
కొతిమేర చేలపై కొసరులాడె

చిలు చేదు వలసె కోసిన జొన్న చేనిలో
తొడిమ దగ్గర పచ్చి దోసపండు

పండి కోయని మిరపలు పెండ్లి కూతుండ్ర
వలె సకుంకుమ శోభకులుకు లాడె

వడిసెలలూ, తప్పు నొడుపు నేర్పెను తల్లి
చిన్ని పిట్టకు మొక్కజొన్న చేల

వెలగె తలగిల్లిన పొగాకు సెనగ తంప
టలను బంతిపూల్ మిరపతోటలకు మధ్య
శరదృతు సమస్తమును ప్రదర్శనము చేసె
కూడి మెట్ట పొలాల వికుంఠ లక్ష్మి.

ప్రాతస్తుషార బిందు సందోహసుందరమైన హేమంతం విశ్వనాథకు ఎలాకనిపించింది? "గుమ్మడి పూవులో నిలిచిన మంచు బిందువు తట్టలో కూర్చుండ పెట్టిన వధువులా వుంది. గడ్డిపోచ కొసన నిలిచిన మంచు బొట్టు ఖండితనాయిక కంటి చివర మొలిచిన అశ్రు కణంలా వుంది. సాలీని పటముపై నిలిచిన తుషార బిందువు తులసి ముగ్గులో పెట్టిన దివ్వెలా వుంది. ఆవు దూడ నుదట నిలిచిన మంచు బొట్టు ఘూర్జరయువతీ వదన మండలంపై మెదిలే ముత్యంలా వుంది " చూడండి.

తట్టలో కూర్చుండ పెట్టిన వధువునా
గుమ్మడి పూవులో కులికె నొకటి

ఖండితాపాంగసక్త నవాంబు కణమునా
ఘాసాగ్రమున యందు కదలె నొకటి

తులసి ముగ్గన నిడ్డ తొలుకాడు దివ్వెనా
సాలీని పటముపై సాగె నొకటి

ఘూర్జరీ ముఖలంబి కొస ముత్తియంబునా
నా దూడ నొసటిపై నాడె నొకటి

మధువునా పూవు పూవున మసలెనొకటి
జగ్గునా ఆకు నాకున జాటె నొకటి
మంచు బిందులు నవసుకుమారమూర్తి
మంతములు ప్రాతరంత హేమంతవేళ.

తమలపాకు, చెఱకు, చేమంతి తోటలు, గుమ్మడిమడులు, అంటుకమ్మలు, సార పూవులు,గడ్డి పూల అందం విశ్వనాథను పులకింపచేసింది. పసుపు తోటల కోసం వదలిన కాలువలలో ఎరుకుల వాళ్లు చేపల కోసం మావులు వేస్తారు. దిగువ కాలువ చెమ్మ యిగిరి పోయి బెరడు కట్టి బురద బయట పడుతుంది. పగలు రెండు జాముల వేళ గాలి కెరటం తగిలి "త్రోపంది" వరిమోళ్లు మంచు బిందువులను చిలకరిస్తాయి. "మాడ్చి పగట నెండలు రేల మంచు తడిపి వెచ్చి పచ్చిగ వేగెబో విశ్వ మెల్ల" అంటారు విశ్వనాథ.

ఇక మిగిలింది శిశిరం. ఈః శిశిరంలో "వ్యాజమ్ము కనిపెట్టి పరిరంభరుచికినై మూడు నిద్దరలులో ముద్దరాలు, ప్రక్కకై యిడిన దుప్పటి కూడ నిదురలో గొని కప్పుకొనియె బో కుఱ్రవాడు, ముడుచుకొని ముని కాళ్లలో ముట్టె జొనిపి, చిన్న యాదూడ రేయి మాగన్ను వెట్టె " ! మరో దృశ్యం చూడండి.

ప్రత్తికాయ విధాన పగిలిన పెదవితో
కొమరారె ప్రత్తేరు కూలి పడుచు

చెదరిన రెల్లు పూచెలువొప్పె జనుములో
మునిగి మేసెడు గిత్త మూపురంబు

ఆకూడ్చి చిగురించు మోకగా పరికిణీల్
వదలి చీరెలు కట్టె ప్రథమ యువతి

ఇవన్నీ యిలా వుండగా రైతులుమాత్రం కడగళ్ల పాలయ్యారు. చిలుపజల్లు పడి పొగాకు చెడిపోయింది. పెసర, మినుముపంటలు పాడయి పశువుల మేతకే అయిపోయాయి. "రైతు లొక్కొక్క డొక్కొక్క రాపు నొందె". ఈ చలికాలమైన పిల్లల ఆటలను ఆపలేకపోయింది. ఇక్కడ విశ్వనాథ గీస్తున్నది పల్లెటూరి బొమ్మ. పట్నవాసాల్లో, నగరాల్లో కనిపించదది. ఇది పూర్తిగా గ్రామీణ దృశ్యం. "అద్దమ్ములో చూచినట్లు నేపాళపు కాయలో తమ చలి కంత మరసి, ఎప్పటి అత్తయో యిప్పుడే పగ యట్టు లరకాళ్ళు చలికాచు చటమటించి సగము నిద్దుర లేపి జనని అన్నము పెట్టు బెటఁగ కాకలి యని యేడ్చి యేడ్చి, దుమ్ము కొట్టుక తల దువ్వించు కొనకుండ నూరేగుటను దిస్స యొడలు పగిలి, పట్టుకొని తల్లి సంజల జుట్టు దువ్వి, యొడల నూనియరాచిమై గడిగినంత నావులించుచు చేతుల యందే తూలి, చిన్ని బిడ్డలు నిదురింత్రు శిశిరవేళ". నిజానికి మన పిల్లలు కోల్పోతున్న జీవన మధుభాండాన్ని మనం ఎలా తెచ్చివ్వగలం? చలికాలంలో మజ్జిగ పోసుకుంటే చలివేస్తుంది. మంచినీళ్ళు తాగితే నాలుక మణిగిపోతుంది. తలుపు తీస్తే ఒణికి పోతారు. మనకి కాదు - మనకి స్వెట్టర్లూ, రగ్గులు వుంటాయ్!

చల్ల పోసి కొనంగ చలివేసే జిహ్వకు
మంచినీళ్ళు త్రావమణగెనాల్క
కంచాల చేతులు కడిగిరి పిల్లలు
కడుగకయ కాళ్లులు తుడుచుకొనిరి
చల్లారకయ మున్న చప్పరించిరి పాల
బెల్లముంచిన వేడి వేడి జున్ను
తలుపింత యెరవాకిలి తీయనీయరు
నుహుహుంచు గొంతు కూర్చుండి తింద్రు
తిని యలుకకుండ బసపు చిందెదరు నీళ్ల
చిలికెదరు తడిచేత రాచెదరుపైని
చిటుచలికి కూడ పెను బీతు చెందెజనము
తడిపరిహరించుటకె మేలు పడియె బ్రతుకు.

ఇలా చెప్పుకుంటూ పోతే విశ్వనాథ "తెలుగు ఋతువులు" లోని ప్రతిపద్యాన్ని ఉదాహరించవలసినదే. ప్రతి బొమ్మా చూడవలసినదే. రసజ్ఞుడైనవాడు నాగరికం బలియని పల్లెపట్టులో ఓ ఏడాది కాపురం పెట్టి యీ చిత్రాలన్నీ ప్రత్యక్షంగా దర్శించవలసిందే! దీని కంతటికీ కావలసింది యీ కావ్యారంభంలోనే విశ్వనాథ సూచించిన "ఎదచెమరింపు" ఇంక కావ్యనిర్మాణాన్ని పరిశీలిస్తే యివన్నీ "నన్నయ్య మార్కు" సీసాలే కానీ, శ్రీనాథుడి 'బ్రాండు' కావు. నన్నయలాగే కేవలం ప్రకృతి వర్ణనానికి పరిమితమైన భావనలు. పద్యాన్ని పద్యంగా కాకుండా వచన ధోరణిలో వ్రాస్తే ఇదంతా మంచి తెలుగు వచన కావ్యం కావడంలోనూ సందేహం లేదు. విశ్వనాథ అనగానే ఏదో "కంకరరాళ్ల గుట్ట" జ్ఞాపకం వచ్చేవారు తెలుగు ఋతువులు చదివితే పద్య విద్యా రహస్యం కరతలామలకం అవుతుంది. సహృదయులకు "కంఠాభరణమూ" అవుతుంది.

**వేదనా హృదయనాదం – శేషేంద్ర ఋతువేదం:** ఈనాటి చర్చలో రెండో కవి శేషేంద్ర కావ్యం "ఋతుఘోష" పేరులోనే కనిపిస్తున్న 'ఘోష' దీనికి అంతస్సూత్రం. ఒకానొక ఆర్తి దీనికి జీవనాడి. ఇది 1963 నాటి కావ్యం. శరీరాన్ని కారాగారంగా భావించి ఎక్కడికో ఎగిరిపోవడానికి ఆకాంక్షించే తత్వం, అది అసాధ్యమైన నిర్వేదం దీనిలో కనిపిస్తాయి. వసంత వర్ణనాన్ని ఆరంభిస్తూనే

"కాలపు బాటం బడి యొకానొక తియ్యటివేళ కోమల
జ్వాలగ వచ్చి నా హృదయ చారుతరాలయ శాతకుంభశ్ఛం
గాలను మేలుకొల్పె నవకాంతులతో మధుమాసమాత్మవ
క్షాలకు విప్పి లే చెను వికస్వర జీవ మహోదయమ్మునన్"

అంటాడు శేషేంద్ర. వసంత వైభవాన్ని వర్ణిస్తూ, "అంతస్సుషమా సముల్బణముతో నుఝ్ఝాత లూగించె నాహా! యాహా విహగమ్ము తానెగిరి పోనాశించె నుత్కంఠతో "అనీ, " నీలిమాకలిత నిర్భర కంఠము పిల్చినట్లు నానీలియు దేహ పంజర వినిర్గతమై పరుగెత్తెనెంతయునన్" అనీ అంటాడు.

ఆసల దీరునె దృష్టి చే మహిత గాఢా లింగానాయుక్తిచే
నాసంయోగ నిరంతవేదనములే యద్వైత సంసిద్ధికో
నై సర్గంబగు నేయగాధ కుహరాంతః ప్రజ్వలానందకీ
లాసంతర్పణకో శరీరమొక కారగారమై తోచగన్"

అంటూ ప్రగాఢ తాత్విక రేఖను ఆవిష్కరిస్తాడు. ప్రణయాన్ని "ఆనంద"భూమికకు ప్రచోదనం చేస్తాడు. శేషేంద్ర ప్రణయతత్వం శరీరావధి కాదు. "ఆనందావధి" అది ఆత్మిక స్థాయిలోనిది – అందుకే 'శేషజ్యోత్స్న'లో "ఓహో! ఏమి జరిగింది నాకౌగిట్లో నాకు!, తొలి ఋషులు అగ్నికీలల్లో మంత్ర గ్రామాలు దర్శించినట్లు, నీ కౌగిట్లో ప్రేమజ్యోతిని చూచాను. నేను నీ భౌతిక మూర్తి కోసం రాలేదు. వచ్చానొక కిరణం కోసం, ఒక కవితా చరణం కోసం, కిరణాల్లో స్నానం చేశాను. మృదుమధుర స్మరణాల్లో గానం చేశాను, నన్ను నేను చేరుకున్నాను" అనగలిగాడు. శేషజ్యోత్స్న 1972 నాటిది.

ఇదంతా యిలా వుండగా వసంతంలో విజృంభించిన ప్రకృతి సౌందర్యాన్ని వివరిస్తూనే దీనిని అనుభవించలేని జనావళి వుంది చూడమంటాడు. ఈ కాలంలో శ్రామికుడు ఏదో దూరగ్రహం నుండి వచ్చి భూమిపై తిరిగే వాడిలా వున్నాడంటాడు. ఇక్కడున్న వేవీ, ఈ అందాలేవీ తనవికాని మనిషిని మనకి చూపిస్తాడు.

తోరపు పంట చేలు పూవుదోటలు బాటలు పచ్చబీళ్ల పొం
గారు తటాకముల్ తనవి కావు విశాల ధరాతలమ్మునన్
దూరగ్రహంతరాగత వినూతన జీవిగ గ్రుమ్మరిల్లి యిల్
సేరగబోవు శ్రామికుడు చీకటి దిక్కుల పిక్కటిల్లగన్"

సాగిన వాడికి మామిడి కొమ్మల మీది కోకిల కలస్వరం వినిపిస్తే సాగనివాడికి "చింతకొమ్మ పయని ఘూకంబు శోకించె", వాడి యిల్లు ఎలా వుంది?

"ముదుసలి తల్లిదండ్రులును ముగ్గురు పిల్లలు చిన్న చెల్లెలున్
ఒదిగి పరున్న జీర్ణకుటిలో నిటువైపున భార్య ఆవలన్

జిదుగుల చెంత దాను శయనించును కన్నులు మూసి మిన్నులన్
దదియ శశాంక రేఖయు నితాంత నిశాగతి నస్తమింపగన్"

ఈ దృశ్యాలన్నీ కంట పడే సరికి కవికి వసంత చిత్రమే మారిపోయింది. ఎక్కడికో ఎగిరిపోదామనే ఆకాంక్ష సర్వమూ నీలిమామయంగా కనిపించిన సౌందర్య భావన కరిగిపోయి "జీర్ణకుటిలో ఎటులో నిదురించే జీవుడున్" అంటూ ఈ గ్రీష్మంలోకి సాగిపోతాడు.

రెండు పద్యాలలో గ్రీష్మ సౌందర్యాన్ని వర్ణించిన శేషేంద్ర మిగిలినదంతా ఎండలో శ్రమజీవుల కడగండ్లను వివరించటానికే వినియోగించుకున్నాడు. క్షేత్ర జీవనులను, గోగణాన్ని విహగ జాతులను, తరువల్లికలను గ్రీష్మం ఎలా వేధించిందో వివరించి

గగన ఘనఘోట ఖుర నిరాఘాట ధాటి
నలఘు బ్రహ్మాండ భాండమ్ము నలగ ద్రొక్కి
చటుల దుర్జన రాజ్య శాసనము వోలె
సాగె మార్తాండ చండ ప్రచండ రథము

అంటాడు. ఇక్కడ విశ్వనాథ చెప్పిన "అల్పప్రాణులపై పరమాధికారి శేఖరుడు గ్రీష్మని ప్రతాపచిహ్నము" అన్నమాట మనకు జ్ఞాపకము వస్తుంది. ఎత్తుపల్లాలతో నిండిన విశాఖ వీధులలో, మలకలు మలకలైన నెల్లూరి వీధులలో, మండుటెండలకాగిపోయే గుంటూరిలో, అతి దీర్ఘపథాలతో సాగే విజయవాడలో "క్రూర దారిద్ర్య దుర్వ్యధికారణమున, తన భుజాగ్రమునెక్కు భేతాళమూర్తి, సర్వకాలాను వర్తి రిక్షా ధరించి,లాగ లేకను వేసవి కాగ లేక" మేను వాల్చిన, కన్నీరు పెట్టిన, సొమ్మసిల్లిన, కుప్పకూలిన రిక్షా వాడిని మనకు చూపిస్తాడు. "కొండల గండ భాగములు కూల్చి శిలా శకలమ్ము లేర్చి పేర్చి పేరెండల ధాటి కోర్చి శ్రమియించి పురీపరిణాహ వీధులం బండలు లాగుచుం బ్రతుకు భారము మోయు నభాగ్యకోట్లు నా గుండెల లోన నగ్ని దరి కొల్పును తీవ్ర నిదాఘ వేళలన్" అంటాడు.

గుస గుస సంచరించు పసికూనలు చానలు చెల్ల నీడలం
దినములు బుచ్చు కాలము గతించును గాక సమస్త దీనజీ
వనములు పల్లవించి సుఖవంతములై విలసిల్లుగాక నా
మనము శమించుగాక మరుమల్లెలో చిగురాకు చందమై

అని ఆకాంక్షిస్తూ గ్రీష్మ వర్ణనాన్ని ముగిస్తాడు. ఈ కవికి వర్షర్తువంటే మక్కువ ఎక్కువలా కనిపిస్తుంది. ఎంతైనా వాల్మీకి, వ్యాస కాళిదాసుల రచనామృతాన్ని కుత్తుక బంటిగా గ్రోలిన వాడీయన. జగన్మోహినీ అవతారంగా ఆయనకు భాసించిన శ్రీనాథుని ఛాయ దీనిలో కనిపిస్తుంది. మనకు - దర్శించండి -

ఘన ఘనా ఘన గజగ్రైవేయ ఘంటికా
　　టంకారములకు ఘంటాపథంబు
శక్రచాపోదగ్ర శార్దూల పాలనా
　　విభవోన్నతికి భూరి విపిన సీమ
చటుల ఝుం ఝూమరుచ్ఛత కోటి భేతాళ

టంతన క్రియలకు రుద్రభూమి
పటు తటిద్విలసన బ్రహ్మరాక్షస కఠో
రాట్టహాసమున కహార్య బిలము

గగనభాగమ్ము ప్రావృష ద్విగుణ రోష
ఘటిత నటనోగ్రథాటీ విఘటిత ప్రకట
కుటిల దూర్జటి ఘన జటాపటల నిటల

వికట భ్రుకుటీ కుటీర ముద్విగ్నమాయె. ఈ వానాకాలం ధనికులకు అపార సుఖాన్ని అందిస్తూ నిరుపేదల నెత్తిన మొత్తుతోంది. అందుకే "ఏమి ధర్మంబు భాగ్య విహీన దీన, జనుల మీదనే దౌర్జన్య చర్య గాని, హేమ ధామ సముద్దామ సీమలందు, అడుగు పెట్టగ పర్జన్యుడైన వెఱచు" అని వాపోతాడు.

లోకాలన్నీ పండు వెన్నెల్లో స్నానం చేయించే శరత్తులో అందాలను వివరిస్తూ, "తరుమూలమ్ముల పూలవాన కురిసెన్ తారాడె కూలం కషా, తరుణీ స్వచ్ఛ దుకూల చేలములలో తారళ్యసారళ్యముల్, ధరణింనిండె శశాంక దీధితి నిశాధమ్మిల్లల మల్లీ విక, స్వర కింజల్కములై యొకా నొక శరద్వాతూల హేలాగతిన్" అంటూనే -

లోకములకెల్ల నమృతాభి షేక మొసగి
పరుగు లెత్తెడి అందాల పాలవెల్లి
పండు వెన్నెల రాదేమి పంతగించి
చితికిపోయిన దీనుల జీర్ణకుటికి

అని ప్రశ్నించుకుంటాడు. ఇక్కడే మళ్లీ వసంతర్తు ప్రారంభంలో వ్యక్తమైన ఎగిరిపోవాలనే ఆకాంక్ష, దాని వైఫల్యం వల్ల కలిగే నిర్వేదమూ ప్రత్యక్షమవుతాయి. "అంతము లేని కాలపథమందొక ఒంటెల బారువోలెన, శ్రాంతము సాగిపోవు ఋతుజాలము జాలము సేయదీతమో, దంతురమౌ విశాల జగదంతరమన్న ఎడారిసీమనే, కాంతముగా తపించు విధురాత్మను గైకొని యేగదక్కటా" అని విలపిస్తాడు. ఒకరకంగా ఎక్కడ ఒక మహాసౌందర్య వైభవం ప్రత్యక్షమవుతూ వుంటుందో అక్కడ యీ కవిలో ఆ సౌందర్య కారకమైన మూలతత్వం కోసం అన్వేషణ, దానినిపట్టుకోవాలన్న తపన, వైఫల్యం నుండి జనించే నిర్వేదమూ వున్నాయనిపిస్తోంది. అంటే శేషేంద్ర ఆంతర్యంలోని సౌందర్య లాలస, రసలోలుపత చివరకు నిర్వేదంగా పరిణమిస్తున్నాయన్నమాట.

హేమంతవర్ణనం అంతా సూర్యుని సంబోధిస్తూ సాగిన రచన. దీనిలో అడుగడుగునా శ్రీనాథుని ముద్ర కనిపిస్తుంది మనకు. పూర్వకవి ప్రభావముద్రకీ, శుష్క అనుకరణకీ చాలా తేడా వుంటుంది. అది పద్యవిద్యారహస్య వేత్తలకి తెలిసిన విషయమే. ఈ హేమంతవర్ణనంలో "ధారుణి బ్రతుకుల నావరించిన పురాతన యాతనలన్న చీకటుల్ ప్రిదులు తెఱంగునన్ శరఝరింగురిపింపవదేలనో ప్రభూ!" అంటూ ఆక్రోశిస్తూ జ్ఞానకాండకు తెరలు తీస్తాడు.

తిమిరములోన బాధపడుదీన జనాళికి దారి జూపి నీ
యమలమయూఖమాల చరితార్థము చేయక లాలితలతా

సుమసముదాయమూర్తివయి శూన్య పథమ్ముల సంచరించుచున్
హిమరమణీయ సౌధముల నెచ్చటనో వసియింతువా ప్రభూ!

అని సూర్యుడిని నిలదీస్తాడు. సర్వ ప్రపంచాన్ని అతలాకుతలం చేసే శిశిరంలో "చలిపులివోలె దారుల పచారులు చేయుచునుండ ఊరి కా, వలపెను మర్రి క్రింద నెలవంకయె దీపముగా పరున్నపే, దలపని పాప లెవ్వరికి తప్పు తలంచిరి? కాలమే హలా, హలమయిపోయి ఆ శిశువు లాకలితో చలితో నశింపగన్" అని ఆక్రోశిస్తాడు. చివరకు

ఏలాగో ఒకనాడు ఆ శిశువులే యింధాన మౌగాక యు
ద్వేలక్షోభ నభోంతరాళమెగయన్ విశ్వ ప్రజాలోచనో
న్మీలంబై హృదయాన్ని పర్వతమహానిర్ఘోషరోషానల
జ్వాలాజాల కరాళ జిహ్వికలు తుచ్ఛంబైన యీ లోకముం
గూలం జేయును గాక! యీ వచనమే ఘూర్ణిల్లుగాకంతటన్"

అంటూ 'ఋతుఘోష" కావ్యాన్ని ముగిస్తాడు. మొత్తం మీద యీ కావ్యంలో ఒక వంక ఋతువుల సౌందర్యాన్ని వివరిస్తూనే అది పేదలకు, దీనులకు అందడం లేదనే ఆవేదనను వ్యక్తం చేస్తాడు. మనదృష్టిని అందం మీది నుండి లోక భోగ వ్యత్యాసం వైపు మళ్లిస్తాడు. ప్రతి ఋతువులోనూ తన్మయత్వాన్ని వెండిస్తూనే చివరకు కొరడాతో చురుక్కు మనిపిస్తాడు. రాయలూ అదే చేశాడు ఆముక్త మాల్యదలో. అందుకే శేషేంద్ర ఋతుఘోష ఇక "మధు కళ". ఇద్దరూ పద్యవిద్యా ప్రభువులే!

•••

# విశ్వనాథ వారి కిన్నెరసాని

**శ్రీమతి సి. వేదవతి**

ఆధునికాంధ్ర వాఙ్మయ జగత్తులో ఒక మహా మేరువు వంటి వాడు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. సాహిత్య ప్రక్రియలలో ఆయన సాధించక విడిచి పెట్టిన అంగం లేదు. హైందవ సంప్రదాయాభిమానం జీవనధర్మంగా, పుంఖానుపుంఖంగా అపూర్వమైన కావ్యసృష్టి చేసిన మహాకవి ఆయన. రామాయణ కల్ప వృక్షం వంటి ప్రౌఢ సుందరకావ్య రచనతో జ్ఞాన పీఠ పురస్కారాన్ని అందుకొన్న విశ్వనాథ తేట తెలుగు పదాలలో - కిన్నెరసాని పాటలు, కోకిలమ్మ పెళ్ళి పాముపాట - వంటి లఘు గేయ కావ్యాలూ, ఖండికలూ కూడా వ్రాశారు. ఎన్నుకొన్న ఇతి వృత్తాలలోనూ, కథా కథన శిల్పంలోనూ, శైలీ విశేషంలోనూ అనంతమైన వైవిధ్యం ఉంది. తన వాణిని గురించి ఇలా చెప్పు కొంటారు విశ్వనాథ

'నిత్యవేగి నా చేతము శబ్దమేరుటకు
చిన్నము నిల్వదు భావతీవ్రతన్'

నిజానికి, ఆ భావ తీవ్రత ఎంతటిదో, అంతకు మించిన వేగంతో శబ్ద సరస్వతి వచ్చి ఆయన నాలుక పైన నాట్యం చేస్తూ ఉంటుంది! కనుకనే శబ్దాన్ని ఏరుకొనే ప్రయత్నం కూడా చేసే అవసరం ఆయనకు లేకపోయింది.! శబ్దార్థాలు రెండూ ఒక ఝరీ వేగంతో వచ్చి కవి హక్కును నడిపిస్తాయి. అందుకే - విశ్వనాథ - అటు జటిల సమాస భూయిష్ఠమయిన కవితలతో పాటు - ఇటు తేనె తేటల తెలుగు పలుకుబడినికూడా సుమనోహరంగా తన రచనలో చొప్పించ గలిగిన ప్రతిభా మూర్తి అయినాడు.

అయితే, ఆయన ఏది వ్రాసినా, ఎల్లా వ్రాసినా, మనలను ప్రగాఢంగా ఆకర్షించేది - అద్భుతమైన భావనా శక్తి! ఒక పాత్రను చిత్రించినా, ఒక కథను నడిపించినా, ఒక దృశ్యాన్ని వర్ణించినా - ఎక్కడ పడితే అక్కడ మనకు పరమ భావుకుడైన ఒక రసరాట్టు కనిపిస్తాడు.

## కిన్నెరసాని పాటలు

ఇంతటి భావుకుడూ, అప్పటికే సంప్రదాయచ్ఛందంలో కొన్ని ఖండకృతులు వ్రాసిన కవీ అయిన విశ్వనాథ - 1923వ సంవత్సరంలో ఒక నాడు భద్రాచలాన్ని సందర్శించడం జరిగింది. అక్కడ ఒక సుందర దృశ్యం ఆయన కంట పడింది. భద్రాచలానికి సమీపంలోనే ఒక కొండ - ఆ కొండను చుట్టుకొని వలయాలుగా ప్రవహిస్తున్న నది. ఆ వాగు పేరు కిన్నెర సాని, ఒక సుమనోహరమైన దృశ్యం! దానికి తోడు మనోరంజకమైన పేరు! అసలే అమిత భావుకుడు! భావతీవ్రతను ఆపుకోలేని రసలోలుపుడు! కవి గుండె కదిలింది! ఒక ఊహ రగిలింది! ఒక కరుణాత్మక ఘట్టం మనసులో మెదిలింది! అది ఒక బ్రతుకు కథగా ఆయనకు సాక్షాత్కరించింది. ఆ నది సర్వ రాగ విరాగ సంభావాలకూ మూలమైన నారీ రూపంలో గోచరించింది. ఆ శిల సర్వ జీవన శ్రుతులకూ ఆధారమైన మానవాకృతిగా కనుపట్టింది.

భావతీవ్రత నిలువనీయని విశ్వనాథ వారి గుండెలో ఆకృతి దిద్దుకొని, గళంలో తా తొరటాడి, కలంలోకి జాలువారి వచ్చినవి - వయ్యారపు నడకలతో కిన్నెరసాని పాటలు!

కిన్నెరసాని వాగును తొలిసారి చూచినప్పటి అనుభవాన్ని స్మరిస్తూ ఇలా అంటారు. విశ్వనాథ -

వనములను దాటి వెన్నెల బయలు దాటి
తోగులను దాటి దుర్గమాద్రులను దాటి
పులుల యడుగుల నడుగులు కలుపుకొనుచు
రాళ్ల వాగు దాటి పథాంతరములు దాటి
అచ్చట కిన్నెరసాని - నాయాత్మయందు
నిప్పటికి దాని సంగీతమే నదించు !

ఇంకా అంటారు - అంతగా తనను ఆకట్టుకొని తన వాక్కును గీతంగా మలచుకొన్న కిన్నెర వాగును గురించి -

అసువులీ దేహమున నున్నంతవరకు
నేను విడలేను కిన్నెరసాని వాగు
నా మనస్సును లాగుకొన్న దతిలోక
దివ్య మోహనముగ బాడి తెనుగు పాట!

ఇల్లా ఊపిరి పోసుకొన్నది విశ్వనాథ వారి కథానాయిక - అచ్చమైన తెలుగుపడుచు కిన్నెరసాని!

భావ కవిత్వ యుగంలో - మెరుపు తీగల వంటి ప్రణయినీ మూర్తులు కొందరు కవుల భావ జగత్తులో ఉదయించి సాహిత్య చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయారు. అక్షరాల పరదాల మాటున దాగి ఉండి అప్పటికీ ఇప్పటికీ రసహృదయులను అలరిస్తూనే ఉంటారు. ముగ్ధ కుసుమాల వలె మురిపిస్తారు. దివి నుండి అప్పుడే దిగి వచ్చి మానవ కన్యలై సాక్షాత్కరించినట్లు కనిపిస్తారు. కవుల ఊహాప్రేయసులు వీరు. ఎప్పుడూ విరహంలో ముంచి, చేతికి చిక్కనట్లే ఉండి చిక్కక - కమనీయ కావ్యాలు వ్రాయిస్తారు కవుల చేత ! ఊర్వశీ, హృదయేశ్వరీ, శశికళ, యెంకి - వీళ్ళంతా కవుల ప్రణయ భావనతో రూపుకట్టిన సజీవ స్త్రీ మూర్తులు.

వీరందరిలోకి తెలుగుదనం నిలువునా వంట పట్టించుకొన్న వారు ఇద్దరున్నారు. ఒకరు యెంకి మరొకరు కిన్నెరసానీ!

తెలుగుపోకిళ్ళు పోయే కన్నె పిల్లను ఒక్కమాటలో వర్ణించాలంటే - నండూరి వారి యెంకి లాగానో, విశ్వనాథ వారి కిన్నెరసాని లాగానో ఉన్నదని అంటే సరిపోతుందని కాస్త సాహిత్య స్పృహ ఉన్న వారందరికీ తెలిసిన విషయం!

అచ్చమైన తెలుగింటి దొరసాని కిన్నెరసాని. అందుకేనేమో ఆమె ఉద్విగ్నహృదయ, వేళపట్టున పెళ్ళీ పేరంటమూ జరిగి అత్తవారి ఇంటికి కాపురానికి వెళ్లింది. తెలుగు కుటుంబాలలో అత్తమెచ్చిన కోడళ్లు ఉండటం కరువే కదా! కిన్నెరకూ అత్తపోరు తప్పలేదు! ఇంట్లో కీచులాటలు మొదలైనాయి. ఒకనాడు అత్తగారు కోడలిమీద మరీ విరుచుకుపడింది. అనరాని మాటలే అన్నది. నిందలు కూడా మోపింది. కిన్నెర హృదయం శోకసముద్రమే అయింది.! అత్త మోపిన నిందల కన్నా ఆమెను అమితంగా బాధించింది,కట్టుకొన్న వాడి ఉదాసీనత. అతడు ఉలకడు! పలకడు! పాపం - అటు అమ్మను అదిలించలేడు! ఇటు ఆలిని ఆదరించుకోలేడు. మౌనమే శరణ్యం

- అని ఊరుకొన్నాడు. ఇది విశ్వనాథ వారి మనస్సులో మెదిలి కథారూపం దిద్దుకున్న కిన్నెరసాని పూర్వకథ!

ఇదంతా మామూలుగా జరిగే ఇంటింటి కథే అయినా, ఇక్కడ ఒక విషయం చెప్పాలి. కావ్యంలోని చమత్కారమంతా నదిని ఒక స్త్రీగా ఊహ చేయటంలో ఉంటే - ఆ స్త్రీని రక్త మాంసాలతో, రాగ విరాగాలతో, జీవితంలో సంఘర్షించే సజీవమూర్తిగా మన కన్నులకు కట్టించటం అంతకన్నా గొప్ప చమత్కారం! అందుకే కావ్యం చదువుతున్నంత సేపూ - ప్రవహిస్తున్న కిన్నెరవాగు - దుర్భరపరితాపాన్ని అనుభవిస్తున్న ఆధునిక స్త్రీ మూర్తిగా మనకన్నులముందు నిలుస్తుంది.

అటు అత్త ఆరడి, ఇటు భర్త నిరాదరణ - భరించరాని బాధను కలుగ జేశాయి కిన్నెరకు. దుఃఖాధిక్యతతో ముందూ వెనుకా ఆలోచించుకొనే శక్తిని కోలుపోయింది ! ఆపుకోలేని శోకంతో అడవులవెంట పరుగులు తీసింది. అప్పుడు కదిలింది ఆ మగవాడి గుండె. ఆమె వెంట తానూ పరుగుతీశాడు! ఆమెను అందుకొని కౌగిలిలో హత్తుకొన్నాడు. తనను విడచి వెళ్ళిపోవద్దని బ్రతిమాలు కొన్నాడు.

అభిమానం ధనంగా గల అమ్మాయి కిన్నెర ! ఆ వేగమూ ఆవేశమూ ఆపుకోలేకపోయింది ! భర్త కౌగిట్లో ఉన్నదల్లా చిత్రంగా చేతికి అందక కరిగి పోవటం ప్రారంభించింది ! అలా కరుగుతూ కరుగుతూ, నీరై, వాగై, ఏరై ప్రవహిస్తూ పోయింది !

చేతిలో ఉన్నదనుకున్న చెలి నీరై పోయింది! నమ్మలేనిదే కానీ -కళ్ళముందే జరిగిన కటిక నిజం అది! అతడు శోకంతో స్థబ్దుడయినాడు. ఆ పరితాపం ఎంతటి తీవ్రమైనదంటే - అది కడకు అతడి ప్రాణాన్నే హరించి వేసింది! అతడు స్థాణువై శిలాకృతి పొందినాడు!

శిలాకృతిలో ఆ కొండ! ఆ కొండను చుట్టకు పారుతూ కొండ వాగు! ఈ దృశ్యం వెనుక విశ్వనాథ వారి భావనలో ఇంతటి బ్రతుకు కథ కదిలింది! భర్త శోకం కరడు కట్టి శిలాకృతి పొందితే, భార్య శోకం రసాకృతి పొందింది. కరుణం అతడిలో ఘనీభవించింది. ఆమెలో ద్రవీభవించింది. విషయం ఎంతటి విషాద భరితం! అయినా కవి కల్పనా చమత్కృతి ఎంత రసభరితం!

ఇప్పటివరకూ జరిగిన కథ కావ్యానికి పూర్వరంగం, ఇలా కన్నీళ్ళ వాగుగా కిన్నెర సాగడంతో కిన్నెర సాని పాటలు ప్రారంభం అవుతాయి.

కిన్నెర పుట్టుక, నడకలు, నృత్యము, సంగీతము, కడలిపొంగు, కిన్నెర దుఃఖము, గోదావరీ సంగమము, కిన్నెర వైభవము - అన్న శీర్షికలతో - తరువాతి కథను గేయచ్ఛందంలో ఒక అద్భుత రసావేశ స్ఫూర్తితో నడిపించారు విశ్వనాథవారు. ఈ పాటల్లోని పదాలు తెలుగు భాషలోని సొగసులన్నీ ఒలక పోస్తాయి. ఒయ్యారాలు పోతాయి. ఝరీ వేగంతో పరుగులు తీస్తాయి. చిరుగజ్జెలు కదిలినట్లు రవళిస్తాయి. పదాల కూర్పులో తెట్టెలు తెట్టెలుగా తెలుగుదనం కనిపిస్తుంది. పాటా, పదాల పొందికా కలిసి - ఒక అపురూప సౌరభం గుండెను తాకినట్లు అనిపిస్తుంది.

## కిన్నెర పుట్టుక

నాయకుడి శోకంతో ప్రారంభమవుతుంది కావ్యం "ఓహో కిన్నెరసానీ! ఓహో కిన్నెరసానీ !" అని ఎలుగెత్తి పిలుస్తూ, -

"నేను తప్పు చేశానే అనుకో! అయితే మాత్రం అంతకాఠిన్యమా నీకు! ఇంతకోపమా! పంతమా! ఆడవాళ్ల నీ అంతటి కఠిన చిత్తలు కావటం ఎక్కడా చూడలేదే! రాళ్లమీద నీపాదాలు మోపినా ఓర్చుకోలేని దానవు కదా! ఇపుడు ఈ రాళ్ల గుట్టలను ఒరుసుకొని ప్రవహిస్తున్నావు ప్రియురాలా! ఎట్లా నడుస్తున్నావు ఈ గండశిలల్లో!" ...అని దుఃఖిస్తాడు.

ఇక్కడ అతడు చేసిన పొరపాటు - రాళ్లమీద కాలు మోపలేని భార్య సౌకుమార్యం ఎరిగిన వాడు. ఆమె మనస్సుకు తగిలే వత్తిడిని గురించి ఆలోచించలేకపోవటం!

ఆమె నవ్వులు నురుగులుగా, వళులు తరగలుగా కన్నులు మీనులుగా - తోచి ఆపుకోలేని బాధతో అంటాడు.

నీజఘనము నిసుక తిన్నె
గా జూచిన నా కన్నులు
ఊడిపడవు నేలపైన
నురిసిపోవు లోనె లోనె - ఓహో కిన్నెర సానీ!

అతడు ఆమె జడను పట్టుకొన్నాడు. ఆ జడకు బదులుగా నీటి పొరలు కాలువ కట్టినాయట! ఈ ఘట్టాన్ని పరమ కరుణాత్మకంగా వర్ణిస్తాడు కవి ।

ఎడమ చేత నీ కొంగును
ఒడిచి పట్టుకొంటి చెలీ
తడి చేతను కొంగులేక
తడబడితిని ప్రియురాలా!

ఆమె స్త్రీ కనుక కరిగి నీరు కాగలిగింది! తాను అలా కాలేక పోయినాడు! అందుకు కారణం అతడు ఇట్లా ఊహించుకొన్నాడు.

ఈవు రసాకృతి వగుటను
ఈ వైఖరి ప్రవహించితి
నేను శిలా హృదయుండను
పూనుదునె ధునీ వైఖరి!

ఇట్లా - పలు విధాల దుఃఖిస్తూ ఉండగానే - అతనిలో చలనం ఆగిపోతున్న సూచనగా దేహం కొయ్యబారి పోవడం ప్రారంభించింది.! అట్లా అతడు నిలువెత్తు శిలగా క్రమంగా ఘనీభవించి స్థాణువైనాడు!

## కిన్నెర నడకలు

తన దుఃఖంతో తానే కరిగి ఏరై పారిన కిన్నెర నడకను వర్ణిస్తున్నాడు కవి - కరుణ రసభరితంగా -
కరిగింది కరిగింది
కరిగి కిన్నెరసాని వరదలై పారింది
తరుణి కిన్నెరసాని తరకల్లు కట్టింది

పడతి కిన్నెరసాని పరుగుల్లు పెట్టింది -

"సుళ్లుగా తిరిగి, వాదుగుల్లు పోయి, నురుగుల్లు గ్రక్కి కడరాల్లు నడిచి, పచ్చికలు తడిసి, కడలందు వారిసి, జడలుగా కట్టి, తళతళా మెరిసి, బిర బిరా నడిచి - బుస బుసా పొంగి - నడిచిందట కిన్నెర !

అల్లా నడుస్తున్న కిన్నెర ఎల్లా ఉన్నదటా! విశ్వనాథ వారి ఊహాపథంలో -

నడవగా నరువగా నాతి కిన్నెర సాని

తొడిమ యూడిన పూవు పడతిలా తోచింది

కడుసిగ్గు పడు రాచ కన్నెలా తోచింది

బెడగు పోయిన రత్న పేటిలా తోచింది!

అల్లా నడచి నడచి కిన్నెర - శిలగా మారిన భర్తను చుట్టకుపోయిన కథ - తరతరాలుగా స్త్రీ జాతి అనుభవిస్తూ వస్తున్న వేదనార్తి కథ! హృదయం చీల్చివేసే ఒంటరి తనపు బాధామయి గాధ!

పతి రాయి వలె మారి

పడి యున్న చోటునే

పడతి కిన్నెరసాని విడలేక తిరిగింది.

ముగుద కిన్నెరసాని వగ చెంది తిరిగింది

వెలది కిన్నెరసాని గల గలా తిరిగింది !

ఇంత సున్నితమైన ఊహలతో నది నడకను వర్ణించిన కవి - మరొక చోట ఝరీ వేగాన్ని ఎంత ప్రౌఢ గంభీరంగా వర్ణిస్తాడో, మార్గ - దేశీ సంప్రదాయాలు రెండింటిలోనూ విశ్వనాథ వారి శైలి ఎంత ప్రతిభావంతంగా సాగుతుందో - రేఖా మాత్రంగా దర్శించటానికి ఒక చిన్న ఉదాహరణ -

రామాయణ కల్ప వృక్షంలోని ఘట్టం. వియద్గంగ దిగివస్తున్నది భువికి - దుముకుతూ వచ్చే గంగా ఝరిని జటలో బిగించి పట్టుకోవటానికి సిద్ధంగా ఉన్నాడు పరమశివుడు -

మకర మత్స్య కుళీర మత్తాహికమఠ వా

రములచే నవజీవ రాశి యగుచు

మణిరత్న మౌక్తిక మరకత వైడూర్య

ముల చేత బుష్కరమూర్తి యగుచు

అద్భుత రౌద్ర వీరానంద కృద్వారి

ధారమై ఘన రసాకార యగుచు

లలిలి తర తరంగ హస్త శస్త్రాభిరామ

ప్రస్రుతిని సర్వతోముఖ ప్రతిభ యగుచు

శివ జటా జూటికా మహాసీమలో గు

భిల్లుమని దూకి పడె తిరుగుళ్ల గంగ !

మహాకవి అయిన వాడు రసానుగుణంగా రచనలో ఇంతటి వైవిధ్యాన్ని చూపగల ప్రతిభావంతుడై ఉంటాడు. అటు జటిల సంస్కృత భూయిష్ఠ సమాసాన్నీ, ఇటు లలిత సుకుమార పద జాలాన్నీ - ఇంత అలవోకగా వాడుకోగలిగిన వాగ్వైభవం విశ్వనాథ వారిది.

తాను తొందరపడి ఎందుకు నదినై పోయినానా అని విచారిస్తున్నది కిన్నెర. ఏ ఉపాయం చేత నయినా మళ్లీ మనిషిని కాలేనా? బ్రతికి ఉండగా తన మీద అతడికి అంతటి అనురాగం ఉన్నదని తా నెరుగక పోతినే ! అటువంటి పతితో అటువంటి కాపురం ఇట్లా నీళ్ళ పాలు చేసుకొన్నానే - అని వగచి వగచి దుఃఖించింది ఆమె!

తను వీడితే వోర్చు
కొనలేదు కాబోలు
బ్రతికుండగా యింత ప్రణయమ్ము కలదంచు
తెలిసితే యింకెంత చెలిమి వుండేదంచు
తలపోసి తలపోసి సొలసె కిన్నెర సాని!

ఇక్కడ మానవ సహజ ప్రకృతికి సంబంధించిన అంశం ఒకటి మనసుకు తడుతుంది. కొంత మంది మగవాళ్లు ఉంటారు. భార్యలపైన చిత్తశుద్ధిగా ప్రేమ ఉన్నవాళ్ళు. కాని ఆమె ముందు తమ ప్రేమను రేఖా మాత్రంగా నయినా వ్యక్తం చేయలేరు! స్త్రీ -ఎంతో ఆశగా ఆ ఒక్క మాట కోసమే కాచుకుని కూర్చుంటుంది.! ప్రేమగా, దయగా, ఆదరంగా - అతడి నుంచి వచ్చే ఆ ఒక్క మాట కోసం ఆమె ఎంతటి త్యాగమయినా చేయటానికి సిద్ధపడి ఉంటుంది ! కానీ, ఒక్కొక్కసారి - అప్యాయతతో కూడిన ఆ చిన్నమాట - ఆమె చెవికి అందే సరికి చాలా ఆలస్యమయిపోతుంటుంది! అప్పు డిక ఆమెకు ఆ మాటతో అవసరం కూడా తీరిపోతుంటుంది!

నిజంగనే రాయిగా మారిపోయిన పతిని మట్టుకుని కెరటాలతో స్పర్శిస్తూ - ఎలుగెత్తి ఏడుస్తున్నది కిన్నెరసాని -

ఓ నాథ ఓ నాథ
నాకు మల్లే నీవు నదివోలె పారరా
జలముగా యిద్దరము కలిసిపోదాముర
కెరటాలు కెరటాలు కౌగిలిద్దాముర!

అంటూ అడిలిపోతుంది. తాము కలిసి కాపురం చేసినప్పటి మధుర క్షణాలను గుర్తు తెచ్చుకుని వలవలా ఏడ్చింది.

ఎంత ఏడ్చినా శిల కరగనూ కరగదు! తానూ ఆ శిలను మట్టుకుని అక్కడే ఆగిపోనూ లేదు!

'తల్లి దగ్గరనుండి తన మెడకు పలుపోసి
లాగగా బడ్డట్టి లేగలా'

ముందుకు సాగిపోక తప్పలేదు కిన్నెరకు! తా నిప్పుడు ఏరైంది ! ఏటి నీటికి జీవలక్షణం పురోగమనం!

సాగుతున్న కిన్నెరసాని ఎట్లా ఉన్నదటా? కవి భావిస్తాడు ఇంత కమనీయంగా -

పరికిణీ తొక్కాడు పదియేండ్ల కన్యలా
చిన్ని గంతులు వేయు తెల్లనాబెయ్యలా
పసిపాప సెలవి వారిన బోసి నవ్వులా
సాగిపోతున్న కిన్నెర -
ఆవు పాదుగున పాలు ధార కట్టిన యట్లు
వనదేవతలు నీళ్ళు వలక పోసిన యట్లు

తల్లి చల్లని ప్రేమ వెల్లి వారిన యట్లు
ప్రవహించి పోతున్నది కిన్నెర -

## కిన్నెర నృత్యము - సంగీతము

ఈ ప్రకరణంలో ఎన్నో దృశ్య శ్రవణ మాధుర్యాలు చిత్రించారు విశ్వనాథ. తెలుగు వాదుగులు పోతూ, తెలుగు తోపులు, చిమ్ముతూ, తేనెలై, కలకండ సోనలై, వానలై - ఎన్నెన్ని అందాలు - కిన్నెర నడకలో - విశ్వనాథ పలుకులో ! శబ్దమూ, నాదమూ రమణీయమైన మేళవింపుతో రవళించి రసావిష్కారం చేస్తాయి.

తెలి నుర్వులో వెమ్మటలు చిమ్ముతూ
అలసటలు క్రమ్ముతూ కిన్నె రటు
సొక్కి యిటు సొక్కి చిరుమీను కనులతో
శ్రమ మీను కనులతో సొగతనములు పోయెనే
లోగొంతు రాగాలు వెలయించెనే!

పాటలో ఒక ధ్వని! కిన్నెర భర్తతో కలిసి లోగడ అనుభవించినప్పటి అనురాగమయ శృంగార జీవిత రసధుని!

అట్లా కిన్నెర ఒక నృత్య హేలగా, స్వరరాగ ఝరిగా, సాగిపోతూ ఉంటే - ప్రపంచంలో అలజడి పుట్టకుండా ఉంటుందా! అందమైన అమ్మాయిలు వొయ్యారాలు పోతూ నడివీధిన నడుస్తూ ఉంటే - విలాస పురుషుల దృష్టి వారిమీద పడక మానదు కదా!

ఇన్నాళ్ళు భర్త చాటున ఉన్నది సరే - ఇప్పుడు ఇల్లు వదలి వచ్చివేసింది కిన్నెర. చూచాడు కడలి రాజు! తమకం పట్టలేని స్థితి! అసలే పొంగుల రాయడు! మోహావేశంతో ఇంకా ఇంకా మేను పెంచి పొంగటం ప్రారంభించాడు. కడలి ఔద్ధత్యాన్ని కన్నులకు కట్టినట్లు వర్ణిస్తారు విశ్వనాథ. తెలుగు పదాలకు గజ్జెలు కట్టి ఆడించినట్లు ఆ కడలి రాయడి మోహావేశాన్ని ఒక వీరావేశంతో వర్ణిస్తారు.!

తగని కోరిక చేత తనలో కడలి రాజు
సొగసు కిన్నెర సాని చూడాలె ననిపించి
ఉర్రట్టలూచెనూ మిర్రెక్కి చూచెనూ!
గగనమ్ము కొసదాక కెరటాలు వుబికించి
దూరాలు చూచెనూ- బారలూ చూచెనూ!

"తనలో ఉన్న బడబాగ్నిశిఖ పొంగి తన శరీరమ్మెల్ల దహియించినట్లుగా - కళపెళలాడిపోతాడు కాముకుడైన కడలిరాజు ! ఈ ఘట్టం చదువుతున్నంత సేపూ రావణుడూ, కీచకుడూ కట్టకట్టుకు వచ్చి కళ్ళ ముందు ప్రత్యక్షమైనట్లు అనుభూతి కలుగుతుంది. ఇది కడలివర్ణనా సామర్థ్యానికి నిదర్శనం.

సముద్రుడి ఔద్ధత్యాన్ని చూచి వణికిపోయింది ఒంటరి కిన్నెర! తన కోసం శిలగా మారిన భర్త తలపుకు వచ్చాడు. నిన్ను వదలి రాబట్టి కదా నాకిన్ని కష్టాలు వచ్చాయి. ఇతరులకు ఇంత అలుసై పోయాను!..... అని వాపోతుంది.

## కిన్నెర దుఃఖము

కిన్నెర దుఃఖ వర్ణనలో - ప్రపంచంలో తరతరాలుగా స్త్రీజాతి అనుభవిస్తూ వస్తున్న దుఃఖోద్వేగమంతా కరళ్ళు కట్టించి విశ్వనాథ వారు కుప్పవోశారు!

అంతటి స్త్రీ దుఃఖాన్ని ఇట్లా చెప్పుకున్నారు. - అనుభవ పారమ్య మెరిగిన మన జానపదులు -

విసిరిసిరి ఆ కాంత స్థంభాన కొరిగె
కాంతకూ కన్నీళ్ళు కాల్వలై పారె
వాన కురవ లేదు వరద ఎక్కడిది?
ఆడవారి శోకంబు అటువంటి దప్ప !

ఆడవారి కష్టం ఆడవారికే తెలుస్తుంది - అన్న మాటను పరాస్తం చేస్తూ - కవి వర్ణన ఇట్లా సాగుతుంది.

ఏడ్చి ఏడ్చి జలమెల్ల నెర్రనయి
ఏడ్చి ఏడ్చి తనువెల్ల నల్లనయి
ఏడ్చి ఏడ్చి నురుసుల్లు తెల్లనయి
ఏడ్చి ఏడ్చి నడకల్లు వేగమయి -
బొట్టు బొట్టు కొక వేయి యెదలుగా
తరగ తరగకొక వేయి నోళ్లుగా
బడలి నీరమే ఏడుపు మయమై
కడలిమ్రోత లెక్కుడు భయమీడ -

ఏడుస్తున్న కిన్నెరను చూచి, అడవి గాలులూ, పులుగులూ, మృగాలూ కూడా ఏడ్చినాయట! మాడవచ్చిన తన బేడిస కన్నుల్లో నీరెత్తుకున్నదట!

లోకంలో అందరూ దుర్మార్గులే ఉండరు! ఇతరుల దుఃఖాన్ని చూచి, గుండె కరిగి, స్నేహ హస్తం అందించి - ఆదుకోవాలనుకొనే దయామయులూ ఉంటారు. ఈ విషయం చెప్పడం కోసం ఒక కమనీయ కల్పన చేశారు విశ్వనాథవారు. గోదావరిని చేరే కిన్నెర వాస్తవ కథకు ఒక ఆర్ద్ర పరిమళాన్ని అద్దుతూ ఈ కల్పన సాగుతుంది.

చల్లని తల్లి గోదావరీ దేవి. కిన్నెర శోకతరంగాలు ఆమె దాకా వచ్చి తాకినాయి! చిన్న కిన్నెర దుఃఖం చూచి ఆ తల్లి కడుపు చుమ్మలు చుట్టుకుపోయింది. భయపడవద్దని ధైర్యం చెపుతూ తన హస్తాల కెరటాలు చాచింది. గోదావరి దేవి గుండె ప్రేగులు తడిసినాయట - జాలితో, దయతో!

తల్లి బిడ్డను పొదువుకొన్నట్లుగా! అక్క చెల్లెలికి ఆదగువు అయినట్లుగా - గోదావరి కిన్నెరను దగ్గరకు తీసుకుని కడుపులో పెట్టుకొన్నది.

గోదావరీ దేవి గొప్ప వంశపురాణి! ఆమె జోలికి వెళ్లటానికి సముద్రమంతటి వాడికయినా గుండెలు చాలవు! వెనుకకు తగ్గి పొగరూ పొంగూ దించుకొన్నాడు. పొంగారి పోయి సాధువై పోయాడు!

ఇంతటితో - కవి మనోకల్పనలో ఊపిరి పోసుకున్న కథ పూర్తయినట్లే ! అయితే - ఇంకా గోదావరీ సంగమము - కిన్నెర వైభవము - అన్న ఖండికల్లో కిన్నెరసాని సోయగాన్ని తీరుతీరుగా వర్ణిస్తేనే కానీ తనవి తీరదు కవికి!

ప్రొద్దు ప్రొద్దున వాయ ప్రొద్దున్న వాయ
పొడుస్తున్న భానుడూ పొన్నపువ్వూ వాయ -

అంటూ మనవాళ్లు ఘడియ ఘడియకు సూర్యగమన సౌందర్యాన్ని వర్ణించుకొంటారు. ఇక్కడ ఉషః కాలంనుంచీ రాత్రి తొలి ఝాము గడిచేటంత వరకూ 'కిన్నెర వైభవము' - అన్న ప్రకరణంలో కిన్నెర అందచందాలని హృదయంగమంగా చిత్రిస్తాడు కవి మహారసాత్మకంగా.

తూర్పులో తెల్లనై తోచిన దుషః కాంత
తొలిమావి లేబూత దూసెను పికీకాంత
తలలపై రతనాలు తళ తళా మెరిసేటి
నల్ల త్రాచులు దూకి నాట్యమాడేటట్లు
మెరిసింది కిన్నెరా - ఒడ్డుల్లు
ఒరసింది కిన్నెరా!

ఇట్లా - ప్రతి పొద్దులోనూ, ప్రతి ఋతువులోనూ మారే కిన్నెర వన్నె చిన్నెలు చిత్ర చిత్రంగా వర్ణించి -చివరగా అంటాడు కవి -

పూతాత్మ కిన్నెరా
తెలుగు దైవమ్ము భద్రాద్రిపై నెలకొన్న
రామయ్య - అతని దర్శనము
చేసే త్రోవ కాచింది కిన్నెరా!

ఈః కావ్యం చదివి ముగించిన తరువాత మనకు ఒక మహత్తర రసవాహినిలో మునకలు వేసిన దివ్యమైన అనుభూతి కలుగుతుంది. ఒక్కసారి భద్రాచలం వెళ్ళి కిన్నెరసాని వాగును చూచి రావాలనీ అనిపిస్తుంది.

నదిని స్త్రీగా, కొండను పురుషునిగా, భావన చేసిన కథ వసుచరిత్ర కథ. శుక్తిమతీ కోలాహల ఘట్టాన్ని నదీపరంగాను, నాయికాపరంగాను - అసమాన ప్రతిభతో శ్లేషించి రామరాజ భూషణుడు ఎన్నో చమత్కారాలు చేశాడు. అయితే, మహారాజులు, దేవతలు,దేవేంద్రుడు, వీరంతా పాత్రలైన ఆ కథ ప్రబంధ యుగానికి చెందినది.

ఇక్కడ - అచ్చమైన ఆధునిక తెలుగుకవి - ఆంధ్రజాతి వైభవమన్నా, పౌరుషమన్నా అణువణువునా పులకించి పోయే కవి -

'ఇమ్మొగఁ గాకుళమ్ము మొద లీ వరకుం గల యాంధ్ర పూర్వరా
జ్యమ్ముల పేరు చెప్పిన హృదంతర మేలా చలించిపోవు ! "

అంటూ ఉప్పొంగిపోయే కవి - భావనచేసి అచ్చుపోసిన తెలుగు కథ - కిన్నెర కథ మానవ జీవితంలోని కష్ట నిష్ఠూరాలకూ దాంపత్య జీవితంలోని ఒడుదుడుకులకూ, స్త్రీ పురుషుల మనస్తత్వాలకూ అద్దం పడుతూ, సామాజిక స్పృహతో, సహానుభూతితో - నడిచిన కథ.

వదలలేక వదలలేక కొండను చుట్టుకు తిరుగు తున్న వాగును చూచాడు కవి. సంప్రదాయ నిష్ఠుడైన కవికి ఆ ప్రకృతి దృశ్యంలో ధర్మ దాంపత్య రక్తి గోచరించింది. కులపాలికా ప్రణయరక్తి అనుభూతమైనది. ఆ దర్శనంలో

కరుణ రసం వాకలై సాగింది. నిత్య దుఃఖితగా మారిన స్త్రీత్వం కన్నులకు కట్టింది. సంసారంలో అనునిత్యమూ అమె అనుభవించే దయనీయ సంఘటనలు స్ఫురణకు వచ్చాయి!

చిత్రమేమిటంటే - విశ్వనాథవారు కిన్నెర పాత్రను సృష్టించిన ఆనాటినుంచీ ఈనాటి వరకూ - స్త్రీ ప్రతిపత్తిలో ఎక్కువ మార్పు కనిపించకపోవటం! ఆమె అనుభవాలు అంత చేదుగానూ ఉండటం! ఏదో ఒక కారణంగా ఆమె తనువూ మనస్సూ - మాటి మాటికీ దెబ్బ తినవలసి వస్తూనే ఉండటం! ఇంట్లో ఆదరణా బయట రక్షణా కూడా ఒక్కోకప్పుడు కరువయ్యే స్థితి! ఒక్కటే తేడా -కిన్నెర సాని కరిగి కరిగి నీరయిపోతే - నేటి అభాగిని గుప్పెడు బూడిద అవుతున్నది !

విశ్వనాథవారు ఒక రసమయ కవితాత్మక దృష్టితో కిన్నెరసాని పాత్రకు రూపకల్పన చేసినా, కథను నడిపించిన తీరులో - మానవీయమైన మనఃస్థితుల లక్షణం సహజాతి సహజంగా దర్శనమిస్తుంది. ఆవేశం, పంతం, ఎక్కువయితే, జీవితంలో ఎంత అనర్థం జరగుతుందో కిన్నెర ముందు ఆలోచన లేకుండా ఇల్లు వదలి అడవులు పట్టి పోవడం, అనేకల్పనలో మనకు విశదం అవుతుంది.

సంసారంలో ఎదురయ్యే ఒడుదుడుకులకు సర్దుకుపోయే మనస్తత్వం అలవరచుకోకపోతే - ఎంతటి చేటు జరుగుతుందో కిన్నెర కథ మనకు చెబుతుంది.అద్వితీయమైన భావనాశక్తితో, లోకవృత్త పరిశీలనా శక్తితో - యదార్థ మానవజీవన చిత్రణం చేశారు ఈ కిన్నెరసాని పాటలలో విశ్వనాథ వారు.

తనదైన ఆత్మీయతాముద్రను జోడించి, అడుగడుగునా ఆర్ద్రతను అద్ది, తెలుగుదనపు పరిమళాలు గుబాళింపులు వెదజల్లి, తెలుగు పదానికి స్వరాలు కూర్చి - విశ్వనాథవారు కిన్నెరసాని పాటలు వ్రాశారు.

తెలుగు జాతి ఉన్నంతకాలమూ, తెలుగు గుండెలో కారుణ్యం ఉన్నంతకాలమూ, భద్రాద్రిలో రాముడు ఉన్నంత కాలమూ - నిలిచి ఉంటుంది విశ్వనాథ వాణి సృష్టించిన కిన్నెరసాని!

•••

# 'విశ్వనాథ మధ్యాక్కఱలు' – వస్తు పరామర్శ

– డాక్టర్ ఎస్. ఎస్. రాజు

నిన్నుఁ దలంచుటయన్న భావముల్ నెగడుటకాదె
పన్నిన మధ్యాక్కఱలుగ భావముల్ వచ్చెడు స్వామి !
యెన్న నీకవనంబు లేకయున్న నేనేమయి యుందు
నిన్నెన్నఁ జాలక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! (92)

కుమ్మి ప్రవాహంబు చొరగ నిమిడించుకొని యోగియోగి
గుమ్ము నీళ్ళలు క్రక్కుతూమువలె నాదుగుండియ నిన్ను
చిమ్ముచున్నది 'యక్కఱ' యుగ నోదయాసింధు ! నింపి హృద
యమ్ము చీల్పఁ గదె భీమేశలింగ ! ద్రాక్షారామ సంగ ! (41)

మధ్యాక్కఱలకు నీకునాకు సంబంధంబు బలిసి
మధ్యాక్కఱలు, నేను వేఱ పనిమీద మాని వేసినను
నీ ధ్యానమేమయ్యె నేమియయ్యెద నేను కృపణమ
హిధ్యేయ ! వేములవాడ రాజరాజేశ్వరా ! స్వామి ! (33)

విశ్వనాథవారు మధ్యాక్కరలో పదిశతకాలను రాయడంలోగల అంతస్సూత్రాన్ని పై పద్యత్రయం ప్రకటిస్తోంది. వారి భావనలో భగవంతుడు మధ్యాక్కరగా రూపొందడమూ, ఆ కవనమే లేకపోతే తానేమైపోతానో అనే ఆవేదనా, మొదటి పద్యం. వారి హృదయమంతా వ్యాపించి ఉన్న దైవం ఒక్కొక్క. మధ్యాక్కరగా బయటకు వస్తున్నాడు. ఒక్కసారిగా హృదయాన్ని చీల్చి బయటకు రమ్మనమనే ప్రార్థన రెండవపద్యం. దైవాన్ని గురించి వారు చేయు ఒక్కొక్క స్తుతి ఒక్కొక్క మధ్యాక్కరగా రూపొందడంచేత, వారికి ఆ పరమేశ్వరునకు నడుమ మధ్యాక్కర ఒక వాహికగా ఏర్పడింది. ఒక వేళ మధ్యాక్కరల రచన మానివేసినా భగవద్ధ్యానాన్ని వీడను సుమా అనే విన్నపం మూడవ పద్యం. ఈ విధంగా ప్రకటితమైన విశ్వనాథవారి మౌలిక తత్వం వేయి ముఖాలుగా విస్తరించి, వారిచేత వేయి మధ్యాక్కరలు వెలువరింప జేసింది.

మధ్యాక్కరను ఒక ఆలంబనంగా చేసికొని విశ్వనాథవారు ఈ శతకాలలో తమ ఆత్మను ఆవిష్కరించారు. భగవంతుని ప్రార్థిస్తున్నట్లుగానో, భగవంతునితో సంభాషిస్తున్నట్లుగానో తన అనుభవాన్ని పాఠకునకు వివరిస్తున్నట్లుగానో, మరేదో విధంగానో పైకి కనిపించే పద్యాలలో అంతర్లీనంగా అనేక విషయాలు కనిపిస్తాయి. భగవంతుడు ప్రత్యక్షమైనప్పటి వారి స్వానుభవం, గహనమైన ఆధ్యాత్మికాంశం, ఉపనిషత్ప్రతిపాదితమైన పరబ్రహ్మతత్వం, సృష్టి స్వరూపం, లోకపరిశీలనం, సగుణమూర్తులలో నిర్గుణ బ్రహ్మమును ప్రతిపాదించడం, వైరాగ్యభావం, యోగవిద్యాప్రకటనం, మానవస్వభావ చిత్రణం, భక్తి భావస్వరూపం, వారి ఆత్మ నివేదనం వంటి అసంఖ్యాక విషయాల సంపుటి ఈ శతకాల లోని వస్తువు. పది గ్రామాలలోని పదిమంది దైవతాలను సంబోధిస్తూ, వారు వెలువరించిన ఇటువంటి భావపరంపర సాహిత్యంతో కూడుకొని ఉండడంచేత, ఈ శతకాలకు సారస్వతంలో ఒక వైశిష్ట్యం చేకూరింది. ఉదాహరణకు పై మూడు పద్యాలలోని మొదటి దానిలో భగవంతుని తలచుకోవాలని అనుకోగానే భావాలు నెగడుతున్నాయని అనడంలో

భావాన్ని గంభీరంగా ప్రకటించిన వైఖరి ఉంది. రెండవదానిలో వారి దైవభావన, నిండైన చెరువుకు ఉన్న తూమునుంచి కుమ్ముకొని వచ్చే నీరులా, వారి గుండె నుంచి వెలువడుతోందని చెప్పడంలో ఆలంకారిక చమత్కారం ఉంది. మూడవ దానిలో వారికీ దైవానికీ ఉన్న సంబంధాన్ని మధ్యాక్కర రూపంగా అభివర్ణించడంలో ప్రతీకాత్మక సౌందర్యం ఉంది. ఇలా ప్రతి పద్యంలోనూ విశ్వనాథవారు, తమ నిసర్గభావాలను వెలువరించిన రీతిలోని కావ్యకళాసౌరభాన్ని వ్యాఖ్యానించవచ్చు. దీనికి తోడు వ్యవహార భాషాగత జీవలక్షణమైన నుడికారాన్ని కావ్య ప్రయోగరూపంలో ఈ శతకాలలో పుష్కలంగా దర్శించవచ్చు. " ఏ సందేశం ఉంది అన్న దానిని బట్టి రచనకు విలువ కల్గదుకాని, ఏ సాహిత్యం.విలువ ఉండడంచేత సందేశానికి బలం, ఆకర్షణ చేకూరుతాయి అన్నది మాత్రం సత్యం." అన్న ముదిగొండ వీరభద్రయ్యగారి (విమర్శ - మౌలిక లక్షణాలు. 40) తీర్పుకు 'విశ్వనాథ మధ్యాక్కఱలు' గీటురాయి వంటివి. చెలమల వంటి ఈ శతకపద్యాలను వస్తువిన్యాసం, కావ్యకళాసౌరభం, భాషా సౌందర్యం అనే మూడింటిని ప్రధానాంశాలుగా జేసికొని పలుకోణాలలో పరామర్శించవచ్చు. ఇదొక బృహత్తరమైన ప్రణాళిక. 'విశ్వనాథ మధ్యాక్కఱ' లను దిఙ్మాత్రంగా పరిచయం చేయడమే ఈ వ్యాసంలో ఉద్దేశించింది. కాబట్టి దీనిలో భాగంగా, ఈ కావ్య పరిశీలనాంశాలలో ప్రప్రథమ మైందిగా గుర్తించిన వస్తు విశ్లేషణ సూచన ప్రాయంగా ఇక్కడ పరామర్శించబడుతుంది.

ఈ శతకాలు ప్రాయికంగా భగవన్నుతి పూర్వకాలైనవి. ఒక్కొక్క పద్యం ఒక్కొక్క కావ్యం. భక్తి ఉపనిషద్విషయ ప్రతిపాదన, లోక పరిశీలన వంటి పైన చెప్పిన విషయాలు ఒక్కొక్కటీ రచయిత స్వానుభవంతో మిళితమై ఒక్కొక్క పద్యంలో వర్ణింపబడ్డాయి. ఈ విషయాలకు క్రమానుగతిగానీ, విభాగ వివేచనగానీ కనిపించదు. ఈ శతకాలలో ముక్తక లక్షణంతో పాటు చాటు పద్యలక్షణం కూడా కలిసి ఉండడం చేత అక్కడక్కడ పునరుక్తి ఉంది. అయినా కవి ప్రదర్శించిన కావ్యకళా నైపుణ్యం ముందు అదంతగా పరిగణింపదగింది కాదు. గుర్తింపదగిన ఏకసూత్రత కనిపించకపోయినా, స్థూలంగా ఈ శతకాలను భక్తి శతకాలుగా పేర్కోవచ్చు. వీటిలో మౌలిక జీవితానికి అందుబాటులో ఉండే తర్కంతో ఆధ్యాత్మికాంశాలను ప్రశ్నించినట్లుగా పైకి కనిపిస్తూనే పరబ్రహ్మతత్త్వం నిరూపించడం గోచరిస్తుంది. వివిధ సందర్భాలలో మానవులు ఎలా ప్రవర్తిస్తారో, వారి స్వభావం ఎటువంటిదో, సమకాలీన సమాజ పరిశీలనతో విశ్లేషించి చూపడం కనబడుతుంది. కవి జీవితంలోని అనుభవాలకు, అనుభూతులకు సాహిత్యగౌరవం కలిగించినట్లుగా కొన్ని పద్యాలలో మనకు తెలుస్తుంది. నిరంతరం తన మనస్సులో మసలే భగవంతునితో సంభాషిస్తున్నట్టుగా, భగవత్తత్వప్రతి పాదనతో పాటు సమాజస్వభావాన్ని కూడా కవి చిత్రించారు. నిత్య వ్యవహారంలో పుట్టే వాక్యాలకు ప్రతిబింబంలాంటి భాషలో రచించడం వీటి ప్రత్యేకత. భక్తికి సంబంధించిన అంశాలలో కొత్త లేకపోయినా, వాటిని ప్రకటించడంలో పైన పేర్కొన్న విషయాలను పొందుపరచడం చేత ఈ శతకాలకు సారస్వతంలో విశిష్టత చేకూరింది. ఈ శతకాలలో వస్తువు అంటూ స్పష్టంగా, చూపడానికి ఏదీ లేకపోయినా, వస్తువుగా పేర్కొనదగిన కొన్నిటిని ఇక్కడ పరామర్శిద్దాము.

## 1. ఉపనిషద్విషయ వ్యాఖ్యానం :

> ఊరక యుండిన వాని ( గొని పోవు టొక సంతలోన (
> గూరుచుండగ( బెట్టుచే పదార్థంబు కోరరాదనుట
> కోరినచో ( దల కొటువి కొని తెచ్చికొన్నట్లె యేమి
> శూరత్వమిద్ది ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ !     (37)

ఈ సృష్టిస్థితిలయాలకు ఆ పరమాత్మ ఆధారం. దీనిని 'అహం వృక్షస్యరేరివా' (తైత్తిరీయోపనిషత్. శీక్షావల్లి)

అనే శ్రుతి వాక్యం సమర్థిస్తోంది. అంటే చరాచరజగత్తు అనే వృక్షాన్ని అంతర్యామిగా ప్రేరేపించువాడు పరమాత్మ. స్థూల శరీరాన్ని పొందిన జీవుడు మాయా ప్రభావంతో ఇంద్రియ లోలుడవుతాడు. ఇంద్రియ ప్రవృత్తి ననుసరించి జీవించేవారికి ఆత్మజ్ఞానం కలగక మోక్షం లభించదు. అంటే పరమాత్మ సృష్టిచేయడం వలనే జీవుడు మాయావశుడై ఇంద్రియలోలుడై మోక్షం పొందలేక పోతున్నాడు. ఇదే దేవుని విడ్డూరం. 'ఊరకయుండిన - - - - పెట్టుట' అంటే ఆత్మస్థూల శరీరాన్ని పొందడం. 'ఏ పదార్థమ్ము ----అనుట' అంటే నశ్వరమైన దేహాదుల వల్ల భ్రాంతి ఉండకూడదు. 'కోరినచో - - - - - కొన్నట్లె' అంటే దేహాదులపట్ల భ్రాంతి ఉంటే జ్ఞానం లభించదు. వ్యవహార దృష్టితో చూస్తే దీనిలో న్యాయం లేదు. అందుకే ఏమి శూరత్వమని కవి దేవుని ప్రశ్నించారు. ఇలా అనేక పద్యాలలో, గహనమైన ఆధ్యాత్మిక సత్యాలను, వ్యావహారిక సత్యానికి చేరువగా తీసికొని వచ్చి విశ్వనాథవారు వ్యాఖ్యానించారు. 'నాలోననెంతగాఁ ద్రవ్వుకొన్న ( బినాకి ! కన్పడవు - --6 '( శ్రీశైల. 2), 'ఒక తెల్ల గురివిందగింజ వోలిక నున్న కాలాణు వకట -- -'(వేములవాడ. 74) మొదలైన పద్యాలలో ఉపనిషద్విషయాల వ్యాఖ్యానం కనిపిస్తుంది. ఈ శతకాలలోని చాలా పద్యాలలో ఈ అంశాన్ని విశ్వనాథవారు ఆయాదైవాలకు సమన్వయ పరుస్తూ వ్యాఖ్యానించారు. ఈ విధంగా బ్రహ్మ నిత్యత్వం, జగన్మిథ్యాత్వం, ఆత్మజ్ఞానమే మోక్షం వంటి ఉపనిషత్ సారాంశాన్ని వారు వ్యవహార ధోరణిలో చర్చించి భగవంతునికి విన్నవించుకొనే వైఖరి మనోహరంగా కనబడుతుంది.

## 2. యోగ విద్యాసమన్వయం :

క్రింది నుంచియును బైదాక శ్వాసదీర్ఘీకరించి తరు
ణేందు చూడామణీ ! పాముతోఁ(కపై నిల్పుచందమునఁ
బొందు వెన్నెముక వెంబడి ( బినాకంబు పూని యుంటివని
యందునా నందమూర్నిలయ ! విశ్వేశ్వరా ! కులస్వామి ! (21)

మూలాధారమునుండి బ్రహ్మదండి మూలమున నాసికాగ్రం వరకు వ్యాపించి యుండే సుషమ్న నాడిలో కుండలినీ శక్తి ఉంటుంది. ఈ శక్తిని జాగృతం చేస్తే అది మూలాధారం నుంచి సహస్రార చక్రం వరకు ప్రయాణం చేస్తుంది. అప్పుడా జీవుడు ముక్తుడవుతాడు. ఈ యోగశాస్త్ర సంబంధమైన అంశాన్ని ఆధారంగా చేసికొని ఆ కుండలినీ శక్తియే విశ్వేశ్వరుడనే భావాన్ని కవి ఈ పద్యంలో ప్రతిపాదించారు. ఇటువంటి, యోగశాస్త్రమునకు సంబంధించిన విషయాలకు వ్యాఖ్యానప్రాయమైన రచన "ఏ నెల్లునుంగాను, పరమహంసయు నింద్రియ విహృతి లోనడంచి విముక్తి నందె--- " ( శ్రీకాళహస్తి. 6 ) 'ఒకటి నిశ్చయమయ్యు బయట నెచ్చట నుండియో నీవు---( శ్రీశైల. 48) మొదలైన పద్యాలలో కనబడుతుంది 'తన నాసంట నిషణ్ణుడై పినాకలస్తకమును వంచి --' ( నెకరుకల్. 88) మొదలైన ఎన్నో పద్యాలలో యోగశాస్త్రాన్ననుసరించి భ్రూమధ్యంలో ప్రకాశించే జ్యోతి వర్ణించబడింది. ఈ అంశంలో వారి స్వానుభవమే పెక్కు పద్యాలలో ప్రకటితమైంది.

## 3. శివకేశవాభేద భక్తి :

ఆయన యహిరాజు శయ్య నిద్రించె, నాయహిరాజె
నీయెడ భూషణంబయ్యెఁ, గొడుకయ్యె నీవాని యొకటి
యైయున్న తత్త్వంబొ మీరలిద్దఱు ! యధికమా యేదొ
యైయున్కి తోచు శ్రీకాళహస్తీశ్వరా ! మహాదేవ ! (7)

నిన్ను భావించుచు విష్ణు వనుకొందు, నీవనుకొందు
వెన్ను నూహించుచు, నిద్దరుంగారు వెసభావమందు
నన్ను నేనే విముక్తునిగ ( దేజస్సనాథుగా బిట్టు
నెన్నుచు వేములవాడ రాజరాజేశ్వరా ! స్వామి ! (98)

శ్రీకాళహస్తీశ్వరుణ్ణి స్తుతిస్తూ శేషశాయి, నాగభూషణులలో, మన దృష్టికి గోచరించే సామ్యాన్ని వర్ణించి, మూలతత్వాన్ని ఊహ చేయడం మొదటి పద్యంలో ఉంది. వేములవాడ రాజరాజేశ్వరునకు చేసిన ప్రార్థనలో శివ విష్ణు తత్త్వాలగురించి కవికి కలిగిన భావన, అభేదదృష్టి ప్రకటితమైంది. 'శివునకు నీకును నేను భేదంబు చేసితినేని --'(శేషాద్రి . 6)'తలమీదినెమ్మిపింఛియముసురగంగతరగల'(మున్నంగి. 86) మొదలుగా గల పద్యాలు పెక్కింటిలో శివకేశవాద్వైత భక్తిభావం వర్ణించబడింది. కొలిచేదేముడెవరైనా మూలతత్త్వం ఒక్కటే అనే భావమే అన్ని పద్యాలలోను కనిపిస్తుంది. అర్చనా మూర్తులను ఆరాధించడంలో మానవులకు కలిగే వివిధ భావాలు ప్రపంచించబడి వాటిని జ్ఞానభక్తి మార్గంలో సమన్వయించడం కనిపిస్తుంది.

## 4. పూర్వగాథల ప్రస్తావన :

ఇది గుండె వింధ్యాద్రివోలె గగనానికెగసి గ్రహాళి
కదలనీయక సూర్యకాంతి చిటుతకాల్వల చినుకు
మొదలనీయద కుంభసంభవత, దీని మిట్టి పాటీవు
చిదుమగానే వలె వేంకటేశ్వరా ! శేషాద్రి నిలయ ! (26)

వింధ్య పర్వతం పైకెదిగి సూర్యమండలం వరకు వ్యాపించగా లోకాలు అంధకారమయమయ్యాయి. అపుడు అగస్త్యుడు వింధ్యాద్రి గర్వమణచి లోకాలకు కాంతి ప్రసాదించాడు. కవి ఈ పురాణ కథను ఆధారంగా గ్రహించి ఈ పద్యంలో వింధ్యాద్రిని హృదయంతో ఉపమించడం కనబడుతుంది. హృదయం కామంతో పైకెదిగి జ్ఞానాన్ని నిరోధించి అజ్ఞానం వ్యాపించునట్లుగా చేస్తోంది. కాబట్టి హృదయపు మిట్టిపాటును తొలగించమనే అభ్యర్థన ఈ పద్యంలో ఉంది. ఇక్కడ హృదయమనే వింధ్యాద్రికి భగవంతుడే అగస్త్యుడు. 'ఒక సాలెపురుగు నాకొక్క యేనుగు నొకపాము వీనినకట !----' (శ్రీకాళహస్తి. 50) 'చన్నదినాల మత్స్యేంద్ర యోగి యాసారంగధరుని --- (వేములవాడ . 2) మొదలైన పద్యాలలో పూర్వ గాథలు వివరింపబడ్డాయి. శ్రీశైల, శ్రీకాలహస్తి మొదలైన శతకాలలో శివభక్తులకు వలె భద్రగిరి, శేషాద్రి మొదలైన శతకాలలో విష్ణుభక్తులకు చెందిన గాథలు ఆధారంగా భక్తి ప్రబోధం కనిపిస్తుంది. విష్ణుపరమైన శతకాలలో అవతార కథనం నవ్యమార్గంలో గోచరిస్తుంది. భక్తుల చరితంగానీ, పురాణగాథలు గానీ ఇప్పటి భక్తుల ఆలోచనలకు అనుకూలంగా వ్యాఖ్యానించడం ఈ శతకాలలోని విశేషం.

## 5. అంకురిత భక్తి :

నాగుండె తీసి నీ పాదమూలంబునం బెట్టు మనుము,
మాఁగు వారిన, శ్రద్ధ సుంత మసలిన, మార్పేరఁ బిలుము
ఊగులాడితినేని వందజన్మ లిట్లొగ్గకు ! నీదు
జోగిని నేను ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! (6)

ఇది విశ్వనాథవారు చేసిన దైవ ప్రార్థన కొక నిదర్శనం. గుండెమాగువారడమంటే భగవద్ధ్యానంతో హృదయం పరిపక్వత చెందడం. గుండెతీసి దేవుని పాదమూలంలో పెట్టడమంటే భక్తి పరాకాష్ఠను పరీక్షించుకోమనే అభ్యర్థన. భక్తుడు భగవంతునికి చేయు ప్రార్థనలో తనకు తానుగా భగవంతుని కర్పించుకొనే అచంచలమైన భక్తి ప్రకటింపబడింది. ఇలా ప్రార్థన వ్యాజంతో విశ్వనాథ వారు జ్ఞాన భక్తిని విశదం చేశారు. ఈ శత కాలలోని ప్రతిపద్యంలోను ప్రార్థన ఉంటుంది. కొన్నిటిలో విషయ ప్రాధాన్యాన్ని బట్టి ఈ అంశం మరుగు పుచ్చబడుతుంది. 'ఎంచవే యేకాంత మందు నన్ను మహేశ్వర ! పరిగణించవే --- '(ద్రాక్షారామ. 29) 'మనసెక్కువగ నైహికమ్మగు దినుసు మనసుతోమము --- ' (భద్రగిరి. 4) వంటి పద్యాలలో వారు భగవంతునికి చేసిన అభ్యర్థనలో సాధారణ మానవుని చిత్తవృత్తిని వర్ణించి, తన మనస్సులో నివసించుమని అడగడం కనబడుతుంది. సాధారణ భక్తులు దైవసాక్షాత్కారం పొందడంలో ఎదురయ్యే సమస్యలను దేవుని ముందు ఏకరువుపెట్టడం ఉంది. 'విశ్వనాథవారి అకుంఠిత భక్తికి 'సకల వేదమ్ములు నుపనిషత్తులు సకలాగమములు (శేషాద్రి. 62) వంటి పద్యాలనెన్నింటినో చూపవచ్చు.

## 6. స్వానుభవ ప్రకటనం :

జ్యోతి వోలిక నీవు కనుబొమల మధ్య నుదయించువేళ
నీ తనూయష్టిలో గాలి యాగిపోయెడు రమారమణ
చేతమ్ము స్తంభించు మండెఁ బ్రాణమ్ము చేతమ్ము జంట
నీ తమ్ము లొకసారి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! (72)

నీవచ్చటెచ్చటో నాదు శిరసుపై నెగడు చుంటివని
యావేగ పడుకొంచు నాదు మేనిలో నాడు నెత్తురులు
నో విశ్వనాథ ! తామెదురు ప్రవహించుచున్నవి పైకిఁ
గ్రోవి చిమ్ముగతి శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! (46)

విశ్వనాథవారికి పరమేశ్వరుడు భ్రుకుటిలో జ్యోత్యాకారంలో కనబడటం, అపుడు దేహంలో గాలి ఒక్కసారిగా ఆగిపోవడం, మనస్సు స్తంభించుకుపోవడం, నెత్తురు ఎదురు తిరిగి ప్రవహించడం మొదలైన స్వానుభవ విశేషాలు పై పద్యాలలో ప్రకటించబడ్డాయి. సమాధి నిష్ఠులైన ఋషులకు దైవ సాక్షాత్కారం కలుగుతుందని, యోగనిష్ఠాపరులు కనుబొమల నడుమ కాంతి పుంజాన్ని దర్శిస్తారని సర్వులకు విదితమైన విషయం. తదనుభవం ఎలా ఉంటుందో చెప్పిన సన్నివేశాలు మృగ్యం. విశ్వనాథవారు ధ్యాన సమాధి యందున్నపుడు వారికా పరబ్రహ్మం జ్యోతిలా కనిపించినప్పటి అనుభవాన్ని పలుపద్యాలలో ప్రపంచించారు.

మున్నులింగాకారమైనఁ గన్నులు మూసినయంత
గన్నుం బొమల మధ్య జోతి మాదిరిఁ గానిపించెడిది
యున్న తెలివి పోయెఁ జదువవేయగా నొగి నన్నయల్లు
సున్నయైనావు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! (43)

ఈ విధంగా సాకారమూర్తిని ధ్యానించగా వారికి జ్యోతి సాక్షాత్కారం కలిగినట్లుగాను అద్వైతజ్ఞానం లభించినట్లుగా వారు అనేక సందర్భాలను ప్రస్తావించారు. చాలా పద్యాలలో సగుణమూర్తిని స్తుతిస్తూ నిర్గుణ మూర్తిని దర్శించినట్లుగా పేర్కొన్నారు. వారికి కలిగిన ఆత్మజ్ఞానాన్ని లౌకిక విషయాలతో జోడిస్తూ విశదపరచారు. తమ అనుభవ ప్రకటనాన్ని

ఈ శతకాలలో విశేషంగా వేయడంతో పాటు 'నా రాముడు' కావ్యంలో కూడా మనోజ్ఞంగా వెల్లడించారు. 'చచ్చెడు నాటికి సంధ్య మంత్రమన్‌జదురుపల్కొప్ప ........' ( శ్రీకాళహస్తి. 37 ) 'కన్నులలో నీరు నిలచి గొంతులోగాద్గద్య మొప్పి ....' (మున్నంగి. 61) మొదలైన పద్యాలలో వారికి కలిగిన పలురకాలైన అనుభవాలను వర్ణించారు. ఈ శతకాలను అన్యశతకాలనుంచి వేరుపరచే విశిష్ట లక్షణాలలో కవి ప్రకటించిన ఆత్మజ్ఞాన స్వానుభవం ఒకటి.

## 7. లోక పరిశీలనం :

తనివి తీరగ నిన్ను రెండు చేతులఁ దాఁకగావచ్చుఁ
గనులఁ ద్రోవగ వచ్చు నిన్నుఁ గౌగింట గ్రమ్ముకోవచ్చు
నునికి నున్నట్లుగా వచ్చి మడి లేకయును గొల్వవచ్చు
సునిశిత బుద్ధి శ్రీశైలమల్లికార్జున మహాలింగ ! (11)

శివాలయాలలో, ఆలయవిధులతో ఏ నిమిత్తమూ లేకుండా భక్తులు ప్రకటించే భక్తి భావనారీతులు ఈ పద్యంలో విశదీకరించబడ్డాయి. శాస్త్ర మర్యాదలలోని కట్టుబాట్ల కంటె భక్తి భావనా నైర్మల్యమునకున్న విశిష్టత ఇక్కడ సునిశిత పరిశీలనచే గుర్తింపబడింది. ఈ విధంగా విశ్వనాథవారు లోకంలో ఎదురయ్యే పలు సన్నివేశాలకు ఆధ్యాత్మిక తత్వాన్ని జోడించి గంభీరమైన సమన్వయాన్ని చాలా పద్యాలలో మనకు అందిచ్చారు. 'కుక్కయు మరి దాలి గుంటలో బండుకొన్నంతసేపె ....' (వేములవాడ .87 ), 'కలసివచ్చినవాడు జగము పౌరుషకలనమంచాడు .......' ( శ్రీశైల. 61) మొదలైన పద్యాలలో, మానవ సమాజంలో కనిపించే సంఘటనలు ఆలంబనంగా చేసికొని వేదాంత విషయాలను విశ్లేషించి చూపడం ఉంది. మానవులు ఎదుర్కొనే సమస్యల వలన వారు, ఈశ్వర ధ్యానమునందు ఏకాగ్రతను వహించలేక పోతున్నారనే విషయాన్ని కవి చాలా పద్యాలలోవ్యంగ్యంగా వివరించారు.

## 8. మానవ స్వభావచిత్రణ :

కోరి, కబేలాకు, మందగాఁ దోలికొని పోవుమండ
దారి ప్రక్కన యున్న పచ్చి గడ్డిపైఁ దారాడు పసుల
తీరుగా నున్నది జనుల భోగాశ ! తెలివి సర్వమ్ము
చూలుపుచ్చెదవు, శ్రీశైలమల్లికార్జున మహాలింగ ! (8)

ఇటువంటి మానవ స్వభావచిత్రణ ఉన్న పద్యాలు ఈ శతకాలలో అక్కడక్కడ కనిపిస్తాయి. 'మానవులు అజ్ఞానంతో భౌతిక వాంఛలకు లోనై, బుద్బుదప్రాయ మీ జన్మ అనే మాటను మరచిపోతున్నారు.' ఈ భావాన్ని పై పద్యంలో ఆలంకారికంగా వెల్లడి చేస్తే, 'తెలివి సర్వమ్ము చూలుపుచ్చెదవు' అని పరమేశ్వర లీలా విశేషాన్ని ప్రకటించడంలో, పద్యాన్ని శతక స్వభావానికి అన్వయించడం గోచరిస్తుంది. 'ఇల సుభార్థులు గడ్డితించు కుధనులై మెకదొట్టుపేలా ----' ( శ్రీశైల. 71), 'దంతురమగు నూహసేయుకొలదిఁ బద్మవ్యూహమయిన ----' (నెకరుకల్. 75) మొదలుగాగల పద్యాలలో వివిధ సందర్భాలలోని మానవుల స్వభావం ఏ తీరులో ఉంటుందో విశ్వనాథ వారు వర్ణించారు. అన్నిటా, ఈ ప్రపంచం అశాశ్వతమని తెలిసి కూడా మానవులు, ఆత్మజ్ఞానాన్ని పొందలేక పోవడాన్ని సానుభూతితో ప్రకటించారు. మానవ స్వభావ చిత్రణకు వారు తీసికొన్న ఉపమానాలు, వారి మనో విశ్లేషణాత్మక దృష్టికి నిదర్శనాలు.

## 9. స్వీయ జీవిత కథనం :

ఇప్పటి కరువది యైదు వచ్చిన వేమనవలయు
నపమెడు పాతిక యేండ్లనాడు నీ యందు నా మనసు
చొప్పెలులున్నదోయట్లె యున్న దీ చొప్పు నీ వేమి
చెప్పెదో వేములవాడ రాజరాజేశ్వరా ! స్వామి ! (95)

నాకీ జగతి నధికారములన ( దృణప్రాయములగు(
గాక, పిల్లల కేమియైన మిగులునో కాదననేల
నీ కృపావశమున మనసు నీపైన నిలుచు చునుండె
శ్రీకంఠ ! దయచూడు నెకరుకల్ ప్రాంతసిద్ధాబ్జహేళి ! (62)

విశ్వనాథవారు దేవునితో వేయు సంభాషణల్లో వివిధాంశాలలో భాగంగా స్వీయ జీవితానికి సంబంధించిన వాటిని కూడా ప్రస్తావించారు. వారికి దైవ భక్తి పాతికేళ్లప్రాయంలో ఎలా ఉందో అరవై అయిదేళ్ళనాడు కూడా అలాగే ఉందని, తనకు పదవీతృణప్రాయము వంటిదని, తన పిల్లలకు దైవకృపచే సంపద కలుగునని వారు పై పద్యాలలో సూచించారు. 'మా యూర నీపేరిస్వామి కలడు, కమ్మకులాంబుధి శశి ---' (మున్నంగి 13)'వసుధ నాకంటెను బుద్ధిమాలిన వా(డు లేడనుము---' (భద్రగిరి. 44) మొదలైన పద్యాలలో కవి తమ జీవితంలోని సంఘటనలను ఆయాదైవతాలకు వివరిస్తూ, సమస్యలకు పరిష్కారాన్ని అర్థించారు. విశ్వనాథవారి ఆత్మకు అద్దంపట్టే ఈ శతకాలలో వారి జీవితచరిత్రకు సంబంధించిన సన్నివేశాలు కూడా పలు పద్యాలలో చోటు చేసుకున్నాయి. వారెన్నిటిని పేర్కొన్నా అన్నీ వారి అద్వైత భక్తితో సంవదించునట్లుగా కనిపించడం ఈ శతకాలలోని విశేషం.

ఈ విధంగా అసంఖ్యాకమైన విషయాలను, కేవలం వస్తు విన్యాసానికి సంబంధించిన వాటినే చెపమికోవచ్చు. చాలా పద్యాలలో రెండుమూడు అంశాలు మిళితమై ఉంటాయి. విషయప్రాధాన్యాన్ని బట్టి దానిని పరిగణించవలసి ఉంటుంది. విశ్వనాథవారు ఈ శతకాలలో ఉత్కృష్టమైన ఆధ్యాత్మిక భావసంపదను, నిశిత పరిశీలన దృష్టితో, శక్తిమంతమైన భాషలో వెల్లడించిన తీరు ఆత్మాశ్రయ కవితాప్రక్రియకు నవ్యశోభను సంతరించిపెట్టింది; వారి నొక మహాకవిగానే కాక, మహాజ్ఞానిగా కూడా నిలబెట్టింది. పర్యవసానంగా, 'విశ్వనాథ మధ్యాక్కఱ'లను చదువుతున్నపమెడు నాకు, వారి ఎదపై చెవిపెట్టి గుండె చపమిళ్ళను వింటున్నట్లు అనిపించింది. వారి ముందు పీట వేసుకొని కూర్చుని ఆధ్యాత్మిక ప్రబోధాన్ని స్వీకరిస్తున్నట్లు అనిపించింది. వారు తీరుబడిగా కూర్చుని, లోకానుభవాలను వివరిస్తున్నట్లు అనిపించింది.

• • •

# తెలుగు సాహిత్యంలో పేరడీ

**డాక్టర్ ముక్తేవి భారతి**

తెలుగు సాహిత్యంలో పేరడీ అనేది ఒక విశిష్టమైన ప్రక్రియ. పేరడీ ప్రధాన లక్ష్యం హాస్యోత్పత్తి. అయితే కేవలం హాస్యం మాత్రమే కాదు. ఈ ప్రక్రియ వికటకవిత్వమని, అనుకరణ కవిత్వమని, వికృతికవిత్వమని రకరకాలుగా పిలువబడింది. కానీ ఇవి ఏవీ కూడా పేరడీ యొక్క సంపూర్ణ స్వభావాన్ని చూపించటం లేదు.

వికటకవిత్వం మన సాహిత్యంలోవున్నదే అనటానికి వికటకవి తెనాలి రామలింగని కవితలు కొన్ని ఉదాహరణ ప్రాయంగా నిలుస్తాయి. అయినా తెనాలి రామలింగని కవిత్వాన్ని పేరడీలుగా గ్రహించవచ్చా అనేది ప్రశ్నగా మిగిలిపోతుంది. హాస్యస్ఫోరకత వున్నంత మాత్రాన అది వికటకవిత్వం కాదు.

కూచిమంచి జగ్గకవి చెప్పిన చంద్రరేఖా విలాపం పేరడీయేనని కొందరు అభిప్రాయపడ్డారు. ఇది తిట్టు కవితగా జమ వేయవలసినదేనని మరికొందరు అభిప్రాయం వ్యక్తం చేశారు. జగ్గకవి నీలాద్రిరాజుని, అతని పరివారాన్ని తిట్టిన తిట్ల వల్ల కొంత హాస్యం జనించినా, అది ఉదాత్తమైన హాస్యంగా అంగీకరింపబడదు. ఇందులో వికటత్వం, హాస్యం కన్న జుగుప్స ఎక్కువగా వుండటం వలన దీనిని పేరడీ అని పూర్తిగా చెప్పటానికి వీలు కనిపించదు.

వీరేశలింగంగారు రచించిన అభాగ్యోపాఖ్యానం పేరడీ అనే భావం కలిగించినా అది పూర్వ ప్రబంధాలను నిరసిస్తూ చేసిన అధిక్షేప రచన మాత్రమే. వెళ్ళపిళ్ళవారి గీరతము పేరడీ అనే భావం కలిగించినా, కృతఘ్నుడైన శిష్యుణ్ణి మందలిస్తూ ఉపదేశాత్మకంగా చేసిన రచనే అది. ఇలా పేరడీ లేమో అనే అపోహ కల్గిస్తున్న రచనలు చాలా కనిపించినా, ఇవేవీ పేరడీలు కావు అని అనుకుంటే, మరి పేరడీ అంటే ఏమిటి? పేరడీ రచయితలెవరు అని పరిశీలించాల్సిన అవసరం వుంది.

పాశ్చాత్య సాహిత్య ప్రక్రియలెన్నో మనసాహిత్యంలో ప్రవేశించినట్లు పేరడీ కూడా మన సాహిత్యంలో ప్రవేశించింది.

"పేరడీ అంటే ఒక పాటలోని అర్థాన్ని విపరీతంగా మార్చేసే మరోపాట ' అని, "పాట, పద్యం మొదలైన వాటికి చేసే అనుకరణ " అని, "గద్యం లేదా పద్యరూపంలో వున్న సాహిత్యకృతిని పరిహసిస్తూ చేసే అనుకరణ" అనీ, "రచయితశైలిని అనుకరణ ద్వారా అపహాస్యం చేసే ఒక రచన" అనీ - ఇలా ఆంగ్లభాషా నిఘంటువులు నిర్వచనం చేశాయి.

పేరడీ రచయిత పాటించవలసిన కొన్ని ముఖ్యాంశాలు వున్నాయి. ఎవరి రచనపై పేరడీ రాయాలనుకుంటున్నామో ఆ రచయిత గురించి, రచన గురించి క్షుణ్ణంగా తెలుసుకోవటం ముఖ్యం. మూలరచన గంభీరంగా వుంటే తేలిగ్గా పేరడీ రచన సాగాలి. హాస్యం, విమర్శ హద్దు మీరకుండా వుండాలి. పేరడీలో సృజనాత్మకత వుండాలి.

తెలుగు సాహిత్యంలో పేరడీ రచయితలుగా ప్రసిద్ధి పొందినవారు కొద్దిమంది మాత్రమే. పేరడీ అనే మాట వినబడగానే మనకి వినిపించే మొదటిపేరు జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారిది. ఆయనే జరుక్ శాస్త్రిగాను, పేరడీశాస్త్రిగాను ప్రసిద్ధుడయ్యాడు. తెలుగులో పేరడీ ప్రక్రియకి ఒక స్థానం కల్పించింది జరుక్ శాస్త్రి అనటం అతిశయోక్తి కాదు. రుక్మిణీ నాథశాస్త్రి చదువు వీధి బడిలో నాలుగో తరగతి దాటలేదని, తండ్రి దగ్గర వేదం, జ్యోతిషం, స్మార్తం నేర్చుకున్నారని, చిన్నప్పటినుంచీ ఒక విధమైన తిరుగుబాటు స్వభావం వుందని విన్నపుడు, ఆయనపై ఒక విధమైన గౌరవము, అభిమానము కలుగకతప్పదు. "కృష్ణ శాస్త్రినో, విశ్వనాథనో, ఏకకాలంలో ఇద్దరినో, ఒకరి

తరువాత మరొకరినో మానా చేసుకున్న, శ్రీ శ్రీ లాటి అలనాటి యువకుల లోనే రుక్మిణీనాథ శాస్త్రికి స్థానం" అన్న కె.వి.రమణారెడ్డి గారి మాటలు రుక్మిణీనాథశాస్త్రిని అభ్యుదయమార్గగామిగా రూపొందిస్తున్నాయి. (రమణారెడ్డి కె.వి. (పీఠిక) జరుక్ శాస్త్రి పేరడీలు ఇతర కవితలు - పేజి 13)

జరుక్‌శాస్త్రి ఎవరిరచనపై పేరడీ రాసినా, ఆయా కవులంతా జరుక్‌శాస్త్రి పై అభిమానం గౌరవం వున్న వారే. జరుక్‌శాస్త్రి వినోదానుకరణ ఏకపక్షంగా సాగలేదు. కొన్ని సందర్భాలలో గేయాన్ని మొత్తంగాను కొన్ని సార్లు పాదాన్ని మొత్తంగాను కొన్ని సార్లు వచనాన్ని అనుకరించి పేరడీ రచన చేశారు జరుక్ శాస్త్రి. ఇవన్నీ వినోదంలో, అధిక్షేపం జత చేసి చేసిన రచనలుగా కనిపిస్తాయి. గేయానుకరణంలో అధిక్షేపం తక్కువగాను, వినోదం ఎక్కువగానూ, కన్పిస్తుంది. అనుకరణకి కృష్ణశాస్త్రి, విశ్వనాథ, శ్రీ శ్రీ, నాయని - ఇలా ఎందరో ప్రసిద్దులైన కవుల రచనలను స్వీకరించారు.

శ్రీ శ్రీ రచించిన 'నవకవిత' అనే గేయాన్ని జరుక్‌శాస్త్రి 'సరదాపాట' అని పేరడీ రచన చేశారు. నవ కవిత ద్వారా చైతన్యాన్ని పాఠకుల్లో రేకెత్తించటం మహాకవి ఉద్దేశం. ఆరచనని సరదా పాటగా పేరడీ చేయడంలో పేరడీ రచయిత ఉద్దేశం ఏమిటని ప్రశ్నించుకుంటే, శ్రీ శ్రీని ఎందరో అనుకరిస్తూ, చైతన్యరహితమైన రచనలు చేస్తూ, ఏ ప్రయోజనాన్ని సాధించటం లేదు అనే విషయాన్ని వినోదానుకరణ ద్వారా చెప్పాలనుకున్నాడు పేరడీ రచయిత జరుక్ శాస్త్రి.

శ్రీ శ్రీ నవకవితలో,

సిందూరం రక్త చందనం
బంధూకం సంధ్యారాగం
పులి చంపిన లేడి నెత్తురు
ఎగరేసిన ఎర్రని జెండా.....

ఇవన్నీ చెప్పి "కావాలోయ్ నవకవనానికి" అంటాడు. ఇంత శక్తిమంతమైన కవితని తేలికపరచి పేరడీ లక్షణాన్ని జొప్పించాడు జరుక్ శాస్త్రి.

మాగాయకంది పచ్చడీ
ఆవకాయ పెసరప్పడమూ
తెగిపోయిన పాత చెప్పులూ
పిచ్చాడి ప్రలాపం కోపం
వైజాగులో కారా కిళ్ళీ......

ఇది వినోదాను కరణకి చెప్పిన సరదా పాట.

కొన్ని సార్లు భావకవుల పద ప్రయోగాన్ని దృష్టిలో పెట్టుకుని రచన చేశారు. జరుక్ శాస్త్రి. అన్వయక్లిష్టత ఎక్కువగా భావకవిత్వంలా వుందని ఇతని అభిప్రాయం. పాఠకుణ్ణి పక్క మార్గం పట్టిస్తుందని ఇతని అభిప్రాయం. అలా ప్రసిద్ధుడైన కృష్ణశాస్త్రి కవితని పేరడీ చేశాడు ఇతడు.

తొలి వియోగిని నేనే
తొలి ప్రేయసిని నేనే

ఆనాటి కీనాటి కేను నీ దాననే - ఈ పాదాలలో అన్వయ కాఠిన్యం వుందని జరుక్ శాస్త్రి వుద్దేశం ఉహా ఊర్వశిని ప్రకృతి సౌందర్యరూపిణిగా ఒక వైపు చెప్తూ, మరొక వైపు ప్రియురాలిగా వర్ణించటం పట్ల అధిక్షేపణ చూపించాడు పేరడీ కవి.

"తులసి మొక్కను నేనే
తురక వేపను నేనే
ఆనాటికీనాటి
కేను మృత్కణమేను " అంటాడు

ఇలా ప్రసిద్ధులైన కవుల రచనలను ఎన్నిటినో పేరడీలుగా రచించాడు జరుక్‌శాస్త్రి. నాటకాన్ని పేరడీ చేసిన ప్రత్యేకత ఇతనికి దక్కింది. విశ్వనాథ వారి నర్తనశాల నాటకాన్ని దృష్టిలో పెట్టుకుని కీచక వధ నాటికను రచించారు. భారతంలో కీచకుడు మహావీరుడు. విశ్వనాథ వారి నాటకంలో కీచకుడు విషాదాంతనాయకుడు. జరుక్ శాస్త్రి కీచక వధ నాటికలో కీచకుడు ముప్ఫై ఏళ్ళ వయసు వాడు. ఫ్రెంచి కట్‌మీసం, బెంగాలి క్రాపు వున్నవాడు.

నాటిక మొదటి రంగంలో సైరంధ్రి కీచకుడితో "మీరు పండితులని విన్నాను" అంటుంది. నాకు పెద్దబాలశిక్ష

బాగా వచ్చు" అంటాడు. కీచకుడు. ఉత్తరతో సంభాషిస్తూ "ఉత్తరా, టీ తీసుకురా" అంటాడు కీచకుడు. మూడోరంగంలో రాత్రి పది దాటిం తర్వాత సైరంధ్రి కీచకుడి వద్దకు వచ్చింది. "మా అక్క మిమ్మల్ని పంపిందా' అంటే "అవును, టీ డస్టు కోసం" అంటుంది. ఇలా వినోదాత్మకంగా వ్యంగ్య రచన సాగింది ఆనాటికలో. చివరకు కీచకుణ్ణి సైరంధ్రి చంపింది. ఈ నాటకంలో అంతట ద్రౌపదిలనే మాటను వాడాడు జరుక్ శాస్త్రి, ఈ నాటకం అయింతర్వాత పాఠకుడికి ఒక సంతృప్తి, ఆడవారు అబలలు కారు అనే ఒక భావం కలిగి నాటకంలో హాస్యం, వ్యంగ్య మాత్రమే కాక, కొంత సందేశాన్ని కూడా అందించారు రచయిత అనే అభిప్రాయం కలుగుతుంది.

పేరడీ శాస్త్రిగా ప్రసిద్ధి చెందిన జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి ఈ ప్రక్రియకి మంచి ప్రచారాన్ని, స్థానాన్ని కలిగించారు.

తెలుగు సాహిత్యంలో పేరడీ ప్రక్రియను చేపట్టిన మరో రచయిత మాచిరాజు దేవీ ప్రసాద్ , అవహేళన, హేళన, అధిక్షేపం, వ్యంగ్యం, వినోదం లాంటి లక్షణాలు గల పేరడీలు చాలా రచించారు దేవీ ప్రసాద్. పేరడీని వికటకవిత్వంగా నిర్వచించారీయన. పద, పాద నియమంతో విపరీతార్థసాధన చేయటమే పేరడీ లక్ష్యం అని దేవీ ప్రసాద్ అభిప్రాయం. మూలకర్త విలోకనానికి పేరడీల రాయవచ్చునని వివరించా రీయన. శ్రీ శ్రీకి మంచి స్నేహితుడై ఎన్నో పేరాడీలు రచించారు. ఇతని రచనలలోని విశేషమేమిటంటే వినోదాత్మకత కన్నా అధిక్షేపాత్మకత ఎక్కువగా వుండటం. శ్రీ శ్రీ రచించిన దేశ చరిత్రలు అనేరచనకి విలక్షణమైన పేరడీ రచించి రహదార్లు అనే పేరు పెట్టాడు.

ఏరోడ్డు చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం
రహదారి చరిత్ర సమస్తం
యాతాయాత జనసంయుక్తం

. . .

ఈ నడివీథికి సంగమముందా

ఆ రహదారీ వాలం వెంతది

పోసిన రాళ్ళు, నడిపిన గుళ్ళు
ఇవి కావోయ్ బాటల భాగ్యం " అన్నాడు.

దేశచరిత్రల గురించి మహాకవి రాస్తే, రోడ్ల చరిత్రలు గురించి పేరడీ కవి రాసాడు.

శతక పద్యాల నడకను అనుకరిస్తూ చేసిన రచన "భక్ష్యేశ్వరీ" అనేది. ఇది నోరూరించే పద్యరచన.

"పూరీకూర జిలేబి మట్టల పయిన్‌పూవంపు బాదుషాపయిన్
వేరేకాల్చిన దోసెకర్కరల శబ్దించేటి అంమల్ పయిన్
ఖూరీపొర్లిన గోఘృతమ్ము లపయిన్ ఘుమ్మైన
బొబ్బట్లపైన్
పారున్ పారు సతంబు మద్ హృదయ విశ్వాసంబు భక్ష్యేశ్వరీ"

తెలుగు పేరడీలు అనే పుస్తకంలో ఎనిమిది పేరడీ రచనలున్నాయి. నవకవి, భోషాణ ప్రభోగట్టా, కచేరి కథనం తెలుగులో నడిస్తే, కచేరి కథనం (కాగితాల పొదుపు), కవి దినోత్సవం, సంపాదకుని లేఖలు, ఓహో సంఘము మొదలైనవి. సెంట్రల్ ఎక్సయిజు శాఖలో వుద్యోగం చేస్తూ, నిర్భయంగా ప్రభుత్వపు తీరును పేరడీ రూపంలో వ్యంగ్య రచన చేసిన దేవీ ప్రసాద్ ధైర్యం మెచ్చుకో దగింది.

కచేరీ కథనంలో మాతృభాషలో పరిపాలన జరగాలంటే ప్రభుత్వోద్యోగులు ప్రభుత్వవ్యవహారాలు లేఖల ద్వారా ఎలా నడుపుతారో చూపించారు దేవీ ప్రసాద్. కచేరీ కథనం తెలుగులో వుంటేఎలా వుంటుందో ఊహించుకుంటూ హాస్యాన్ని వెదజల్లారు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో వచ్చిన కాగితం కరువును గురించి చెప్తూ, కాగితాల పొదుపు ఎలా అసాధ్యమో చెప్పేందుకు పేరడీ రచన స్వీకరించారు. ఒక ప్రణయకవి దురంత ఉదంతం అంటూ రాజకీయ బాధితుడు అని చెప్పి

పేరడీలో చమత్కరించారు దేవీ ప్రసాద్.

" లేవు లేవిక కాగితాల్లేవు, లేవు
బిల్సుకైన అంటించు లేబిల్సుకైన
నోటుకైనను ప్రాంశరీ నోటుకైన
లార్డుగాంచి మానోటీసు బోర్డు కైన"

.. కాగితం ఖర్చు చేయపోకండి మీరు
ఖర్చు చేయకండి, చేయనీకండి మీరు
అంచు వాలు పోస్టర్లు వేయించే అచ్చు
విశ్వరూపాల వంటివి వేనవేలు "

సంపాదకుని లేఖలు అనే పేరడీలో "ఉత్తరాలు అనేకరకాలు. కొన్ని చిన్నవి కొన్ని పెద్దవి. కొన్ని చిన్న విషయాల మీద భారత మంతవి, కొన్ని భారతమంత విషయం మీద బస్సు టిక్కెట్టంతవి, కొన్ని పొడుగు ఉత్తరాలు పొట్టి సంతకాలు కలవి. కొన్ని విషయాలు సంతకాలు రెండూ లేనివి" - అంటాడు దేవీ ప్రసాద్ - లేఖా రూపంలో చాలా పేరడీలు రచించా డాయన. వచనంలో ఎక్కువగా పేరడీ రచన చేశాడు. దేవీ ప్రసాద్ ఆనాటి సాంఘిక రాజకీయ పరిస్థితుల దృష్ట్యా పేరడీ రచన చేశాడు దేవీ ప్రసాద్.

తెలుగుసాహిత్యంలో పేరడీ రచయితగా స్థానం సంపాదించుకున్నది శ్రీరమణ. శ్రీరమణ పేరడీలకు ముందుమాట రాస్తూ నండూరి రామమోహనరావు గారన్న మాటలు ఇక్కడ చెప్పటం సముచితం.

"సెటైరుకి రెడీ రెడీ - స్వటైరుకు ఫెడీ ఫెడీ
శ్రీరమణ ప్రతిపేరడీ చిత్రోక్తుల గారడీ"
- పద్యం కాక వచనాన్ని పేరడీ రచనకి ఎన్నుకున్నారు శ్రీరమణ.

వెడుతున్న రైలు ఫస్ట్ క్లాస్ కంపార్టుమెంటులో అతడేదో ఆలోచిస్తూ ప్రయాణం చేయడం - ఇది సన్నివేశం. దీన్ని విశ్వనాధ, బుచ్చిబాబు, రాచకొండ, పురాణం సీత, కొడవటిగంటి - ఇలా ఎవరెవరు ఎలా రాస్తారో పేరడీ చేసి చూపించారు శ్రీరమణ. "ప్రముఖుల ప్రేమలేఖలు" అంటూ చేసిన రచనలో "ఈ పేరడీ లోని ప్రముఖులంతా వారి జీవితాల్లో ప్రేమలేఖలు రాశారో లేదో నాకు తెలియదు. వారి మీద నాకున్న ఎనలేని అభిమానంకొద్దీ, ఒక వేళ వారు రాసివుంటే ఎలావుండేవో అని ఊహించి ఈ పేరడీ రాయటం జరిగింది" అని వివరించారు. ( శ్రీరమణ పేరడీలు - నవోదయ పబ్లిషర్స్ - విజయవాడ)

గిరి కుమారుడు అనేది విశ్వనాధ వారి కలం పేరు అంటూ శ్రీరమణ విశ్వనాధ వారి ప్రేమలేఖని రాసి చూపించారు.

బాలామణీ!

ఆశీః

నిన్ను జూచితిని. తదా ఆలోచనలన్నియు నీ చుట్టూ పరిభ్రమించును. వదలివచ్చుట కవి మొరాయించు చున్నవి. కుంకుమ శోభితమైన నీ నొసట - కుంకుమ యనిన జ్ఞప్తికి వచ్చును. కాశ్మీరదేశము కుంకుమపూలకు బ్రసిద్ధి........." ఇలాగే సాగే వారి ప్రేమ లేఖకి జవాబు వస్తుందంటారా అని ప్రశ్నిస్తాడు పాఠకుడి ఈ పేరడీ రచయిత.

ముని మాణిక్యం గారు ప్రేమలేఖ ఇలా రాస్తారు.

ప్రియమైన కాంతానికి శుభాశీస్సులతో వ్రాయు లేఖాంశములు: ఉభయకుశలోపరి. నీవు వ్రాయించిన జాబు అందినది. ఎదురింటి మీనాక్షికి మళ్ళీ ఆడపిల్లే..... నువ్వు పుడిగా లేక విడిగా చిన్న జాడీలో తీసివెళ్ళిన ఆవకాయ అయిపోయింది........

శ్రీ శ్రీ రచించే ప్రేమలేఖని శ్రీరమణ బాగా ఊహించారు.

మధురవాణీ,

ఆ రోజు బ్రాడ్వేలో నువ్వు వెళ్తుంటే రేసు గుర్రం రోడ్డున పడ్డట్టు అనిపించింది. అప్పటికప్పుడే నీకు మూడు ముక్కల వుత్తరం కూడా రాసిన జ్ఞాపకం. నన్ను ప్రేమించనందుకు చింత కొంతే కాని మీరు సందు చివర విశ్వనాథాన్ని అభిమానిస్తున్నారని విని చింతించాను. చిలక ముక్కుకి నేరేడు పండులాగా విశ్వనాథాన్ని మిమ్మల్ని పక్కపక్కన ఊహించుకుంటే మీ మీద జాలి వేస్తోంది. ...... జాలి పడే నాలాంటి వాళ్ళను మన సమాజం నమ్మదు.... శ్రీ శ్రీ కి అసలు జవాబుతో పనిలేదు అంటారు చివరలో శ్రీరమణ.

శ్రీరమణ గారు బుడుగు వేత సీగాన పసూనాంబగారికి ప్రేమలేఖ రాయించేసారు

సీ గాన పసూనాంబలు గారికు,

ఇది లౌ లెటరు రాస్తున్నానన్నమాట. బాబాయి ఇచ్చిరా అంటే 2 జెళ్ళ సీతకి ఇచ్చానే అలాంటిదన్నమాట. లౌ లెటరు అంటే ప్రేమించుకోవడమంట - బాబాయి చెప్పాడు. నాకు తెలియదు అనుకో !!

శ్రీరమణ పేరడీ రచయితగా మంచి స్థానాన్ని తెలుగుసాహిత్యంలో సాంపాదించారు.

తెలుగు సాహిత్యంలో పేరడీ ప్రక్రియ వినోదాత్మకతతో, వ్యంగ్యాత్మకతతో, అనుకరణతో, హాస్యంతో ఒక ప్రత్యేకతని సంతరించుకుంది. జరుక్శాస్త్రి, దేవీ ప్రసాద్, శ్రీరమణలే కాక, ఎందరో కవులు ఈ ప్రక్రియను చేపట్టి విస్తృతం చేయాల్సిన అవసరం వుంది. ఇదొక సాహిత్య ప్రక్రియగా బాగా ప్రచారాన్ని అందుకోవాలంటే పేరడీ రచయితకి ధైర్యం, సమకాలీన కవుల రచనలపై సదవగాహన, హాస్య ప్రవృత్తి ముఖ్యంగా అవసరం !

●●●

# ఆలోకన 1985

**– డాక్టర్ వెలగా వెంకటప్పయ్య**

తెలుగు వాఙ్మయానికి సంబంధించిన సమాచారం అందించే గ్రంథాలు బహు తక్కువగా ఉన్నాయి. సమాచారం తగినంతగా, సాధికారంగా, తాజాగా ఉన్నపుడే శోధన, పరిశోధన, ఉపరిశోధన సజావుగా జరగడానికి అవకాశం ఉంటుంది. సుప్రసిద్ధ సాహితీపరులు డా.జి.వి. సుబ్రహ్మణ్యం గారి నేతృత్వంలో హైదరాబాదు విశ్వవిద్యాలయం ప్రచురించిన "ఆలోకన 1985" ఒక అపూర్వ ప్రయోజన కర ప్రయోగం. అనితర సాధ్యమైన ప్రయత్నం అని చెప్పవచ్చు. ఇందు 1985లో తెలుగులో వెలువడిన పుస్తకాల, పత్రికారచనల సమాచారం ఉంది. బిబ్లియోగ్రఫి , ఇండెక్స్ – రెండు ఒకే గ్రంథంలో కలిసి ఉభయ తారకంగా ఉంది. ఇదొక విశిష్టమైన వినూత్న ప్రయత్నం.

## తొలి ప్రయత్నాలు

వాఙ్మయ సూచీల నిర్మాణ ప్రయత్నాలు మూడు,నాలుగు శతాబ్దాలుగా అభివృద్ధి పొందుతున్న దేశాలలో జరుగుతూ ఉన్నా – తొలిసారిగా 1901-1916 మధ్య వెలువడిన నాటకాల జాబితాను " నాటిక నామావళి " పేరుతో పురాణం సూరిశాస్త్రి, కానుకొలను వెంకట్రామయ్య గారలు ప్రచురించారు. తదుపరి దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు పూనుకొని 1927 వరకు. వెలువడిన జాబితాను గన్నవరపు సుబ్బరామయ్య మల్లంపల్లి సోమశేఖర శర్మ గార్లతో తయారు చేయించి "ఆంధ్రవాఙ్మయ సూచిక" ను ప్రచురించారు. పైగా ఇందులో కాకినాడ, ఆంధ్రసాహిత్య పరిషత్తు, తంజావూరు సరస్వతీ మహల్, మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలోని తెలుగు రాత ప్రతులను కూడా ఇందు చేర్చారు.

ఆ తర్వాత మారేపల్లి రామచంద్రశాస్త్రి గారు 1953లో "తెలుగు నుడిదండలు" పేరుతో నిఘంటువుల జాబితా ప్రచురించారు. 1963లో సుప్రసిద్ధ నాటక విమర్శకులు శ్రీనివాస చక్రవర్తి గారు సుమారు రెండు వేల నాటకాల జాబితాను "ఆంధ్రనాటక దర్శిని" పేరుతో ప్రచురించారు. 1863 – 1965 మధ్యకాలంలో అచ్చయిన శాస్త్ర, సాంకేతిక గ్రంథాల సూచీని "శాస్త్రీయ వాఙ్మయ సూచిక" పేరుతో డాక్టరు వెలగా వెంకటప్పయ్య గారు తయారుచేయగా ఆంధ్రప్రదేశ్ సైన్సు అకాడమి 1967 లో ప్రచురించింది. తదుపరి సామాజిక శాస్త్రాలలో వచ్చిన గ్రంథాల సూచీని భారత సమాజ శాస్త్ర విజ్ఞాన పరిశోధన మండలి, దక్షిణ ప్రాంతీయ విభాగం సిద్ధం చేసింది. కాని అచ్చేయలేదు.

ఐతే మరింత క్రమబద్ధమైన రీతిలో "భారతీయ గ్రంథ సూచి " ప్రచురణ 1958 నుంచి ప్రారంభమైంది. ఇది రోమన్ లిపిలో ఉన్నందున రాష్ట్ర ప్రభుత్వం ఇందలి తెలుగు విభాగాలను తెలుగు లిపిలో 1958 నుంచి ముద్రించడం ప్రారంభించింది. ఇప్పుడు లభించే తాజా సూచి 1974లో ప్రచురించిన పుస్తకాలకు సంబంధించినది., తదుపరి సంపుటాలు (1975-1986) వెలవడనే లేదు. 1967-1972 కు సంబంధించిన సంపుటాలు కూడా వెలువడనేలేదు. ఇది దురదృష్టకరమైన విషయం.

ఇహ అత్యంత విలువైన పత్రికా రచనల విషయంలో తగిన సమాచారం లభించడం లేదు. 1977 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పక్షాన నేల నూతుల శ్రీ కృష్ణమూర్తిగారు తయారు చేసిన "వ్యాస రచనల సూచి" ఒక ప్రయత్నం. తయారీలో శాస్త్రీయ పద్ధతులు అనుసరించనందువలన దీన్ని ఉపయోగించడం కష్టంగా ఉంది. అసలు దీపం లేని చోట గుడ్డి దీపమైనా మేలు అన్నట్లుగా ఈ సూచిక కొంతవరకు వినియోగపడుతుంది. "సామాజిక విజ్ఞానం" పేరుతో భారత సమాజ విజ్ఞాన పరిశోధన మండలి దక్షిణ ప్రాంతీయ కేంద్రం 1978 నుంచి ఆరుమాసాలకోసారి

పరిమితంగా వెలువరించే వ్యాససూచి కుంటినడకలో ఉంది.

## ఈనాటి పరిస్థితి

సుమారు 150 సంవత్సరాల నుంచి పుస్తకాలు, వందేళ్ళ నుంచి పత్రికల ప్రచురణ తెలుగులో సాగుతున్నది. ఈకాలంలో వెలువడిన పుస్తకాల, పత్రికా రచనల గురించి తెలుసుకోడానికి సాధికారమైన పరామర్శ గ్రంథం లేదు. కేవలం గ్రంథ సూచీ నిర్మాణం కోసం చట్టసమ్మతంగా ఏర్పడిన సెంట్రల్ రెఫరెన్సు లైబ్రరీ రిజిస్ట్రార్ ఆఫ్ బుక్స్ కార్యాలయాల వారు ఈ విషయం లో విఫలం అయ్యారని చెప్పవచ్చు. 1958-1987 మూడు దశాబ్దాల మధ్యకాలంలో 'భారతీయ గ్రంథ సూచీ' సకాలంలో ప్రచురణ జరక్కపోవడం సర్వసామాన్యం, రిజిస్ట్రార్ ఆఫ్ బుక్సు కార్యాలయానికి చేరిన పుస్తకాల జాబితా ప్రచురణ జరగకపోవడం సహజం. తెలుగు విభాగం 1974 వరకే వెలువడిందంటే ఎంత వెనకబడి ఉన్నాయో మనం ఊహించుకోవచ్చు. జాతి జీవనాడిగా గ్రంథాలను మనం గుర్తించనందుకే ఈ ఆలస్యం జరుగుతున్నది. పత్రికా రచనల సమాచారం అందించే ఏ ప్రయత్నము ఇంతవరకు సఫలం కాలేదు. అందుచేత పరిశోధకులు, పండితులూ తమకు కావలసిన సమాచారం కోసం గ్రంథాలయాల చుట్టూ, వ్యక్తుల చుట్టూ తిరిగి వ్యయ ప్రయాసలకు గురవుతూ వుంటారు. సమాచార సేకరణతోనే ఆలసిసొలసి అణగారిన ఆలోచనలతో సిద్ధాంత వ్యాసాలసైజు పెంచుతూ ఉంటారు. అభివృద్ధి చెందిన ఏ దేశంలోనూ ఈ పరిస్థితి లేదు. ఈ అసహాయ పరిస్థితిలో కారు చీకటిలో కాంతి రేఖలాగా హైదరాబాదు విశ్వవిద్యాలయ తెలుగు విభాగమైన తెలుగు సాహితి "ఆలోకన" ప్రచురణ చేపట్టింది. ఇది సరికొత్త ప్రయోగం, సాహసోపేతమైన ప్రయత్నం.

## ఆలోకన వివరాలు-విశేషాలు :

తాజాగా వెలువడిన "ఆలోకన" ప్రచురణ తాలూకు విశేషాలను సంపాదకులైన డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం గారు ఇలా వివరించారు.

1. తెలుగులో ప్రతి సంవత్సరం ప్రచురించే వార్షిక వాఙ్మయ సూచి "ఆలోకన" ప్రతి సంవత్సరం ఆ సంవత్సర సంఖ్యతో వెలువడుతూ ఉంటుంది.

ఉదా: ఆలోకన 1985, ఆలోకన 1986 ఇలా...

2. ప్రతి సంవత్సరం జనవరి 1 నుండి డిశంబరు 31 వరకు ముద్రింపబడిన గ్రంథాలూ, పత్రికలూ, వ్యాసాలూ, కథలూ,కవితలూ, సమీక్షలూ మొదలైన ప్రక్రియా విశేషాల శీర్షికలను ప్రచురణ వివరాలతో సహా సేకరించి, వర్గీకరించి "ఆలోకన"లో ప్రచురించడం జరుగుతుంది.
3. తెలుగులో ప్రచురింపబడిన వాఙ్మయాన్ని గురించిన సామగ్రి అంతా సూచికా రూపంలో సంపుటీకరించడం "ఆలోకన" విశేషం.
4. 'ఆలోకన" లో ప్రచురించే ప్రతి ఆరోపం (entry) లోనూ రచయిత పేరు, రచన పేరు, ప్రచురణ వివరాలూ, ప్రచురణ కర్తల వివరాలూ, గ్రంథమైతే విషయాంశాలు మొదలైన వివరాలు ఉంటాయి.
5. సేకరించిన ఆరోపాల నన్నింటిని ప్రక్రియాపరంగా విశ్లేషించి ఒక్కొక్క విభాగంలో వాటిని అకారాది క్రమంలో ప్రచురించడం జరుగుతుంది.
6. తెలుగులో ప్రచురించిన రచనల ఆరోపాలే గాక తెలుగు భాషాసాహిత్యాలను గురించి ఇతర భాషలలో ప్రచురింపబడిన రచనల పేర్లకు సంబంధించిన ఆరోపాలను వాటి విశేషాలను కూడా "ఆలోకన" లో అకారాది క్రమంలో అమర్చి ప్రచురించడం జరుగుతుంది.
7. విశ్వ విద్యాలయాలలో వెలువడుతున్న సిద్ధాంత వ్యాసాలు, పరిశోధనా వ్యాసాలు, పరిశోధకులు వెలికి తీసిన లేదా పరిష్కరించిన అముద్రిత గ్రంథాలు వాటి పేర్లు, వివరాలు కూడా ఈ వాఙ్మయ సూచిలో పొందుపరచి ఉంటాయి.
8. "ఆలోకన" లో గమనింపదగిన విశేషం అకారాది

క్రమంలో గ్రంథాది శీర్షికల వివరాలను ముద్రించడం కాదు. రచయితల పేర్లతో ఆరోపాలను సిద్ధపరచి అకారాది క్రమంలో ప్రచురించటం దీని ప్రత్యేకత. పరిశోధకులకు ఈ పద్ధతే ఎక్కువ ఉపయోకరంగా ఉంటుంది.

9. వాఙ్మయ సూచితోపాటు ఆ సంవత్సరంలో వెలువడిన వివిధ సాహితీ ప్రక్రియల మీద ఒక సమీక్షను కూడా సిద్ధం చేసి ముందు మాటగా ప్రచురించటం జరుగుతుంది. గణాంక పద్ధతిని ఆశ్రయించి కొన్ని విశేషాలను వివరాలను అనుబంధంగా చేర్చడం జరుగుతుంది." ఐతే స్థలాభావం చేత పైన ఉదాహరించిన 7,9 అంశాలకు మాత్రం ఇందు స్థానం లభించలేదని తెలుస్తూంది.

## "ఆలోకన" ఎవరికోసం?

విశ్వవిద్యాలయ "తెలుగు సాహితి" చేస్తున్న భగీరథ ప్రయతం వలన ఈ దిగువ ఉపయోగాలు ఉంటాయని సంపాదకులు అభిప్రాయపడ్డారు.

1. "కలకాలంగా పరిశోధకులు ఇటువంటి వాఙ్మయ సూచి తెలుగులో వెలువడితే బాగుంటుందని కన్న కలలు వాస్తవ రూపాన్ని తాలుస్తాయి.
2. తెలుగులో వెలువడుతున్న వాఙ్మయ వివరాలను అన్నింటిని ప్రతి సంవత్సరం ఒక సూచిగా ప్రచురించటం వలన సేకరించి, విశ్లేషించి ఒక చోట సమీకరింపబడిన సామగ్రిని భావి పరిశోధకులకు అందించడం జరుగు-తుంది.
3. ఆలోకన ప్రతి సంవత్సరం ప్రచురంపబడే వాఙ్మయ సూచిక కార్యక్రమం కాబట్టి, హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం తెలుగు శాఖ నిరంతర పరిశోధన వ్యవస్థనొక దానిని తన కనుబంధగా నెలకొల్పుకొనే అవకాశం ఏర్పడుతుంది.
4. నిశ్శబ్దంగా ఈ సంపుటిలో నిలిచిన ప్రతి ఆరోపం భవిష్యత్తులో ఎన్నో వినూత్నాంశాలకు, సమన్వయాలకు, వాదాలకు, సూత్రాలకు, దర్శనాలకు, ప్రయోగాలకు, సాహితీ ప్రయోజనాలకు, ప్రేరకం కావచ్చు. భవిష్యత్తులో ప్రకటింపబడే విజ్ఞాన ఫలాలకు అక్షర బీజ సంపుటిగా ఆలోకన సాహితీ కృషీవలులకు తోడ్పడుతుంది.
5. పత్రికల నుండి సేకరించే వాఙ్మయ విశేషాలకు ఇది "దిగ్దర్శిని' అని ప్రత్యేకంగా చెప్పాలి. ప్రసిద్ధ పత్రికలలో ప్రచురింపబడే సాహిత్య వ్యాసాదుల వంటి విశేషాలన్నీ ఇందులో తేదీలతో సహా నమోదై ఉంటాయి. స్వల్పకాలం జీవించే పత్రికలు, ఆయా సందర్భాలలో వెలువడే ప్రత్యేక సంచికలు, అనుబంధాలు కూడా ఆరోపాల సేకరణంలో చోటుచేసుకోవటం వలన పత్రికా వాఙ్మయానికి సంబంధించిన భావి పరిశోధకులకు "ఆలోకన" విలువైన ఆధారం కాగలదు. తెలుగులో పత్రికల చరిత్రను నిర్మించటానికి, పత్రికా రచనా వికాసాన్ని వివేచించటానికీ "ఆలోకన" అమూల్యమైన ఆధారం అవుతుంది.
6. "ఆలోకన" భాషా సాహితీ రంగాలకేకాక బహు విధ శాస్త్ర కళారంగాలకు సంబంధించిన గ్రంథాలు, వ్యాసాలు మొదలైన అంశాలను పొందుపరుస్తుంది. ఉదాహరణకు తెలుగులో భౌతిక, రసాయనిక, ఖగోళ, జ్యోతిషాది శాస్త్రాలకు, రాజకీయ, సాంఘిక, మానసిక, తాత్త్విక శాస్త్రాలకు, లలిత కళలకు సంబంధించిన వాఙ్మయ సూచి కూడా ఆలోకనలో సహజంగా అంతర్భాగమై ఉంటుంది.

ఒక్కమాటలో చెప్పాలంటే తెలుగులోనూ, తెలుగును గురించి ఇతర భాషల్లోనూ ప్రచురింపబడిన వాఙ్మయానికంతా సూచికా రూపమైన విషయ భాండాగారం "ఆలోకన".

## అమరిక

ఇందలి విషయాలు : 1. గ్రంథాలు 2. కవితలు, గేయాలు, మినీ కవితలు, 3. కథలు, 4. ధారావాహకాలు, 5.

సంపాదకీయాలు, 5. సీరియల్ శీర్షికలు, 6. వ్యాసాలు, 7. ముఖాముఖి, 8. ఇంగ్లీషులో వెలువడిన రచనలు, 9. పరిశిష్టం అని తొమ్మిది భాగాలుగా విభజించడం జరిగింది. ఆరోపాలన్నీ పై విషయాల వారీగా రచయితల అక్షర క్రమంలో ఉన్నాయి. ప్రతి ఆరోపానికి రచయిత (త్రి) పేరు, రచన పేరు, ప్రచురణ కర్త, పుటలు, వెల ఇత్యాది వివరాలు సంక్షిప్త రూపంలో ఉన్నాయి. ఇందలి విశిష్టత ఏమంటే

1. సంకలన కావ్యాలు, కథలు, నాటికలు, వ్యాసాలు, - మొ. వాటిలో రచయితలు వేరుగా ఉన్నప్పుడు ప్రతి రచన రచయిత పేరు కూడా ఉదాహరించడం జరిగింది. ఒకే కవితలో కవుల పేర్లు మాత్రం పేర్కొనడం జరిగింది.
2. ఒక గ్రంథం అనేక భాగాలుగా ప్రచురణ జరిగినప్పుడు అందలి భాగాల వివరాలు ఇవ్వడం జరగింది.
3. సంపాదకీయాల జాబితా(పుటలు 158-197) నేటి సామాజిక, ఆర్థిక , రాజకీయాలకు సంబంధించిన అనేక విషయాలకు దర్పణం పట్టినట్లయింది. ఆలోకనలో ఈ విభాగం నాయకమణి.
4. ఐదవదైన సీరియల్ శీర్షికలోని ఆలయ విశేషాలు ఇంటిపేర్లు, ఊరూ, పేరూ, తెలుగులో వెలుగు, నటరత్నాలు, ఆర్థిక, సాంఘిక, రాజకీయాంశాలు, ప్రపంచతంత్రం, మహిళాలోకం మొదలైన అంశాలలోని సమాచారం అన్ని తరగతుల వారికి ఎంతో ఉపయోగిస్తుంది. పరిశోధకులకు వరమానందంగా అరచేతి యిుసిరికగా ఉంటుందనడంలో సందేహం లేదు.
5. వ్యాసాల విభాగంలో విషయపరమైన కలగలుపు ఉన్నా 189 పుటలలో విస్తరించి ఉన్న సుమారు 4500 వ్యాసాల సమాచారం ఈ గ్రంథంలో ఒక ప్రత్యేక వెలుగు.
6. ఎనిమిదవ విభాగంలో ఇంగ్లీషులో వెలువడిన మన రాష్ట్రానికి సంబంధించిన రచనల వివరాలను ఇవ్వడం ఈ సంకలనానికి నిండుతనాన్ని చేకూర్చింది.
7. 1985లో వచ్చిన పుస్తకాల, పత్రికా రచనలకు ఈ గ్రంథం దర్పణంగా ఉపయోగపడుతుంది. ఎవరూ చేయని, చేయలేని పని తెలుగు సాహితి చేసి చరిత్ర సృష్టించింది.

## కొన్ని సూచనలు

తెలుగులో ఇలాటి సంకలనం కావాలని కలలుగనే వారి ఎదుట కల నిజమై ఒక బృహద్గ్రంథం వెలసినపుడు లోపాలు ఎంచబుద్ధి పుట్టడం లేదు. కాళిదాసు కుమార సంభవకావ్యంలో -

> "అనన్త రత్న ప్రభవస్యయస్య
> హిమం నసౌభాగ్య విలోపి జాతమ్
> ఏకోహి దోషో గుణ సన్నిపాతే
> నిమజ్జతీన్దోః కిరణేష్వి వాఙ్కః"

అన్నారు. అపారమైన రత్నాలు, మణులు, ఓషధుల సంపద గల హిమవన్నగం మంచుతో కప్పబడి ఉన్నంత మాత్రాన అది లోటు కాదు. కాంతి ఇచ్చే చంద్రునిలో మచ్చ ఉన్నంత మాత్రాన దాని గొప్పదనం తగ్గదు. అలాగే ఆలోకనలో గల కొద్దిపాటి లోపాలకు దీని విలువ తగ్గదు. సవరిస్తే బహుళ ప్రయోజన కారికగా ఉంటుందనే నా ఆకాంక్ష.

1 నేడు విశ్వ వ్యాప్తంగా అమలులో ఉన్న దశాంశ వర్గీకరణకు ఎ.ఎ.సి. ఆర్. 2. ఆరోప రూప నిర్ణయానికి అనుసరిస్తే మరింత ప్రయోజన కరంగా ఉండేది. ఈ సమాచారం మొత్తం కంప్యూటరీకరించడానికీ, మాగ్నటిక్ టేపుల మీద, లేదా ఫ్లాపిడిస్కులలో భద్రపరచడానికి వీలుగా ఉండేది.

2. కవిత, కథ, వ్యాసం తదితర ప్రక్రియలు సాహిత్యం వరకే పరిమితమై ఉండాలి. ఇది సంప్రదాయం. ఉదాః గణితాన్ని కావ్యంగా రాస్తే గణితశాస్త్రం

చెంతనే వర్గీకరించడం సముచితం. సంపాదకీయాలు (పుటలు 158-197) సీరియల్ శీర్షికలు (198-261) వ్యాసాలు (264-447), ముఖాముఖి (448-452) అనేక విషయాలకు చెందినవి. ఈ తరగతి రచనలను ఆ విషయాల చెంత ఉంచడమే యోగ్యమైన పని. పై శీర్షికల అస్పష్టత వలన అసలు విషయం మరుగై పోయే ప్రమాదం ఉంది.

3. ఒక విషయం, విషయంపై విమర్శ గ్రంథాలు, వ్యాసాలు, తదితరాలు ఒకే తావునే ఉండాలి. వేరు వేరుగా ఉంటే పరిశోధకుని దృష్టి కొన్నిటిపై పడకుండా ఉండే అవకాశం ఉంది.

4. ఆరోపం లో శీర్షికగా రచయిత పేరునే స్వీకరించాలి. గాని సంపాదకుని పేరు గాదు. చూ. పుట. 3 ఉదా: ధర్మారావు, తా.పి. (సంపా.) పారిజాతాపహరణం - తెలుగు, పు 117, రు.6 ద్వి.ము.
ఇచట పుస్తకం పేరును హలంతం చేయడం జరగింది. ఇది పొరపాటు "పారిజాతాపహరణము అనే ఉండాలి, 'తిమ్మన', 'నంది' అని శీర్షిక ఉండాలి. ఇలాటి పొరపాట్లు మరి కొన్ని ఉన్నాయి.

5. జీవిత చరిత్రలను ఆయా విషయాలు చెంతనే చేర్చామని దశాంశ వర్గీకరణ పథకం 19వ, సంస్కరణ సూచిస్తోంది. ఇది ఆధునిక పరిశోధన ధోరణి. ఈ విధానాన్ని ముందు ముందు అనుసరించడం మంచిది.

ఇవి మచ్చుకు చూపిన కొన్ని లోపాలు మాత్రమే. ఆలోకన 1986 ప్రచురించేటప్పుడు విషయ విభజన, ఆరోప నిర్మాణం మరొకసారి పునఃపరిశీలించాలనేదే ఈ సమీక్షాకారుని సహృదయ సూచన.

## ఏమి సాధించారు

పుస్తకాల, పత్రికా రచనల జాబితా తయారు చేసి ఏమి సాధించారని కొందరికి సందేహం రావచ్చు. కాని లక్ష మెదళ్లను కదిలించగల అక్షరం, మానవమేధా సంస్కృతీ విజయ పరంపరను ప్రతిబింబించే పుస్తకం, జాతి సజీవ నాడిని ప్రతిస్పందించే పత్రికారచన ఏమిసాధిస్తుందో, ఏ ఆలోచన రేకెత్తిస్తుందో ఈ "ఆలోకన" అదే అనుభూతిని, కొత్త ఆలోచనలకు ప్రేరణ కలిగిస్తుంది. జాబితాలు పదాల కూర్పులు మాత్రం కావు. ఆలోచనా స్రవంతులు, జల జల పారే సెలయేరులు నదీనదాలు. అందుకే అభివృద్ధి పొందిన దేశాలు వాఙ్మయ సూచికలకు, ప్రలేఖనా విజ్ఞానానికి, అక్రమణికా సేవలకు చెప్పనలవికానంత ప్రాధాన్యం ఇస్తున్నారు. అది గమనించే డాక్టరు జి.వి. విశేష శ్రమ కోర్చి ఆలోకనా లోకాన్ని మన ముందుంచి - మనదేశం కూడా అభివృద్ధి పొందిన దేశమే అనే భ్రాంతిలో ముంచేశారు. వాస్తవానికి ఈ పని గ్రంథాలయ సమాచార రంగంలో శిక్షణ పొందిన సిబ్బంది చేయాల్సింది. కాని వారి కృషి బోధన, వ్యాస రచనలు, సదస్సులలో ఊరేగింపు వరకే పరిమితం కాగా వారి వెన్ను చరిచి, అంతకంటే ఒక మెట్టు ముందుకు పోయి వాఙ్మయ నిధిని సేకరించి జాతికందించిన హైదరాబాదు విశ్వవిద్యాలయ, తెలుగు సాహితీ బృందం సేవలను తెలుగు జాతి మరచిపోదు. ఇది ఒక వార్షిక సంచికతో ఆగిపోయినా బాధ లేదు. గత అరవై సంవత్సరాలుగా "ఆంధ్రవాఙ్మయ సూచిక"ను తయారు చేసిన కాశీనాథుని నాగేశ్వరరావు, మల్లవరపు సోమశేఖర శర్మ, గన్నవరపు సుబ్బరామయ్య గారి పేర్లు నేటికీ తలుచుకుంటున్నట్లు, ఆలోకన సంపాదకబృందం డా. జి.వి. సుబ్రహ్మణ్యం, ఆర్. శ్రీహరి, పి. రామనరసింహం గారి పేర్లు మరో అరవై ఏళ్లయినా తలుచుకుంటారు. మరో వార్షిక సంచిక రాకూడదని కలలో కూడా కోరుకోను. కాని జరక్కూడంది జరిగితేనే... ఇలా అనుకొనేది. కేంద్ర ప్రభుత్వపరమైన విశ్వవిద్యాలయపరంగా ఈ ప్రచురణ జరుగుతుంది గనుక ఇది నిరంతరాయంగా కొనసాగుతుందనీ, కొనసాగాలనీ - నా ఆకాంక్ష. అంతేకాదు ప్రతివాడి అభిలాష.

# ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారి పద్య రచనా శిల్పం

**శ్రీ జి. కుమారస్వామి నాయుడు**

దివాకర్ల వేంకటావధాని గారు పాఠశాలలో చదివే రోజుల్లోనే పద్య రచన ప్రారంభించారు. తూర్పు గోదావరి జిల్లా ఉండి గ్రామంలోని ఉన్నత పాఠశాలలో చదువు కొనేటప్పుడు పద్య రచన ప్రారంభించారు. ఆ పాఠశాలలో ఉపాధ్యాయుడైన ఉప్పలూరి సీతారామశాస్త్రి గారి దగ్గర, ఆ ఊరిలో ఆయుర్వేద వైద్యులైన దిగవల్లి శ్రీరాములు గారి దగ్గర తాను రాసిన పద్యాలు దిద్దించుకొనేవారు.

1928-29 విద్యా సంవత్సరంలో ఉండి హైస్కూలు ప్రధానోపాధ్యాయుడు నండూరి శ్రీరాములు గారికి బదిలీ అయింది. ఆయనకు వీడ్కోలు సభ ఏర్పాటు చేశారు. ఆ సభలో దివాకర్ల వేంకటావధానిగారు పంచరత్న పద్యాలు చదివి ప్రశంసలందుకున్నారు.

ఆ తరువాత ఆయన పద్యాలు 'భారతి' వంటి ప్రసిద్ధ తెలుగు పత్రికలలో ప్రచురింపబడినాయి. ఆయన పద్యకావ్యాలు నాలుగు రచించారు. అష్టావధానాలలో ఎన్నో పద్యాలు ఆశువుగా చెప్పారు. సంస్కృతం నుండి అనువదించిన నాటకాలలో కూడా రసరమ్య భరితమైన పద్యాలను రచించారు.

ఆయన పద్యాలు మొట్టమొదట భారతిలో ప్రచురింపబడినాయి. తొలిరోజుల్లో రాసిన పద్యాలు కూడా ఎంతో భావగర్భితంగా చక్కటి ధారతో ఉన్నాయి.

ఉదాహరణకు 1929వ సంవత్సరం అక్టోబరు నెల భారతి మాసపత్రికలో ప్రచురింపబడిన ఒక పద్యం.

"ఆకృతిని జూచి జనులందఱు నిన్ రజితాద్రివంచు ను
ద్రేకముతో నుతించెదర దేమి పురాకృత పుణ్య వైభవ
ప్రాకట సిద్ధియోగద? కరంబును నీ దగు నున్కి జేసి ము
ల్లోకములందు నెవరికి రూఢిగ మోదము గల్గజాలెడిన్"

శరన్మేఘమనే శీర్షికతో ప్రచురింపబడిన ఈ పద్యం ఎంతో భావగర్భితంగా ఉంది. శరన్మేఘం అందమైందే కానీ లోకానికి చేసే మేలు శూన్యం. అందమైనవన్నీ ప్రయోజనవంతంకావనే భావాన్నీ ఇందులో పొందు పరచారు. శరన్మేఘం తెల్లగా వుండుట సహజం. దానిని వెండి కొండతో పోల్చటం కవి భావుకతకు నిదర్శనం. చిన్ననాడు రాసిన ఈ పద్యం ఎంతో ధారాశుద్ధితో ఆయన ప్రతిభకు తార్కాణంగా ఉంది.

ఆయన రచించిన పద్యకావ్యాలలో మొదటిది "రాజసందర్శనము" 1954లో ఈ కావ్యం రచింపబడింది. బాణ మహాకవి సంస్కృతంలో గద్యకావ్యంగా రాసిన హర్ష చరిత్ర నుండి వస్తువును గ్రహించారు. అందులోని కథను భావాలను చాలా వరకు స్వీకరించి కొంతభాగాన్ని కల్పించి రచించారు. ఇందులో పద్యరచనా శిల్పమెంతో రమణీయంగా ఉంది. భాణమహాకవి హర్ష చక్రవర్తిని దర్శించుటే ఇందులోని విషయం. సామెతల ను జాతీయాలను పద్యాల్లో మణుల్లా పొదగడం కొందరు కవులు చేసే చమత్కారం. దివాకర్ల వారటువంటి పద్యాలెన్నో ఈ కావ్యంలో రచించారు.

అటువంటిది ఒక పద్యం -

"వెదకంబోయిన తీవ కాల దగిలె న్వింతయ్యె నేడంచు స
మ్మదమేపారగ నేగు దెంచి కనియెంబా ణుండు వార్తాహరున్
వదనావేద దూరభార గమన ప్రాప్తశ్రముండయ్యు న
భోదయా శంసి దరస్మితు స్మృతి లేశో ద్యత్సరాంభోజున్"

బాణుడు హర్షభూపతిని సందర్శించి తన పాండిత్యాన్ని ప్రదర్శించాలనే కోరికతో తనను రాజు మన్నిస్తాడో మన్నించడో అనే సందేహంతో సతమతమవుతుంటాడు. ఆ సమయంలో హర్ష భూపతి సోదరుడైన కృష్ణ భూపతి (బాణునికి మిత్రుడు) పంపిన ఒక సేవకుడు ఒక లేఖను తీసుకొని బాణుని దగ్గరికి వస్తాడు. ఆ సందర్భంలో "వెదకబోయిన తీగ కాలదగిలినదన్నట్లు" అనే సామెతను పొందుపరచి ఈ పద్యం రచించారు. ఈ పద్యం ప్రాచీన కవుల శైలికి యే మాత్రం తీసిపోని విధంగా ఉంది.

దివాకర్ల వారి రెండవ పద్య కావ్యం "మధువనము" వాల్మీకి రామాయణంలోని సుందరకాండలోని ఇతివృత్తాన్ని సంగ్రహంగా మధువనమనే పేరు పెట్టి 1963లో రచించిన కావ్యమిది. ఇది అనువాద కావ్యమైనా స్వతంత్ర కావ్యం వలె భాసిస్తుంది. ఇందులోని పద్యరచన సరళంగా సరసంగా సాగింది. సంభాషణ శైలిలో రచించన పద్యశిల్ప మెంత రమ్యంగా సాగిందో చూడండి.

"నిన్ను వెడల మంచు నే బంపలేను నీ
వరగకున్న రాముడరుగు దెంచు
దారి లేదు వాయుతనయ నీవరిగి రా
వయ్య నన్ను గావవయ్య"

అని పల్కు ఆమె దీనా
ననమారసి యాగ్రహంబునన్ దశకంఠున్
దునుమంగ మేనువెంచితి
ఘనమగు పర్వతమువోలె గన్పట్టంగన్

అనిన విని యంగదుండు హనుమా! యది కూడను చేసి వచ్చితే? యన హనుమంతుడప్పటికి నాగ్రహమున్నియ మించు కొంటి మీదనుగల కార్యభారము నెదందల పోయుచు నన్న దక్కుగాథను వివరించి మాకిడుముదంబు నటుంచనె జాంబవంతుడున్"

హనుమంతుడు సీత జాడ తెలిసి కొని వచ్చి అంగదాదులతో చెప్పే సందర్భంలోని ఈ పద్యాలలో సంభాషణ ఎంతో చక్కగా సాగింది. ఈ సంభాషణలో ఒక దృశ్య చిత్రం దర్శనమిస్తుంది. నాటకీయ శిల్పాన్ని పోషించిన వైనం కనిపిస్తుంది.

ఆయన రచించిన పద్యకావ్యాలలో మూడవది "కలిపరాజయము". 1972లో దీనిని రచించారు. పరీక్షిత్తు మహారాజు కలిని జయించుట ఇందులోని ఇతివృత్తం. శ్రీమద్భాగవతం నుండి విషయాన్ని గ్రహించారు. ఈనాటి సామాజిక స్థితిగతులకు ప్రతిబింబాలనదగిన పద్యాలిందులో ఎన్నో చోటు చేసుకున్నాయి.

మనసుల్ లగ్నము చేసి మాకడ బఠింపన్ గోరుచో వేదశా
స్త్ర నికాయమ్ములు లేవటే కురుకులోద్యన్మౌళిమాణిక్యమో
హన నైషధ్య విలాసగాత్రులయి బార్హస్పత్య చార్వాక ద
ర్శనముల్ నేర్పుడటంచు వత్తురు యథేచ్ఛన్ బ్రహ్మచారిబ్రువుల్

కొందరు విద్యార్థిబ్రువులు కామశాస్త్రాలను నేర్పమని వస్తారు. వీరికి సాంప్రదాయమైన విద్యరుచింపదు. వర్తమాన కాలంలోని కొందరి విద్యార్థుల ఆగడాలనిందులో స్పృశించారు. ఆధునిక కాలంలో అధ్యాపకులకు ఎదురయ్యే సమస్యలలో ఇది కూడా ఒకటి.

అవధాని గారి నాలుగో పద్యకావ్యం "త్రింశతి" అప్పుడప్పుడు రాసిన ముప్పై కవితా ఖండికల సంకలన గ్రంథమే ఈ త్రింశతి. పండుగలకు సంబంధించినవి, ప్రాసంగిక భావాలకు సంబంధించినవి, దేశ నాయకులను ప్రస్తుతిస్తూ రాసినవి, భక్తి భావాలకు సంబంధించినవి అయిన కవిత లిందులో వినూత్న భావ సమారంగా ఉన్నాయి.

మహాత్మాగాంధీని గురించి రాసిన ఈ పద్యం చూడండి -

యోగులకెల్ల యోగి నూర్జితుడాహరి వేదసార గీ
తా గురువయ్యు మున్నడపె దారుణ యుద్ధము రాజనీతితో
భూగత రాజనీతి పరిపూర్ణుడవయ్యును నీ వొక రక్త సం
యోగము లేని నూత్న రణమున్నడిపించితి తత్త్వ బుద్ధితో

ఇందులో వినూత్న భావవిలసితాన్ని వేరుగా చెప్పనవసరం లేదు. యోగులకెల్ల యోగియైన శ్రీకృష్ణపరమాత్మ నడిపిన భారతయుద్ధం కంటే గాంధీ మహాత్ముడు నడిపిన స్వాతంత్ర్యపోరాటం సముచితమైనదని పాఠకుని హృదయంలో ముద్రపడేలా ఈ పద్యశిల్పం సాగింది. ఇటువంటి పద్యాలీ త్రింశతిలో ఎన్నో ఉన్నాయి.

దివాకర్ల వేంకటావధాని గారు సుమారు 15 అష్టావధానాలు చేసి అవధాని అనే పేరు సార్థకం చేసుకొన్నారు. ఆశువుగా ఆయన చెప్పిన పద్యాలెంతో చమత్కారవంతంగా సమయస్ఫూర్తిగా ఉన్నాయి. అవధానాలనుండి మచ్చుకు ఒక పద్యం - 1974లో సర్దారు పటేలు కళాశాల సికిందరాబాదులో చేసిన అష్టావధానానికి పృచ్ఛకు డిచ్చిన సమస్య ఈ విధంగా ఉంది. "మదగజయానకు రవిక మాత్రము చాలదె చీరయేటికిన్" ఇది అవధాని గారిని ఇరుకున పడవేసే సమస్య, కానీ దానిని

"మదిగల కోర్కె దీరగ అమర్త్య విభు ప్రతిముండు రాజు స
మ్మదమున వీథి బోవ అరమోడ్పు కనుంగన తల్పుచాటునం
దొరిగి విశాల నేత్రముల యూహలు నెమ్మది పొంగువారున
మ్మదగజ యానకున్ రవికమాత్రము చాలదె చీర యేటికిన్"

పద్యం ఆశువుగా చెప్పింది అయినా భావం ఎంతో రసభరితం. భావగర్భితం. ప్రేక్షకులతో పాటు పృచ్ఛకులను కూడ మైమరిపించే చమత్కారం ఇందులో ప్రదర్శితమైంది. అవధానం నీరసంగా కాకుండా రసభరితంగా ఉండాలంటే ఇటువంటి పద్యాలెంతో అవసరం. అవధానం ఒకానొక మేధాజనితమైన విద్య, దీనికి ఆశు కవితా ధార మణిమ యాలంకారం. యుద్ధంలో వీరుని కత్తిమొనవలె అవధానం చేసే వారి కుశాగ్రబుద్ధి, పనిచేయాలి. అవధానం జేసేవారు

సభ్యుల హృదయాలను ఉల్లాసపరచాలి. సమయస్ఫూర్తి వీరికెంతో అవసరం. ఈ గుణాలన్నీ ఈ పద్యంలో చోటు చేసుకొన్నాయి.

దివాకర్ల వారు సంస్కృతం నుండి తెలుగులోనికి అనువదించిన నాటకాలలో సందర్భానుసారంగా కొన్ని పద్యాలు రచించారు. ఇవికూడా ఎంతో రసరమ్యంగా ఉన్నాయి. సంస్కృతంలో విజ్జికావిరచితమైన కౌముదీమహోత్సవనాటకాన్ని పూర్తిగ, హర్షునిచే రచింపబడిన నాగానంద నాటకంలోనిచివరిమూడంకాలను అనువదించారు. కౌముదీ మహోత్సవ నాటకంలోని ఒక పద్య శిల్పం పరిశీలిద్దాం.

"సదమల మున్నతమయిన సౌధమునగ్రము నెక్కి భూ విభుం
డుదిత విశేష సంభ్రమ సముత్కట మౌ పురి జూడ గోరెడిన్
ఉదయ నగేంద్ర కూటమున నుండి శశాంకుడుదీయ మానుడై
ముదమున నుచ్చలోర్మియయి, పొంగులు వారు సముద్రము వలెన్"

ఇందులోని భావంలో కవితా ధారలో ప్రబంధకవుల శైలి శిల్పచ్ఛాయలు స్ఫుటంగా కనిపిస్తున్నాయి.

ఇటువంటి పద్యాలు ఆయన ఎన్నో రచించారు. ఆయన పద్యరచనలు రాసిలో తక్కువ అయినా వాసిలో మాత్రం మిన్న అని చెప్పవచ్చు. పద్యప్రకియలో ఒక మహా కావ్యం ఆయన రచించి ఉంటే అది ఆంధ్రసరస్వతి కమూల్యాభరణమై శోభించి రాణించేది.

•••

# ప్రభావం

**( తమ తమ జీవితాలపై సాహిత్య దృక్పథాలపై బలమైన ముద్రవేసిన సన్నివేశాలను ఇరవై మంది ప్రసిద్ధాంధ్ర సాహితీ వేత్తలు చెప్పినవి – 1975–76 సంలో నందిని – మాస పత్రికలో ప్రచురించినవి)**

## అగ్నయే నమః

– దాశరథి *

" మామ కాని మామ చందమామ"

" కట్టు కాని కట్టు జీలకట్టు "

" శాస్త్రి కాని శాస్త్రి కేశవార్యశాస్త్రి"

కేశవార్యశాస్త్రి జన్మతః శాస్త్రి కారు. ఆయన శాస్త్రాధ్యయనం చేసి శాస్త్రి అయినారు. కేశవయ్య కేశవార్యశాస్త్రిగా ఖ్యాతి పొందారు. నాకు పట్టుమని పదేళ్ళ వయసైనా లేనినాడు ఖమ్మంలో గుంటి మల్లన్న వీధిలో సంస్కృత పాఠశాల పెట్టి ఉదయం, సాయంత్రం హోమం చేస్తూ (ఘుమ ఘుమలాడే ఘృతంతో!) వేదం పఠిస్తూ ఉండేవారాయన.

ఆయన గంభీరకంఠం వినడానికి వెళ్లే వాణ్ణి. నాతో వచ్చిన తోటి బాలురు "మామకాని మామ చందమామ" అంటే "శాస్త్రి కాని శాస్త్రి కేశ వార్య శాస్త్రి" అనేవాణ్ణి. ఆయన నవ్వుకుని "నువ్వన్నది నిజం. నా మతం, నా కులాలను అంగీకరించదు." అనేవారాయన.

"అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రవిశత్" అనే ఐతరేయోపనిషత్సూక్తికి అర్థం చెబుతూ వుంటే - " ఆ భగవంతుడి నోట్లోకి అగ్ని యెలా ప్రవేశిస్తుంది? కాలదూ?" అని అడిగే వాణ్ణి. "శబ్దరూపంలో అగ్ని ప్రవేశిస్తుంది. కనుక కాలదు. ఇతరుల గుండెల్లోని అజ్ఞానాన్ని కాలుస్తుంది" అనేవారు ఆయన. మత విశ్వాసాలలో, నాకు విశ్వాసం లేకపోయినా, వేదాల్లో, ఉపనిషత్తులలోని అగ్నిని గూర్చి ఆయనచెప్పినప్పుడల్లా సాహిత్యపరంగా అన్వయించుకోడానికి తప్పటడుగులు వేసేవాణ్ణి.

ఇటు 'మదార్సా'కు వెళ్ళితే జనాబ్ జక్కీ సాహెబ్ - ఇక్బాల్ కవితలు చదివి వినిపించి అర్థాలు చెప్పేవాడు.

'జిస్ ఖేత్‌సె దహ్‌ఖాఁకో మయస్సర్ నహోరోజీ
ఉస్ ఖేత్‌కె హర్ ఖూషయె గందం కో జలాదో"

(యే చేను కృషీవలునికి ఈయదా తిండి ఆ చేనున ప్రతిమొక్కను కాల్చేయండి)

ఇందులోని అగ్ని, విప్లవాగ్నియై నా మనసులో చొరబడేది. ఇక్బాల్ రాజకీయ సిద్ధాంతంతోనూ నేను ఏకీభవించలేదు.

ఇటు కేశవార్య శాస్త్రి, అటు జక్కీ సాహెబ్ - ఈ ఇద్దరూ లేని సమయాల్లో, నన్ను కవ్వించే మా బంధువులమ్మాయి చూడామణి శృంగారమంటే తెలియని రోజుల్లో ఏదో గిలిగింత (మనస్సులో) తనువు లోనూ కలిగిస్తుండేది.

ఉపనిషద్వాక్యాలు, ఇక్బాల్ విప్లవ గీతాలలోని అగ్ని, చూడామణి చూపుల్లోని వెచ్చదనం అడపా దడపా నా మీద దాడిచేసి నన్ను లొంగదీశాయి. ఆనాడే అంగారం, శృంగారం నన్ను ఆవహించాయి.గ్రామీణ ప్రమదా వినీల కబరీ రంగస్థలీలాసికా!" అని చాలాకాలం తరువాత వ్రాసిన పంక్తిలో ఈ రెండు (రసాలు) కలగలిసిపోయాయి. పలాశకుసుమలాసిక అగ్ని బాలిక!

నేను ఆ విద్వాంసు లిద్దరికి దూరమైనా, నా చూడామణి దక్కకపోయినా, నాలో ఆనాడు వారివలన ప్రవేశించిన అగ్ని రమారమి నలభై యేళ్లుగా నన్ను వెంటాడుతున్నది.

'అగ్నయే నమః'

* "నందిని" మాస పత్రిక - సంపుటి :1, సంచిక :1, జనవరి 1975.

●●●

# ఒక పాఠం

డా॥ సి. నారాయణరెడ్డి*

కవిగా కాదు, వ్యక్తిగా కాదు; వక్తగా నేను నేర్చుకున్నవి కొన్ని పాఠాలున్నాయి. అదేపనిగా నేర్చుకున్నవి కావు. అలవోకగా అలవడ్డవికూడా కావు; బుర్ర గిర్రుమనేటట్టు కొన్ని సందర్భాల్లో తారసపడ్డ ఘట్టాలివి.

ఆంధ్రదేశంలోని ఒక ప్రముఖ కళాశాల సాంస్కృతికోత్సవాలలో పాల్గొనటానికి వెళ్లాను. దాదాపు 17 ఏండ్ల క్రితం. అప్పటికి సినీ నీడల ప్రసక్తి లేదు. కాబట్టి కేవల తరుణసాహితీ మూర్తిగానే ఆ సభల్లో పాల్గొన్నాను. ఫలానా విషయంపై ప్రసంగించాలనే కటకటా లేమీలేవు. మత్తేభాన్ని స్టూలు మీద ఎక్కించి తిప్పించే ఇక్కట్టులూ ఏమీ లేవు. సాంస్కృతికోత్సవములు కదా! ఇష్టమున్నవాళ్లు ఇష్టమున్నది ఇష్టమున్నంత సేపు మాట్లాడవచ్చు. అయితే, ప్రేక్షకుల కరతాళధ్వనులు కాల నిర్ణయానికి తగిన తగవరులు, రక్తికీ విరక్తికీ. ఆ రోజు నేను బాగా నూరి తీసుకపోయిన విషయం - తెనాలి రామకృష్ణుని పాండురంగ మహాత్మ్యంలో హాస్యరస పోషణం, రామకృష్ణుడనగానే రామలింగడు గుర్తురావటం, రామలింగడనగానే 'త్రువ్వట బాబా తలపై స్ఫురించటం రకరకాల అకటా వికటపు పద్యాలు జ్ఞాపకం రావటం సహజం. అలాకాకుండా చాటుపద్యాల్లో రామకృష్ణుని వికటకవిత్వం ప్రకటితం కావటంలో విశేషం లేదు. అంతటి భక్తి ప్రధానమైన, భావబంధురమైన పాండురంగ మాహాత్మ్య ప్రబంధంలో కూడా అక్కడక్కడ అతని హాస్యకుశలత ఎలా కొస మెరుపులు మెరుస్తుందో వ్యాఖ్యానిస్తూ ఆ మెరువుల్ని పట్టుకొని నభలో గుప్పించటానికి ప్రయత్నించాను. ఏం లాభం? ఎవరూ కదలరే? ఒక అరడజను కరతాళధ్వనులైనా, పొరపాటుననైనా పలుకవే. ఓహో! అనరు చాలు లెమ్మనరు. దాదాపు 45 నిమిషాలు స్తబ్దంగా గడిచిపోయింది. చాలనుకొని నేనే శలవు తీసుకున్నాను, రక్తి కట్టవలసిన విషయం చప్పగా చల్లారినందుకు బుద్ధి బొప్పి కట్టింది. ఆరాత్రి అలా నిట్టూర్చింది. మరునాడు ఉదయం. అదే నగరంలో మరో కళాశాలలో మరో సాహితీ సదస్సు. మళ్లీ నా ఉపన్యాసం వరస తిప్పితే కాని వ్యవహారం రక్తి కట్టదనుకున్నాను. నిర్వికారంగానే కాదు, నిర్విషయకంగానూ వేదికపై నిలబడ్డాను. బుర్రఖాళీగా ఉంది. కారణం? అంతవరకు నూరుకొని ఉంచిన సారాన్ని అమాంతంగా చాలా ముందుగానే ఒలకపోశాను. అప్పటికి ఏ కొమ్మ దొరికితే దాన్ని పట్టుకొని ఊగాలని అనుకున్నాను. సాగింది ఉపన్యాసం ఊగింది పదవిన్యాసం. సాహిత్యమంటే - కవిత్వమంటే - నిత్యజీవితం - సమకాలీన సమాజరంగం - వాస్తవికత ఇదీ కథ. వీటి చుట్టూ తిరిగింది నాభాషణం. మధ్య మధ్య ఉత్తేజం, కావలసినంత ఉద్రేకం, ఎవరికి ? ప్రేక్షకలోకానికి, దాదాపు రెండు డజన్ల చప్పట్ల పరంపరలు. ఫలితం ఉపన్యాసం చాలా బాగుందని (విద్య) అర్థులు, (విద్య) అధికులు ఏకగ్రీవంగా మెచ్చుకోవటం. రెండు ఘట్టాలను బేరీజు వేసుకొని నేను నేర్చుకున్న తొలిపాఠం - మహాసభల్లో విషయనిర్దేశం లేని సాంస్కృతికోత్సవాలలో ఒక ప్రత్యేక విషయాన్ని గూర్చి పరిశ్రమించి ప్రసంగించటం వృథా ప్రయాస కాలాన్ని మరిగిస్తున్న, లోకాన్ని కదలిస్తున్న సమకాలీన విషయాల్ని గూర్చి ఉవ్వెత్తుగా ఉపన్యసించటం అప్పటికి అత్యంత సముచితం.

నాటినుంచి వక్తగా నేను నేర్చుకున్న పాఠాలు తెరుచుకున్న వివేక కవాటాలు ఎన్నో - ఎన్నో, వీలున్నప్పుడు మలిపాఠం గురించి ముచ్చటిస్తాను.

* "నందిని" మాస పత్రిక - సంపుటి :1, సంచిక :2, ఫిబ్రవరి 1975.

•••

# విశ్వనాథ వక్తృత్వం

**- దివాకర్ల వేంకటావధాని***

మా నాయనగారికి సోదరులు నలుగురు, అన్నలిరువురు, తమ్ములిరువులు. తమ్ములలో మొదటివారు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులలో నొకరైన తిరుపతిశాస్త్రిగారు. వారు పోలవరము జమిందారు గారికి కాస్థాన కవులగుటచే కాకినాడలో నుండెడివారు. ప్రతి సంవత్సరము తల్లిదండ్రుల ఆబ్దికములకు వారు సకుటుంబముగా అభిజనస్థానమైన యండగండి వచ్చెడివారు. అది క్షత్రియు లధికముగా కలయూరు. శ్రీ తిరుపతి శాస్త్రి గారు మాయూరు వచ్చినపుడెల్ల యెవరో సంపన్నక్షత్రియ గృహస్థులు వారిని సగౌరవముగా తమ ఇంటికి గొని పోయి యూరిలోని విద్యావంతులందరిని పిల్చి కవితాగోష్ఠి చేయించెడివారు. శ్రీ శాస్త్రిగారు జరీయంచుల దోవతి కట్టుకొని పెద్దజరీకల యెఱ్ఱని సేలువపైని ధరించి పలువురు వినుచుండ సారస్వత గోష్ఠి జరిపెడివారు. నేనును వారి ప్రక్కనే కూర్చుండి వినుచుండెడివాడను. అప్పుడు నాకైదాఱేండ్ల కంటె ఎక్కువ యుండవు. గాయత్రీ రామాయణమునందలి శ్లోకములు, భాగవతము నందలివియు శతకములందలివియు కొన్ని పద్యములు నాకప్పుడు కంఠగతములై యుండెను. శ్రీ శాస్త్రి గారు తమ ప్రసంగము ముగిసిన తరువాత నాచే కొన్ని పద్యములు శ్లోకములు చదివించెడివారు. మాఇంటికెదురుగా నున్న క్షత్రియు లొకరు. వారిపేరు పేరిచర్ల సోమరాజు గారు - శాస్త్రి గారితో "వీనిని మీయంతకవిని పండితుని చేయవలెను" అనెడివారు. శ్రీ శాస్త్రి గారు మందహాసమొనరించుచు ప్రక్కనున్న నాశరీరము ప్రేమతో తడవెడివారు. వారి మొగమున నందము చిందెడి ఆమందహాసము నాకిప్పటికిని జ్ఞాపకమున్నది.

నా కాఱేండ్లు. ఉదయమేడు గంటలకు పోష్టు వచ్చెను. మానాయనగారొక కార్డు చదివి గొల్లుమని యేడ్చిరి. ఇంటిలోని వారందఱు నేడ్చిరి. నేనును కారణము తెలియకుండానే యేడ్చితిని. తరువాత ఆంధ్రపత్రిక వచ్చినది. అందులో తిరుపతిశాస్త్రి గారి నిర్యాణము దివాకరాస్తమయమను పేరుతో ప్రకటింపబడినది. పలువురు మిత్రులు, శిష్యులు వారిని గూర్చి పద్యములు వ్రాసిరి. మానాయన గారు పెద్ద పెట్టున నేడ్చుచు ఆపద్యములు చదివిరి. లక్ష్మణుడు యుద్ధరంగమున మూర్ఛిల్లినప్పుడు శ్రీరాముడేడ్చిన యేడ్పు తరువాత చదివినప్పుడెల్ల నాకప్పటి మా నాయనగారి యేడ్పు జ్ఞప్తికి వచ్చుచుండును వారంతగా దుఃఖించుట మఱెన్నడు చూడలేదు. అపుడు బిక్కమొగముతో చెంత చేరిన నన్నుచూచి వారు "తిరుపతీ వీనిని నీయంతకవిని పండితుని చేసెదవనుకొంటినిరా వీనికా అదృష్టములేదు. నీవు లేమిచే లోకమంతయు శూన్యమై పోయినదిరా" అని మరల బిగ్గరగా ఏడువనారంభించిరి. నాకా అదృష్టము లేకపోయినది. కాని మానాయనగారన్న ఆ మాటలు నాగుండెలో నెప్పుడును మెదలుచునే యుండును.

బందరులోని హిందూ కళాశాలలో ఇంటరులో చేరితిని. అప్పుడు శ్రీ కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారందాంధ్రోపన్యాసకులు. నేను కళాశాలలో సంస్కృతము చదువుచుంటిని. వారు తెలుగే కాక సంస్కృతము కూడ బోధించుచుండిరి. తఱుచుగా నేను వారియింటనే యుండెడి వాడను. వారు కళాశాలకు తెల్లని ఖద్దరు ధోవతి, ఖద్దరు కోటు, ఖద్దరు తలపాగ ధరించి వచ్చెడివారు. వారి ఆ వేషము, వారు బోధించెడి తీరు, వారిని కళాశాలలోని యితరోపన్యాసకులు గౌరవించెడి విధానము నన్నెంతో ఆకర్షించెడివి. వారి ఉపన్యాసము లెచ్చట నున్నను వెళ్ళి

వినుచుండెడి వాడను. వారు కొందఱిని మెచ్చెడివారు. కొందరిని నిర్భయముగా తెగడెడివారు. నాసహపాఠి, మాయూరివాడు, ఇంకూరి సత్యనారాయణ రాజు (పాపమాతడు యౌవనముననే దివంగతుడయ్యెను) ఆయుపన్యాసములకు నాతో వచ్చి దారిలో ఉపన్యాస విషయముల నుత్సాహముతో చెప్పుచు నాతో "మీరును ఇట్లే కవిపండితులై ఉపన్యాసములు చెప్పి సభ్యుల నలరించు కాలము వచ్చు" ననెడి వాడు. ప్రేమతో అతడనెడి ఆ వాక్యములు నేనుపన్యాస వేదిక ఎక్కునప్పుడెల్ల జ్ఞప్తికి తగులు చుండును.

మాటలు విస్మృతములై గాలిలో కలసి పోవచ్చును. వాని ప్రభావము మాత్రము శాశ్వతముగా నుండిపోవును.

* "నందిని" మాస పత్రిక - సంపుటి :1, సంచిక :3, మార్చి 1975.

•••

# పోతన ఆదర్శకవి

**- వానమామలై వరదాచార్యులు***

నా పదేండ్ల వయస్సులో మణిగిరి రామాబాయమ్మ గారింట్లో మా అన్నగారి వద్ద విద్యాభ్యాసం చేస్తొండేవాణ్ణి. రామాబాయమ్మ గారు తమ విరామ సమయాల్లో ఎప్పుడూ పోతన గారి భాగవతం చదువుతూ నాతో గూడా చదివించేది. భాగవతంలో దశమస్కంధం పూర్వభాగం చదవడమంటే నాకు చాలా ఇష్టంగా ఉండేది. గోకులాష్టమీ రోజు కృష్ణ జన్మ నేనే చదివేవాణ్ణి. పోతన గారు సహజ కవులు. సహజ పండితులు. ఆయన శబ్దాలలో సామవేద సంగీతమేదో ఉన్నట్లనిపిస్తుంది. ఆయన శబ్దసౌందర్యానికి ఎంతటి ప్రాధాన్యం ఇస్తాడో అర్థచమత్కృతికి అంతటి ప్రాధాన్యమిస్తాడు. నేనా రోజుల్లో భాగవతం చదువుతూ ఆనందాతిశయంతో 'కవిత్వం రాస్తే ఇలా వ్రాయాలె' అనేవాణ్ణి. అనుకొని మురిసిపోయేవాణ్ణి.

కొంచెం పెరిగి 18 ఏండ్ల ప్రాయం వచ్చింది. కాళిదాసు కవితతో కొంచెం పరిచయం గలిగింది. మా పెద్దన్న గారు శాకుంతల శ్లోకాల కొన్నిటిని, అతి సుందరమైన వ్యాఖ్యానంతో బోధించేవాడు. ఆయన శృంగార రస చిత్రణ నన్ను ముగ్ధుణ్ణి చేసింది. అటు పోతన భక్తి, ఇటు కాళిదాసు సుధారససూక్తి నా తలలో నిండిపోయాయి.

ఒకనాడు రవీంద్ర కవీంద్రుని 'గీతాంజలి' చదవడం తటస్థించింది. వేదాంతానికి కళారూపమిచ్చి చెప్పే పద్ధతి నాకు చాలా నచ్చింది.

జాషువా వ్రాసిన 'ఫిర్దౌసి' అను చిన్న కావ్యాన్ని చదివి కవికి రాజు చేసిన అన్యాయానికి కన్నీరు గార్చాను. కాని అంతమాత్రానికే ఆ మహాకవి గుండెబగిలి ఎందుకు మరణించాల్సి వచ్చిందో నాకు అర్థం కాలేదు. "అక్షర కవితా ధనం తనకుండగా క్షరధనాలకు లొంగిపోకుండ ఉండాలి గదా" అని అనిపించింది. అలా చేసిన పోతన జ్ఞాపకానికి వచ్చినాడు. ఆ మహితాత్ముని యాత్మోన్నతి నిరుపమాన మనిపించింది. రాజాదరమును కాలదన్ని, కలకాలం మహాకవిగానిలబడగలిగిన పోతన ఆదర్శ కవియని భావించి అతని సచ్చరిత్ర గానం చేయాలనిపించింది. ఆయన వర్తనం ఆయన కవిత్వం నన్నాకర్షించాయి. ఆయన చరిత్ర వ్రాస్తే నేనుగూడ ఒక కవిని కాక పోతానా అని గానం చేశానాహాలిక కవివృత్తాన్ని. అది నాకు చక్కని కవిత్వం ఎలా ఉండాలో ఉపదేశించింది. ఆవు వెంట నడిచే లేగనై అతని వెంట ఆటలాడాను.

* "నందిని" మాస పత్రిక - సంపుటి :1, సంచిక :4, మార్చి 1975.

•••

# మలపు తిప్పిన లేఖ

**– దేవులపల్లి రామానుజరావు***

ఇప్పటికి ముప్పై ఆరు సంవత్సరాల క్రిందటి మాట. 1939 సం॥లో నిజాం కళాశాల నుండి డిగ్రీ తీసుకొన్న తరువాత ఒకటి రెండు సంవత్సరాలు తీరికగా ఇంటిలో ఉండడం తటస్థించింది. ఆ కాలంలో న్యాయవాద వృత్తి అవలంబించవలెనా లేక వ్యవసాయము మొదలైన ఇంటి వ్యవహారాలు చూచుకొనవలెనా అని ఆలోచించుకుంటున్న రోజులు. కాలక్షేపానికి కొంత కవితా వ్యాసంగము, రచనా వ్యాసంగము చేస్తుండేవాణ్ణి. ఆ సందర్భంలో గోలకొండ పత్రికలో కొన్ని వ్యాసాలు వ్రాసి ప్రచురించే అవకాశం కలిగింది.

నా మొట్టమొదటి వ్యాసము పత్రికలలో ప్రకటితమైంది. ఎంతో సంతోషం కలిగింది. రెండు రోజుల తరువాత సన్నని దస్తూరితో 'మిత్రవర్యా!' అని సంబోధిస్తూ వ్రాసిన కార్డు ఒకటి అందింది. ఆ కార్డు హైదరాబాదు రాష్ట్రంలోని సమస్త ప్రజాహిత జీవనానికి, సాంస్కృతిక కార్యకలాపాలకు అన్నింటికీ మార్గదర్శకులైన మూలవిరాట్టు ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు పంతులు గారు వ్రాసింది. వారి ప్రశంస నన్ను పరమానంద భరితుణ్ణి చేసి, సాహిత్య రంగంలో కృషిచేయవలెననే సంకల్పము రేకెత్తించింది. నా వ్యాసాన్ని హర్షిస్తూ హైద్రాబాదు వచ్చినప్పుడు తమను తప్పక కలుసుకోవలసిందిగా పంతులుగారు నన్ను ఆకార్డులో కోరినారు. అంతటి మహావ్యక్తి కోరికను ఆదేశంగా భావించి తరువాత కొన్ని వారాలకు హైద్రాబాదు వచ్చి వారిని సందర్శించినాను. ఆనాడు వారు నాపట్ల చూపిన ఆదరము, నాకు ఇచ్చిన ప్రోత్సాహము నా జీవితంలో యెన్నడూ మరవజాలను. ఆనాటి వారి ప్రోత్సాహమే తరువాత కాలాన్ని పూర్తిగా సాంస్కృతిక కార్యకలాపాలకు వినియోగించటానికి కారణభూతమైనది. విద్యాధిక యువకులను ప్రజాసేవవైపు ఆకర్షించడం పంతులుగారి ఆశయాలలో ఒకటి!

1942 సం॥లో 'తెలంగాణ' దినపత్రికగా హైద్రాబాదు నుండి వెలువడింది. ఆ పత్రిక సంపాదక వర్గంలో చేరవలసిందని హనుమంతరావు పంతులుగారు స్వదస్తూరితో మరొక జాబు వ్రాసినారు. కాని, నేను నాగపూరు న్యాయకళాశాలలో చేరినందువలన ఆ అవకాశాన్ని వినియోగించుకోలేదు. అయితే హైద్రాబాదుకు వచ్చిన ప్రతి సందర్భంలోనూ పంతులుగారిని సందర్శించి, వారితో కొంత కాలము గడిపి, ఉత్తేజితుణ్ణి అయ్యే వాడిని వారి సలహాలను, ఆశీర్వచనాలను పొందేవాడిని, వారు నాపట్ల చూపిన ఆదరాభిమానాలు నా ప్రజాహిత జీవనానాకి మార్గదర్శకాలైనవి.

క్రమశిక్షణ, సమయపాలన విశేషించి సంస్థల డబ్బు వినియోగించడంలో కఠినమైన నియమాల పాటింపూ, ప్రజాసంస్థలకు సుస్థిరమైన పునాదులను నిర్మించవలెననే దీక్షా నేను పంతులుగారి నుండి నేర్చుకున్న పాఠాలు. ఆ పాఠాలను సరిగా అభ్యసించి, అందుకు అనుగుణంగా వ్యవహరించినందువల్లనే, నేను కొద్దో గొప్పో భాషా సేవ, దేశ సేవ చేయగలిగాను నాజీవితంలో యీ మలుపుకు కారణభూతులు హనుమంత రావు పంతులు గారే.

ఆయన మరెందరికో మార్గదర్శకులైనారు. నాటి తెలంగాణా పరిస్థితులు తెలిసిన వారందరికీ యీ సత్యము విదితమే కదా!

* "నందిని" మాస పత్రిక – సంపుటి :1, సంచిక :5, మే 1975.

•••

# అపోహలు అందించిన విజయాలు

## శ్రీ రావూరు వెంకట సత్యనారాయణరావు*

ఆదినుంచి నా జీవితంలో అపోహలు చాలా రకాలుగా బయలుదేరుతూ వచ్చాయి. కొన్ని లేనిపోని గొప్పలు చెప్పేవి, కొన్ని కానరాని తప్పులు వల్లించేవి. అవన్నీ నిజమైతే నేను ఒక అమల మందాకిని సృష్టించుకొని ఒడ్డున కూర్చుని ఏవో గీతాలాలపిస్తూ వుండేవాణ్ణి లేదా వైతరంగి వొడ్డున విషాద గీతాలో వల్లిస్తూ వుండేవాణ్ణి.

అపోహల ప్రభావం అప్పుడప్పుడు జీవితం మీద పడుతూ వుంటుంది. నా జీవితంలో కొందరి అపోహలు నాకెంతో మేలు చేసినాయి. మావుళ్ళో ఒక హరిజన బాలుడికి నాకు ఇంగ్లీషు బాగా వచ్చనే అపోహ వుండేది. నేను కాదనడం ఎందుకని వూరుకొనే వాణ్ణి. ఒక రోజున వాడు ఇంగ్లీషు పుస్తకం తెచ్చి పాఠం చెప్పమని బ్రతిమలాడాడు. ఆ రాత్రి మా అన్నగారి దగ్గర పాఠం చెప్పించుకొని మరునాడు వాడికి చెప్పాను. ప్రతి రోజు అంతే! అతగాడి అపోహవల్ల నాకు ఆంగ్ల భాషాధ్యయనం ఏర్పడింది. అంతకు ముందు అక్షరాలు తప్ప మాటలు రావు.

ఎందుకనో మా బందరులో ఒక వ్యాపార ప్రముఖుడికి నాకు టైపు చేతవుననే అపోహకలిగింది. వెంటనే ఉద్యోగం ఇచ్చాడు. నేను ఒక అయిదు రోజులు టైము అడిగి ఒక మిషను అద్దెకు తీసుకుని దాని లక్షణాలు మాత్రం గ్రహించి ఉద్యోగంలో చేరాను. ఈయన అపోహ నన్ను ప్రప్రథమంగా ఉద్యోగస్థుణ్ణి చేసింది.

అలాగే ప్రఖ్యాత పత్రికాధిపతులు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారికి నాకు హిందీ భాష వచ్చుననే అపోహ కలిగింది. అనువాదకుడుగా పిలిచి ఉద్యోగం ఇచ్చారు. రాదనకుండా ఎలాగో తంటాలు పడ్డాను.. అపోహ ఈనాటి సారస్వత జీవితానికి నాంది గీతం అయింది. అపోహల నుంచి ప్రభావితాలైన జీవితాలు అరుదేమో!

* "నందిని" మాస పత్రిక - సంపుటి :1, సంచిక :6, జూన్ 1975.

●●●

# చతురంగం

## - డాక్టర్ పల్లా దుర్గయ్య *

నేను పుట్టింది మొదలు ఇంచుమించు అరువై పంచాంగాలు పాతబడి పోయినవి. చిన్నతనం చూస్తుండగానే పెద్దతనంగా రూపుదిద్దుకున్నది. రకరకాల అనుభవాలు, ప్రభావాలు పొంది చిన్న వాడు పెద్దవాడౌతాడు మనిషి. అందరి జీవితం యింతే.

నా చిన్నప్పుడు మా గ్రామం ( మడి కొండ) లో కనకయ్యగారంటూ ఓ బ్రాహ్మణ సన్యాసి ఉండేవాడు. ఆయన చతురంగపు ఆట వ్యామోహంలో పడి సన్యాసి అయినాడు. ఆ ఆటలోఆయన నిష్ణాతుడు. ఆయన దగ్గర శిక్షణ పొంది చతురంగం ఆడటం బాగా నేర్చినాను. 'చతురంగ పెత్తు, సంసారపు ఎత్తు' అంటారు. చతురంగం వల్ల నాకు వేరే లాభం కలుగకున్నా మన స్థైర్యం, చిత్త సంయమనం కుదిరింది.

మాగ్రామంలో గురుకులాలలాంటి రెండిండ్లు ఆనాడు వుండేవి. ఒకటి వానమామలై వారిది, రెండోది కాళోజీ వారిది. ఈ రెండు చోట్ల కూడా నిరంతరం ఉచిత విద్యాభోధనం జరుగుతూ వుండేది. వానమామలై వారింట్లో తెలుగు, సంస్కృతం; కాళోజీ వారింట్లో ఉర్దూ, ఇంగ్లీషు కొంత నేర్చుకున్నాను. అప్పటి జ్ఞానం నాకు ఉన్నత విద్యాభ్యాసంలో బాగా తోడ్పడింది.

బి.ఏ.,లో మాకు రాయప్రోలువారి 'తృణకంకణం' పాఠ్య గ్రంథంగా ఉండేది. అప్పుడు ఆచార్య రాయప్రోలు

సుబ్బారావు గారు విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖకు అధ్యక్షులు. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గారు ఉపన్యాసకులు. నేనూ, శ్రీ ఆరుట్ల రామచంద్రరెడ్డి మాత్రమే అప్పుడు తెలుగులో విద్యార్థులం కాబట్టి ఆచార్యులు మాకు చక్కగా బోధించేవారు. ముఖ్యంగా తృణకంకణం చదవటం వల్లనే అనుకుంటాను నాకూ కవిత్వం వ్రాయాలనే అభిలాష కలిగింది. ఛందస్సు శ్రీమాన్ దూపాటి వేంకటరమణాచార్యుల వద్ద ఇంటర్ మీడియట్ చదివేటప్పుడే నేర్చుకున్నాను. వ్రాయాలనే కోరిక అప్పుడు కూడా కలిగినా ప్రయత్నం జరగలేదు. కాని శ్రీ సుబ్బారావు గారి ప్రభావం వల్ల చిన్న చిన్న ఖండికలు వ్రాయటం ప్రారంభించినాను. 'నన్నయ్యభట్టు ప్రశంస'యే నా మొదటి రచన అని చెప్పవచ్చు. శ్రీ సుబ్బారావు గారికి వినిపించినాను. వారెంతో మెచ్చుకున్నారు. ఆ ప్రోత్సాహంతో నా ప్రయత్నం ముందుకు సాగింది. పద్యాలే కాక చందమామ, సెలయేరు వంటి గేయాలు (ఎం.ఏ.కి చదువుతున్నప్పుడు) వ్రాయడం, వారికి వినిపించడం వారి మెప్పు అందుకోవడం జరిగింది. ఈ విధంగా నేనూ ఒక కవినైనా ననుకున్నాను, తర్వాత 'గంగి రెద్దు' లాంటి కావ్యం కూడా వ్రాయడం జరిగింది.

ఒకప్పుడు 'మనుచరిత్ర' చదువుతుండగా కొన్ని పద్యాలకు నాకు తోచిన విశేషాలను వ్యాసరూపంలో వ్రాసి ఆచార్య లక్ష్మీరంజనం గారికి వినిపించినాను. వారు నన్ను పి.హెచ్.డి., పరిశోధనకు ప్రోత్సహించినారు. ఆ తర్వాత వారి పర్యవేక్షణలోనే పరిశోధన సాగించి పట్టము పొందటం జరిగింది. సాహిత్య విమర్శనకు, పరిశోధనకు మార్గదర్శకు లయినారు ఆచార్య శ్రీ లక్ష్మీరంజనం గారు.

** "నందిని" మాస పత్రిక - సంపుటి :1, సంచిక :7, జూలై 1975.*

•••

# గురవే నమః

**– డాక్టర్ పాటిబండ మాధవ శర్మ***

"పథా గురోః పాదనపూత గంధినా
గిరా గురోః కీర్తన బంధురశ్రియా
హృదా గురో ర్భావన పావితా స్రృజా
భావే దియం మే కవితా ప్రయత్రా"

ఈ శ్లోకానికి 42 ఏళ్లు. నాకు 65 ఏళ్లు. ఇందులో 'గురోః' అని ఏకవచనం ఉన్నది. కాని ఆ యేకవచనంలో ఇద్దరున్నారు. ఆ యిద్దరూ బహిరంగంగా పరమశత్రువులు లాగా కనిపించినా అంతరంగంలో పరమమిత్రులు. నా అంతరంగంలో కూడా ఆ యిద్దరూ ఒక్కరే.

నేను ఇంటర్ చదవడానికి బందరు నోబుల్ కాలేజీలో చేరేను. మదనగోపాలునికి అంకితం చేస్తూ యదువంశము అనే ప్రబంధం మొదలుపెట్టి రెండాశ్వాసాలు వ్రాశాను. విశ్వనాథ వారు హిందూకాలేజీలో ఉపన్యాసకులుగా ఉండేవారు. వారిని దర్శించి నా పద్యాలు దిద్దిపెట్టండి అని అడిగేను. చదవమన్నారు.

అభీలాబ్ద చమూ సమాన నిజ దే
హోక్షుద్ర తేజ శ్చటాం
ధీభూతాఖిల భూమి చక్ర యగునా
స్త్రీ గాంచి కంసుండు మే
ఘాధ్వానముతోడ నిల్లనియె నో
గంభీర సంరంభ.......

విశ్వనాథవారు ఈ పద్యాన్ని మహాప్రాణాక్షరాలను వొత్తుతూ, దీర్ఘాకారాలను సాగదీస్తూ చదివి అబ్బో అన్నారు. వెక్కిరిస్తూన్నారనిపించింది. దిద్దలేదు, సలహాలివ్వలేదు.

ఒకనాడు ఆయన పాఠం చెబుతుండగా క్లాసులో వెళ్ళి కూర్చున్నా గుణనిధి కథ చెబుతున్నారు. ఏమి

చెప్పటం ! అది గానమా, వ్యాఖ్యానమా, అభినయమా! **మరపురాని** అనుభవం అది. ఆయన నాకు మొదటి గురువు. ఆయనలాగా కవిత చెప్పలేక పోయినా పాఠమైనా చెప్పాలి.

తరువాత బి.ఏ. ఆనర్సు చదవడానికి వాల్తేరు వెళ్ళాను. అక్కడ పింగళివారు. ఆయన పాఠం చెప్పడం అదొక తీరు. పరమ సుకుమారమైన తీరు. విశ్వనాథవారు చెబుతుంటే రత్నాలు త్రవ్వి పోస్తున్నట్లు. పింగళివారు చెబుతుంటే పువ్వులు వెదజల్లుతున్నట్లు. పింగళి వారు రెండో గురువు. మొదటి ముద్రమీద రెండో ముద్ర పడింది. కొంతకాలం దేనికదే. నేను నేనయిన తరువాత రెండూ కలిసిపోయినై.

విశ్వనాథ వారి ప్రతిభ మహాసముద్రం. దరి దొరకదు. లోతు తెలియదు. పింగళి వారి ప్రతిభ నిన్ను కొత్త వ్యక్తిని చేస్తుంది. పింగళివారి ప్రతిభ నిన్ను నిండు వ్యక్తిని చేస్తుంది విశ్వనాథ సూర్యుడు. చైతన్యాభిషేకం చేస్తుంది ఆయన ప్రతిభ. పింగళి చంద్రుడు – అమృతాభిషేకం చేస్తుంది. ఆయన ప్రతిభ. నేను రెండు అభిషేకాలు అనుభవించాను. నేను నేనుగా వికసించాను.

నేను కవిని కాలేదు. పండితుడను కాలేదు. అధ్యాపకుడనైనాను.. 'గురోః'లో ఇమిడి ఉన్న ఆ యిద్దరి ప్రతిభా ప్రభావం ఏకమైనా అధ్యాపకత్వానికి ఒక విశిష్టతను ప్రసాదించినై. గురవేనమః!

* "నందిని" మాస పత్రిక – సంపుటి :1, సంచిక :8, ఆగష్టు 1975.

•••

# ప్రభావం – ప్రతిభ

**– కుందుర్తి ***

నామీద ఎవరి ప్రభావమైనా పడిందా? ఏమో, చెప్పడం కష్టం. పడిందంటే నేను స్వతంత్ర వ్యక్తిత్వం లేనివాణ్ణి అయిపోతాను. పడలేదంటే, మీరు నమ్మరు. నువ్వేం జీనియస్‌గా పుట్టావా అంటారు. అందుకే నేను మిమ్మల్నే అడుగదలుచుకున్నాను. నా కవిత్వం పూర్వం రాసిన ఫలానా వారి కవిత్వంలా వుందని పరిశోధన చేసి చెప్పండి. ఆ ఫలానా వారి ప్రభావం నా మీద పడిందని నేను ఒప్పుకుంటాను.

జాషువా గారి దగ్గర చదువుకున్నాను. ఎవరి ప్రభావమై నా మీద పడే యీడు కాదది. అయినా ఆయనంటే నాకు అభిమానం. ఆయన పద్యకవితలో సారళ్యవాది. నేనూ సారళ్యవాదినే వచన కవిత్వంలో. ఆయన అభ్యుదయవాది పద్యకవితలో నేనూ వచన నకవితలో అభ్యుదయవాదినే. ఇంతకూ ఆయన ప్రభావం పడిందంటారా?

విశ్వనాథ వారి శిష్యుణ్ణి. ఆయన ముద్ర నామీద ఒకానొక కాలంలో చాలా వుండేది. ఆయనలాగా రాయగలిగానా అంటే లేదు. ప్రయత్నం జరిగింది కాని విఫలం కాలేదు. ఆయన భావాలూ నా భావాలూ, రాను రాను బాగా దూరమైపోయాయి. అయినా గురువే. అభ్యుదయ కవుల్లో చాలామంది ఆయన్ను తిడతారు. నాకు తిట్టబుద్ధి వెయ్యదు సరిగదా; ఆయన తిట్టినా పడతాను ఆయనంటే నాకు సాఫ్ట్ కార్నర్.

మరి శ్రీశ్రీ? శ్రీశ్రీ నన్నేమి, మా యుగంలోని సర్వ యువకవులను నూతన అభ్యుదయ కవితా తత్వశక్తి చేత శాసించాడు. చుట్టూ వున్న గాలిని పీల్చకుండా ఎలా బ్రతుకగలరు, ఎవరైనా? ఇది శ్రీశ్రీ శక్తి అనడం కంటే యుగశక్తి అంటే న్యాయంగా వుంటుంది. ఆ యుగశక్తిని ఆ యుగకర్త మేలుకొల్పాడు.

ఇంతకూ వీరి ప్రభావం వున్నట్లా, లేనట్లా, ఒక్క చోటునుండే అన్ని లక్షణాలు, లేక అనేక లక్షణాలు వచ్చిపడితే దాన్ని ప్రభావం అంటాం. అనేకచోట్ల నుండి రకరకాల గుణాలు వచ్చిపడి తమ జన్మ స్థానానికి పోలిక

లేని విధంగా ఒక కొత్త మిశ్రమం ఏర్పడితే దాన్ని ప్రభావం అనం. ప్రతిభ అంటాం.

యువకులు క్రొత్తలో కొంత మందిని అనుకరించడం చేస్తూంటారు. ఇది అనివార్యం. కాని ఆ ధోరణి అలా సాగినంతకాలం వ్యక్తిత్వం ఉండదు. దానిని సాధ్యమైనంత త్వరలో తెంచుకోవాలి.

ఎన్నెన్ని ప్రభావాలు వచ్చి తలుపు తట్టినా, అన్నింటినీ స్వీకరించి, జీర్ణం చేసుకుని, తనదైన ఒక కొత్త ప్రభావాన్ని యితరులపై పడజేయగలిగినవాడే నిజమైన కవి ప్రతిభ అనేమాటకు నిర్వచనం అదే.

* *"నందిని" మాస పత్రిక - సంపుటి :1, సంచిక :9, సెప్టెంబరు 1975.*

•••

# ఎన్నో వర్ణభావాలు

**– శ్రీ కోదాటి నారాయణరావు ***

బాల్యంలో నాపైన ప్రసరించిన ప్రభావం విశేషంగా మా తాతా గారిది. ఆయన పల్లెటూరివాడైనా, విద్యావంతుడు కాకపోయినా, అన్ని మతాలపట్ల, కులాల పట్ల సమన్వయభావం ఉండేది. మూఢ విశ్వాసాలు ఆయన నమ్మేవాడు కాదు. సంప్రదాయాల ప్రభావం కూడా ఆయనపై అంతగా ఉండేదికాదు. ఇవన్నీ, మరీ బాల్యంలో ఆయన చెప్పుచేతలలో పెరిగిన నాకు కూడా అలవడినవి. చివరకు గాంధీగారి పట్ల విశ్వాసం కూడా ఆయిన ప్రభావమని చెప్పవచ్చును. తర్వాత మా గ్రామంలోని నవ్యభావాలు నాటిన సన్నిహిత బంధువులు, అన్నగారు అయిన కీ॥ శే కోదాటి వెంకట నర్సిహ్మారావు గారు కూడా నన్ను చాలా ప్రభావితుడిని చేసారు. ఆయన మా గ్రామంలో గ్రంథాలయం నెలకొల్పారు. 1918 ప్రాంతంలో సభలు సమావేశాలు జరిపారు. స్వయంగా కాకినాడ కాంగ్రెసు సభలలో పాల్గొన్నారు. ఆయన జరిపిన ఒక సభలో పాడిన "స్వదేశ మాత నీ పదారవిందములో" అనే గేయం నాటికీ, నేటికీ నన్ను సేవా కార్యక్రమాలకు పురికొల్పుతూనే వున్నది. నా పైన పెచ్చుగా ప్రభావం వేసినవారు మా పినతండ్రి కీ॥ శే కోదాటి రామకిషన్‌రావు గారు ఆయన ఉస్మానియా విశ్వవిద్యాలయం రెండవజట్టులోని పట్టభద్రుడు రాయప్రోలు సుబ్బారావు గారి శిష్యుడు. సంఘ సంస్కర్త. దేవ సేవాపరుడు. అందువల్ల ఆయన అన్ని రంగాలలోనూ నాకు ఒక విధంగా శిక్షణ ఇచ్చాడని చెప్పవచ్చును. చివరకు సాహిత్య రంగంలోనూ, ఆనాడు ఎక్కువ చలామణిలో ఉన్న భావకవిత్వ ప్రభావం ఆయనద్వారానే నాపై పడింది. ఆనాడు వ్యాప్తిలో ఉన్న ఎన్నో పుస్తకాలు అర్థమయినా కాకున్నా, చదివాను. నా మనసుకు హత్తుకపోయిన కొడవటి గంటి వెంకటసుబ్బయ్య గారి "ఆగు మాగుము తెరువరీ" అనే గేయము ఈ నాటికీ నన్నెంతో ముగ్ధుడిని చేస్తుంది.

ఆ రోజులలో నందగిరి వెంకటరావు గారి శైలి, ఆయన సంభాషణ, నన్ను చాలా ఆకర్షించింది. తర్వాత గిడుగు రామమూర్తి పంతులు గారి పుస్తకాలు చదవడం, శిష్టవ్యావహారికం వ్రాయడం అలవరచుకోవడం మొదలు పెట్టాను. శిష్ట వ్యావహారిక భాషలో కీ॥ శే చింతా దీక్షితులు గారి రచనలు నన్ను ఒరవడి పెట్టినవని చెప్పవచ్చును. కొంత వయస్సు పై బడిన తర్వాత గాంధీ రచనాశైలి నన్ను చాలా ఆకర్షించింది.

నేను అప్పట్లే కవిత్వం వ్రాయడానికి ప్రయత్నించలేదు. అల్లే కథలు కూడా. కాని చాలామంది కవితలు, కథలు చదివాను. రాయప్రోలు సుబ్బారావు గారి దేశభక్తి గీతాల తర్వాత నన్నాకర్షించింది బసవరాజు అప్పారావు గారి గేయాలు అలాగే జాషువా పద్యాలు. ఒకరిది ఆలోచనాశక్తి ప్రేరేపించేది అయితే మరొకరిది కళ్ళముందు చిత్రాలను

చిత్రించేది. అని నాకు స్ఫురించేది.

* "నందిని" మాస పత్రిక - సంపుటి :1, సంచిక :10, అక్టోబరు 1975.

●●●

## జీవితంలో మలుపు

**– ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం ***

తన విధికి లేక తన భవిష్యత్తుకి తానే కారకుడు అవుతాడని అంటూంటారు. స్థిత ప్రజ్ఞుల విషయంలో ఇది వాస్తవమే కావచ్చును. సామాన్యుల విషయంలో పరిస్థితులే మనుష్య జీవితం అనే డింగీని కెరటాల మీద ఇటూ అటూ కొట్టేస్తూంటాయి. అవి నెట్టిన దారిని బట్టి పోయి ఏదో ఒక రేవుకు అతడు చేరుకుంటాడు.

1928లో నేను బి.ఏ., ప్యాసయాక ఉద్యోగ ప్రయత్నం చెయ్యక తప్పింది కాదు. అప్పటికి నాకు ఉన్న మూలధనం అంతా బి.ఏ., అనే రెండక్షరాలు. ఆ సువర్ణాక్షరాలు ముద్రించిన కొన్ని విజిటింగుకార్డులు. అవి చేత పుచ్చుకొని ఆఫీసు లుండే ఒక్కొక్క వీధి పట్టుకొని ఎక్కే గుమ్మం దిగే గుమ్మంగా, కొత్త బూట్లు కాళ్లు కరిచి బాధపెడుతుండగా, రాని మందస్మితం చేస్తూ సాగిపోతూండే వాడిని. 'నేతి నేతి' అనే వేదాంత వాక్యమే చెవిన బడేది. ఇట్లాంటి సంచారాల్లో ఒక మాటు సిటీ కాలేజి అని చెప్పబడే సంస్థకు దర్శనమిచ్చాను. మూసీ ఒడ్డున హైకోర్టు పక్కన అది ఇప్పటికీ నిలిచియే ఉంది. అప్పటి దాని ప్రిన్సిపాలుగారు సయ్యద్ మహమ్మదు ఆజం అనేవారు. వారు తలుచు కుంటే ఉద్యోగం వేయించి వెయ్యగలరని చాలామంది చెబితే కొండంత ఆశతో వెళ్ళి విజిటింగు కార్డు పంపాను. వెంటనే పిలిపించి నన్ను ఎగాదిగా చూసి ఆయ అన్నారు. 'ఇక్కడ ఎవరూ చనిపోలేదు. ఖాళీలు ఏమీ లేవు దయ చెయ్యి' అని. చాలాక్రుంగిపోయాను ఎదుటివారిచేత మాట పడలేని దురభిమానము నాకు అప్పటికే ఉండేది కాబోలు. ఇంటికి వచ్చి ఆజం సాహెబు గారి పరుష సమాధానాన్ని విమర్శిస్తూ ఇంగ్లీషులో ఉత్తరం వ్రాసి పోస్టు చేశాను. సిటీకాలేజి ఉద్యోగానికి శాశ్వతంగా తిలోదకాలు ఇవ్వడం అయిందని భావించాను.

ఒకమాటు అప్పటి రెసిడెన్సీ ఆఫీసులో ఉద్యోగానికి దరఖాస్తు పెట్టాను, వాళ్ళు ముఖసందర్శనానికి పిలిచారు. అదొక ఆగాధంగా కనబడింది. నిశ్శబ్ద నీరవ నిశీథిలా ఉంది ఆఫీసు అంతా. ఎవరూ తలయెత్తడానికి గాని, పెదవిప్పి మాట్లడడానికి గాని వీలు లేదు. పది రోజులు తిరగకుండానే రెసిడెన్సీ నుంచి ఆర్డరు వచ్చింది. పదిరోజుల కాలీ వున్నది వచ్చి చేరవలసిందని.

ఈ మధ్యలో ఒకనాడు నాజిమ్ తాలీ మాత్( అంటే డి.పి.ఐ., ఆఫీసు అన్నమాట) అక్కడ దరఖాస్తు పెట్టి చెట్లకింద తిరుగుతున్నాను. తలవని తలంపుగా సయ్యదు మహ్మదు ఆజంగారు అక్కడికి కారులో వచ్చారు. నాక పై ప్రాణాలు పైన పోయాయి. నన్ను ఎక్కడ చూసిపోతాడు అని. కాని ఆయన చూడనే చూశాడు. నన్ను తన దగ్గరకు పిలిపించుకున్నాడు. 'ఆ ఉత్తరం వ్రాసిన యవకుడవు నువ్వా' అని ప్రశ్నించారు. అవునండి అని భయంతో చెప్పాను. 'అబ్బాయీ! అప్పుడు నేను తొందరలో ఉన్నట్లున్నాను. మా ఆఫీసుకు మళ్ళీ వచ్చి కలుసుకో' అని చెప్పి ఆయన వెళ్ళి పోయారు. తరువాత చాలా గౌరవంగా ఆదరంగా మా సమావేశాలు జరిగేవి చివరకి వాళ్ళ ఉన్నత పాఠశాలలోనే నేను ఆశించిన దాని కన్న ఎక్కువ జీతంతో ఉద్యోగం ఇస్తామన్నారు.

రెసిడెన్సీ ఆఫీసులో చేరడమా సిటీ కాలేజిలో చేరడమా అనే ఆస్తినాస్తి విచికిత్స ఏర్పడింది. రెసిడెన్సీ అంటే రవియస్తమించని బ్రిటీషు సామ్రాజ్యయంత్రంలో చిన్న మరమేకులా ఉండడమూ.నిజాము రాజ్యంలో ఉద్యోగమంటే హిందువులకు ఎక్కువ అవకాశాలు రావు.

ఏమైనా సరే రెసిడెన్సీలోని మహారణ్య నిశ్శబ్దం భరించలేనని అనిపించింది. నిజాం రాజ్యంలో దాస్యంలోనే కొంత మానవత్వం ఉంటుందేమో అని తోచి దానికే మొగ్గాను. సయ్యదు మహమ్మదు ఆజం గారి ఋజుమానవత్వం నన్ను బంధించింది . రెసిడెన్సీలో చేరలేనని తప్పించుకున్నాను. జీవిత చరమసంధ్య దాకా ఉపాధ్యాయుడుగానే ఉండి పోయాను.

పైళ్ళ పర్వతాల క్రింద అణగిపోవడమూ, కోతి సజ్జైన విద్యార్థులతో వేగడమూ రెండవదానినే వరించాను. జీవితం శాశ్వతంగా ఒక మలుపు తీసుకుంది. అది మాత్రం నా ఆలోచనా విశేషం చేత జరిగిందా. "విధి రహో బలవానితిమేమతిః !"

* "నందిని" మాస పత్రిక - సంపుటి :1, సంచిక :12, డిసెంబరు 1975.

•••

# పరిశోధనకు పునాది

– శ్రీ ఆరుద్ర *

నేను సినిమా రచయిత నవుతానను కోలేదు. కాని అయ్యాను. సాహిత్య పరిశోధనలు చేస్తాననుకోలేదు. కాని అందులో తమునకలుగా పడిపోయాను. నిజానికి సినిమాలో చేరడం వల్లనే సాహిత్య పరిశోధనలు ప్రారంభించాను. అదొక కథ. రాజకీయ ప్రభావంవల్ల కాలేజీ చదువులకు స్వస్తి చెప్పి ప్రజాయుద్ధానికి తోడ్పడాలని విమానదళంలో చేరిన నాకు తిరిగి వచ్చాక జర్నలిస్టుగానే జీవించాలన్న ఆశా, ఆశయం ఉండేవి. విడుదల కాగానే ఆనందవాణిలో చేరాను. కొద్దికాలం తర్వాత మానేశాను. న్యాపతి నారాయణమూర్తి గారు పెట్టబోయే దినపత్రికలో ఉద్యోగం ఇస్తామన్నారు. ఎప్పుడు పెడతారు? ఎప్పుడు ఇస్తారు? అని రోజూ వారిని అడుగుతూ వచ్చాను. నాబాధ పడలేక ఆయన రాజరాజేశ్వరి, ఫిలిం కంపెనీలో కథాశాఖలో "టెంపరరీ"గా పెట్టారు. అలాగా సినిమాల్లో చేరాను.

కథాశాఖలో చేయవలసిన పనులు నా ప్రవృత్తికి నచ్చాయి. ఇంగ్లీషు తెలుగు భాషల్లో కావలసినన్ని పుస్తకాలు చదవడం, వచ్చిన కథలు గుర్తుంచుకుని నిర్మాతకు చెప్పడం, ఆయనకు నచ్చినవి కాగితం మీద పెట్టడం అంతే. ఆ నిర్మాత ధర్మామా అని గంటల తరబడి పుస్తకాలు చదవడం అనే సద్గుణం అబ్బింది.

నేను పనిచేస్తున్న కంపెనీ అధినేతలు కడారు నాగభూషణం గారూ, కన్నాంబ గారూ ఆ ఇద్దరికి కె.వి. రెడ్డిగారు మిత్రులు. ఒకనాడు ప్రసంగవశాతురెడ్డి గారితో " రెడ్డిగారూ మీరు భక్త పోతన యోగివేమన చిత్రాలు తీశారు. కదా కవి తిక్కన కూడా తీయకూడదా" అన్నాను. 'అందులో లేడిసెంటిమెంట్స్ ఏమున్నాయప్పా' అని ఆయన ప్రశ్నించారు. వెంటనే నేను జవాబు చెప్పలేకపోయాను.

నిజానికి అప్పటికి తిక్కనగారి గురించి నాకేమీ తెలియదు. విరాటోద్యోగ పర్వాలు మళ్ళీ మళ్ళీ చదువుకోడం తప్ప ఆయన రాసిన నిర్వచనోత్తర రామాయణం కూడా చదవలేదు. కాని తిక్కన గారి జీవిత చరిత్రను కూలంకషంగా చదివి రెడ్డిగారికి ఆ కథ సినిమాకి పనికి వచ్చేదే అని ఒప్పించాలన్న పట్టుదల కలిగింది. ఎక్కడ దొరుకుతాయో నాకు కావలసిన వివరాలు? ఎక్కడ గాలించాలి? అన్నీ ప్రశ్నలే.కవి తిక్కన్నకూ, ఖడ్గ తిక్కనకూఏమిటి బంధుత్వం. ఖడ్గ తిక్కన కథలో సినిమా వాళ్ళకు కావలసిన 'లేడీ సెంటిమెంట్' ఉంచి ఇద్దరి జీవితాలు కలిపితేనో? ఏమిటా జీవితాలు?తెలుసుకోవాలి.

గురజాడ శ్రీరామమూర్తిగారి 'కవి జీవితాలు' పుక్కిటి పురాణాలు. అయినా చదివాను. వీరేశలింగం గారి కవుల చరిత్ర దొరకలేదు. వాగంటి వారివి దొరికాయి. కేతన దశకుమారచరిత్రలో తిక్కన గారి వంశవర్ణన ఉందని తెలిసింది. కన్నెమెరా లైబ్రరీకి పరిగెత్తాను. పుస్తకం చదివి

వంశవృక్షం రాసుకున్నాను. మారన తిక్కనగారి శిష్యుడని తెలిసింది. మార్కండేయపురాణం కొనుక్కొని చదివాను. మద్రాసు ఓరియంటల్ లైబ్రరీ వారి 'కాటమరాజు కథ' ప్రచురించారని తెలిసింది. ఖడ్గతిక్కన కోసం అది కొని చదివాను. సోమశేఖర శర్మగారి ఉపోద్ఘాతం ఎన్నో సంగతులు చెప్పింది. దానితో పాటే ఎన్నో అనుమానాలను ప్రశ్నలను రేకెత్తించింది.

కాటమరాజు పోరాడిన సిద్దిరాజు మనుమసిద్ధేనా? తెలుగు చోడుల చరిత్ర చదవాలి. గణపతి దేవ చక్రవర్తి నెల్లూరికి సేనలు పంపాడు. కాకతీయుల చరిత్ర చదవాలి. ఒక పుస్తకం అధోజ్ఞాపికలో మరొక పుస్తకం ప్రసక్తి ఉంటుంది. ఆ పుస్తకాన్ని అమూలాగ్రం చదవాలి.

చదవడం మొదలుపెట్టాను. తీగె లాగితే డొంకంతా కదిలింది. వరసపెట్టి అహోరాత్రులు చదువుతూ నోట్సు రానుకోవడం మొదలు పెట్టాను. అదే సమగ్ర ఆంధ్రసాహిత్యానికి పునాది.

ఇంతకు కె.వి.రెడ్డిగారికి తిక్కన గారి కథ నేను చెప్పనేలేదు.

* *"నందిని" మాస పత్రిక - సంపుటి :1, సంచిక :12, డిసెంబరు 1975.*

●●●

# కెరటాలు

**- శ్రీ చర్లగణపతి శాస్త్రి ***

పరమసాధ్వియగు మా తల్లి నా చిన్నతనంలోనే పరమపదించడం చేత మా తండ్రినారాయణశాస్త్రి గారు నాకు తల్లి, తండ్రి, గురువు అయినారు. ఆయన పల్లెటూరిలో నున్నా గొప్ప సంస్కర్త. ఇంగ్లీషు బడిమాని కాంగ్రెసు ఉద్యమంలో జాతీయ పాఠశాలకు వెళ్ళి వచ్చినందుకు ఆరోజుల్లో ఇంగ్లీషు మాష్టారు నన్ను కొట్టి బెంచిమీద నిలబెట్టారు. దాంతో ఆ యేడే స్కూలు మానే హిందీ సంస్కృతం మా తండ్రిగారి దగ్గర చదివాను.

నా 19వ యేట మేఘ సందేశమును మొయిలు రాయబారమను పేరుతో తెనిగించాను.. సమగ్రాంధ్ర వ్యాకరణము "నారాయణీయాంధ్ర వ్యాకరణ"మను పేరుతో నేను, మా తండ్రిగారు కలిసి వ్రాశాము. అది మూడు విశ్వవిద్యాలయములలో పాఠ్య గ్రంథమైంది.

మా తండ్రి గారు ఇష్టంలేక ఏ ఉద్యోగం చేయలేదు. కాని ఆర్థికమైన యిబ్బందుల వల్ల నేను కొంతకాలము సంస్కృత పండితునిగా పని చేసి తరువాత రాజీనామా చేశాను.

ఆంధ్ర సాహిత్య పరిషత్తు, నవ్యసాహిత్య, పరిషత్తు, అభ్యుదయ రచయితల సంఘం మొదలగు సభలకు వెళుతుండేవాడిని. అవి కలలవలె జారిపోయాయి.

గాంధీజీ ప్రభావం నా మీద చాలా పడింది. అది మొదలు తెలుస్తున్న కాస్త ఆచరించాలనే భావంకలిగింది. దాని ఫలితంగా ఏదీ వ్రాయకూడదనుకొన్నాను. నేనెవరిని పొగడనూ లేదు. నన్నూ ఎవరూ పొగడలేదు. నవీన సంస్కృతి కలవారితో మెలగుతున్న వారి కృత్రిమాడంబర పద్ధతుల వల్ల విసిగాను. ప్రాచీన సంస్కృతి మీదే మోజు పడింది.

"కవులూ కళోపాసకులూ ఏదో ఆవేశంతో చెపుతారేకాని వారు చెప్పింది వారికే తెలియదు. వారు చెప్పేదానికి చేసేదానికి చాల తేడావుంది" అను సోక్రటీసు వాక్యాలు ఎప్పుడూ చెవిలో గింగురుమంటూ వుంటాయి. అంచేత చేతనైంది చేయాలనే కాని వ్రాయకూడదు అనుకున్నాను. కాని అలవాటు రోగం చేత వ్రాయక మానలేదు. అయినా నేను సొంతంగా వ్రాసింది చాలా తక్కువ. పెద్దలు ఆచరించి చెప్పేవి తెలిసికోవాలని నాలాగే

ఇతరులకు తెలిసికోవాలని యుంటుందని దర్శనాలు ఉపనిషత్తులు కొన్నినాటకాలు, కావ్యాలు అనుదించాను.

జైలుకు వెళ్లాలనుకోకపోయినా వెళ్ళడం జరిగింది. నేను రాజకీయ బాధితులకోసం ఇచ్చే భూమి కోసం ధరఖాస్తు పెట్టలేదు.

పిదప సర్వోదయ ప్రచారం చేస్తూ ఆ కార్యకర్తలలో గూడ నిజాయితీలేక మానేసి తిరిగి అలవాటయిన పుస్తకాలు వ్రాసే ధోరణిలోనే పడ్డాను.

అర్థానికి మరక అంటకుండ ఉంచుకుంటేనే అందం. దానికెవరు పూతలు పూయనక్కరలేదు. పొగడ్తలు అక్కర లేదు అనుకుంటాను. కవి క్రాంతి దర్శి, క్రాంతివాదీ కావాలి. భ్రాంతి దర్శి భ్రాంతి వాదీ కారాదు అని నా భావం.

జీవనోద్యాన సౌందర్యాన్ని సత్యదృష్టితో కోకిల లాగా చెప్పాలి.

* "నందిని" మాస పత్రిక - సంపుటి :2, సంచిక :1, జనవరి 1975.

•••

# అమృత గడియలు

– కళాప్రపూర్ణ
శ్రీ నిడుదవోలు వెంకటరావు *

నలుబదేండ్లనాటి ముచ్చట. నాజీవితమునకొక మలుపు నా సాహిత్యమున కొక వెలుగు నిలిచినది పుష్కరకాలము బ్యాంకు గుమాస్తాగా పనిచేయుకాలములో హఠాత్తుగా ఒకనాడు ఆంధ్రభోజులు పిఠాపురము మహారాజావారు వర్తమానమంపగా వారిని దర్శించుటకు వెళ్లినాను. అపరకృష్ణరాయలైన అయనను అముక్తమాల్యద పద్యము "ఖనటత్ప యోబ్ధి వీక్ష్య" తో ఆశీర్వదించినాను - "మీరు చదివినపద్యములో వటులఝుంపా" అని యున్నది. ఝుంపా శబ్దమున కర్థమేమి అని ప్రశ్నించినారు. నేను వెంటనే ఇంగ్లీషులో **Jump -(జంప్) అనే మాటయే** దానికర్థము - అన్నాను. "తెలుగు మాటకు ఇంగ్లీషు అర్థమా" అన్నారు. పిత-ఫాదర్-మాత-మదర్-భ్రాత, బ్రదర్ -అని మనకున్నవే. ఇంతకు నోటికి ఇంగ్లీషు పదమేమి? అని తిరిగి ప్రశించినాను- వారు Mouth -(మౌత్) అన్నారు తెలుగులో 'మూతి' ఉన్నదే- అన్నాను. వారాశ్చర్యపడినారు. అంతటితో వదలలేదు. - ఆపద్యానికి అర్థము చెప్పమన్నారు. అముక్తమాల్యద పద్యాలు ఇనుపగుగ్గిళ్లు - నన్ను పరీక్షించడానికడిగనారేమో నాకు తెలియదు. పద్యార్థము వివరముగా విశేషములతో వినిపించినాను. మహారాజా వారు "మేము నన్నెచోడని కుమార సంభవము చదువుచున్నాము. కాని అది కాళిదాసు కృతి కంటే భిన్నముగా ఉన్న కారణమేమి?" అన్నారు.

కాళిదాస కుమార సంభవము కావ్యకళా దృష్టిలో పరాంకోటి కెక్కినది. కాని నన్నెచోడని కృతియందు - కావ్యదృష్టితో పాటు వీరశైవ, సంప్రదాయకమగు - ఆధ్యాత్మిక మత సంప్రదాయములు నిండియున్నవి. అని బదులు చెప్పినాను.

వారు ఇదియేమి? కేవలము రసవిషయకమగు కావ్యమున మత సంప్రదాయ ప్రవేశమెట్లు? అని ప్రశ్నించినారు.

నేను "రాయలవారు రసైకమగు గోదా శ్రీ రంగనాయకుల ఉదంతమున - విశిష్టాద్వైత మత సంప్రదాయమును నిబంధించి యున్నారు కదా? అన్నాను.

ఇంతలో ఆస్థాన కవి ఓలేటి వెంకటశాస్త్రి గారు వచ్చినారు. డబ్బాటు - అనే పదమునకు ప్రయోగమున దాని రాజావారడిగినారు. వారు స్ఫురణలో లేదన్నారు. నేను వెంటనే - అప్పటి కిరువదేండ్ల క్రిందట 'వారు రచించిన పద్యమును చదివి ప్రయోగము తెలిపినాను.

పది నిముషములకనుజ్ఞగొనివచ్చిన నేను వారితో పన్నెండు పదుల నిముషములు (రెండు గంటలు) అవే నాజీవితములో అమృత గడియలు. ఆనాడే వారు నన్ను అంకెల నుండి తప్పించి అక్షరములలో ప్రవేశపెట్టవలెనని తీర్మానించుకున్నారు. సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థానమున పండితునిగా నియమించినారు. మూడేండ్లచ్చట పని చేసి ఎం.ఏ.,పట్టభద్రుడనై, మద్రాసు విశ్వవిద్యాలయమున తెలుగు సహాయోపన్యాసకుడనుగా నియమితుడనైనాను- శాఖాధ్యక్షుడనైనాను.

పిఠాపురము మహారాజా వారు నాకు నిత్య సంస్మరణీయులు.

* "నందిని" మాస పత్రిక - సంపుటి :2, సంచిక :12, ఫిబ్రవరి 1976.

•••

## 'చెప్పండి జవాబు'

– శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు *

1933లో గాబోలు, అంటే నలభై యేళ్లక్రితం, నేను ఇంగ్లీషులో ఒక నవల చదివాను Andre Britton అనే రచయిత వ్రాసిన "Hunger and Love", అంటే "ఆకలి-ప్రేమ", అనే నవల.

అది ఒక పేద పిల్లవాడి కథ. అనాథ బాలుడు, ఆకలితో పుట్టాడు. ఎలాగ బ్రతుకుతాడు? ఆకలి తీర్చుకోడానికి శ్రమ చేస్తాడు. జోళ్లు తుడిచి రంగువేయడం, వార్తాపత్రికలు అమ్మడం లాంటి పనులు చేసి తన భుక్తి తాను ఆర్జించుకుంటూ ఒక నగరంలో అతడు పెరుగుతూ వస్తాడు. మనస్సూ వయస్సూ కూడా పెరిగి అవకాశాలు వినియోగించుకుంటూ, యౌవన ప్రాయానికి వస్తాడు. అప్పుడు వానికి ప్రేమ కోసం ఆకలి పుడుతుంది. తర్వాత ఏమేమో చేస్తాడు. పెద్దవాడౌతాడు. బ్రతుకొక adventure లా కొనసాగుతుంది.కథంతా నాకిప్పుడు జ్ఞాపకం లేదు. అయినా ఆ పుస్తకం నా హృదయాన్నీ మనస్సునీ లోతుగా విశాలంగా ప్రభావితం చేసింది. అంతకు పూర్వం నేను గొప్ప నవలలు చాలా చదివి వున్నాను అయితే Romain Roland వ్రాసిన "John Christopher" తర్వాత నా హృదయానికి హత్తుకున్నది యీ "Hunger and Love" ఒకటే.

ఎంచేత? ఆ పిల్లవాడి బ్రతుకు భూలోకంలో ఒక చిన్న చీమ బ్రతుకులా ప్రారంభమై నడిచింది. అయితే దానికి వెనకతెరగా రచయిత విశ్వ ప్రకృతి నంతనీ నాట్యం చేయిస్తాడు. నక్షత్ర మండలాలూ, గ్రహకూటాలూ ఆ పిల్లవాడి బ్రతుకుతోపాటుగా రోదసీ కుహరంలో భ్రమిస్తూ సంచరిస్తాయి. భూ జీవితానికి ఆకాశ జీవితాన్ని, సృష్టి నంతనీ Back-ground చేస్తాడు. అతడి జీవితపు సుడిగుడాల చుట్టూ విశ్వజీవితమంతా చక్రభ్రమణం చేస్తున్నట్లు చూపుతూ రచయిత మన భావనాజగత్తుని విస్తరింపచేస్తాడు, మన సానుభూతిని వేయింతలు చేస్తాడు. "ఇంతింతై వటు డింతయై" అన్న మాట కళ్లక్కడుతుంది.

కథ అయినా ఈనాడు సరిగా జ్ఞాపకంలేని ఈ పుస్తకం మీద ఇన్నాళ్లయాక నేను ఇంత అభియానాన్ని ఎందుకు వెళ్లబోస్తున్నానని అడగొచ్చు. ఈ పుస్తకం నా చేత ఒక పద్యం వ్రాయించింది. అంతవరకు నేను వ్రాయనిలాంటి పద్యం, ప్రేమగీతం కానిది, ఛందస్సు లేనిది. అయితే నా గురుదేవ రవీంద్రుడన్నట్లు, దాన్ని ముక్తచ్ఛంద మనొచ్చు. ముక్తచ్ఛందానికి యిప్పటి వాళ్లనే వచనపద్యానికి చాలా తేడా వుంది. ముక్తచ్ఛందంలో ఛందం నశించిపోదు. విముక్తి పొందుతుంది. అంతే. అంచేత ఛందానికి ప్రాణమైన లయ స్వతంత్రమూ బలీయమూ అవుతుంది. వచనానికి దగ్గరై చావదు. పద్యంకంటే బలం పుంజుకుంటుంది. అందంగా చెప్పడం కంటె బలంగా

చెప్పడం ప్రధానమవుతుంది. లాస్యానికీ తాండవానికీ వున్న తేడా కనిస్తుంది. లాస్యాన్ని నియమితం చేయగలరు. తాండవాన్ని నియమితం చేయలేరు. సౌందర్యఫలంలోని సత్యబీజం. పైకి పొడుచుకు వస్తుందన్నమాట.

ఆ నా వ్రాసిన ముక్తచ్ఛందం పేరు "చెప్పండి జవాబు" అని, "సృష్టి తీరాంతాలకు నేడు దృష్టి బరపుతున్నానోయ్ నేను, కష్టజీవు లెన్ని యెన్ని కోట్లనో నేను స్పష్టంగా చూస్తున్నానోయ్ నేడు", అని ప్రారంభమైన ఆ రచన చివరి మాట ఇది.

"చోరుడైన మానవుడు రాయేనోయ్,
చోరుడైన దేవుడు మాయేనోయ్ ! "

ఆ పుస్తకం తిరిగి నాచేతికి రాలేదు. ఆ కథ అంతా యిప్పుడు నా జ్ఞాపకంలో లేదు. అలాంటి పద్యం తిరిగి నేను వ్రాయలేదు. "చెప్పండి జవాబు" అనే శీర్షిక మాత్రం నన్ను నిరంతరం కదుపుతూ వుంటుంది.

"అభ్యుదయ సంఘాలు" నన్ను ప్రభావితం చేయలేకపోయాయి. కాని యీ "Hunger and Love" అనే నవల చేయగలిగింది. మొన్న హైదరాబాదులో జరిగిన అభ్యుదయ సభలలో చివరిమాటలు ఘాటుగా మాట్లాడిన వక్త Love poetry ని "Synthetic Love Poetry" (కృత్రిమ ప్రేమ కవిత్వం) అని హేళన చేశారు. నేను వారి అభ్యుదయ కవిత్వాలని "Synthetic Labour Poetry" (కృత్రిమ కవిత్వం) అంటాను. ఎందుక్కాదు చెప్పండి జవాబు !

* "నందిని" మాస పత్రిక - సంపుటి :2, సంచిక :3,4, మార్చి, ఏప్రిల్ 1976.

●●●

## మొదటి అనువాదం

– శ్రీ మరుప్పూరు కోదండ రామరెడ్డి *

రచనా పాటవం ఏదో ఒక మెరుపు తీగవలె నాలో పుట్టలేదు. మూగ ఎండలో నా రచన కళాలత ననవేసి ఎదిగి పూచినది.

మొదట ఒక పల్లెటూరు వీధిబడి నా చదువుల తల్లి పేరోలగం. సుమతీ శతకం, రుక్మిణీ కల్యాణం, అమరం, గురువుల వద్ద గుడ్డి పాఠంగా చదివినా పెద్దపుస్తకం(భారతం) చదివించినారు. ఆ పల్లెకూటంలో పల్లాప్రోలు కృష్ణమాచారి చిన్నతరగతులలోనే వ్యాసరచనకు ఒరవడి బెట్టినారు.

పోట్లపూడిలో, మా అప్ప (సోదరి) పొణకా కనకమ్మ ఇల్లు 1910-20 మధ్య జాతీయ ఉత్సాహశక్తికి ఒక కరదీపికగా ఆ ప్రాంతాన్ని వెలిగించింది. ఆనాడు తెనుగునాట లెక్కబడిన రాజకీయనాయకులు, కవులు, పండితులు మా ఇంట అతిథులై సభలలో ఉపన్యసించి, వాతావరణాన్ని చైతన్యకణాలతో నింపి పోయ్యేవారు. నా 15వ ఏడు మొదలు, చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారి వ్యాఘ్రిలో స్నానమాడిన ప్రథమ జాతీయ వైతాళికుడైన ఆచార్య రాయప్రోలు సుబ్బారావు అమృత కవిత విన్నా - సుబ్బారావు మా కుటుంబంతో కలసి మెలసి ఉండిన ఆ కాలంలో వారి కవిత నన్ను ప్రేరేపించేది. దంటు సుబ్బావధాని హాస్య రసపూర్ణ ఉపన్యాసాలు విని మాటకారితనం నేర్చుకొన్నా, శ్రీ పాదసుబ్రహ్మణ్య శాస్త్రి మా ఇంటనే నవలలు వ్రాస్తూంటే తొంగిచూస్తూ వ్రాయాలనుకొన్నా. ఇది, ఆ చిరుతకూకటినాడు నేను జదివి పోగు చేసి పెట్టుకొన్న సామాగ్రి.

1918-20 వరకు నెల్లూరులో హైస్కూల్ చదువు. నేలటూరు పార్థసారథి అయ్యంగారు బాగా వ్యాసరచన వ్రాయించినారు. కాంపోజిషన్ టీచర్ నందగిరి హనుమంతరావు నా వ్యాసాలు పై క్లాసులలో చదివి వినిపించి, వీపుదట్టి ప్రోత్సహించినారు.

1920లో గాంధీజీ పూరించిన శంఖారావం, బ్రిటీషు వారి బడిని విడిపించి, నన్ను బందరు ఆంధ్ర జాతీయకళాశాల

చేర్పించినది. వేదాల రంగాచారి, పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి తెనుగు నేర్పినారు. డాక్టర్ పట్టాభి, కోపల్లి హనుమంతరావు జాతీయ ప్రబోధం గావించినారు. ఇట్లా నా చదువుకు కోడె ప్రాయం వచ్చినది.

కవుతా శ్రీరామశాస్త్రి - సింహపురి నటసార్వభౌమ కందాడై శ్రీనివాసన్ (దొరస్వామి అయ్యంగార్ బి.ఎ., ఎల్.టి.) గారి నాట్యకళను గూర్చి ఒక వ్యాసం వ్రాయ మన్నారు.

దానిని వారి 'శారద' (ప్రథమాంధ్ర సచిత్ర మాసపత్రిక)లో సచిత్రంగా అచ్చువేసినారు. అది చూచి ఒళ్ళంతా గగుర్పొడిచింది. నా రచనకు ప్రథమ ముద్రణ దర్శనమదే!

1924లో బందరు చదువు చాలించుకొని, మా ఇంకొక గ్రామం-పిడూరు చేరినా. నెల్లూరు "దేశబంధు" పత్రికలో 'హాలికుడు' అన్న గుప్తనామంతో వ్యాసాలు వ్రాసినా. మ.కొ.రె. అన్న పొడి అక్షర సంజ్ఞతో టిట్‌బిట్సు వ్రాసినా, అప్పుడే - "అదిగో ! మొగ్గ దొడుగుతున్న వ్రాతగాడు " అని పెద్దలు నన్ను వ్రేలుబెట్టి చూపినారు.

1926లో కామాల, కాంగ్రెసు ఉద్యమం, ముమ్మరంగా సాగుతున్నది. ఆ చంట రుక్మిణమ్మ నెల్లూరు వచ్చి, కాలేజి మైదానంలో ఆంగ్లంలో ఉపన్యసిస్తున్నారు. ఒక పట్టభద్రుడు దానిని తెనుగు చేస్తున్నాడు. నా ప్రక్కన, కాలేజి ప్రిన్సిపాలు-ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య కూర్చొని ఉన్నారు. ఆయనతో రన్నింగ్ కామెంటరీగా అనువాద లోపాలను - పిల్లతనపు ఎగుపొగరుతో అంటూ వచ్చినా. శ్రోతల గలభావల్ల అనువాదకుడు మధ్య కూర్చోవలసి వచ్చినది. వెంకట రంగయ్య గారు నా భుజం తట్టి లేపి వేదికపై నిలిపి అనువదించమన్నారు. గురువులు శిష్యులకు చేసే వేదదీక్ష (షాక్ ట్రీట్‌మెంటు) వంటిదైనది నాకు. జంకు గొంకు లేకండా అనువాదం చేసినా, వెంటనే ఉపన్యాస అనువాదకుడుగా పేరుపడినా. అది సుతా నేటి వరకు నెల్లూరు వచ్చిన రాజకీయ నాయకులకు, వేదాంతులకు, మతస్వాములకు నేనే అనువాదకుడుగా ఉన్నా. ఒక నెల్లూరు టౌన్‌హాల్ సభలో నా అనువాదం వింటుండిన కట్టమంచి రామలింగా రెడ్డిగారు వెల్‌డన్ బాయ్ - అన్నారు. ఉప్పొంగి పోయినా, ఇదంత ఆ మొదటి అనువాద ఫలితమే.

* *"నందిని" మాస పత్రిక - సంపుటి :2, సంచిక :5, మే 1976.*

•••

# సువాసన

## - శ్రీ పప్పు సూర్యనారాయణ *

'కుసుమ గుచ్ఛంబునకుఁ బోలఁ బొసఁగు శౌర్య
మానవంతున కివి రెండు మహితగతులు
సకలజన మస్తక ప్రదేశములనైన
వనమునందైన జీర్ణభావంబు గనుట '

ఈ భర్తృహరి సుభాషితం చదువుకున్నప్పుడెల్లా నా జీవితంలో 18 సం॥ క్రితం జరిగిన ఒక సంఘటన జ్ఞాపకం వస్తుంది.

మా తండ్రిగారు కీ. శే. పప్పు సోమసుందరంగారు స్వభావతః శౌర్యమానధనులు. ఒకసారి నేనొక ఉన్నత పదవికి దరఖాస్తు పెట్టాను. పోటీ బాగా ఉంది. 'కర్తవ్యో మహదాశ్రయః' అన్న న్యాయాన్ని స్మరించి అధికారిని ఆశ్రయిస్తే పని అవుతుంది కదా అని అనుకున్నాను. ఒక ప్రముఖ రాజకీయవేత్త చేతులో ఆ ఉద్యోగం ఉంది. మా తండ్రి గారికీ ఆ రాజకీయవేత్తకూ మంచి పరిచయం కూడా ఉంది. వారి మాట సుగ్రీవాజ్ఞగా చలామణి అవుతుంది.

ఒక రోజు ధైర్యం చేసి మా తండ్రి గారితో 'మీరు వెళ్లి ఆ రాజకీయ వేత్తను అర్థిస్తే నాకు తప్పక ఉద్యోగం ఇస్తా'రని మనవి చేశాను. మా నాన్నగారు ఆ మాట విని గంభీరులైనారు. నేను 'దేహి అని ఎవరినీ అడగను. నీకు యోగ్యత ఉంటే నీ కా ఉద్యోగం వస్తుంది. ఒకవేళ ఉద్యోగం రాకపోయినా చింత లేదు. ఆత్మాభిమానం అన్ని యోగ్యతలకంటే అధికమైంది' అని సమాధానం చెప్పారు. 'కర్తవ్యో మహదాశ్రయః' అని న్యాయముంది కదా అని అన్నాను నేను. 'అవును మహదాశ్రయమంటే పరమేశ్వరాశ్రయమని భావం! నా బిడ్డలు నరుల నాశ్రయించకుండా స్వశక్తితో పైకి రావాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తాను' అన్నారు ఆర్ద్రంగా. ఆ మాటలు నాజీవితానికి మార్గదర్శకాలైనవి. నా చెవుల్లో మాతండ్రిగారి ఉపదేశం ఎల్లప్పుడూ అమరంగా వినపడుతూనే ఉంది. నా పిల్లలకీ వారి తాతగారి సందేశాన్ని అందించాను. వారు ఆ బాటలోనే నడుస్తున్నారు.

సువాసన గల పూలు సకలజనుల శిరోధార్యాలౌతాయి. లేదా స్వీయ వ్యక్తిత్వంతో తామున్న వనానికే అలంకారాలౌతాయి. సాటి మానవులను అర్థించని స్వాభిమానమే మానవజీవిత కుసుమాని కబ్బే మేటి సువాసన!

* "నందిని" మాస పత్రిక - సంపుటి :2, సంచిక :6, జూన్ 1976

●●●

# బ్రహ్మర్షి వేంకటరత్నం నాయుడుగారు

**- శ్రీ పి.ఎల్.ఎన్. శర్మ**

తెలుగు మాట్లాడేవారిలో నాయుడు గారు, పంతులుగారు అంటే గుర్తుకు వచ్చే వారు ఇద్దరే ఇద్దరు. బ్రహ్మర్షి వేంకటరత్నం నాయుడు గారు, ధర్మవీరుడు కందుకూరి వీరేశలింగం పంతులుగారు. ఆంధ్రజాతిని ఉద్ధరించిన మహాపురుషుల్లో వీరు ముఖ్యులు. సంఘంలో ఉండే కాలుష్యాన్ని క్షాళనం ఒనర్చినవాడు వీరేశలింగం. విద్యార్థుల హృదయక్షేత్రాలను క్షాళనమొనర్చి, ఆస్తిక్య భావాన్నీ, సంఘ సంస్కరణ ప్రియత్వాన్ని నెలకొల్పి యువతరాన్ని ఉద్ధరించిన మహానుభావుడు శ్రీనాయుడు. జన్మతః క్షాత్రం ఉంది. కాని తాను పరమసాత్త్వికుడు, సుప్రసిద్ధ దేశికుడు. ఆంగ్ల భాషలోనేకాక ఉర్దూ, పర్షియన్ భాషల్లో పాండిత్యం సంపాదించిన మనీషి. క్రైస్తవ కళాశాల ప్రధానాధ్యాపకుడు రెవరెండ్ మిల్లర్ ప్రియశిష్యుల్లో ఒకడు. సర్వ విధాల గురుని అడుగు జాడల్లో నడిచిన ధన్యజీవి. తాను బ్రహ్మసామాజికుడు. నాయుడుగారు సంఘ సంస్కారానికి, దీనజనోద్ధరణకూ జీవితాన్ని ధారపోసినవారు.

నేను శ్రీ నాయుడు గారి ప్రశిష్య కోటికి చెందినవాణ్ణి. వారి ప్రముఖ శిష్యులు, మాగురువర్యులు. ముఖ్యంగా పేర్కొనదగ్గ వారు డా॥ వేమూరు రామకృష్ణరావు గారు, ఆచార్య పెద్దాడ రామస్వామిగారు. కవిపుంగవులు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు వారి ప్రముఖ శిష్యులలో ఒకరు. ఈ మహానుభావుల దయ వలన నేను నాయుడు గారి దయకు పాత్రుడనైనాను. నేను కష్టపడి చదువుకున్నాను. గురువుల ఆశీర్వచనం ఫలించింది. పట్టభద్రుడనైనాను. ఉద్యోగం కావాలి. నిరుద్యోగం పరాకాష్ఠ చెందిన రోజులు. 1935వ సంవత్సరం శ్రీ కృష్ణశాస్త్రి గారు చెప్పగా నాయుడు గారు కబురు చేశారు. వారిని చూస్తేనే కడుపు నిండేది. ఆరడుగుల పొడవు. తెల్లని ఉడుపులు, స్ఫూర్తిగల విగ్రహం. నేను ఎప్పుడో ఒకటి రెండు సార్లు యువజన ఆస్తిక మండలిలో ప్రసంగించడం విన్న శ్రీ నాయుడు గారికి నేను గుర్తుంటానని అనుకోలేదు. చనువుగా పలుకరించి, యోగక్షేమా లడిగి, నా యెడ దయగలిగి కళాశాలలో

ఆంగ్లభాషలో ట్యూటర్‌గా చేరమని ఆజ్ఞ ఇచ్చారు. ఆ సందర్భంలో వారన్నమాటలు మరపురానివి. ఒక దేశికోత్తముడు, ఒక సంస్కర్త, ఒక దయాసాగరుడు ప్రతి చిన్న వాణ్ణి ఏ తీరుగా పరిశీలించి, పరీక్షించి ఆదరిస్తారో నాకప్పుడు తెలిసింది. ఉద్యోగం ఇస్తూ ఆయన ఆంగ్లంలో అన్నమాట లివి.

**"You will have many occasions to come into contact with youngmen and youngwomen as a teacher. You may have to teach many Texts, Let Every Text be a Pretext to Preach Liberalism, may this be a Mission in Life."**

నాకు అశ్రువులు రాలాయి. ఆశ్రయం, ఆదరణ, అభిమానమే కాకుండా వారి ఆశీర్వచనం, నాయందు వారికి గల విశ్వాసం నన్ను ఉత్తేజితుణ్ణి ఒనర్చాయి. నా జీవితమంతా అధ్యాపకుడుగా గడపడానికి అదే కారణం. ఇలాంటి మహానుభావుణ్ణి Fisherman of the souls అన్నారు శ్రీ నాయుడు గారు. ఆయన శిష్యుల పాదరజోలేశమువంటి నేను ధన్యుణ్ణి అయ్యాను. నావంటి వారు వేలకొలది ఉన్నారు తెలుగుదేశంలో...

** "నందిని" మాస పత్రిక - సంపుటి :2, సంచిక :7, జులై, 1976*

•••

## తల్లి-తండ్రి

### - విద్వాన్ శ్రీ గూడ లక్ష్మీనారాయణ శర్మ *

నేను నెల్లూరు సంస్కృత పాఠశాలలో చదువుకోవటానికి పోతున్న రోజది. ఇప్పటికి దాదాపు నలభై అయిదేళ్ళ క్రింది మాట. మా నాన్నగారి దగ్గర సెలవు తీసికొంటూ ఏదైనా సందేశం ఇసారేమో నని నిలుచున్నాను. ఆయ మొదలుపెట్టారు. నీవు ఉన్న వూరి నుంచి దూరంగా పోతున్నావు. 'నీకు పాఠశాలలో ఉపాధ్యాయులుంటారు, చదువు చెపుతారు. దానికి మించి నీ జీవితమే నీ కొక ఉపాధ్యాయుడు. అది చెప్పే పాఠాలు అనంతాలు. జీవితంలో ప్రతి సన్నివేశం నీకొక సందేశాన్ని అందిస్తుంది. దాన్ని తెలుసుకొనే నేర్పు ఉండాలి, ఆచరించే ఓర్పు ఉండాలి అన్నారు. నేను మా నాన్నగారిలోనే ఒక ఉపాధ్యాయుణ్ణి దర్శిస్తూ అలాగే నిలువబడి వింటున్నాను.

'బుద్ధుడు జ్ఞానాన్ని సాధించటానికై పూనుకొని అన్నపానీయాలు మాని శరీరాన్ని బాగా కృశింపజేసు కున్నాడు. అందువల్ల ఆయనకు సమాధి కుదరటం లేదు. ఒకనాడు ఆదారిన పోతున్న వేశ్య వీణాతంత్రులను బిగదీసే ప్రస్తావనలో పలికిన మాటలు ఆయన చెవుల పడినవి. 'తంత్రులు బాగా బిగిస్తే తెగిపోతాయి, వదులుగా ఉంచితే మోగవు. కాబట్టి శ్రుతిగానసమంగా తగురీతిని బిగించి వీణ మీటాలి.' ఈ మాటల్లో ఆయనకు మరోపరమార్థం స్ఫురించింది. 'శరీరాన్ని బాగా కృశింపచేస్తే తనువే రాలిపోతుంది. తనువును విషయసుఖాలకు వదలివేస్తే ఇహమూ ఉండదు. పరమూ ఉండదు. శరీరాన్ని యోగ సాధనతో పటువుగా ఉంచుకుంటే జ్ఞానసిద్ధి లభిస్తుంది' ఈ అర్థం ఆయన సాధన కెంతో ఉపకరించింది. ఆయన కొక క్రొత్తబాటను చూపింది. సిద్ధార్థుడు బుద్ధుడు కావటానికిముందు ఆయన ప్రగతికి దారి చూపింది, మార్గం బోధించింది జీవితమే. నీవు జ్ఞానాన్వేషణకు పోతున్నావు. పుస్తకాలపుటల్లోంచి ఎంత జ్ఞానం సేకరిస్తావో, జీవితపు అనుభూతుల్లో నుంచి అంత జ్ఞానం సంపాదించవచ్చు- అని సందేశమిచ్చారు.

ఆ సందేశాన్ని నాటి నుండి దినదినమూ అర్థం చేసుకుంటున్నాను. బ్రతుకు పాఠాలను నేర్చు

తండ్రి.

* "నందిని" మాస పత్రిక - సంపుటి :2, సంచిక :8, ఆగష్టు 1976

•••

## "నిర్మల"

**- శ్రీ ఛాయేశ్వర్ ***

ప్రేమ్‌చంద్ అసలు పేరు 'ధనపత్‌రాయ్ శ్రీవాత్సవ్ 'నవాబ్‌రాయ్' అని చిన్ననాటి ముద్దుపేరు. 1880లో అతి పేద కుటుంబంలో పుట్టాడు. ఉరుదూ అక్షరాభ్యాసంతో విద్యార్థి జీవితం ప్రారంభించాడు. సవతి తల్లి వల్ల, గృహకల్లోలాల వల్ల, పేదరికం వల్ల ఎన్నో కష్టాలు అనుభవించాడు. చారెడు శెనగపప్పు చిన్న బెల్లంముక్కతో గడిపిన రోజులున్నాయి. ఇన్ని కష్టాలు అనుభవిస్తూకూడా దీక్షగా విద్యాభ్యాసం సాగించాడు. 'నవాబ్‌రాయ్' అనే పేరుతో ప్రచురించిన 'సోజేవతన్' అనే కథల సంపుటి ప్రతులను బ్రిటీష్ ప్రభుత్వం స్వాధీనం చేసుకొని కాల్చి వేసింది. తరువాత 'ప్రేమ్‌చంద్' పేరుతో కథలు నవలలు రచించడం ప్రారంభించాడు.

ప్రేమ్‌చంద్ నవలలో 'గోదాన్'కు ఒక ప్రముఖ స్థానం ఉన్నమాట నిజమే. కాని ప్రేమ్‌చంద్ రచించిన 'నిర్మల' పొందినంత ప్రజాదరణ ఆయన రచించిన మరేనవల కూడా పొందలేదనుకుంటాను. అన్ని లక్షల ప్రతులు మనదేశంలో మరే నవల అమ్ముడు పోయి వుండదు. 'నిర్మల' నన్నెంతగా బంధించివేసిందీ అంటే - మా ఆవిడ కాపురానికి వచ్చిన కొత్తలో ప్రతిరాత్రి కొన్ని పేజీలు, హిందీలో నేను చదివి, తెలుగులో ఆమెకు వివరించి చెప్పేవాణ్ణి. 'నిర్మల'ను తెలుగులో విని అమె కూడా ఎంత ఆనందించేదో! మా జీవన వసంతంలోని ఆ తొలి నెలలు ఏనాటికి మరపురానివి! అప్పటికీ నాకు తృప్తి కలగలేదు. మా పిల్లలు కూడా దీన్ని తెలుగులో చదవుకునేందుకు వీలుగా ఉండాలని అనువాదం చేశాను. కాని, కొంతకాలానికి నా జీవిత పరిస్థితులలో వచ్చిన మార్పుల వల్ల వాళ్ళ కంటే ముందు తెలుగు జాతికే నా అనువాదాన్ని అందించడం జరిగింది. అంతే! మిగతా దారులన్నీ మూసివేసి నన్ను సాహిత్యక్షేత్రంలోనే స్థిరపరిచేసింది 'నిర్మల'. తెలుగులో కూడా అయిదు ముద్రణలు అయిపోయి ఇప్పుడు ఆరవ ముద్రణలో ఉన్నది 'నిర్మల'

* "నందిని" మాస పత్రిక - సంపుటి :2, సంచిక :9, సెప్టెంబరు 1976

•••

# యశోద– శ్రీ కృష్ణుడు

డాక్టర్ పి. యశోదారెడ్డి

పట్టిన బట్టు పడని నిను
బట్టెదమని చలముకొనిన బట్టుట బట్టే?
పట్టువడ వండ్రు పట్టే
పట్టుకొనన్ నాకు గాక పరులకు వశమే?

అంటూ యశోద ఆదిజుడైన బ్రహ్మ ఉదయంబున కాస్పదమైన వాడినీ, వేదాదిసమస్త విద్యలందు తానై వెలసిన వాడినీ, సర్వలోకాభిగమ్యుడైన లోకోత్తరుణ్ణీ, శ్రుతిశిరోభాగాల్లో తన శ్రీచరణ పంకజామోదాన్ని పంచిన వాడినీ, తనదైన సదమల ద్యుతితో సకలజనులకు తేజాన్నీ తనువునూ కల్పిస్తూ సత్వేవ్యుడైన పుండరీ కాక్షుణ్ణి అంటే శ్రీకృష్ణుణ్ణి తన కొడుకుగా భావిస్తూ "చిన్ని వెన్న దొంగ చిక్కెననుచు' దామెన త్రాటతో రోలుకు కట్టింది. ' ఈ పని సాధారణంగా ఆగడాలు చేసే ప్రాకృత శిశువులను తల్లులు దండించే విధానం. కానీ శ్రీహరి లీలామానుష విగ్రహుడు, పలుపు చుట్టిన ఆ చిన్ని బొజ్జ పెక్కు బ్రహ్మాండాలను దాచుకున్నపట్టు. ఇంతటి అపురూపమైన సౌభాగ్యాన్ని దర్శించిన లోకం యశోద సుకృత ఫలాన్ని కొనియాడుతూ.

"సంగడి దిరిగెడు శంభుడు
నంగాశ్రయమైన సిరియు నాత్మజుడైయు
ప్పొంగెడు పద్మజుడును
గోపాంగన క్రియ గరుణ వడయ రఖిలేశ్వరుచేన్."

అంటూ ఎపమెడూ జతగా తిరిగే శివునికన్నా, ఎదలో వాసం చేస్తున్న లక్ష్మీ దేవికన్నా, కొడుకైకులుకు తున్న బ్రహ్మదేవునికన్నా అధికంగా ఆహరి కరుణను గోపాంగన ఐన యశోద చూరగొన్నట్లు పేర్కొన్నారు. అంతతో ఆగక యశోద చిన్ని కృష్ణయ్యను రోటగట్టిన సన్నివేశాన్ని పురస్కరించుకొని

"చిక్కడు సిరికౌగిటిలో
చిక్కడు సనకాది యోగి చిత్తాబ్జములన్
చిక్కడు శ్రుతిలతికావళి
జిక్కెనతడు లీల దల్లి చేతన్ ఱోలన్"

అంటూ ఆమె పొందిన అనుగ్రహ విశేషాన్ని పొగడ్తూనే ఆ తల్లి చేసిన పుణ్య విశేషాన్ని గూర్చి ఆలోచింప చేసింది భాగవతం. అందుకే

"జగదధీశ్వరునకు జన్మిచ్చు తల్లిగా
నేమినోము నోచె నీయశోద
పుత్రు డనుచు నతని బోషించు తండ్రిగా
నందు డేమి చేసె నందితాత్మ"

అంటూ నంద యశోదాదుల జన్మ రహస్యాలను గూర్చి తెలిసికోవలెనన్న జిజ్ఞాసకు శ్రీకారం చుట్టింది. అందుకే మనకూ ఆలోచింపక తప్పదు. పౌరాణిక గాథలు ఆధారంగా తొల్లి వసు శ్రేష్ఠుడైన ద్రోణుడు పద్మయోని ఐన బ్రహ్మను పురస్కరించుకొని తాను పృధ్విపై మనుష్యయోనిగా జన్మించే సందర్భంలో స్వయం విష్ణు రూపియైన శ్రీ కృష్ణుని లో అచంచల మైన భక్తి కలవానిగా చేయమంటూ ప్రార్థించినాడు. ఈ సందర్భంలో అక్కడే ఉన్న అతని భార్య 'ధరాదేవి' కూడా ఆ కోరికనే చిత్తంలో దృఢంగా ప్రోదిచేసుకున్నది. పరమభక్తి ప్రేరకాలైన వారికోరికలను మన్నిస్తూ పద్మభవుడు తథాస్తు అన్నాడు. ఈ వరప్రభావంతో ఈ దంపతులిద్దరిలో ధరాదేవి వ్రజమండలంలో సుముఖ నామకుడైన గోపాలునికి అతని భార్య పాటలకు కూతురై పుట్టింది. ఈ దంపతులు తమ ముద్దు బిడ్డకు యశోద అనే పేరు పెట్టినారు. ఈమె వివాహం వ్రజరాజైన నందగోపునితో జరిగింది. ఇదే శ్వేతవరాహ కల్ప ద్వాపరయుగ సదర్భం. శ్రీకృష్ణ భక్తి భావం చేతనే ఈ పుణ్య దంపతులిద్దరూ సర్వజగన్నాయకుడైన శ్రీ మహావిష్ణువును తల్లీ తండ్రి రూపంలో సేవించి ధన్యతను పొందగలిగినారు. అందుకే భాగవతం ఎవ్వరికీ అందని పరంధామపతిని గూర్చి-

> "చిక్కడు వ్రతముల గ్రతువుల
> చిక్కడు దానముల శౌచశీల తపములన్
> జిక్కడు యుక్తిని భక్తిని
> జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ"

అంటూ చివరకు ఆయోగీశ్వరుని అనుగ్రహప్రాప్తిని దక్కించుకునేందుకు కావలసిన యోగ్యతలను నిష్కర్షగా చాటి చెప్పినట్లు

> "చాలదు భూదేవత్వము
> చాలదు దేవత్వ మధిక శాంతత్వంబున్
> చాలదు హరి మెప్పింప వి
> శాలోద్యములార! భక్తి చాలిన భంగిన్"

అంటూ చెప్పి 'భక్తి'కి భద్ర పీఠాన్ని పెట్టింది.

యశోదా కృష్ణుల సందర్భంలో విష్ణుదేవతాకమైన గ్రంథాలన్నింటినీ వదిలి భాగవతాన్నే ప్రధానంగా ఎందుకు పేర్కొంటున్నాను అంటే భగవంతుని పురస్కరించుకుని రచింపబడ్డ గ్రంథం భాగవతం. అంతే కాదు, భగవంతుడంటే ఎవరూ? అనే ప్రశ్నకు సమాధానం కూడా పొందవలసి ఉంటుంది. అందుకే ఈ గ్రంథాన్ని స్వీకరించడం జరిగింది. సమగ్రమైన ఐశ్వర్యమూ, పరాక్రమమూ, యశస్సూ, సంపదా, జ్ఞాన వైరాగ్యాలు అనే ఆరింటికి 'భగ' అనే వ్యవహారం ఉంది. ఈషద్విభూతి రూప భగాలకే 'భగవత్వం' అనే పేరు దక్కుతుంది. ఆదర్శనమే భాగవతం అంటూ పెద్దలు నిర్ణయించినారు. ఇట్లే ఉత్పత్తి, లయ, భూత సృష్టి, భూత ప్రళయ, విద్యావిద్యలు అనే ఆరింటిని ఎరిగినవాడు భగవంతుడు. ఈయన సనాతనుడు, ఆద్యుడు, అనంతుడు, సర్వజగత్స్రష్ట, సర్వజగన్నియామకుడు, సకలయజ్ఞ స్వరూపి, సర్వయజ్ఞ భోక్త, యోగప్రియుడు, భక్త జన ప్రియుడూ అయిన వాడు. అట్టి ఆదిమధ్యాంతరహితమైన పరతత్వాన్ని లోకమోహనమైన శ్రీకృష్ణ పరమాత్మ రూపంలో నిరూపించి మహిమాభివర్ణనం చేసింది భాగవతం. అంతేకాదు పరాభక్తితో తెలియదగిన బ్రహ్మ విద్యావిధానాన్ని పరమ ప్రేమ రూపంలో జాలువారించింది.

'భజ సేవాయాం' అనే ధాతు నిష్పన్నమైన భక్తిని గూర్చి అనేకులు అనేక విధాలైన నిర్వచనాలను చెప్పినప్పటికీ

నారదుడు 'సా తస్మిన్ పరమ ప్రేమరూపా' అంటూ భగవంతుని ఎడల పరమమైన ప్రేమయే 'భక్తి' అంటూ చెబితే శాండిల్యుడు 'సాపరానురక్తిరీశ్వరీ' అంటూ ఆభక్తి భావానికి గట్టి ముడివేసినాడు. ఈశ్వరుని యందు ఏర్పడ్డ పరమానురక్తి, భక్తికీ, భగవంతునికీ అమృతత్వాన్ని ఆపాదిస్తుంది. అపుడు జగత్తు సర్వం చిగిర్చిన దివ్యశోభతో అలంకృతమై, దివ్యరసమయమై గోచరిస్తుంది. అందుకే ఈ భక్తిని 'అమృత స్వరూపాచ' అంటూ కూడా సంభావించినారు. విశిష్టాద్వైత ప్రవక్తకులైన ఆచార్యులు భక్తిని సంకీర్తన,అర్చన, వందన, పాదసేవనాది రూపాల్లోనే కాకుండా భగవంతునికీ, భక్తునికీ మధ్య కల్పించుకున్న సంబంధాన్ని పురస్కరించుకొని కూడా, శేష శేషి, పితా పుత్ర, భార్యాభర్తృమొదలైన పేర్లతో విభజించుకున్నారు. ఈ రీతిని పురస్కరించుకొని చూచినా యశోదా కృష్ణుల సంబంధం పరమప్రేమరూపమై మోడువారిన జగత్తునే ఆనందపులకితం చేస్తూ ప్రాణవంతం చేస్తుంది.

వయసు మళ్ళిన యశోద నీరు మోసి, నీళ్ళాడి గుమ్మడి పండువంటి నీలమణిని కన్నది. ఈ ముద్దుల మూటను చూడ ఊరూవాడా ఏకమై,

> "ఏమినోము ఫలమొ యింత ప్రొద్దొక వార్త
> వింటిమబలలార! వీను లలర
> మన యశోద చిన్న మగవాని గనెనట
> చూచి వత్తమమ్మ సుదతులార"

అంటూ వెళ్ళి చూచి వచ్చిన సంబరంలో యశోద నోచిన నోము ఫలం ప్రధానంగా ధ్వనించింది. సాక్షాత్తు 'భగవంతునికి తల్లిఐనను చను గుడుపే భాగ్యం ఎందరికి కలుగుతుంది. అందుకే పూతన సంహారావసరాన్ని పురస్కరించుకొని పోతన భాగవతంలో-

> "వెన్నుని కొకమఱి విషమగు
> చన్నిచ్చిన బాలహంత్రి చనెనట దివికిన్
> వెన్నుని గని పెంచుచు దన
> చన్నిచ్చిన సతికి మఱియు జన్మము గలదే"

అన్నాడు. ఇంకెక్కడది జన్మ? ఆమె ఆపరంధామపతిలో, ఆ భక్తిరసాయనంలో, ఆ ఆనందామృతఝురిలో, ఆతన్మయత్వంలో తలమునకలై భక్తి అంతా తానై తానే భక్తి ఐ స్రవించింది. ఆదివ్యజ్యోతిలో లీనమైంది.

యశోద శ్రీహరిని దేవుడుగా మోక్షప్రదాతగా, చూడలేదు. తాను తల్లి, వాడు కొడుకు అంతే! తల్లిగా చన్నుగుడిపి, బొజ్జకు పెట్టి, చమురు రాచి, లాలలు పోసి జోలలు పాడుతుంది, నిద్ర పుచ్చుతుంది. వాడికి తప్పడడుగులు నేర్పుతూ చప్పట్లు చరిచి నవ్వుతుంది, బొద్దుగా ముద్దుగా ఉన్న ఆ పాదాలకు గజ్జెలూ మువ్వలూ కడుతుంది. అవి ఘల్లు ఘల్లు మంటూ ఉంటే వాడు నజ్జులు తొక్కుతూ నఖరాలు చేస్తాడు. తాను చల్ల చేస్తూ ఉంటే చిట్టిబొజ్జ ఊపుకుంటూ చిందులు వేస్తాడు, వెన్న ముద్దలు పెట్టమంటాడు ఆ అందమైన ఆగడాలకు ఉబ్బిపోతూనే ఆటగా ఆలీలామానుషవిగ్రహుణ్ణి తెచ్చికోలు కోపంతో దండిస్తానంటుంది. చిన్ని కృష్ణయ్య పెద్ద గొల్ల బిడ్డ, అందుకే చిలిపి చేష్టలకు కొదవలేదు, పక్కవారిండ్ల వారిని మననీయడంలేదు. వీడి ఆగడాలు భరించలేని గొల్లెతలు యశోదతో మొరబెట్టుకుంటారు, తోటిబాలురు మన్ను తిన్నాడంటూ తాకట్టుపెడ్తారు. అపుడామె చిరుకోపంతో దుండగిని, శిక్షిస్తానంటూ వెనుదరుముతుంది. అదొక లీలావిలాసం. అదొక నాటక విశేషం. ఈ ఆగడాలన్నీ అతి మానుషమైన శ్రీహరిక్రీడలుగా దివ్యసిద్ధిని పొందుతూ

అంటూ నంద యశోదాదుల జన్మ రహస్యాలను గూర్చి తెలిసికోవలెనన్న జిజ్ఞాసకు శ్రీకారం చుట్టింది. అందుకే మనకూ ఆలోచింపక తప్పదు. పౌరాణిక గాథలు ఆధారంగా తొల్లి వసు శ్రేష్ఠుడైన ద్రోణుడు పద్మయోని ఐన బ్రహ్మను పురస్కరించుకొని తాను పృథ్విపై మనుష్యయోనిగా జన్మించే సందర్భంలో స్వయం విష్ణు రూపియైన శ్రీ కృష్ణుని లో అచంచల మైన భక్తి కలవానిగా చేయమంటూ ప్రార్థించినాడు. ఈ సందర్భంలో అక్కడే ఉన్న అతని భార్య 'ధరాదేవి' కూడా ఆ కోరికనే చిత్తంలో దృఢంగా ప్రోదిచేసుకున్నది. పరమభక్తి ప్రేరకాలైన వారికోరికలను మన్నిస్తూ పద్మభవుడు తథాస్తు అన్నాడు. ఈ వరప్రభావంతో ఈ దంపతులిద్దరిలో ధరాదేవి వ్రజమండలంలో సుముఖ నామకుడైన గోపాలునికి అతని భార్య పాటలకు కూతురై పుట్టింది. ఈ దంపతులు తమ ముద్దు బిడ్డకు యశోద అనే పేరు పెట్టినారు. ఈమె వివాహం వ్రజరాజైన నందగోపునితో జరిగింది. ఇదే శ్వేతవరాహ కల్ప ద్వాపరయుగ సదర్భం. శ్రీకృష్ణ భక్తి భావం చేతనే ఈ పుణ్య దంపతులిద్దరూ సర్వజగన్నాయకుడైన శ్రీ మహావిష్ణువును తల్లీ తండ్రి రూపంలో సేవించి ధన్యతను పొందగలిగినారు. అందుకే భాగవతం ఎవ్వరికీ అందని పరంధామపతిని గూర్చి-

> "చిక్కడు వ్రతముల గ్రతువుల
> చిక్కడు దానముల శౌచశీల తపములన్
> జిక్కడు యుక్తిని భక్తిని
> జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ"

అంటూ చివరకు ఆయోగీశ్వరుని అనుగ్రహప్రాప్తిని దక్కించుకునేందుకు కావలసిన యోగ్యతలను నిష్కర్షగా చాటి చెప్పినట్లు

> "చాలదు భూదేవత్వము
> చాలదు దేవత్వ మధిక శాంతత్వంబున్
> చాలదు హరి మెప్పింప వి
> శాలోద్యములార! భక్తి చాలిన భంగిన్"

అంటూ చెప్పి 'భక్తి'కి భద్ర పీఠాన్ని పెట్టింది.

యశోదా కృష్ణుల సందర్భంలో విష్ణుదేవతాకమైన గ్రంథాలన్నింటినీ వదిలి భాగవతాన్నే ప్రధానంగా ఎందుకు పేర్కొంటున్నాను అంటే భగవంతుని పురస్కరించుకుని రచింపబడ్డ గ్రంథం భాగవతం. అంతే కాదు, భగవంతుడంటే ఎవరూ? అనే ప్రశ్నకు సమాధానం కూడా పొందవలసి ఉంటుంది. అందుకే ఈ గ్రంథాన్ని స్వీకరించడం జరిగింది. సమగ్రమైన ఐశ్వర్యమూ, పరాక్రమమూ, యశస్సూ, సంపదా, జ్ఞాన వైరాగ్యాలు అనే ఆరింటికి 'భగ' అనే వ్యవహారం ఉంది. ఈషద్విభూతి రూప భగాలకే 'భగవత్వం' అనే పేరు దక్కుతుంది. ఆదర్శనమే భాగవతం అంటూ పెద్దలు నిర్ణయించినారు. ఇట్లే ఉత్పత్తి, లయ, భూత సృష్టి, భూత ప్రళయ, విద్యావిద్యలు అనే ఆరింటిని ఎరిగినవాడు భగవంతుడు. ఈయన సనాతనుడు, ఆద్యుడు, అనంతుడు, సర్వజగత్స్రష్ట, సర్వజగన్నియామకుడు, సకలయజ్ఞ స్వరూపి, సర్వయజ్ఞ భోక్త, యోగప్రియుడు, భక్త జన ప్రియుడూ అయిన వాడు. అట్టి ఆదిమధ్యాంతరహితమైన పరతత్వాన్ని లోకమోహనమైన శ్రీకృష్ణ పరమాత్మ రూపంలో నిరూపించి మహిమాభివర్ణనం చేసింది భాగవతం. అంతేకాదు పరాభక్తితో తెలియదగిన బ్రహ్మ విద్యావిధానాన్ని పరమ ప్రేమ రూపంలో జాలువారించింది.

'భజ సేవాయాం' అనే ధాతు నిష్పన్నమైన భక్తిని గూర్చి అనేకులు అనేక విధాలైన నిర్వచనాలను చెప్పినప్పటికీ

నారదుడు 'సా తస్మిన్ పరమప్రేమరూపా' అంటూ భగవంతుని ఎడల పరమమైన ప్రేమయే 'భక్తి' అంటూ చెబితే శాండిల్యుడు 'సాపరానురక్తిరీశ్వరీ' అంటూ ఆభక్తి భావానికి గట్టి ముడివేసినాడు. ఈశ్వరుని యందు ఏర్పడ్డ పరమానురక్తి, భక్తికీ, భగవంతునికీ అమృతత్వాన్ని ఆపాదిస్తుంది. అపుడు జగత్తు సర్వం చిగిర్చిన దివ్యశోభతో అలంకృతమై, దివ్యరసమయమై గోచరిస్తుంది. అందుకే ఈ భక్తిని 'అమృత స్వరూపాచ' అంటూ కూడా సంభావించినారు. విశిష్టాద్వైత ప్రవక్తకులైన ఆచార్యులు భక్తిని సంకీర్తన,అర్చన, వందన, పాదసేవనాది రూపాల్లోనే కాకుండా భగవంతునికీ, భక్తునికీ మధ్య కల్పించుకున్న సంబంధాన్ని పురస్కరించుకొని కూడా, శేష శేషి, పితా పుత్ర, భార్యాభర్తృమొదలైన పేర్లతో విభజించుకున్నారు. ఈ రీతిని పురస్కరించుకొని చూచినా యశోదా కృష్ణుల సంబంధం పరమప్రేమరూపమై మోడువారిన జగత్తునే ఆనందపులకితం చేస్తూ ప్రాణవంతం చేస్తుంది.

వయసు మళ్ళిన యశోద నీరు మోసి, నీళ్ళాడి గుమ్మడి పండువంటి నీలమణిని కన్నది. ఈ ముద్దుల మూటను చూడ ఊరూవాడా ఏకమై,

> 'ఏమినోము ఫలమొ యింత ప్రొద్దొక వార్త
> వింటిమబలలార ! వీను లలర
> మన యశోద చిన్న మగవాని గనెనట
> చూచి వత్తమమ్మ సుదతులార"

అంటూ వెళ్ళి చూచి వచ్చిన సంబరంలో యశోద నోచిన నోము ఫలం ప్రధానంగా ధ్వనించింది. సాక్షాత్తు 'భగవంతునికి తల్లివైనను చను గుడుపే భాగ్యం ఎందరికి కలుగుతుంది. అందుకే పూతన సంహారావసరాన్ని పురస్కరించుకొని పోతన భాగవతంలో-

> "వెన్నుని కొకమఱి విషమగు
> చన్నిచ్చిన బాలహంత్రి చనెనట దివికిన్
> వెన్నుని గని పెంచుచు దన
> చన్నిచ్చిన సతికి మఱియు జన్మము గలదే"

అన్నాడు. ఇంకెక్కడది జన్మ? ఆమె ఆపరంధామపతిలో, ఆ భక్తిరసాయనంలో, ఆ ఆనందామృతఝరిలో, ఆతన్మయత్వంలో తలమునకలై భక్తి అంతా తానై తానే భక్తి ఐ స్రవించింది. ఆదివ్యజ్యోతిలో లీనమైంది.

యశోద శ్రీహరిని దేవుడుగా మోక్ష ప్రదాతగా, చూడలేదు. తాను తల్లి, వాడు కొడుకు అంతే! తల్లిగా చన్నుగుడిపి, బొజ్జకు పెట్టి, చమురు రాచి, లాలలు పోసి జోలలు పాడుతుంది, నిద్ర పుచ్చుతుంది. వాడికి తప్పడడుగులు నేర్పుతూ చప్పట్లు చరిచి నవ్వుతుంది, బొద్దుగా ముద్దుగా ఉన్న ఆ పాదాలకు గజ్జెలూ మువ్వలూ కడుతుంది. అవి ఘల్లు ఘల్లు మంటూ ఉంటే వాడు నజ్జులు తొక్కుతూ నఖరాలు చేస్తాడు. తాను చల్ల చేస్తూ ఉంటే చిట్టిబొజ్జ ఊపుకుంటూ చిందులు వేస్తాడు, వెన్న ముద్దలు పెట్టమంటాడు ఆ అందమైన ఆగడాలకు ఉబ్బిపోతూనే ఆటగా ఆలీలామానుషవిగ్రహుణ్ణి తెచ్చికోలు కోపంతో దండిస్తానంటుంది. చిన్ని కృష్ణయ్య పెద్ద గొల్ల బిడ్డ, అందుకే చిలిపి చేష్టలకు కొదవలేదు, పక్కవారిండ్ల వారిని మననీయడంలేదు. వీడి ఆగడాలు భరించలేని గొల్లెతలు యశోదతో మొరబెట్టుకుంటారు, తోటిబాలురు మన్ను తిన్నాడంటూ తాకట్టుపెడ్తారు. అపుడామె చిరుకోపంతో దుండగిని, శిక్షిస్తానంటూ వెనుదరుముతుంది. అదొక లీలావిలాసం. అదొక నాటక విశేషం. ఈ ఆగడాలన్నీ అతి మానుషమైన శ్రీహరిక్రీడలుగా దివ్యసిద్ధిని పొందుతూ

పాఠకులకు అనేక సుఖానుభూతిని కల్పిస్తుంటాయి. అంతేకాదు. ఈ లీలా ఖేలనం అంతా మన కళ్ల ముందే ప్రదర్శితమైనట్లుగా భావించుకొని మనమూ ఆనంద ధన్యతను పొందుతూ ఉంటాం. లోకమోహనుడైన శ్రీహరి దివ్యలీలల వర్ణనా సందర్భంలో చిన్ని కృష్ణుడు మువ్వలు మొలగంటలు మొరయ నాడగా గోపికలు తమ యాత్మ భ్రమసి పెరుగుదరువ మరచి సంప్రీతితో చూచినట్లు మనమూ ఆలీలలను మనోనేత్రంతో దర్శిస్తూ నాటక ప్రదర్శనంలో ప్రేక్షకులకు వలె విభావాదులన్నీ సాధారణీకరణాలై సత్య ప్రభావంతో రసాస్వాదనం చేస్తూ ఆనందానుభూతిని పొందుతాం. ఈ దివ్యచరిత్రవలనిఫలం ఇది! అందుకేనేమో కురుక్షేత్ర సంగ్రామానంతరం సర్వరాజవంశాలు నశింపగా కేవలం నిరీహను ప్రతిపాదిస్తూ, ఇహ భోగ విముఖతతో కుటుంబ వర్ధనానికి భంగం కలిగిస్తూ ఉన్న భారతం తరువాత జగద్ధితరతి ఐన వ్యాసభగవానుడు సకల జగత్తుకు తిరిగి అభివర్ధనాన్ని కోరుతూ శ్రీకృష్ణ బాల్యలీలావిలాసితమైన హరివంశాన్ని రచించినట్లు అభిజ్ఞులు సూచిస్తారు. ఇందుకు అనుగుణంగానే సంతానరహితులైన వారు హరివంశపారాయణాన్ని విధి విధానంతో జరిపించితే సంతానం కలుగుతుంది అనే సమ్మకం ప్రామాణికంగా మన భారతీయులలో వ్యాపించి ఉంది. ఇందుకు కారణం మాతృమూర్తి, అనురాగం తప్ప అన్యమెరుగని యశోదాప్రేమమాహాత్మ్యమే కావచ్చు. పాలబుగ్గలతో పసినిమ్మపండు వంటి నల్లనయ్య నవ్వులు చిందుతూ, తొట్టెలలో నలుమూలలా తిరుగుతూ, కాటుక కళ్ళన్నీ చిన్ని చేతులతో నలుపుకొని కావు కావున ఏడుస్తూ ముఖమంతా పులుముకొని, తన్నెవరైనా ఎత్తుకోవాలంటూ పిరుదొయ్యన లేవనెత్తుతూ, శ్రీరమ్యాంఘ్రియుగ్మాన్ని గింజుకుంటూ ఉంటే చూచి ద్రవించిన మాతృమూర్తి యశోద చేపిన చన్నులు వర్షించే పాల ధారలే అమృతధారలై, సంతానకారకాలై సకల జగత్తుకు మాతృత్వాన్ని పంచి ఉండవచ్చును అనే విశ్వాసం కలుగుతుంది.

శ్రీహరి నిత్యలీలలో ఒక యశోద గోచరిస్తుంది. ఈమె శ్రీకృష్ణ దేవునికి నిత్యమాత. ఈమెను వాత్సల్య రసాధి దేవతగా, ఘనీభూతమైన వాత్సల్య రసంగా పేర్కొంటూ ఉంటారు. తల్లి తన పసిబిడ్డకు గోరుముద్దలు తినిపించినట్లుగా ఈమె శ్రీహరి చేత వాత్సల్య రసాస్వాదనం చేయిస్తుంది. ఎపుడైతే శ్రీమహావిష్ణువు భూభారావతరణం కోసమై భూతలంలో కృష్ణ రూపిగ జన్మించే అవసరం ఆసన్నమైందో అపుడే ఈ దివ్యమాత, చిదానందమయి, వాత్సల్యరసధుని, నందగోపుని భార్య ఐన యశోదను ఆవేశించి, ఆమెలో సంలీనం పొందుతుంది. ఆవిధంగా పాటలాపుత్రి ఐన యశోద నిత్యమాత ఐన యశోదతో అభేద ప్రతిపత్తిని పొందుతూ తానొక వాత్సల్యకుల్యగా పరిణతిని పొందింది. శ్రీకృష్ణుడు తన కొడుకో, శ్రీమన్నారాయణుడో, కాక దేవకీదేవి కన్నబిడ్డడో? ఆ ప్రేమమూర్తికి అవసరంలేదు. ఆమెకు తెలిసిందీ కావలసిందీ అంతా శ్రీకృష్ణుడే, ఆమెకు సర్వవిశ్వం కృష్ణమయంగా గోచరిస్తుంది. అందుచేతనే కామరూపిఐన పూతన పిల్లవాడికి పాలిస్తానంటే ఏమాత్రం శంకించలేదు. మాతృత్వంపై ఆమెకున్న అచంచల మైన విశ్వాసమే చిన్ని కన్నయ్యకు అమేయ బలాన్ని ప్రసాదిస్తూ వాడిచేత బాలఘాతిని ఐన ఆ రాక్షసి ప్రాణాలను తావింప చేస్తూ వాడిని కాపాడుకోగలిగింది. అందుకే పోతన భాగవతంలో ఈ సందర్భాన్ని పురస్కరించుకొని

> " హరి దనమీదం బదములు
> గరములు నిడి చన్నుగుడిచి కదిసిన మ్రాతన్
> హరిజననిపగిది బరగతి
> కరిగెన్ దురితములు వాసి యసురాంగనయున్ "

అంటూ స్పష్టపరిచి శ్రీ కృష్ణుని దైవత్వాన్నీ యశోదకు దక్కిన అనన్యసామాన్యమైన అమృత ఫలాన్నీ

ప్రదర్శింపచేసినాడు.

జగడాలమారి ఐన కృష్ణుని అల్లరి మాన్ప బంధిస్తానంటూ స్తన భారముతో డస్సి క్రుస్సియసదై జవ్వాడేనడుముతో జారుతున్న ఉత్తరీయంతో యశోద పరుగెత్తుతున్న కొడుకు వెంబడి పట్టుదలతో పరుగెత్తి పట్టుకొన్నది. జనని పాటోర్వక పట్టు బడ్డ ఆ బిడ్డడు రెండు మద్ది చెట్ల మధ్యలో ఇరికి వాటిని విరిచి నపమెడు ఆ తల్లి పాటు ఆ భగవంతునికే తెలుసు, అట్లే శ్రీ కృష్ణుని తృణావర్తునడపహరించినప్పుడూ శకటాసురసంహారం సందర్భంలో కాళియభంజన సందర్భంలో ఆమె పడిన మానసికావేదనం ఇంతితనరానిది. అందులో నిస్వార్థమైన ప్రేమ, త్యాగం, తప్ప ఇతరాలేవీ గోచరించవు. ఈ గండాలను దాటి బయట పడ్డ తన కొడుకును చూచి గాలీ, ధూళీ, శాకినీ ఢాకినీలు చూపుకు అందకుండా, పొరకాడించి, పేడనీళ్ళు చల్లి, చందిరపు నీళ్ళు దిగదుడిచి దృష్టి పరిహారం కావిస్తూ కొడుకుకు రక్షరేకులు కట్టించిన అమాయక. పాలనురుగువంటి ఆ స్వచ్ఛతలో ఆ ప్రేమలో భక్తి గోచరిస్తుంది. ఈ విధానాన్నే 'అన్యాభిలాషికాశూన్యం జ్ఞాన కర్మాద్యనావృతం, ఆనుకూల్యేనకృష్ణానుశీలనం భక్తి రుత్తమా - అంటూ భక్తి రసామృత 'సింధువు చెప్పింది. ఈ యశోద స్థితిని పురస్కరించుకొనే కాబోలు లింగపురాణం -

*'యన్ముహూర్తం క్షణంవాపి వాసుదేవో నచింత్యతే*
*సా హానిః తన్మహచ్ఛిద్రం సా భ్రాంతిః సైవ విక్రియా,*

అంటూ ఎవ్వరు సర్వకాల సర్వావస్థల్లో ఆ స్వామినే చింతిస్తూ , ఆ చింతలేని క్షణాన్ని గొప్పకీడుగా, మహచ్ఛిద్రంగా భావిస్తారో వారే పరమభక్తులంటూ నిర్ధారించింది. యశోద పూర్వజన్మ సుకృత విశేషంతో ఆనందకందమైన పరబ్రహ్మను కొడుకుగా పొంది తన అదుపాజ్ఞలకు లోనైన హరినోటిలో సకల విశ్వాన్ని సందర్శించినా భయభ్రాంత కాకుండా తన కొడుకు సర్వాత్ముడా దివిష్ణువగుట నిజం అంటూ ఒకలిప్తకాలం భావించిందే కాని తన మాతృప్రేమలో పొరపొచ్చెం రానివ్వలేదు. అందుకే శ్రీహరి పెరిగి పెద్దవాడై పురుషోత్తమ రూపంలో సభార్యుడై యశోదను ఎప్పుడు దర్శించినా సరే ఆమెకు ఆ కృష్ణుడు బాలకృష్ణుని రూపంలోనే కనిపిస్తాడనీ, ఆమె నవ ప్రసూత వలె పాలు స్రవిస్తూ ఆయనకు చనుగుడుపుతుందనీ బ్రహ్మ వైవర్త మార్కండేయ పురాణాలు పేర్కొన్నాయి. మాతాపుత్రుల ఈ ప్రేమ అపురూపం, అసదృశమై పరమమైన పరాభక్తిగా, వాత్సల్య భక్తిగా రూపుదిద్దుకున్నది. అందుకే పోతన -

*"జ్ఞానులచే మౌనులచే*
*దానులచే యోగసంవిధానులచేతన్*
*బూని నిబద్ధుడగునే*
*శ్రీనాధుడు భక్తి యుక్తుల చేతన్ బోలెన్. "*

అన్నాడు. ఈ విధంగా చూస్తే యశోద కృష్ణుల దొక విశిష్ట మార్గం. పరమ ప్రేమ రూపమైన వాత్సల్య మార్గం. తాను ప్రేమించే వస్తువు దక్క అన్యమెరుగని మార్గం. ఫల నిరపేక్ష రూపమైన సేవాస్వరూపం. ఈ సేవలో శ్రమ లేదు. విసుగు లేదు. దాస్యభావన లేదు, సర్వతంత్ర స్వతంత్రమైన ఆత్మార్పణం. ఆనందనిష్యందిని ఐన పరమసుఖరూపభక్తి విశేషం. ఇదే యశోదతత్వం. కృష్ణతత్వం..

***

# తెలుగు సాహిత్య విమర్శలో దేశీయతాన్వేషణ

- డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం

తెలుగులో నేటి సాహిత్య విమర్శకులు ఆరు రకాలుగా కనపడుతున్నారు.

1. సంస్కృత లాక్షణికులు నిర్దేశించిన ప్రమాణాలే భారతీయ భాషా సాహిత్య ప్రయోగాల కన్నింటికీ మూల సూత్రాలుగా వర్తిస్తాయని భావించి, తెలుగులో సాహిత్య ప్రక్రియలనూ, విమర్శ తీరు తెన్నులనూ సమీక్షించే వారు.
2. పాశ్చాత్య విమర్శసూత్రాలే సాహిత్య ప్రయోగాల విలువలను, విమర్శవివేక వికాసాలనూ వివేచింపగలవని విశ్వసించి తెలుగులో సాహిత్య విమర్శను సాగించేవారు.
3. తెలుగు సాహిత్యాన్నీ, విమర్శనూ ప్రాచ్య పాశ్చాత్య విమర్శన సూత్రాల సమన్వయ దృక్పథంతో అనుశీలించేవారు.
4. ఏదైనా ఒక సాహిత్యేతరమైన శాస్త్ర దృక్పథానికి గానీ, సిద్ధాంతానికి గానీ, ప్రయోగసూత్రానికి గానీ కట్టుబడి సాహిత్యాన్నీ, విమర్శనూ విలువకట్టే పద్ధతిని పాటించేవారు.
5. స్వీయాభిరుచులనే సాహిత్య ప్రయాణాలుగా, విమర్శసూత్రాలుగా వెలువరించేవారు.
6. సాహిత్యం మీద ప్రభావాలు ఎన్ని ఉన్నా, దానిదైన దేశిలక్షణం ప్రయోగాలలో జీవశక్తిగా ప్రవహిస్తూ ఉంటుందనీ, అంతర్గతి వికాససూత్రం అవిచ్ఛిన్నంగా సాగుతూ ఉంటుందనీ విశ్వసించి, తెలుగులో ఆయా కాలాలలో వెలువడుతున్న ప్రక్రియలకూ, విమర్శ విధానాలకూ కూడా వానివైన దేశి అస్తిత్వ వ్యక్తిత్వాలూ, అంతర్గతి వికాస ప్రస్థానాలూ ఉన్నట్లు దర్శించి ప్రపంచించేవారు.

ఆరురకాల విమర్శకు లున్నారంటే - ఆరు రకాల విమర్శ మార్గాలు ఆచరణలో ఉన్నాయన్నమాట. ఇది ఆధునిక కాలం చేసుకొన్న అదృష్టం అని కూడా చెప్పాలి. తెలుగులో సాహిత్య విమర్శ పట్టుపుర్వోత్తరాల చరిత్ర గమనిస్తే, ఈ ఆరు మార్గాలూ ఒకసారే పుట్టాయని చెప్పలేము గాని, పైన పేర్కొన్న క్రమంలో ప్రాచుర్యం చెందుతూ వచ్చి ఇప్పుడు అన్నీ కలిసి ప్రవర్తిల్లుతున్నాయని పేర్కొనగలం. తెలుగులో ఒకసారి వెలసిన ఏ పద్ధతైనా తరువాత రూపరేఖలు లేకుండా అంతరించిపోవటం అరుదు. కాని, అది కాలాంతరంలో రూపాంతరం పొందవచ్చు. తెలుగు సాహిత్యంలోనూ, విమర్శ రంగంలోనూ ఇదే వాస్తవం ఈనాడు కనపడుతుంది. శతాబ్దం క్రింద తలయెత్తిన విమర్శ పద్ధతి ఈనాడూ ఏదో విధంగా కొనసాగుతూనే ఉంది. ఈనాడు ప్రాచుర్యం పొందిన మార్గానికి తొలిజాడలు కొన్ని దశాబ్దాలక్రిందనే తలయెత్తి ఉంటాయి. పై ఆరురకాల విమర్శలలో మొదటి రకం, ఆరవరకం విమర్శ ఈ వాస్తవాన్ని ఋజువు చేస్తున్నాయి.

ఆరురకాల విమర్శలు సమాంతరంగానూ, సమ్మిశ్రితం గానూ సాగుతున్న ఈ కాలం గతం కంటె ఎంతో సాధించగలిగే సామర్థ్యం కలిగి ఉన్నదనటంలో అనుమానం లేదు. సాహిత్య స్వరూప స్వభావాలను బహుముఖాలుగా విశ్లేషించి వివేచించే పరికరాలు, పద్ధతులు ఈనాడు ఎన్నో మన కందుబాటులో ఉన్నాయి. వాటిని ఉపయోగించుకొంటూ విమర్శ తాను విస్తరిస్తూనే, పరిశోధనకు కూడా బలాన్ని చేకూరుస్తుంది. అయినా, గమనింపదగిన విశేషమేమంటే - తెలుగు సాహిత్య విమర్శకు మొదటినుండి ఒక సొంత గొంతుక ఉందా? ఒక స్వంత వికాస సూత్రం ఉందా, తనదైన దేశి ప్రమాణం ఉందా, దాని వికాస చరిత్రకు స్వీయ అస్తిత్వ వ్యక్తిత్వాలున్నట్లు వివేచించటానికి వీలుందా? - మొదలైన ప్రశ్నలకు సూటిగా, స్పష్టంగా సమాధానం చెప్పటం సాధ్యంకావటం లేదు. సమకాలీన

సాహిత్య విమర్శ ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పాలని ప్రయత్నిస్తోంది. అందులోనూ ఆరు విధాలైన విమర్శకుల్లో చిట్ట చివరి వారు తమ దృష్టిని ఈ అంశాల మీద కేంద్రీకరిస్తున్నారు. దీన్ని అత్యంత ఆధునిక లక్షణంగా పరిగణిస్తున్నారు.

తెలుగులో లిఖితపూర్వకమైన సాహిత్య విమర్శ దాదాపు నూటపాతికేళ్ల నుండి వెలువడుతున్నది. ముద్రణయంత్రాల వల్లనే మనకీ సౌకర్యం లభించింది. ముద్రణ సౌకర్యం లేనప్పుడు కూడా సాహిత్య విమర్శ లిఖిత సంప్రదాయంలో ప్రాచుర్యం చెందినట్లు మనకు తాళపత్ర గ్రంథాలు కానీ, వ్రాతప్రతులు గానీ సాక్ష్యాధారాలుగా లభించటం లేదు. అట్లని సాహిత్య విమర్శ తెలుగులో ఆకాలంలో లేదని చెప్పలేము. కావ్యావతారికలలో విమర్శ ప్రతి విమర్శలజాడలు కొన్ని, విమర్శ ప్రమాణాల ప్రతిపాదనలు కొన్ని, సాపేక్ష అనుశీలన సూత్రాల ప్రసక్తులు కొన్ని, కావ్యలక్షణ వివేచనలు కొన్ని,సాపేక్ష అనుశీలన సూత్రాల ప్రసక్తులు కొన్ని, కావ్యలక్షణ వివేచనలు కొన్ని ఎడనెడ చోటు చేసుకోవటం వల్ల సాహిత్య విమర్శ వెయ్యేళ్ళుగా తెలుగులో సజీవంగా, చైతన్యవంతంగా ఉన్నదని నిస్సందేహంగా చెప్పటానికి వీలుకలుగుతున్నది. అయితే, అది ముద్రణయంత్రాలు వచ్చేంతవరకూ మూగవోయినట్లు కనపడుతున్నా, మౌఖిక సంప్రదాయంలో జీవప్రవంతిగా ప్రవహిస్తూ ఉన్నట్లు స్పష్టమౌతున్నది.

మౌఖిక సంప్రదాయంలో కూడా ప్రక్రియోచితమైన పద్ధతులను ప్రజలు రూపొందించుకొంటూ తరువాతి తరాలవారికి అందిస్తూ ఉంటారు. అందులో ఎంతో వైవిధ్యం ఉంటుంది. వైశిష్ట్యం కూడా గోచరిస్తుంది. అవి దేశీయతా అస్తిత్వ వ్యక్తిత్వాలను పరిరక్షించుకొనే యత్నంలో కాలోచితమైన ప్రయోగాలు కూడా ప్రకటితమౌతూ ఉంటాయి. కవితలో ఆశువులు; చాటువులు, తిట్టు కవితలు, గుట్టుకవితలు మొత్తానికి మౌఖిక సంప్రదాయానికి చెందినవైనా, వాటి అస్తిత్వంలో వైవిధ్యం ఉంది. జానపదకళారూపాలకు పాదు ఒకటే అయినా అవి పెరిగే మౌఖిక సంప్రదాయ పద్ధతులలో సూక్ష్మభేదాలు కనపడతాయి. తెలుగులో దేశిరూపకాలూ, తదనుబంధ ప్రక్రియలూ పాక్షికంగా మౌఖిక సంప్రదాయాన్ని మన్నించి విస్తరించాయి. వీటి కన్నింటికంటె విలక్షణమైంది విమర్శ.

విమర్శలో శాస్త్రాంశ -లక్షణ వివేకం ; కళాంశ-అనుశీలన కౌశల్యం. ఈ రెండూ మొదట మౌఖికంగా సాపేక్షంగా సాగుతాయి. లక్షణ వివేకం విమర్శ సూత్రంగానో, ప్రమాణంగానో సహృదయుల మన్ననలు అందుకొంటే అది తరువాత ఒక లక్షణ గ్రంథకర్త చేత ఛందోమయంగా వ్యక్తీకరింపబడ వచ్చు. అంటే మౌఖిక సంప్రదాయంలో సాగే సాహిత్య విమర్శలో లక్షణభాగం లిఖిత సంప్రదాయం లోకి ప్రవేశించి తన అస్తిత్వాన్ని సుస్థిరం చేసుకొంటుందన్న మాట! లక్షణం మనకు లిఖిత రూపంగా కనపడ్డా, దానిని కావ్యానుశీలనంలో సమన్వయించే కళ ఆయాకాలాల్లో ఎదుట ఉన్న శ్రోతలకు వినపడింది గాని లిఖిత సంప్రదాయంలో జాలువారలేదు. లక్షణం ధారణలో నిలిచింది, అనుశీలనం శ్రవణమననాలలో స్రవించింది. ఈ పద్ధతి విమర్శక వ్యక్తిత్వాన్ని మన్నించేది; సశాస్త్రీయ విమర్శ చైతన్యాన్ని సాహితీ లోకంలో పరిపోషించేది. ముద్రణ యంత్రం వచ్చి - లక్షణాన్నీ అనుశీలనాన్నీ కలిపి లిఖిత సంప్రదాయంలో పెట్టింది. దీనితో లక్షణం ధారణలో నిలిచే ధోరణి మందగించింది. మౌఖిక సంప్రదాయంలో జీవించే ఉపన్యాసం కూడా లిఖిత సంప్రదాయంలోని వ్యాసంగా రూపొందటం ఎక్కువయింది. వట్టి ఉపన్యాసానికి నేడు విలువ తక్కువ. శాస్త్రాంశ, కళాంశాలను ఉభయ పార్శ్వాలుగా మలచుకొన్న ఉపన్యాసం వ్యాసగౌరవం పొందుతున్నది. ప్రచురింపబడని అటువంటి ఉపన్యాసం మౌఖికంగా సాగిన విమర్శ సంప్రదాయానికి ఆధునికంగా నిలిచిన తీపి గుర్తు. గతంలో పాక్షికంగాను, పూర్తిగానూ మౌఖిక సంప్రదాయంలో ఉన్న సాహిత్య విమర్శను బలవంతంగా లిఖిత సంప్రపదాయంలోకి మార్చిన యంత్ర మంత్రాంగానికి చిహ్నం వ్యాసం. అందువల్లనే కొన్ని వ్యాసాలు వింటేనే బాగుంటాయి. చదివినా కొన్ని మాత్రమే

జ్ఞాపకముంటాయి. శాస్త్రాంశనూ, కళాంశనూ లిఖిత సంప్రదాయానికి అనుగుణంగా సంపదించి సాహిత్య విమర్శను నిర్మించటమే ఈ శతాబ్ది మొదటిపాదంలో తెలుగు విమర్శకులు సాధించిన ఘన విజయం.

తెలుగు సాహిత్య విమర్శ చరిత్రలో తొమ్మిది శతాబ్దాల చరిత్ర అజ్ఞాతయుగం; ఈ శతాబ్ది చరిత్ర ప్రయోగయుగం. మరొకరకంగా చెప్పాలంటే మొదటిది మౌఖిక సంప్రదాయ యుగం; రెండవది - లిఖిత సంప్రదాయ యుగం. ఈ రెండు యుగాలలో వెలువడిన సాహిత్యాలలో మౌలికంగా ప్రేరక, క్రియాశక్తులలోనూ, ప్రయోజన ప్రవృత్తులలోనూ, ప్రయోగ దృష్టులలోనూ, ప్రభావ పద్ధతులలోనూ భేదం బాగా కనపడుతుంది. సాహిత్య చరిత్రలో లాగానే సాహిత్య విమర్శ చరిత్రలో కూడా ఈ శక్తుల పాత్ర బలంగా ఉంటుందనటంలో అనుమానం లేదు.

నన్నయ్యనుండి వీరేశలింగం పంతులు వరకు సాగిన సాహిత్య చరిత్రలో మూడు రకాల శక్తుల ముక్కోణపు పోటీ కనపడుతుంది. సంస్కృత ప్రాకృత సాహిత్యాలను దేశభాషలలో అనువదించటం వలనగాని, భారత వర్ష ధర్మ స్ఫూర్తి నివ్వగలిగిన వస్తువులతో వివిధ రచనలు చేయటం వలన గాని, దేశభాషా సాహిత్యా లెన్నైనా భారతీయ సాహిత్యం ఒకటే అనే అనుభవం కలిగించాలనే ప్రవృత్తి ఒకవైపు ఉండేది. ఆయా ప్రాంతాలలో బలంగా ఉన్న మతాలను గాని, ప్రచారంలో ఉన్న సాహితీ ప్రక్రియలనుగాని, ప్రమాణాలను గాని ఎన్నుకొని దేశభాషాసాహిత్యాలకు ప్రత్యేక ప్రతిపత్తి కలిగేటట్లు ఉద్యమించే ప్రవృత్తి దానికి ప్రతిగా మరో వైపు సాగుతూ ఉండేది. ఈ రెండింటికీ నడుమ సంఘర్షణ రేగటం సహజం. దాని వలన భరతవర్ష సాహిత్య సాంస్కృతిక సమైక్యత కుంటుపడవచ్చు. లేదా, దేశిసాహిత్య వికాసానికి దోహదం చేసే భారతీయ భాషా సాహిత్యాల ప్రభావం పట్ల ప్రజలకు వైముఖ్యం కలగవచ్చు. అవి వాంఛనీయాలు కావు. అందువలన సాంఘిక, మత రాజకీయాలలోని వైరుధ్యాల కతీతంగా ఒక సమన్వయ దృక్పథంతో దేశభాషా సాహిత్యాల అస్తిత్వ వ్యక్తిత్వాలకు నవ్యరూప కల్పనం చేసే ప్రవృత్తి మరొకటి బలంగా పని చేస్తుండేది. ఈ మూడవ ప్రవృత్తి దేశిసాహిత్యోద్యమాలలో పరిణత మైనదిగా పరిగణింపబడుతుంది. నన్నయ ఈ పద్ధతిని తెలుగులో ఆరంభించాడు. తిక్కన దిద్దితీర్చాడు. శివకవులు రెండవ ప్రవృత్తితో ఉద్యమించారు. మొదటి ప్రవృత్తి తెలుగులో పురాణానువాద పద్ధతిలో అవతరించినా పోతన దానిని పొలిమేరలు దాటకొట్టాడు. శ్రీనాథుడు, ప్రబంధకవులు, శతకకవులు మొదలైన వారిని మొదటి ప్రవృత్తికి ప్రతినిధులుగా కొందరు పరిగణిస్తారు. కాని, అది సత్యంకాదు. వారందరూ తెలుగు సాహిత్యంలో సమన్వయ శక్తులు. దేశి భాషాసాహిత్యాల అస్తిత్వ వ్యక్తిత్వాలను రూపుదిద్దిన కళామూర్తులు. ఒక్క మాటలో చెప్పాలంటే మన ప్రాచీన తెలుగు సాహిత్యమంతా భారతీయతాపరిరక్షణ ( Preservation of Indianness ) కు భంగం కలుగకుండానే తెలుగు దేశీయత ( Nativity ) యొక్క అస్తిత్వ వ్యక్తిత్వాల పరిపోషణంచేసిన కవుల నిర్విరామకృషి. సాహిత్యంతో పాటు సాహిత్య విమర్శకూడా ఇటువంటి ప్రస్థానమే సాగించి ఉండాలి.

కందుకూరి వారి కాలం నుండి పాశ్చాత్య ప్రభావ ప్రవృత్తి అనే మరో [illegible]ైన శక్తి మన సాహిత్యం మీద పని చేసింది. ప్రభావం అంటే ఇతరుల భావాదర్శ ప్రవాహాలలో కొట్టుకొని పోవటం కాదు. అది అనుసరణం లేదా అనుకరణం. ఒక భాషా సాహిత్యానికి గల దేశీయతా అస్తిత్వాన్ని వికాసదశ వైపు విస్తరింపజేయగల భావాదర్శ జాలాన్ని పోషక ద్రవ్యంగా మాత్రమే గ్రహించటం ప్రభావం. పాశ్చాత్య భాషా సాహిత్య సంస్కృతులతో మనకు సాన్నిహిత్యం ఏర్పడినప్పుడు వాటిని అనుకరించే ప్రవృత్తులకు, అనుసరించే చిత్త వృత్తులకు, ప్రభావంగా గ్రహించి దేశీయతకు పోషకంగా మలచుకొనే ప్రయోగాసక్తులకు ఆయాకాలాలలో ప్రాచుర్యం ఏర్పడవచ్చు. ఏమైనా అనుకరణ, అనుసరణ ప్రవృత్తులకు ఎప్పుడూ, ఎక్కడా అస్తిత్వ గౌరవం ఉండదు. వాటిని

ప్రభావ చైతన్యంగా మార్చుకొన్నప్పుడే సాహిత్యానికి మన్నన ఏర్పడేది. పాశ్చాత్య ప్రభావం మనకు కొన్ని ఆసక్తులను కలిగించింది. సమస్యలను కల్పించింది. వాటిని ఆహ్వానించ టానికి, ఎదుర్కొనటానికి అవసరమైన దేశీయ అస్తిత్వ మూల్యాల పునఃపరిశీలనానికి అవకాశాన్ని కలిగించింది. పాశ్చాత్య భాషాసాహిత్యాల ద్వారా ఆధునిక సాహిత్యం అంతర్జాతీయమైన మానవ వికాసాన్ని దర్శింపగలిగింది. సామాజిక, రాజకీయ, సాహిత్య, సాంస్కృతిక శాస్త్ర సిద్ధాంతాల , ఉద్యమాల ధోరణులను అవగాహన చేసుకొనగలిగింది. భారతీయ సాహిత్య, తాత్త్విక, సామాజిక, సాంస్కృతిక మూల్యాలను, దర్శనాలను ప్రపంచానికి అందించటానికి యత్నించింది. తెలుగు సాహిత్యం తన అస్తిత్వం ఆధునికంగా వికాసం చెందటానికి కావలసిన ద్రవ్యాలను, గుణాలను, దృక్పథాలను, సిద్ధాంతాలను మాత్రమే గ్రహించి తనలో భాగంగా సంపదించుకొన్నది. ప్రపంచంలో ఉన్నవన్నీ తెలుగులోకి రాలేదు, రాలేవు. వేటిని ఎలా తనలో విలీనం చేసుకోవాలో తెలుగు సాహిత్యం ఈ శతాబ్దంలో ప్రయోగాలు చేసి ఫలవంతమైంది. తెలుగులో లీనంకాలేనిది ఎంత అంతర్జాతీయమైనదైనా అల్లంత దూరంగానే నిలిచిపోయింది. విలీనదశ దేశీయతకు పోషక ద్రవ్యంగా మారినప్పుడే సాధ్యమౌతుంది. అందువలన పాశ్చాత్య ప్రభావం తెలుగుసాహిత్యంలోని దేశీయతను పోషించుకునే ప్రవృత్తి యొక్క పోషక శక్తియే కావాలి.

తెలుగు సాహిత్యం మీద పడిన ప్రభావాలు ముఖ్యంగా రెండు రకాలు. ఒకటి సాహిత్య సంబంధులు; మరొకటి సాహిత్యేతరాలు. ఇరవయ్యో శతాబ్దంలో ప్రపంచవ్యాప్తంగా సాహిత్యాన్ని సాహిత్య సాహిత్యేతర ఉద్యమాలు ప్రభావితం చేశాయి, చేస్తున్నాయి. ఆ గాలి తెలుగులో కూడా వీస్తోంది. ఈ రెండింటి వలన ప్రపంచ సాహిత్యాలలో లాగానే తెలుగులో కూడా వెలుగులోకి వచ్చిన ఫలితాంశాలు ప్రధానంగా రెండు. ఒకటి - పాశ్చాత్య సాహిత్య సిద్ధాంత ప్రభావం వలన దేశ భాషాసాహిత్యాలు తమ తమ దేశీయతా అస్తిత్వ వికాసాల కనువైన పోషక ద్రవ్యాల అవసరం ఎంతవరకు ఉందో ఆత్మపరిశీలనం చేసుకోవటం; అవసరమైనంత వరకే వాటిని అంతర్నిర్మాణానికి ఉపయో గించుకోవటం. రెండు - సామాజికాది శాస్త్ర సిద్ధాంతాల పరిజ్ఞానంతో ప్రపంచ పరిణామగతిలో దేశీయతను ఒక అంతర్భాగంగా పరిగణించి పరిశీలించటం. ఈ రెండింటిలో తత్వతః గోచరించే ఆధునికలక్షణం దేశీయతాన్వేషణ (Search for nativity). అయితే, మొదటి ఫలితాంశంలో దేశీయత సాహిత్యపరంగా సాహిత్యంలో ఎంతవరకు అస్తిత్వాన్ని నిలుపుకొన్నదనే అన్వేషణ గాఢంగా ఉంటుంది. రెండవ ఫలితాంశంలో సామాజిక పరంగా గానీ, వివిధ శాస్త్రాల పరంగా గానీ ప్రపంచంలో వ్యాప్తి చెంది ఉన్న సిద్ధాంతాలను అనుసరించి ఏర్పడిన శాస్త్రీయ విశ్లేషణకు అనుగుణంగా దేశీయతా గుణం సమాజంలోనూ, దాని కనుగుణంగా సాహిత్యంలోనూ ప్రతిఫలిస్తూ ఉన్నదా లేదా అని పరిశీలించటం ప్రధానంగా ఉంటుంది.

భారతీయతతో వైరుధ్యం లేకుండా దేశీయత యొక్క అస్తిత్వ వ్యక్తిత్వాలను పరిపోషించుకోవటం ప్రాచీనాంధ్ర సాహిత్య స్వభావమైతే, అంతర్జాతీయతను మన్నించే జాతీయ భావంలో దేశీయత యొక్క అస్తిత్వ వ్యక్తిత్వాలను పరిరక్షించుకోవటం ఆధునికాంధ్ర సాహిత్య స్వభావంగా స్పష్టమౌతుంది. ప్రాచీన సాహిత్యం లాగానే మౌఖిక సంప్రదాయానికి చెందిన సాహిత్య విమర్శ 'టూ ఇన్ వన్'; లిఖిత సంప్రదాయానికి చెందిన విమర్శ 'త్రీ ఇన్ వన్'. అంతర్జాతీయత ( International outlook ), జాతీయత లేదా భారతీయత ( Indianness ), దేశీయత ( Nativity ) అనే మూడు గుణాల్లో మొదటి రెండింటినీ పోషించటంలో దాదాపు 1935 నుండి 1980 దాకా రెండు బలవత్తరమైన ప్రవృత్తులుగా అభ్యుదయ, నవ్య సంప్రదాయోద్యమాలు తెలుగు లో ప్రవర్తిల్లాయి. ఆతరువాత ఆ రెండింటి కంటే మూడవ గుణం సాహిత్యంలో ముందంజవేస్తోంది. దానితో పాటు సాహిత్య విమర్శలో కూడా ఈ స్వభావం స్పష్టంగా తెలుస్తోంది. ఆరు రకాల విమర్శలూ ఈ మూడు ప్రవృత్తులనుండి క్రమంగా విస్తరిల్లినవే - మూడు పువ్వులూ, ఆరుకాయలూ అన్నట్లు.

దేశీయత కంటె భారతీయత సాహిత్యంలో ప్రధానమని భావించేవారు మొదటి రకం విమర్శకులు. వీరు సంస్కృత లక్షణ గ్రంథాలలో ఉన్న ప్రమాణాలను, సూత్రాలను మాత్రమే తెలుగు కవులు గ్రహించి సాహిత్య రచనలను చేసి ఉంటారనే విశ్వసిస్తారు. ఒక వేళ పాశ్చాత్య లక్షణాలేవైనా ఈ శతాబ్ది తెలుగు రచనలలో కనపడ్డా వాటికి కూడా తప్పకుండా సంస్కృతంలో మూలాధారాలుంటాయని అన్వేషిస్తారు. వీరి దృక్పథం మౌలికంగా తెలుగు సాహిత్య అస్తిత్వ వికాస ప్రవృత్తులకు విరుద్ధం కావటం చేత దీని వలన తెలుగు సాహిత్యానికి మేలు కంటే కీడే ఎక్కువ జరిగింది. ఆ కీడు రెండు రకాలు. ఒకటి ప్రాచీన తెలుగు సాహిత్యంలో చాలా భాగం సంస్కృత సాహిత్యానికి అనువాదమనీ, అనుసరణమనీ ఈ పంథా ప్రచారం చేసింది. రెండు - దేశి ప్రక్రియలకూ, ప్రమాణాలకూ, విమర్శ పద్ధతులకూ విలువ లేకుండా వెల వెల పోయేటట్లు చేసింది. ఈ విపరీత పరిణామాల వలన నన్నయాదుల రచనలలోని క్రొత్తదనాన్నీ, ఒరిజినాలిటీని వివేచించే చూపును కోల్పోయాం. పాల్కురికి వంటి దేశికవుల ప్రయోగాల బలాన్ని పరిపూర్ణంగా దర్శించే చేవను పోగొట్టుకున్నాం. ఈ విమర్శ మార్గానికి నేడు కాలం చెల్లింది. గతానికి అవశేషంలా వర్తమానంలో అక్కడక్కడా మినుకు మినుకు మంటోంది ఈ పద్ధతి.

ఆధునికాంధ్ర సాహిత్యం, సాహిత్య విమర్శ- పాశ్చాత్య సాహిత్య లక్షణానుగుణంగా పుట్టి పెరిగినవని రెండవ వర్గం వారు భావిస్తారు. అంతేకాదు. తెలుగు సాహిత్యాన్నంతటినీ అనుశీలించటానికి పాశ్చాత్య విమర్శ ప్రమాణాలూ, సూత్రాలూ చాలునని నమ్ముతారు. ప్రాచీన, ఆధునిక ఆంధ్ర సాహిత్య అస్తిత్వ వికాస క్రమాలను - పాశ్చాత్య సాహిత్య పరిణామాలనూ, ప్రస్థానాలనూ ప్రాతిపదికలుగా చేసుకొని నిర్ణయిస్తారు. వీరు సాహిత్యానుశీలనంలో పాటించే పద్ధతులూ, పారిభాషికపదాలూ, విమర్శ సూత్రాలూ అన్నీ పాశ్చాత్య సాహిత్యక్షేత్రాల నుండి దిగుమతి చేసుకొంటారు. దీనివలన తెలుగు సాహిత్యం, సాహిత్య విమర్శ అంతర్జాతీయ అవగాహనను పెంచుకొన్న వన్న కీర్తిని గడించాయి. కాని, ఈ అంతర్జాతీయత తెలుగు సాహిత్యానికున్న దేశీయతా అస్తిత్వాన్ని, వికాస వ్యక్తిత్వాన్ని, దాని అంతర్గతి సూత్రాన్నీ గుర్తించే మార్గాన్ని మరుగుకు తోసింది. తెలుగు రచయిత వేసిన ప్రతి ముందడుగుకూ పాశ్చాత్య సాహిత్యాలలో ఎక్కడో ఒక చోట ఒక ముందుబాట ఉంటుందనే విశ్వాసం, ఉండకుండా ఉండటానికి వీలు లేదనే ఒక గట్టి నమ్మకం సాహిత్య జగత్తులో ప్రబలిపోయింది. దీనివలన తెలుగు సాహిత్యవిమర్శకు అనుసరణ ప్రవృత్తి తప్ప స్వీయ అస్తిత్వ వికాస జీవితం ఉంటుందని, ఉండటానికి వీలుంటుందని దర్శించే అంతర్వీక్షణాన్ని ఈ పద్ధతి అందించలేకపోయింది.

పై రెండు రకాల విమర్శ పద్ధతులూ ఎంత మంచివైనా మొత్తంమీద తెలుగుసాహిత్యానికీ, విమర్శకూ అవసరమైన మంచిని చేకూర్చేవి కావనే అభిప్రాయం కొంతమంది విమర్శకులకు బలంగా ఏర్పడింది. వారే మధ్యేమార్గంలో నడిచే మూడవ పద్ధతి నెన్నుకొన్న విమర్శకులు. వీరు తమకు అందుబాటులో ఉన్న ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య ప్రమాణాలనూ, సూత్రాలనూ సందర్భోచితంగా ఎన్నుకొని తెలుగులో వెలువడిన ప్రయోగాలను విశ్లేషించి, వివేచిస్తారు. అందువల్లనే వీరిని సమన్వయవాదులని కూడా అంటారు. వీరి పద్ధతి ప్రాచుర్యాన్ని పొందినా, సహజంగా తెలుగు ప్రయోగాల కున్న దేశీయతా అస్తిత్వాన్ని వెలికి తీసుకొని వచ్చే అంతస్సూత్రాన్ని అనుశీలనంలో అందించలేకపోయింది. మిశ్రప్రయోగాలలోని సాహిత్య స్వభావాన్ని ఈ పద్ధతి వ్యాఖ్యానింపగలుగుతుంది కాని ఆ మిశ్రస్వభావాన్ని తనకు పోషకంగా వాడుకొన్న దేశీయతను నిరూపించలేదు.

శాస్త్ర విజ్ఞానం విస్తరిస్తున్న ఈ యుగంలో సాహిత్య తత్త్వాన్ని సాహిత్య శాస్త్రేతర దృష్టులతో కూడా వివేచించటానికి వివిధ ప్రయత్నాలు, ప్రయోగాలు సాగాయి. సాగుతున్నాయి. సామాజిక శాస్త్ర దృష్టితో సాహిత్యాన్ని విశ్లేషించే పద్ధతులలో మార్క్సిస్టు పద్ధతి ప్రసిద్ధం. మానసిక శాస్త్ర పద్ధతులలో ఫ్రాయిడ్, యూంగ్, ఆడ్లర్ సిద్ధాంతాల నాశ్రయించిన మార్గాలు ప్రచారం చెందాయి. ఇలాగే

తత్త్వశాస్త్రానికి చెందిన అనేక దృక్పథాలున్నాయి. శాస్త్రానికి దర్శన స్థాయి, ఆదర్శావళి (Ideolgy) స్థాయి, నియమ నిబంధనల స్థాయి, ఆచరణ స్థాయి అనేవి ఉంటాయి. సాహిత్య శాస్త్రంలో కూడా ఈ నాలుగు ఉన్నా సాహిత్యానికి సంబంధించే ఉంటాయి. మిగిలిన శాస్త్రాలలో ఆయా శాస్త్ర ప్రవృత్తులను బట్టి ఉంటాయి. సాహిత్య తత్త్వాన్ని సాహిత్యేతర శాస్త్ర దర్శనంతోకాని, దృక్పథంతో కాని, సిద్ధాంతాలతో కాని, ఆదర్శావళితో కాని, నియమనిబంధన లతో గాని, ప్రయోగపరీక్షలతో గానీ పరీక్షించి నిరూపించటం అసాధ్యం. సాహిత్యేతర శాస్త్ర దృక్పథాలు ఎంత గొప్పవైనా సాహిత్య తత్త్వ దర్శనం చేయలేవు. కాని, పాక్షిక పరిశీలనం సాధించగలవు. ఈ శతాబ్ది సాహిత్యవిమర్శలో సాహిత్యేతర శాస్త్ర పద్ధతులు ప్రబలటం చేత సాహిత్య పాక్షిక పరిశీలనలకు మాత్రమే పెద్ద పీట లభిస్తోంది. సాహిత్యేతర శాస్త్ర ప్రవృత్తులలో సామాజికమైన ఒక ఆదార్శావళికి కట్టుబడి సాహిత్య విమర్శ చేసే వారిని నిబద్ధ సాహిత్య విమర్శకులు అనవచ్చు కాని, మార్క్సిస్టు ఆదర్శావళికి కట్టుబడ్డ వాళ్ల విషయంలోనే 'నిబద్ధత ' అనే మాట ప్రసిద్ధంగా వినబడుతోంది.

'నిబద్ధత'ను గురించి వాదోపవాదాలున్నాయి. కాని, నిబద్ధత సాహిత్యాన్ని నిండుగా చూడలేదు. దండిగా విలువకట్టలేదు. శాస్త్రాలు సాహిత్యంలో ప్రతిఫలించగలవే కాని ప్రాణాలుగా నిలవలేవు. ధ్వని కావ్యానికి ఆత్మ అయినట్లు మార్క్సిజం కాలేదు, మనోవైజ్ఞానిక తత్వం కాలేదు, అద్వైత దర్శనం కాలేదు. ఆర్థిక శాస్త్రం అసలే కాలేదు. ఈ విమర్శ పద్ధతి సాహిత్యంలోని శాస్త్ర విశేషాలను విశ్లేషించటానికి ఉపయోగపడదు.

అయిదవ పద్ధతికి చెందిన స్వీయాభిరుచి విమర్శకులు అన్ని కాలాలలోనూ, అనేక రూపాలలో సాహితీ రంగంమీద ప్రత్యక్షమౌతూ ఉంటారు. అభిరుచులు ఎప్పుడూ ఉత్తమ ప్రమాణాలు కావు. అయితే, ఒక్కొకసారి పరిణత విమర్శకుని అభిరుచిగా కనపడే విమర్శ ప్రమాణం కొన్ని రచనల పట్ల సాపేక్ష ప్రమాణంగా కుదిరి సహృదయుల ఆమోదాన్ని సాధించవచ్చు. అప్పుడది ఆదరపాత్ర మౌతుంది. కాబట్టి అప్పుడప్పుడూ అభిరుచి విమర్శ సాహిత్య వివేచనలో సార్థకమైన పాత్ర నిర్వహించే అవకాశం ఉంది. దేశీయతకు దగ్గరగా ఉన్నప్పుడే అభిరుచి కూడా దేశీయులకు ఆమోదయోగ్యం కాగలుగుతుంది.

ఆరోమార్గం వారు అచ్చమైన దేశికవుల్లాంటి వారు. తెలుగుకవిత్వం పుట్టినప్పటి నుండి దేశికవు లెలా ఉన్నారో, తెలుగు విమర్శ వెలుగులోకి వచ్చినప్పటినుండి కూడా దేశీయతను దర్శించే విమర్శకులు అలా ఉంటూ వచ్చారు. అటు భాషాపరంగా చూస్తే తెలుగు ద్రావిడ భాషాజన్యమనే వాదానికి చెందినవారు ఇలాంటివారు. ఇటు సాహిత్యశాఖలో గమనిస్తే ప్రబంధం తెలుగువారి స్వంత ప్రక్రియ అనే వారూ, కవిత్రయ భారతం అనువాద కావ్యం కాదనే వారూ, బసవపురాణం తెలుగులో తొలి దేశిపురాణం అనేవారూ,వాగ్గేయకారుల రచనలనూ, జానపదకళా ప్రక్రియలనూ, ద్విపదకృతులనూ, కథాకావ్యాలనూ తెలుగుదేశీయతా ప్రవృత్తులకు ప్రతినిధులుగా గుర్తించేవారు.. ఇలా ఎందరో గోచరిస్తారు. వీరందరిని గురించి వివరించటం ఈ చిన్ని వ్యాసంలో కష్టం. ప్రబంధ విమర్శకులను గురించి ఒక మాట చెపుతాను.

16వ శతాబ్ది తెలుగు కావ్యాలను ప్రబంధాలని పిలిచింది, వాటికి లక్షణాలు తెలుగులో చెప్పటానికి మొదలుపెట్టింది, 20వ శతాబ్దిలోనే. ప్రబంధం తెలుగులో ఒక ప్రత్యేక ప్రక్రియగా గుర్తించటం వలన తెలుగు కవుల ప్రతిభా విశేషాలనేకాక, తెలుగు సాహిత్య అస్తిత్వ వికాసాలను గూడా విమర్శకులు గుర్తించినట్లైంది. ఆరురకాల విమర్శకులలో మొదటి అయిదు రకాల వారూ ప్రబంధం తెలుగు దేశీయతతో ముడిపడి ఉన్నదని అంగీకరించరు. ప్రభావాలు ఎన్ని ఉన్నా తెలుగు ప్రబంధాలు ప్రత్యేక ప్రయోగాలుగానే ప్రభవించాయి. తెలుగులో శ్రీనాథ యుగం రస కావ్య కథాకావ్య ప్రయోగాలకు ప్రతీతి. రసానుగుణ రీతి ప్రస్థానానికి ప్రసిద్ధి. ఆప్రక్రియలన్నీ తెలుగు దేశీయతను పుక్కిలించటం విశేషం. ఆ తరువాత ప్రబంధయుగం

అలంకార ప్రస్థానంలో నడిచింది. వక్రోక్తి జీవితం సాగించి ప్రయోగాలు నిర్వహించింది. తెలుగులో చారిత్రికంగా ప్రబంధయుగం ఆరంభంకావటానికి సాహిత్యపరమైన అంతర్గతి సూత్రం తర్కబద్ధంగా గోచరిస్తుంది. వక్రోక్తి జీవితంతో పాటు జాతి వార్తా చమత్కారాలు, శ్లేషవైచిత్రులు తెలుగు దనానికి అలంకారాలుగా అందగించాయి. ప్రబంధ ప్రయోగాలు సంస్కృత కావ్యానుసరణలు కావు. సంస్కృత కావ్య ప్రక్రియకు సమస్థాయిలో తెలుగు కావ్యం సగర్వంగా నిలువగలిగే దేశీయతా అస్తిత్వాన్ని ఒక అంతర్గతి సూత్రంలో ఆవిష్కరించిన ఆంధ్రకవుల ప్రతిభాకేతనాలు. ఇలాగే మన భావకవులు, నవ్యసంప్రదాయకవులు, కొందరు అభ్యుదయకవులు, కొందరు ఆధునిక కావ్యేతి హాసకవులు చేసిన ప్రయోగాలు కూడా దేశీయతా అస్తిత్వం కలవే. (వివరాలకు చూడండి : **'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు '** - జి.వి.సుబ్రహ్మణ్యం - తెలుగు అకాడమీ ప్రచురణ)

ఆరవ మార్గం అఖిలభారత స్థాయిలో దాదాపు అయిదారేళ్ళుగా బలాన్ని పుంజుకుంటున్నది. ఎన్ని విశేషాలు ఎన్ని విధాలుగా చెప్పినా ఒక సాహిత్య ప్రయోగం సహృదయులకు అందిస్తున్న దేశి అస్తిత్వాన్ని, వికాసదశను నిరూపించలేకపోతే సాహిత్య విమర్శ నిరుపయోగమని నేడు భావింపడుతున్నది. దేశీయతకు, విశ్వజనీనతకు వైరుధ్యం లేదు. దేశీయతలోని గాఢత్వం విశ్వజనీనతను అందుకోవటానికి బలమైన ఆలంబనం.

దేశీయతను భారతదేశానికి సంబంధించినంతవరకు భారతీయతగా గ్రహించవచ్చు నంటారు కొందరు. కాని, కొందరు దేశ భాషాసాహిత్యాలకు గల అస్తిత్వాలను ప్రత్యేకంగా గుర్తిస్తారు. వాటిలో కానవచ్చే వైవిధ్యమే మనదేశ వైశిష్ట్య మంటారు. అనేకత్వంలో ఏకత్వంలా దేశీయతలలో భారతీయత ప్రవహిస్తుందని దర్శిస్తారు. దానిని అన్వేషించటం తులనాత్మక అధ్యయనం సాధించే ఫలితాంశంగా పేర్కొంటారు. అంటే - దేశీయతను సాహిత్యంలో గుర్తించి నిరూపించటం, భారతీయతను తులనాత్మక అధ్యయనం ద్వారా అన్వేషించి వివేచించటం నేటి సాహిత్య విమర్శ కర్తవ్యం.

●●●

# ఆధునిక తెలుగు కవిత్వం – అభావపద్య ధోరణి

– డాక్టర్ వై. కామేశ్వరి

'భావంలేని కవిత్వం ఉంటుందా?' అంటూ భావ కవుల్ని పండితులు ఎగతాళి చేస్తున్న రోజుల్లోనే పాశ్చాత్య దేశాల్లో అభావపద్య రచన ముమ్మరంగా సాగడం, దాని ప్రభావం త్వరలోనే తెలుగు కవిత్వంపై ప్రసరించడం చాలా చిత్రమైన విషయం. ఇరవయ్యో శతాబ్దం ఆరంభంలోనే అభావపద్య రచనల సంకలనాలు వెలువడ్డాయి. 'నాన్సెన్స్ వెర్స్' (Nonsense Verse) గా ప్రసిద్ధి పొందిన ఈ ధోరణికి చెందిన రచయితల్లో జి.కె. ఛస్టర్‌టన్, లూయిస్ కారొల్, ఎడ్వర్డ్ లియర్ మొదలైన వారు ప్రసిద్ధులు.

అభావపద్యం అంటే భావం లేని పద్యమే. నిర్వచనం ఇంత తేలిగ్గా ఉన్నా అంత తేలిక కాదు. దాన్ని గుర్తించడమూ అంత తేలిక కాదు. అభావ పద్య లక్షణం తెలుసుకునేందుకు 'నేతి నేతి' మార్గం సరైనది. ఒక పద్యంలో భావం లేదని పాఠకులు భావించినా దాన్ని కూర్చిన రచయిత కౌశలం పద్యంలో కనిపించకపోయినా దాన్నిఅభావ పద్యం అనలేము. విఫలమైన పద్యం అనో లేక అసమర్థ రచన అనో అనవలసి ఉంటుంది. అలాగే ఒక పద్యంలో అసంబద్ధమైన కథగాని, కథనం గాని చోటు చేసుకున్నంత మాత్రాన దాన్ని కూడా అభావ పద్యం అనడానికి వీల్లేదు. అంతేకాదు. చమత్కారం, హాస్యం, అసంబద్ధమైన ప్రాసలు చోటు చేసుకున్న పద్యాలను కూడా అభావ పద్య పరిధిలో చేర్చడానికి వీలులేదు. అందుచేత వాటన్నింటిని కులాసా కవిత్వం కింద లెక్కవెయ్యవచ్చు గానీ అభావ పద్యం రచనలుగా పరిగణించలేము.

స్వచ్ఛమైన అభావ పద్యం మనందరం అంగీకరించే తర్కబద్ధతను, సమాజం అంగీకరించే నియమాలను తిరస్కరించి తనదైన ప్రపంచాన్ని సృష్టించుకుంటుంది. లోకజ్ఞానానికైనా (Common sense) ఒదగదు, విశేష అన్వయానికీ తావీయదు. ఏ పద్యానికి ఆ పద్యం స్వతంత్ర ప్రవర్తనతో ఉంటుంది. ఒక్కమాటలో చెప్పాలంటే ఆరోగ్యవంతమైన మనసుకు అభావ పద్యంలోకి జొరబడే అవకాశం లేదు.

అభావపద్యంలో ఎంతట దారుణమైనా వర్ణితమవచ్చు. కాని, పాఠకుని మనస్సు వ్యగ్రమూ అవదు, జుగుప్సా పొందదు. సానుభూతి కలగదు. రేఖా మాత్రమైన స్పందన కూడా కలిగించని ఈ రచనలో రచయితలు సాధారణంగా అనుసరించే విధానం ఒకటి ఉంది. సంఘటితమయ్యే విషయాన్ని పనిగట్టుకుని విశ్లథం చేస్తారు. నేర్పుతో చేసిన ఈ పని వల్ల పాఠకుడి మనసులో ఉన్న సానుభూతి స్పందన పద్యం నుండి వేరయిపోతుంది. పద్య సంఘటనకు పాఠకుని మనస్స్పందనకు గల సంవాదం చెదరిపోతుంది. విశేష అన్వయానికి తావీయని నిశ్చిత (Fixed and definite) అసంబద్ధపదజాలంతో అభావ పద్యం నిర్మిత మవుతుంది. మరో విధంగా చెప్పాలంటే భావ బోధ కోసం వెదకే పాఠకుడికి, రచయితకి మధ్య జరిగే పోరాటం అభావ పద్యం.

స్వచ్ఛమైన అభావపద్యాన్ని రచించాలంటే రచయితకు ఎంతో నేర్పు అవసరం. వ్యంగ్యాన్ని చమత్కారాన్ని ఉపయోగించాలనో, హాస్యపూరిత వ్యాఖ్యను జోడించాలనో రచయిత ఉబలాట పడటానికి వీలులేదు. అభావపద్య రచయిత తన భావనాలోకం పద్యంలోకి జొరబడకుండా రచనా వేళలో అత్యంత జాగరూకత వహించాలి. ఇంతటి క్లిష్టత ఉండ బట్టే స్వచ్ఛమైన అభావ పద్య రచనల సంఖ్య చాలా కొద్ది. చస్టర్ టన్ రచించిన ఒక పద్యాన్ని చూస్తే అచ్చమైన అభావ పద్యరూపం అవగతమవుతుంది.

### A SONG OF WILD FRUIT

THE PINEAPPLE KNOWS NOTHING
OF THE APPLE OR THE PINE.
THE GRAPE FRUIT IS A FRUIT, BUT NOT
THE GOD'S FRUIT OF THE VINE;

AND GRAPE-NUTS ARE NOT EVEN NUTS
FOR THE HYGIENIC HUT
WHERE THE NUT-CRANK WITH THE NUT- CRACKERS
IS CRACKING HIS OWN NUT
FAR IN THE LAND OF NONSENSE NAMES
THESE ANTIC FRUITS WERE BORN,
WHERE MEN GATHER GRAPES OF THISTLES
AND THE FIGS GROW ON THE THRON,
AND ANANIAS NAMED THE FRUIT
THAT FRENCHMEN CALL ANANAS;
AND ALL THE PLANTAINS ARE A PLANT.
AND ..... NO! WE HAVE BANANAS!

డాడాయిస్టు రచనలు, సర్రియలిస్టు రచనలు ఇతర కులాసాకవిత్వ ధోరణులు ఇవన్నీ కూడా అభావపద్య రచనలుగా చెలామణి అవడం పరిపాటి. కాని, నిశితంగా పరిశీలించినప్పుడు పాతవన్నీ ధ్వంసం చేయడం ఫ్యూచరిస్టుల సిద్ధాంతమైతే, సమస్త విలువల్ని తర్కాల్ని ధ్వంసం చేసే కార్యక్రమం డాడాయిస్టులది. వ్యక్తా వ్యక్తంలో ఈత కొట్టి అవ్యక్త మానసాన్ని సర్వ విధాల ఉపయోగించుకోవడం అధివాస్తవికుల లక్ష్యం. అధివాస్తవిక ప్రతీకల ఉపయోగం కూడ ఈ తరహా రచనల్లో అధికం. కాని, అభావపద్య ధోరణికి మాత్రం ఎలాంటి కార్యక్రమం సిద్ధాంతం, లక్ష్యం లేనే లేవు. ఇదే ఆ భావధోరణిని ఇతర ధోరణుల నుండి వేరు చేస్తుంది.

ఈ భూమికను దృష్టిలో ఉంచుకొని తెలుగు కవిత్వరంగాన్ని పరిశీలిస్తే ఎన్నో ఆసక్తికరమైన అంశాలు వెల్లడౌతున్నాయి. "1940 ప్రాంతమున శ్రీ శ్రీ, నారాయణ బాబు, పఠాభి ప్రభృతులు అతి నవ్యకవితా ధోరణులకు పునాదులు వేసిరి. శిష్టా అతి నవ్యకవులలో ఒకడై నను వస్తువులో ఇతడు పై వారివలె ప్రయోగ వైచిత్ర్యము చూపలేదు. శ్రీ శ్రీ ప్రభృతుల పట్ల గాక పాశ్చాత్య కవులలో అతినవ్యులు జరిపిన ప్రయోగములన్నింటిని తెలుగున దిగుమతి చేయుటకు ప్రయత్నించిరి. ఇరువదవ శతాబ్దిలో ఫ్రెంచి కవితారంగమునను, ఇంగ్లీషు కవిత్వమునను వెలువడిన విచిత్ర కవితా ధోరణులను వీరాకళించుకొన్నారు. ఇమేజిజము, సర్రియలిజము, రియలిజము, డాడాయిజము మున్నగు కవితోద్యమముల స్వరూపములు పరిశీలించి వారి జాడలలో తమ కవితా రథమును పరుగెత్తించినారు. వస్తువులోనే కాక భాషలో, ఛందస్సులో, భావవైఖరిలో వీరు నవ్య ప్రయోగములు చేయుటకు ప్రయత్నించినారు. ఈ ధోరణులలో ఏదియు తెలుగు పొలమున పుట్టినది కాదు" అని ఆచార్య సి. నారాయణరెడ్డి గారు చేసిన పరిశీలనలో అభావపద్య ధోరణిని కూడా చేర్చవలసి ఉంది. ఆంగ్ల సాహిత్యంలో ఇతరేతర ధోరణులు అభావ పద్యాలుగా చెలామణి అయితే తెలుగు నేల మీద విచిత్రంగా అది తిరగబడి అభావపద్య ధోరణి కూడా ఇతరేతర ధోరణులుగా చెలామణి అయింది.

భావకవిత్వంపై తిరుగుబాటుగా పఠాభి పలికించిన ఫిడేలు రాగాల డజన్ అభావపద్య ధోరణికి చెందినది కాదు. పద్యాల నడుములు విరగదన్నాలనే ఆశయం గల ఈ రచనలో విధానం మాత్రం అ భావ పద్య ధోరణి వల్ల ప్రభావితమైందని చెప్పక తప్పదు. భావ స్ఫురణ కలగకుండా అభావ పద్యరచయితలు విశ్లథం చేసే ప్రయత్నాన్ని ఎలా చేశారో అలాగే లయ స్ఫురించకుండ ప్రయత్నపూర్వకంగా నడకను విడిచి రచించడం మనం ఈ సంపుటిలోని ప్రతి పద్యంలో చూడగలం. సప్రయత్నక విశ్లథ గుణం అభావ పద్య ధోరణే అయితే ఏదో ఒక విచిత్ర భావమైనా ఖండికల్లో స్ఫురిస్తుండటం వల్ల దీన్ని అభావపద్యంగా చెప్పలేము. కాని, ఆ ప్రభావాన్ని మాత్రం గుర్తించవలసి ఉంటుంది.

ఈ శతాబ్దం నాది అని ఘంటాపథంగా చెప్పుకొన్న శ్రీ శ్రీయే స్వచ్ఛమైన అభావపద్య రచన చేసిన ఘనతను కూడా దక్కించుకొన్నాడు. 'ఖడ్గ సృష్టి' కవితా సంకలనంలోని De-compositions కచ్చితమైన, స్వచ్ఛమైన అభావ పద్యాలే.

1

తురాయి కంటె, ఆ
కు రాయికంటె, కీ
చు రాయికంటె - హిమాం
శు రాయి గొప్పవాడు.

2

భుజంగ ప్రయాతం, బుభుక్షాభిఘాతం
చలంగారి పాపం, ప్రజామిత్ర కోపం
జరుక్‌నాథ Zam Bak మణిశాస్త్రి Humbu (K)
లతాంతాగ్ర రాగంబు లంబాడి లంగా....

3

కాకి కేమి తెలుసు Psycho analysis ?
ఆటవెలది ద్విపద కత్తగారు
5,3,2, ఆముక్తమాల్యద
విశ్వదాభిరామ వినురవేమ
(పాఠాంతరం : దీని భావమేమి తిరుమలేశ)

4

హాంగ్ కాంగ్‌లో
కింగ్ కాంగ్‌తో
ఒరాంగ్ టాంగ్ ఆడిన
పింగ్ పాంగ్ లాగు !!!
(సశేషం, బహుశా)

ఈ పద్యాల్లో ప్రయత్న పూర్వకమైన, నేర్పరి తనంతో చేసిన భావ నిఘటన కనిపిస్తుంది. ఈ రచనను అధివాస్తవిక రచనగా పరిగణించడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. ఎందుచేతనంటే అభావపద్యానికీ, అధివాస్తవిక రచనకీ మధ్య అంతరం చాలా సున్నితమైనది. అత్యంత వ్యక్తిగతమైన అనుభవాల ముద్రతో వెలువడే అధివాస్తవిక ప్రతీకల వల్ల ఆ రచన అబోధత పొంది అన్వయానికి అందదు. కానీ, ఎప్పుడైతే ఆ ప్రతీకల పజిల్ విడుతుందో అప్పుడా రచనను కలిపిఉంచిన అంతస్సూత్రం తెలిసి కవిత సుబోధమౌతుంది. అదీగాక అధివాస్తవిక మైన స్థితిలో వెలువడిన రచనలో ఒక ధార కనిపిస్తుంది. పరస్పర విరుద్ధ పదజాలంతో వెలువడినప్పటికీ Spontainity మనకు రచనలో స్పష్టంగా తెలుస్తూనే ఉంటుంది.

అభావ పద్య రచన ఇలాంటిది కాదు. రచయిత పనిగట్టుకొని ఏదీ స్ఫురించకుండా రచనలో జాగ్రత్తపడుతూ ఉంటాడు. రచయిత చేసే ఈ ప్రయత్నం రచనలో కనిపిస్తూనే ఉంటుంది. పాఠకుడు తన భావనా సామర్థ్యంతో ఏదో ఒక ప్రతీకగా పద్యంలోని పదాలను భావించినా ఎలాంటి అన్వయానికి అందదు ఆ పద్యం. ఎంచేతనంటే ఆ రచననంతటినీ కలిపి ఉంచే అంతస్సూత్రమనేదే ఉండదు. అధివాస్తవిక కవితలు అలాకాక ప్రతీకల ఆంతర్యం బోధపడితే పద్యంలో ఇంకా అన్వయానికి అందని భాగాలు మిగిలి ఉన్నా సుమారుగానైనా విషయం అవగతం అవుతుంది. ఈ కారణాల వల్లనే పైన పేర్కొన్న రచన అభావ పద్యమే కాని అధివాస్తవిక రచన కాదు అని నిర్ణయించవచ్చు.

విమర్శకుడుగా, నవలా రచయితగా, నాటక రచయితగా ప్రఖ్యాతి నార్జించిన కీర్తిశేషులు శ్రీ బుచ్చి బాబుగారు కవిగా చాలా కొద్దిమందికే పరిచితులు. 1967 లో 'అజ్ఞానం' అనే పేరిట వెలువడ్డ కవితా సంపుటం ఆయన్ని కవితాలోకంలో ప్రత్యేకస్థానంలో నిలుపుతోంది. ఈ సంకలనంలోని రచనలను పరిశీలిస్తే ఆయన అభావ పద్య ధోరణి వల్ల ప్రభావితం అయినట్లు తెలుస్తుంది. ముఖ్యంగా 'అజ్ఞానం' 'మూలుగుమాల' అనే రచనలు ఆయన కవితా వ్యక్తిత్వాన్ని సామర్థ్యాన్ని తెలియజేస్తున్నాయి- బుచ్చిబాబు విశ్వనాథలాగా Conscious artist. తా నేమి చేస్తున్నాడో తెలిసే చేస్తుంటాడు. నేటి సమాజాన్ని అందులో కృత్రిమత్వాన్ని కవితా రంగంలో పేర్కొంటున్న పాండిత్య ప్రకర్ష, ఆర్ద్రతారాహిత్యాలను తీవ్ర విమర్శల పాలు చేస్తూ ఆయన రాసిన ఈ ఖండిక ఈ అంశాన్ని స్పష్టం చేస్తోంది.

" అజ్ఞానం అనంతం
అదేనా వచన కావ్యకుతంత్రం
----
జ్ఞాన చక్రాలకి 'బ్రేక్
అజ్ఞాన పత్రానికి లక్కసీల్
బికాస్, అజ్ఞానం అనంతం
----
అజ్ఞానం అల్లిన వ్యాకరణం,
వర్ణ క్రమం, గుణింతం
అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ

రెండు రెళ్ళు నాలుగూ
నిప్పు కాలుస్తుంది
(తత్వమసి)
నీరు తడుపుతుంది
(ఓం)
చెవి వింటుంది కన్ను చూస్తుంది
ఒళ్ళు మండుతుంది
---
వేదాంత శిథిలాలయంలోకి
పోదాం పద
ఆత్మకి అనంత జాగారం
---
ఎవరం ఎవరం, మనమెవరం?
కూడూ, గుడ్డా, నెత్తిన కొంపా
పిల్లా మేకా, శనివారం సంబరం
---
తరతరాల సంతానం, సంతాపం
ప్రపంచ తత్వమసిత్వం
అడక్క పెట్టింది నీలో మిగిలిన జ్ఞానం
అందర్నీ అడుక్కు తిన్నది విజ్ఞానం
అంతిమ అజ్ఞానం,
మళ్ళా అజ్ఞానం అనంతం,
అదే నా వచన కావ్యకుతంత్రం "

బుచ్చిబాబుది మాత్రమే అయిన, ప్రత్యేక శైలిని, ఆయన (Conscious effort), శిల్ప సామర్థ్యాలను ఈ ఉదాహృత భాగం తెలియజేస్తుంది. 'అవక తవకల సమన్వయం'గా ఉంటున్న ఆధునిక కవిత్వాన్ని విమర్శించడం ఈ పద్యంలోని వస్తువు. (Absord Poetry) అనో, అధివాస్తవిక కవిత్వంఅనో అనిపించే ఈ పద్యంలో వస్తువును కనుగొనాలంటే అభావ పద్య శిల్పం తెలిసి ఉండాలి. అవకతవక విధానాన్ని అవక తవక శిల్పంతోనే ఖండించాలని బుచ్చిబాబు భావించి ఉంటారనిపిస్తుంది. శీర్షికను దృష్టిలో ఉంచుకుని అజ్ఞానం గురించి కవితలో వెలువడ్డ అభిప్రాయాలను, విజ్ఞానం, జ్ఞానంలపై కవి విసిరిన విసుర్లను క్రమంగా అధ్యయనం చేస్తే తప్ప కవిత బోధపడదు. ఈ కవితలో అభావ పద్య ధోరణి కవితా నిర్మాణంలో స్పష్టంగా కనిపిస్తుంది. వస్తువు గాంభీర్యాన్ని సంతరించుకుని భావధార ఏర్పడే సమయంలో కవి ప్రయత్న పూర్వకంగా చెడగొట్టే విధంగా అసంబద్ధ పదజాలంతో భావ పాదాలను నిర్మించడం గమనార్హం.

'అవాకులు చవాకులు అజ్ఞానం
నా వచనకావ్య కుతంత్రం
అయ్యాక 'అయ్యో' అని ఏడవకండి
అపదం లెండి- అవధి లేనిదే అజ్ఞానం'

గంభీర విషయాల మధ్య అసంబద్ధ పాదరచన మనసును వేరే దోవ వైపు మళ్ళిస్తుంది. ఈ ఖండికల్లో ఇదే శిల్పం మళ్ళీ మళ్ళీ ఆవృత్తం అవుతోంది. విసిగి వేసారిన పాఠకుడు అలసి ఖండికను అవతల పడవేసే ప్రమాదం ఉంది- అందుకే 'అజ్ఞానం అనంతం- నా వచన కావ్యకుతంత్రం" అనే పాదాలను మళ్ళీ పునరుక్తం చేసి ఇందులో ఏదో ఉంది సుమా అనే కుతూహలాన్ని మళ్ళీ మళ్ళీ కలగచేస్తాడు. అవి కులాసా కవిత్వ లక్షణాలను, అధివాస్తవిక లక్షణాలను కూడా కుప్పపోసి ఏవేవో అసంబద్ధ ప్రాసలు, అర్థరహిత పద చిత్రాలు గుది గ  ్చడు. శిల్పం మాత్రం అభావపద్య ధోరణిదే.

కవితకు జీవనాడి వంటి పాదాలను ఓపికగా విశ్లేషించి, అవి అందించిన ఆ క్లూల దారిలో పయనించినపుడే ఈ కవిత అర్థం అవుతుంది. ఆనందాన్ని కలిగిస్తుంది. ఈ కవితలో శిల్పంలో, భావంలో ఉన్న తాత్వికాంశ క్లిష్టమైనదే అవటం వల్ల అది భావబోధకు అంతరాయం కలిగిస్తోంది. విప్లవాత్మక కవితా రచనలలోని పులుముడు ధోరణిని రచయిత ఖండిస్తున్నాడు. వివిధ శాస్త్రాల, శాస్త్రేతర అంశాల జ్ఞానం మానవునిలోని మానవత్వాన్ని సమాజ స్పందనను మరుగు పరచి కవిత్వంలోని ఆర్ద్రతా గుణాన్ని నశింప చేస్తోందని, అలాంటి విజ్ఞానమే అజ్ఞానమనీ చెప్పే క్లిష్టమైన

(తరువాయి 140వ పుటలో)

# ప్రపంచపదులు – తత్వ పరిశీలనం

– డాక్టర్ బి. జయరాములు

'ప్ర'పంచపదులు అన్న పేరులోనే రూప, వస్తుభావాలలోని నవ్యతలు గోచరిస్తున్నాయి. వీటిని గురించి ఆచార్య ఎన్. గోపి గారు 'పంచపదుల్లో ప్రపంచం' అనే శీర్షికతో విపులంగా చర్చించారు. "రుబాయీ ఛందోరూపానికి తెలుగులో ఐదోపంక్తిని జోడించి 'ప్ర'పంచపదిగా రూపొందించారు సినారె " అంటూ రూపాన్ని గురించి విపులంగా విశ్లేషించారు. ఛందస్సులో గల వైవిధ్యాలను, సినారె ప్రదర్శించిన విశిష్టగతి ప్రయోగాలను ఎత్తి చూపారు. నిర్మాణ శిల్పంలో అంత్యప్రాసలు, అంతః ప్రాసలు, పద విరామాలు మొ॥ వాటి స్థానం నిరూపించారు. ఈ రూపాన్ని గురించే మరోమాట.

108 పంచపదులున్న ఈ గ్రంథం పద్యసంఖ్యను బట్టి ఒక శతకం లాగా భాసిస్తుంది. శతకాలలోని పద్యాలు ముక్తకాలలా ఉంటాయి. ఆ ముక్తక లక్షణం కూడా వీటిల్లో ఉంది. మకుట నియమం శతకంలో మరో లక్షణం. వీటిలో మకుటమని చెప్పదగిన ఒకే వాక్యం లేదా పదం (సుమతీ, విశ్వదాభిరామ వినురవేమ, దాశరథీ కరుణాపయోనిధీ) లేదుకాని మూడో వాక్యం ఈ పనిని నిర్వహిస్తున్నట్లుగా ఉంది. శతకాల్లోని మకుటం సంబోధనలాగా ఉండి, అన్ని పద్యాల్లో ఒకే వాక్యంగా లేదా పదంగా ఉంటే దీనిలో మాత్రం అది భిన్నంగా వుంది. పై రెండు వాక్యాలకు, కింది రెండు వాక్యాలకు అనుసంధానంగా ఉంటుంది. ఈ వాక్యం అనేక పనులను చేస్తూ ఉంటుంది. ప్రకృతి గుణాలకు మానవుని గుణాలకు అనుసంధానం కలిగిస్తుంది.

'పక్షి రెక్కలకు మబ్బులు గొడుగులు పట్టినప్పుడే సార్థక్యం
పారేయేటికి పైరు గొంతులో పాడినప్పుడే సార్థక్యం
ఏ లక్ష్యానికి కట్టుపడక బతుకీడ్చుకుపోతే ఏం లాభం
నేర్చిన చదువుకు జాతి జాతకం మార్చినప్పుడే సార్థక్యం
కట్టుబానిసకు సంకెళ్ళు మట్టిగరిచినప్పుడే సార్థక్యం' .......... (28)

ఇంకోచోట కవి భావానికి భాష్యం చెబుతుంది.

'నిండుసభలో నీతినొలిచే దండి మగలున్నారు నేడూ
మర్మమెరిగీ బొంకులాడే ధర్మసుతులున్నారు నేడూ
నాటి భారత గాథ లేదా నేటికీ మనకళ్ళముందే
పాప సంతతి కొమ్ము కాచే ప్రభువులూ ఉన్నారు నేడూ
పరమశిష్యుల ప్రతిభ నరికే గురువులూ ఉన్నారు నేడూ " .......... (3)

మూర్త, అమూర్త విషయాలకు మధ్య నిలిచి భావ సమన్వయం చేస్తుంది. (చూ.2) ఇలా అనేక పనులు చేస్తూ ఉండే మూడవపాదం శతకంలో నిర్జీవ సంబోధనలా నిలబడే మకుటంలా గాక భావాలకు, ప్రకృతికి మానవులకు అనుసంధానం చేస్తూ మకుటాయ మానంగా భాసిస్తూంది. ఆధునికతలో సంప్రదాయాన్ని మేళవించిన అపురూప ప్రయోగం ఇది!

వస్తు, భావాలను బట్టి కూడా ఇది శతకం (లాంటి ప్రక్రియ) లాగా కనబడుతుంది. భర్తృహరి సజ్జనపద్ధతి, దుర్జనపద్ధతి మొ॥వి, సుమతి, వేమనపద్యాల్లోని సామాజిక పరమైన భావధార, తదితరశతకాల్లోని నీతి బోధనపద్ధతులు స్పష్టా స్పష్టంగా 'ప్ర'పంచపదులలో కనిపిస్తాయి. ఇలా పరిశీలిస్తే ఈ గ్రంథం ఒక శతకంలాగా కనిపిస్తుంది. కాని, నిజాని

కిది శతకం కాదు. గతానుభవాన్ని దృష్టిలో పెట్టుకొని, వర్తమానాన్ని విశ్లేషిస్తూ భవిష్యత్తుకు బాటలు వేసే నవ్యపథం. మత్రాఛందస్సులో మంచి మనస్సుతో చేసిన మరో ప్రయోగం. మానవునకుపకరించే మహాయాగం. దీనిలోని తత్త్వాన్ని మనం (స్థూలంగా) పరిశీలిద్దాం.

తత్వం అంటే గుణం అని అర్థం. ఆ తత్వం అనేక రకాలుగా ఉంటుంది. ఆధ్యాత్మికతత్వం, సృష్టితత్వం, ప్రకృతి తత్వం , నీతి తత్వం, విలువల తత్వం, మానవోద్ధరణ తత్వం, ఇలా తత్త్వాన్ని అనేక రకాలుగా గడించడానికి వీలుంది. 'ప్రపంచపదుల్లో ఈ తత్వ వివేచనం మొదటి పద్యంతో ప్రారంభమై చివరి దాకా సాగుతుంది.

"నింగి లోతును చూడగోరితె నీటి చుక్కను కలుసుకో
రత్నతత్వం చూడగోరితె రాతిముక్కను కలుసుకో
అణువు నడిగితె తెలియదా బ్రహ్మాండమంటే యేమిటో
మౌన శిల్పం చూడగోరితె మంచు గడ్డను కలుసుకో
మనిషి మూలం చూడగోరితె మట్టి బెడ్డను కలుసుకో" ........ (1)

ఆకాశం లోతు నీళ్ళలో, రత్నతత్వం రాతిముక్కలో, మౌనశిల్పం మంచుగడ్డలో , మనిషి మూలం మట్టిలో, బ్రహ్మాండాన్ని అణువులో తెలుసుకోవచ్చునని భావం. నీళ్ళలో ఆకాశం కనబడడం, రాళ్ళల్లో రత్నం ఉండడం (రత్నం కూడా ఒక రాయే కదా!)' మంచుగడ్డల్లో మౌనం ఉండడం, మనిషి పుట్టుకకు అంటే దేహ నిర్మాణానికి పంచభూతాలే కారణం కావడం, వాటిలో మొదటిది మట్టికావడం, (పృథి వ్యాపస్తేజో వాయురాకాశాత్....) బ్రహ్మాండానికి మూలం అణువుకావడం వీటిని తిప్పి చూస్తే అనగా ఆత్మపరిశీలనం చేసుకుంటే తత్వం బోధపడుతుంది. (అణోరణీయాన్ మహతో మహీయాన్). దృష్టిని బట్టి దృక్పథం, దృక్పథాన్ని బట్టి పరిశీలనం, పరిశీలనను బట్టి తత్వవివేచనం తద్వారా తత్త్వ విదత్వం కలుగుతుంది. ఇక్కడ ఆత్మపరిశీలనం గాక ఆత్మదర్శనం అయితే ఆనందం వెల్లివిరుస్తుంది.

" జగతికంటికి ఊహకందని గగన మొక స్వప్నం
విత్తుకంటికి వేయి నిలువుల వృక్ష మొక స్వప్నం
స్వప్న వాసనలేని శాశ్వత సత్యముంటుందా
చినుకు కంటికి నురగలెత్తే సింధు వొక స్వప్నం
కలం కంటికి నోటి కెక్కే గ్రంథ మొక స్వప్నం" .......... (10)

శుద్ధమైన శాశ్వత సత్యం ఉండదనీ, అది స్వప్న వాసనతో మిళితమై ఉంటుందని భావం. కంటికి ఆకాశం ( ఆకాశం గగనం శూన్యం), విత్తుకు వృక్షం (విత్తనంబున మహావృక్షంబు నిమిడించి చిత్రంబుగ గారడి చేయువాడ), చినుకుకు సంద్రం, కలానికి గ్రంథం స్వప్నాలని భావం. ఇక్కడ సృష్టికి, సృష్టికర్తకు మధ్య స్వప్నం నిలచింది. ఆ స్వప్నాన్ని కల్పనగా భావించాలి. కన్ను వల్ల ఆకాశం, విత్తు వల్ల వృక్షం, చినుకువల్ల సంద్రం, కలం వల్ల గ్రంథం సృష్టింపబడతాయి. దీనిలో సృష్టితత్వం వివరిస్తూ కల్పనాశక్తిని ధ్వన్యాత్మకంగా మెచ్చుకొంటున్నాడు కవి.

"చేదు సత్యం మింగగలిగితె జీవితం వైద్యాలయం
మనసు పుటలను చదవగలిగితె అనుభవం విద్యాలయం
ఎవ్వరో నేర్పాలనే భ్రమ ఎందుకంట వృథా వృథా -
అడుగు తప్పక ఆడగలిగితె అవనియే నృత్యాలయం

కనులు తిప్పక చూడగలిగితె అణువణువు తత్వాలయం"  .......... (12)

సత్యం తెలుసుకోవడం, మనస్తత్వం గ్రహించడం, సత్క్రమవర్తన, ఋజు దృష్టి ఉంటే మానవుడు జీవితానుభవం ద్వారా ఈ భూమిపైనే ( ఈజన్మలోనే) తత్వజ్ఞానాన్ని పొందగలుగుతాడని భావం. మోక్షం కోసం ఆలయాలను దర్శించడం కంటే ఆత్మదర్శనం అవసరమని అంతరార్థం.

"తవ్వగలిగితె గుండెపొరలను రవ్వలెన్నో ఎదుటపడవా
ఇవ్వగలిగితె నాదలయలను మువ్వలెన్నో వెంటపడవా?
చెక్కు చెదరని లక్ష్యముంటే చేతకానిది మనిషి కేదీ
చూడగలిగితె పట్టపగలే చుక్కలెన్నోకంటపడవా
కదపగలిగితె పెనుయెడారిని గంగలెన్నో బయటపడవా "  ......... (13)

చిత్తశుద్ధి ఉంటే లక్ష్యసిద్ధి అవుతుందని, అంతర్ముఖదర్శనం (ఆత్మ పరిశీలనం) ఆ సిద్ధికి దోహదం చేస్తుందని ఇందలి భావం. 'చిత్త శుద్ధి లేని శివపూజలేలయా' ! అని ప్రశ్నించిన వేమన ఇక్కడ మనకు ప్రత్యక్షమౌతాడు.

" ఏ రాపిడి లేకుండా వజ్రం ఎలా మెరుస్తుంది?
ఏ అలజడి లేకుండా సంద్రం ఎలా నిలుస్తుంది?
నడిపించే చైతన్యం లేనిదే నడవదు ఈ సృష్టి -
ఏ ప్రేరణ లేకుండా నాదం ఎలా పలుకుతుంది?
ఏ స్పందన లేకుండా హృదయం ఎలా బతుకుతుంది ?  ......... (33)

సృష్టిలో కార్యాలన్నింటికీ ఒక కారణం ఉందనీ, ఆ కారణమే చైతన్యమనీ కవి భావం. ఆ చైతన్యాన్నే మనం భగవంతుడు అంటాం. అతన్ని తెలుసుకొమ్మని అంతరార్థం.

పరతత్వ దర్శనానికి మౌనంతో ధ్యానం చేస్తారు. ఆమౌనం యొక్క విలువను సి.నా.రె. 'మనసుకు వెలుగును చూపే నయనం మౌనం' (45) అన్నారు. అలాగే ప్రతి దానికీ రెండంచులు ఉంటాయనీ, పూలు - ముళ్ళు, వేకువ-చీకటి, సుఖం - దుఃఖం, జీవం - మరణం, వీటిలో రెండో పార్శ్వం చూడక నిండు నిజం తెలియదంటారు. (59) ఈ రెండూ తెలిస్తే తర్వాత ద్వంద్వాతీతమైన శక్తిని దర్శించవచ్చని ధ్వని.

'నేడు సుఖపడుతున్నానని మురవకు రేపటి ఫలితం గురించి ఆలోచించు. ఇహసుఖాలు శాశ్వతం కావు. అవి పర లోకంలో పీడిస్తాయి. తస్మాత్‌జాగ్రత్త అంటున్నారు (65) కవి. ఇక్కడ ఇహపర వివేచనం ద్వారా తత్వాన్ని బోధిస్తున్నారు.

దేశాటనం, అధ్యయనం, నీతి కోవిదత్వం, ప్రసంగం మొదలైన వాటి వల్ల తుది లక్ష్యం నెరవేరదు. తీవ్రమైన 'తపన' ఉంటేనే లక్ష్యం నెరవేరుతుంది. (104). ప్రతి వానికి తపన ఉండాలి. ఈ తపనే తపస్సు. మోక్షం అనే లక్ష్యం నెరవేరడానికి తపస్సే ముఖ్యమని బోధిస్తున్నారు కవి. 106వపద్యంలో కనబడేది ఉందని, కనపడనిది లేదని అనడం అవివేకం అంటారు. చర్మ చక్షువే కాదు మనో నేత్రమూ ఉంది. లోపలి పొరల్లో కెళితే ఆత్మదర్శనమౌతుందని ఉద్బోధిస్తారు.

ఇలా సృష్టితత్వం భగవత్తత్వాన్ని చెప్పడమే కాకుండా ప్రకృతి తత్వాన్ని ప్రపంచించి తద్వారా మానవుని

ప్రవర్తనను దిద్దుకోమంటారు సినారె. కాలచక్రభ్రమణంలో జరిగిపోయే కార్యాలు ఆగవనీ, మనకిష్టంగాకున్నా ప్రకృతి మార్పులు తప్పవనీ (9) ప్రకృతి తత్వాన్ని వివరించారు. ప్రకృతి పశుపక్ష్యాదులకు, మానవులకు ఉపకరించే లక్ష్యంతో ఉంది. అలాగే మానవుడు చదువుకొని జాతికి మేలు చేయడం, బానిసల బానిసత్వం తొలగించడం చేయాలి (28). ప్రకృతికి లక్ష్యం ఉన్నట్లు మానవునికీ ఉండాలి. ప్రకృతికి కలత, నలత, కొరత, కోతలు లేవు. అవి మానవునకెందుకు? (75). పాదానికి పరుగు, వేదానికి స్వరం, హృదయానికి క్షతి, మరణానికి చితి - వివరించాల్సిన అవసరం లేదు (79). ఇవి మనకళ్ళముందు కనిపించే ప్రకృతి తత్వాలు, సత్యాలు. అలసట లేకుండా ముందడుగు వేయమనీ, కర్మ వీరునివి కమ్మనీ బోధ. మానవునిలో ఉండే తపన ప్రకృతిలో, ప్రకృతిలో ఉండే తపన మానవునిలో ఉందనీ, సృష్టి ఎప్పుడూ ఒకలాగే ఉండదనీ, చైతన్యం, మార్పు దాని సహజలక్షణమనీ (88) వర్ణించారు.

సినారె కవిత్వానికి జీవధాతువు మానవుడు. అతని చుట్టూ ఉన్నవి. ప్రకృతి, సమాజం ఈ రెంటిపై ఆధారపడి అతని మనస్తత్వం ఉంటుంది. పాంచభౌతిక శరీరం కాబట్టి ప్రకృతి ప్రభావం, మనస్సు, మేథా ఉన్న జీవి కాబట్టి సమాజ ప్రభావం అతనిపై ఉంటుంది. అలాంటి మానవుని యొక్క మనస్తత్వం అతని ప్రవర్తనారీతులు, మంచి చెడులు, అతని సంకల్పం, లక్ష్యం మొదలైన విషయాలనెన్నింటినో ఆధారంగా గ్రహించి 'ప్రపంచపదుల్లో చిత్రించడం జరిగింది. వాటిని పరిశీలిస్తే 'ప్రపంచ పదుల్లోని తత్త్వం వ్యక్తమౌతుంది.

ద్వాపరయుగంలో ఉన్నట్లే దుశ్శాసనులు, ధర్మరాజులు, ధృతరాష్ట్రులు, ద్రోణులు నేడు కూడా ఉన్నారనీ (3), వారి లోని చెడు గుణాలను ఎత్తి చూపి, యుగాలుమారినా మానవుని స్వభావం మారలేదనీ చెప్పారు. కొమ్మపైన ఉండే నింగిని కొల్లగొట్టాలని, ఒడ్డుపై నిలిచే సముద్రాన్ని ఒడిసిపట్టాలని, మూట విప్పకుండానే దాతగా పేరు రావాలని, ఏ త్యాగం చేయకుండానే నాయకుడు కావాలని కోరికను కలిగి ఉంటాడని (4) మానవస్వభావాన్ని చిత్రించారు. మరణం తథ్యం అని తెలిసినా తనఅజ్ఞానాన్ని వదలుకోడని (5) ఆశ్చర్యం ప్రకటించారు కవి. ఆకాశానికైనా పరిమితి ఉండవచ్చును కాని కంటి కుండదు. కన్ను తెరచి కాంచవచ్చు. కన్ను మూసి (మనసుతో) కాంచవచ్చు. అలాగే మొక్కు, ధ్యాస,ఆశ వీటికి పరిమితుల్లేవు. (8) కాబట్టి 'గిరి గీసుకోవడం మానవస్వభావమే కాని వేరు కాదు. అందని మ్రానికి అర్రులు చాచడం, ఎదుట ఉన్నదాన్ని ఉపేక్షించడం, రాని దాని కోసం నిరీక్షించడం, జడాన్ని మాటిమాటికి పరీక్షించడం మానవస్వభావాలు (11). తృప్తిచెందని మానవుని మనస్తత్వ చిత్రణమిది. అనుకున్నది కాకుంటే నిరాశ చెంది నీరుగారడం, అనుకోనిది జరిగితే తప్పటడుగేయడం, మానవ స్వభావం. అలాగేమాటలతో మనస్సును బాధించడం, ఊహల్లో మునిగి వాస్తవాన్ని వదలడం మానవ మనస్తత్వ లక్షణం (91)

ఇలా ఆధ్యాత్మికతత్వం, ప్రకృతి తత్వం, మానవమనస్తత్వం వివేచించడమే కాక జాతి వైతాళిక తత్వాన్ని కూడా బోధించారు. దీనిలో సజ్జన, దుర్జన, తారతమ్యాన్ని చూపి, దుర్లక్షణాలను వదలి సల్లక్షణాలను అలవరచుకొమ్మని కవి ఉద్బోధించారు. జాతి వైతాళికత్వానికి నీతితత్వం మూలంగా నిలుస్తుంది.

'లోభం' మనిషిని ఎన్ని నీచపు పనులైనా చేయిస్తుందనీ, బాగా ఆలోచించి ఆ లోభగుణాన్ని తొలగించుకోవాలి (19) అరిషడ్వర్గాల్లో లోభం ఒకటి, అంతశ్శత్రుజయం మోక్షానికి సోపానం అని బోధిస్తుందీ విషయం - అలాగే 'స్వార్థం' వల్ల మానవుడు దిగజారుతున్నాడని, విలువలు దెబ్బతింటున్నాయని, అవినీతి పెచ్చుపెరిగి పోతుందనీ, లోకానికి కీడు జరుగుతుందని కాబట్టి మానవుడు ఆత్మపరిశీలన చేసుకొని స్వార్థాన్ని వదలుకోవాలనీ నీతి బోధ (20). దుర్గుణ పరిత్యాగం ఉత్తమమానవలక్షణం కాదా! నీవు నేడు ఉన్నత స్థితిలో ఉన్నా, గతంలో ఎలా ఉండేవాడివో ఒక్కసారి

ఆలోచిస్తే మానవునకు 'అహం'కారం రాదు (22) 'అహం' పరిత్యాగం ప్రతి వానికీ అవసరం . 5వ పద్యంలో కూడా అంతశ్శత్రువులను జయించమంటారు. స్వార్థం కోసం మానవుడు చేయని పని అంటూ ఏదీలేదు. పేరుకోసం నీతిని వదలడం, పదవికోసం పరువును గంగపాలు చేయడం చేస్తున్నారు. స్వార్థం 'మనిషిలోనిచీకటి కోణం' (30) అనే దాన్ని జ్ఞాన దీపం తో తొలగించాలని ప్రబోధం. లోకులు చూడడం కోసం చేసే చిత్తశుద్ధి లేని ఆడంబరాలు (29) వద్దంటాడు. నమ్మక ద్రోహం,అసత్య ప్రచారం, మనోవ్యథ కలిగించడం, - ఇవి నీచుల లక్షణాలనీ (32),ఇట్టి వారితోకలవడంనరకం కాబట్టి వారిని దూరం చేయమంటారు కవి. (దీనిలోకవి మనోవేదన గోచరిస్తుంది.) శరీరాన్ని, మనస్సును బాధించడమే గాక ఆశలను, ఆశయాలను వమ్ము చేసేది దుఃఖమనీ, దుఃఖం అంచులు దూకే బతుకే (35) ఉద్బోధిస్తారు కవి. నిగ్రహం, శాంతం, సర్వసంగపరిత్యాగం నీతి - మొదలైనవి నాకున్నాయనిచెప్పుకొని వాటిని పాటించకపోవటం అహాన్ని పోషించడం, నిజాన్ని పాతేయడమౌతుంది (38) త్రికరణ శుద్ధి లేని జీవితం వ్యర్థం అని వ్యంగ్యం.వేదాంతం వల్లించడం, చిన్న విషయాన్ని పెద్దగా చేసి చెప్పడం, తన సుత్తి చెప్పుకోవడం, నేను చెప్పిందే నిష్కర్ష అనడం తగదనీ, తెలివంతా నీ ఒక్కని సొత్తు కాదు (41) అని కవి అంటారు.పదవి, ధనం, ప్రాణం, పేరు వీటికోసం మానవుడు ఏవేవో పనులు చేస్తాడు (51) అలాంటి వాడు మనిషా? అని కవి ప్రశ్న.

నడమంత్రపు సిరికి ఉబ్బిపోవద్దనీ, అది శాశ్వతంగా ఉండేది కాదని అల్పవస్తువుల ఉపమానాలు ( గడ్డి పరక, నీటిబుడగ, కప్ప పిల్ల) ఇస్తూ అల్పుడవుగా ప్రవర్తించవద్దని (89) ధ్వనింపజేసారు. అలాగే ద్వేషం వల్ల కలిగే అనర్థాలు చెబుతూ, ద్వేషం తలకెక్కితే వినాశనం తప్పదని హెచ్చరించారు (70). కవి, నూతిలో కప్ప బావినే ప్రపంచంగా భావిస్తుంది. బాతును పరమహంస అనీ, మడుగు కడలి అనీ, గుట్టనే హిమాలయం అనీ, మైలునే గమ్యం అనీ, అనడం మగత వల్లనో, పొగరు వల్లనో అంటారు కవి (76). మగత పొగరులు - అజ్ఞానానికి సంకేతాలు వాటిని తొలగించాలని భావం. మన చేత కాని తనంతో ఇతరులను, ఇతర వస్తువులను నిందించటం సమంజసంకాదు. అసలు లోపంయెక్కడుందో తెలుసుకొంటే మేలు (101). పురుగు,పుండు, వాదు,నింద - అవి చిన్నవైనా, పెద్ద బాధనే కలిగిస్తాయి. చెడుబుద్ధే ఉండకూడదు (105)అని కవిగారి నిష్కర్ష.

ఇలా చెడు లక్షణాలను వివరిస్తూ వాటిని పరిత్యజించాలని చెప్పడం నెగిటివ్ పద్ధతిలో నీతిని బోధించడం. దీన్ని భర్తృహరి లాంటి వారు 'దుర్జనపద్ధతి' అనే పేరుతో పిలిచారు. ఏదైనా ఇది నీతిని బోధించే విధానంలో, జాతిని మేల్కొల్పే పద్ధతిలో ఒక తీరు. ఇంక మంచి లక్షణాలను లేదా సజ్జన పద్ధతిని వివరించి వాటి నాదరించమని చెప్పడం పాజిటివ్ పద్ధతిలో నీతిని బోధించడం.

కాల చక్ర భ్రమణాన్ని ఎవ్వరూ ఆపలేరు దానిలో మానవుడు పుట్టడం పెరగడం, గిట్టడం, సహజంగా జరిగిపోతునే ఉంటుంది. అయితే మనిషి బతికి ఉన్నంతకాలం ఎన్నికలతలు వచ్చినా సముద్రం లాగా గంభీరంగా, హిమాలయంలాగా ధీరత్వంతో ఉండాలని (2), అలాంటి వాడే ఉత్తమ మానవుడని అంటారు కవి. గాయాలు,కన్నీళ్ళు, రక్తాలు - మూర్తులుగా, ఆర్తులుగా, షరతులుగా ఇహజీవితంలో కనిపిస్తాయని, త్యాగాలు మాత్రం లోకంలో గుర్తులుగా మిగిలి ఉంటాయి (14) అని చెబుతూ, నశ్వరమైన దేహంకంటే శాశ్వతమైన కీర్తి నిచ్చే త్యాగాలు చేయమంటారు కవి. ఏవో ఆటంకా లొస్తున్నాయని, ఇబ్బందులు కలుగుతున్నాయని, ఆశయాలు లక్ష్యం, సాధించకుండా ఉండకూడదు. (15) ధర్మనిర్వహణను వదలకూడదని బోధ. ' స్వధర్మేనిధనం శ్రేయః'. ఆశయ సాధనకు ముందుకు సాగమని కవి వెన్ను చరుపు.. సృజనశక్తిని, వాద తీవ్రతను, చురుకు నెత్తురును నశింపచేయవద్దనీ అవి నశిస్తే ప్రతిభ నశిస్తుందనీ భజనపరత్వం, సోది, పిరికితనం అలవడుతుందని (17) కాబట్టి మానవు డెపుడూ య్యాక్టివ్‌గా ఉండాలని కవి ఉద్బోధ.

ఏ పనిచేసినా ఆలోచిస్తూ చేయమనీ, ఇతరులకు బాధ కలుగనిరీతిలో చేయమనీ,నీ పని ఫలితాన్ని అంచనా వేసుకొమ్మనీ (21) చెబుతారు కవి. ఉన్నతంగా ఆలోచిస్తూ, లోతులు తెలుసుకొంటూ, బుద్ధిని పెంచుకుంటూ గమనం సాగించి గమ్యాన్ని చేరి సిద్ధిని పొందాలి (23). ఆలోచన, అనుభవం, సాధన - మూడింటిని ముప్పేటగా చేసుకుని జీవితంలో సిద్ధిని పొందాలని కవి ప్రబోధం. దైన్యం, నిర్వేదం, భయం, అలసత పనికిరావు. ఆరంభశూరత్వం, మధ్యలో సాధనను నిలిపివేయడం సమంజసం కాదు (24). గమ్యం చేరే వరకు గమనం మానొద్దు.

చెడు నెదిరించడం,జడత్వాన్ని తొలగించడం, త్యాగాలకు సిద్ధపడడం నిజాయితీకి నిలబడడం ప్రతివాడు ధర్మంగా భావించాలి (34). దేనికీ తలవంచకపోవడం. ఓటమికి నిట్టూర్చకపోవడం, నలుగురి మెప్పు పొందడం, నీతికి నిలబడడం జీవిత ధర్మాలు (41). హృదయానికి మథనం, మేధకు మననం అవసరమని (49), ఏ కొంచెమైనా మంచితో మార్పు వస్తుందనీ (50), అపరిశుద్ధం అనే ముసుగును తొలగించుకొమ్మనీ (54), మనిషికి హద్దు, అదుపు అవసరమనీ (55), జీవితంలో ఎలాంటి బాధలు, కష్టాలు, అవమానాలు ఎదురైనా కలతపడకుండా గట్టు (గమ్యం) చేరాలనీ (56), మానవులకున్న కలిమి, పదవి, తెలివి. బలిమి, అనేవి అతని కోసం కాక ఇతరులకోసం ఉపయోగపడ్డప్పుడే సఫలమౌతాయనీ (57),మంచైనా,చెడైనా కష్టమైనా, సుఖమైనా మంచిపని చేసే వాళ్ళకే స్థిరచిత్తంతో రెండింటినీ స్వీకరిస్తూ ముందుకు సాగాలనీ (67) దైన్యాన్ని వదలి దృఢ సంకల్పంతో ప్రలోభాలకు లొంగక, తలరాతను నమ్మక కార్యశూరుడవై సాగాలనీ (63) అడ్డుస్టుమెంటుకాదు అందరు మెచ్చేట్లుగా పనిచేయాలనీ, అతనిలో నైపుణ్యం, చూపించి పదిమందిని ఆకర్షించాలని వారిమెప్పు పొందాలనీ (77), కెరటానికి ప్రవాహం, కిరణానికిప్రసారం, మౌనికి సమీక్షణం, జ్ఞానానికి నిరీక్షణం జీవగుణాలని (87), ప్రతి మనిషీ కర్మయోగి కావాలనీ (95) వాజ్నియంత్రణమవసరమనీ (99), రచ్చకెక్కగానే కాదు రాణించే ఒడుపుండాలనీ (100), చెబుతూ సలక్షణాలను అలవరచుకోవడం ద్వారా తాను తనజాతి బాగుపడేట్టుగా చూసుకోవాలని బోధించారు కవి. ఇలా నీతి తత్వాన్ని బోధిస్తూ జాతి వైతాళికత్వాన్ని ప్రదర్శించారు కవి.

ఇలా లోకంలో శ్రమశక్తికి చాలా విలువుందని శ్రమ తత్వాన్ని విశదీకరించారు.

"పడగనీడలో పడుకుని పాడే అలవాటు నాది
మండుటెండలో చల్లగ మాడే అలవాటు నాది
ప్రమాదాల బడి నేర్పినట్టి పాఠం పట్టింది ఒంట -
మాడుపోటులో అంకెలు కూడే అలవాటు నాది
మరణదూతతో పాచికలాడే అలవాటు నాది" ........... (86 )

ఆటైనా పాటైనా, పాఠమైనా, పనైనా, శ్రమతో సాధించడం నాకు అలవాటు అంటారు కవి. దేన్నైనా శ్రమతో సాధించాలని భావం. అలాగే తను శ్రమించి, మానవుడు ప్రకృతిని వశపరచుకోవాలని తన చేతులను, పనిముట్లను సమన్వయించుకొని ముందుకు సాగాలని ఉద్బోధిస్తారు కవి (90). లోతుగా ఆలోచించడం చొచ్చుకుపోవడం వీటివల్ల మూలరహస్యం తెలుస్తుంది. ముడచుకుకూచొని వుంటే ఏ ఫలితమూ ఉండదు (93).

ఇలా శ్రమశక్తి మూలంగా మానవుని కర్మయోగిని కమ్మని, లక్ష్యసాధనకు సాధనాలను అన్వేషించి, ముందడుగేయమని బోధిస్తారు సినారె.విలువల విలువలు తెలిపి, వాటినిరక్షించ మంటారు.

" ఒరిగిపడిన జాతికి వెనుచరుపులీ ప్రపంచపదులు
మరుగుపడిన నీతికి కనుమెరుపులీ ప్రపంచపదులు
చేదో తీపో మధించి చెప్పాడు సుమా సినారె -
కునికే అడుగులకు మేలుకొలుపులీ ప్రపంచపదులు" .......... (108)

ఫలశ్రుతి లాంటి ఈ భరత వాక్యంతోకావ్యం ముగుస్తుంది. ఈ భరతవాక్యంలో ఈ కావ్య ప్రయోజనం వివరించబడి ఉంది. సినారె కావ్య తత్వం ఉంది. కావ్యాన్ని చదవడానికి మార్గదర్శకత్వం ఉంది.

ఈ కావ్యాన్ని చదివిన తర్వాత మరొక్క సారి వెనుదిరిగి చూస్తే మన ఆలోచనా తరంగాలను, జీవితాన్ని విన్నట్లు, కన్నట్లు అనిపిస్తుంది. సమాజానికి ఉపదేశాన్నిస్తూ, పాఠకునికి ఆనందానుభూతిని కలిగిస్తూ ముందుకు సాగే ఈ రచనను చదివి 'భేష్' అని తల ఊపనివాడుండడు.

●●●

## ఆధునిక తెలుగు పద్యం – అభావ పద్యధోరణి

*(133వ పేజీ తరువాయి)*

భావం, వ్యంగ్యాత్మకత , అభావ పద్య ధోరణి అన్నీ కలిసి ఈ కవితలోని ఉత్తమ గుణాన్ని మరుగు పరిచాయని అనిపిస్తుంది. కాని, కవి ప్రతిభ ఈ పద్యాన్ని అర్థం అయ్యేదాకా అధ్యయనం చేయిస్తుంది. కృత్రిమ జీవనానికి అలవాటు పడ్డ మానవ జాతి ఎన్నెన్నో రోగాల బారిన పడి అవస్థపడుతోందని, ఎన్నిరోగాలొచ్చినా మానవానుభూతులకు కేంద్రమైన హృదయాన్ని కోల్పోనంతవరకు మానవజాతి బ్రతికి ఉంటుందని చెప్పే 'మూలుగు మాల' అనే కవితా ఖండికలో కూడా బుచ్చిబాబు ఇదే శిల్పాన్ని అనుసరించారు. అభావ పద్య ప్రభావం గురించిన అధ్యయనం చేయకపోతే ఈ ఖండికను విప్పటం పాఠకునికి సాధ్యం కాదు. ఆరుద్ర ప్రభృతులపై కూడా ఈ ప్రభావం ఉంటున్నట్లుగా తోస్తుంది.

ఆధునిక తెలుగు కవిత్వంపై అభావ పద్య ధోరణి ప్రభావం ఎంతవరకు ఉందో ఇంకా పరిశీలించవలసి ఉంది. కానీ, ప్రభావం మాత్రం కచ్చితంగా ఉందని ఈ అధ్యయనం వల్ల తెలుస్తోంది.

●●●

# అలుపెరగని కవితా భాస్కరుడు - కె. శివారెడ్డి

- శ్రీ చీకోలు సుందరయ్య

శివారెడ్డి కవిత్వాన్ని గూర్చి తెలుసుకోవడమంటే పాతికేళ్ళ కవిత్వాన్ని గూర్చి తెలుసుకోవడమే.

విప్లవ కవితకి ఉన్నంత చరిత్ర శివారెడ్డికి ఉంది.. అందుకే శివారెడ్డికి ముందున్న తెలుగుకవితా రంగం, ఆతర్వాత వచ్చిన మార్పులు క్లుప్తంగానైనా తెలుసుకోవడం అవసరం.

తెలుగు సాహితీ రంగంలో రెండు దశాబ్దాలకు పైగా అజేయంగా కొనసాగుతూ, కవిత్వాన్ని శాసిస్తున్నది విప్లవ సంస్కృతి. సమాజాన్ని, రాజకీయాల్ని విప్లవకవులు పట్టించుకున్నంతగా మరెవరూ పట్టించుకో లేదని చెప్పవచ్చు. అందుకే ఈనాటికీ విప్లవోద్యమస్ఫూర్తి అంతటా పరివ్యాప్తమై కలం పట్టిన ప్రతివారినీ ఉత్తేజితుల్ని చేస్తోంది.

భూమికోసం, భుక్తి కోసం, కూలి కోసం నాలి కోసం ఎన్ని పోరాటాలు చెలరేగాయి!!

- 1945 నుండి 51 వరకు నిజాం రాజుకు వ్యతిరేకంగా సాగిన గెరిల్లా పోరాటం.
- 1967 పూర్వార్థంలో పశ్చిమబెంగాల్ డార్జిలింగ్ జిల్లాలో నక్సల్బరీ గ్రామంలో జరిగిన గిరిజన రైతాంగ తిరుగుబాటు - దీర్ఘ కాలిక పోరాటం.
- 1968-69 ప్రాంతాలలో శ్రీకాకుళంలో (వెంపటాపు, ఆదిభట్ల) సాయుధపోరాటం
- తెలంగాణా రైతాంగ పోరాటం.

ఇన్ని పోరాటాలను , ఉద్యమాలను చూసిన అభ్యుదయ కవిత తెలంగాణ పోరాటం తర్వాత అనేక కారణాల వల్ల పక్కదారులు తొక్కింది. అది నీరసించి నిస్తేజమైన దశలో, సమాజంలో పెరిగిన దోపిడీకి వ్యతిరేకంగా దిగంబరకవిత్వం దూసుకొచ్చింది. అయితే దిగంబర కవులకు సామాజిక నేపథ్యం అవగతమైందే కానీ రాజకీయ అవగాహన లేకపోవడం వల్ల ఉవ్వెత్తున లేచిపడ్డ కెరటంగా మాత్రమే దిగంబర కవిత మిగిలింది. ఏ కవిత్వోద్యమమైనా ఒక నిర్దిష్టమైన గమ్యం వైపు పయనించనినాడు, తనకంటూ స్పష్టమైన సామాజిక లక్ష్యాన్ని ఎంచుకొననినాడు అది నిలబడలేదని దిగంబర కవిత మూడు సంపుటాలతోనే ముగిసింది. సరిగ్గా ఆ దశలోనే శ్రీకాకుళ గిరిజన సాయుధ విప్లవాల వేడితో తిరగబడుకవులు వచ్చారు.

' ఇది ప్రజాస్వామ్యం కాదు. ఈ వ్యవస్థకు శస్త్ర చికిత్స చేసి కొత్తవ్యవస్థనిర్మించడానికి త్యాగాలు, బలిదానాలు తప్పవు. అరణ్యాల్లో, కొండ కోనల్లో, చెట్లల్లో, పొదల్లో కార్చిచ్చులా రాజుకుంటున్న జ్వాలల్ని పంచడానికే మా ఈ తిరుగుబాటు హస్తాల్ని అందిస్తున్నాం' అంటూ విప్లవశక్తులు క్రియాశీలంగా పరిణమించాయి..

1970ఫిబ్రవరిలో విశాఖపట్నంలో శ్రీశ్రీ షష్టిపూర్తి సభలో 'రచయితలారా మీరెటువైపు' అంటూ విశాఖ విద్యార్థులు రచయితల్ని నిలదీశారు. ఆ నేపథ్యంలో 'సాహిత్యం కేవలం జీవితాన్ని నిర్వచించడమే కాదు అస్తవ్యస్తమైన సాంఘిక జీవితాన్ని మార్చడానికి ఉపయోగ పడాలి. జాతిని సమగ్ర విమోచనం వైపు నడిపించేందుకు విరసం ఏర్పడుతున్నదని రచయితలు ప్రకటించి విరసానికి నాంది పలికారు.

1970లో వరంగల్లులో వెలువడిన 'మార్చ్' కవితా సంకలనం, 1970లో ఖమ్మంలో వచ్చిన 'ఝుంఝుం' 1971లో వచ్చిన తిరుపతి విప్లవసాహితి వారి 'లే' అనంతపురం చైతన్య సాహితి వారి 'బందూక్' వంటి

సంకలనాల్లో విప్లవరచయితలు ఎలా రాయాలి. ఏంరాయాలి అన్నది స్పష్టమైంది.

'పోరాటం - వేడిలో తన చైతన్యాన్నీ, కలాన్నీ, గళాన్నీ, కుంచెనీ,ఆయుధాలుగా మలచుకోవాలి. పీడిత ప్రజానీకంలో ఐక్యమై వారి విప్లవ చైతన్యాన్ని పెంచాలి. ప్రజలే అధ్యాపకులు గనక కార్మిక, కర్షక,కష్ట జీవుల జీవితాలు అధ్యయనం చెయ్యాలి. మనస్తత్వాలను సమస్యలను అర్థం చేసుకోవాలి. వారి భాషలోనే రచనలు చెయ్యాలి. సమాజంలో వర్గసంఘర్షణను, వర్గవైరుధ్యాలను మెలకువగా అధ్యయనం చెయ్యాలి. పీడిత ప్రజల్లో వర్గకసినీ ఆత్మ విశ్వాసాన్నీ పెంచి వారి అజేయ శక్తిని తెలిపే రచనలు - కళలు వారికి హత్తుకునేలా అందించాలి' అనే లక్ష్యంతో విప్లవాభిముఖంగా పయనిస్తూ కార్యాచరణతో క్రియాశీల పాత్ర నిర్వహిస్తూ వచ్చిన పాణిగ్రాహి, జ్ఞానేశ్వర్ కీర్తి, చెరబండరాజు, శివ సాగర్, అజ్ఞాత సూరీడు, వరవరరావు, గద్దర్ వంటి కవులున్న విరసంలో సభ్యత్వం పొందకున్నా ఆచైతన్యంతో ప్రజ్వరిల్లిన కవి కె. శివారెడ్డి. విప్లవ కవిత్వోద్యమంనుండి తన ఊపిరి తీసుకుంటూ, అంతకు మించే విప్లవ కవిత్వోద్యమానికి ఊపిరిపోశాడు. ఈ రెండు దశాబ్దాల్లో కార్యోన్ముఖులై క్రియాశీలక పాత్ర నిర్వహిస్తూ వచ్చిన ఎంతోమంది కవులు అజ్ఞాతం లోకి వెళ్ళడమో, నిర్బంధంలో వుండడమో జరిగినా వారితో సమానంగా ఎప్పటికప్పుడు విప్లవ స్పృహను చైతన్యాన్ని కాపాడుకుంటూ తన కవితల ద్వారా వాటికి జీవం పోశాడు. 1976-77ల తర్వాత కలంపట్టిన ప్రతియువకవికీ నిస్సందేహంగా ఆయనే ఆదర్శం. ఒక దశలో మహామహులైన సీనియర్ కవులు కూడా శివారెడ్డి బాణీ తొక్కవలసిన స్థితి వచ్చిందంటే శివారెడ్డి అందుకున్న విప్లవ స్పృహ అలాంటిది. అనన్యసామాన్యమైన విప్లవ స్పృహని ఆయన ఎలా అందుకోగలిగారు. ఎలా జీర్ణం చేసుకోగలిగారు ?ఎలా కాపాడుకో గలిగారు? ఇంత నిబద్ధత, నిమగ్నత ఎలా వచ్చాయి? ఇవన్నీ సందర్భోచితమైన ప్రశ్నలే.

ఇక్కడ మనం శివారెడ్డి జీవితాన్ని గూర్చిన కొన్ని ముఖ్యమైన విషయాల్ని తెలుసుకోవలసిన అవసరముంది.

1943 ఆగస్టు ఆరున గుంటూరు జిల్లా కార్మూరి వారి పాలెంలో జన్మించి అతి పిన్న వయసులోనే తల్లిని పోగొట్టుకున్న శివారెడ్డి అమ్మ ప్రేమకు దూరమయ్యారు. వేయితలల నాగుపాము వంటి ప్రపంచములో జీవితం భయమై, దరిద్రమై, అనాదరణ చోటు చేసుకున్నప్పుడు తన్ను తాను కాపాడుకోవటానికి పుస్తకాల్ని ఆశ్రయించారు. హైస్కూలు రోజుల్లోనే అప్పటి నవలా సాహిత్యం, కథా సాహిత్యం, అనువాద సాహిత్యంలో శరత్‌బాబు, టాగూర్, ప్రేమ్‌చంద్, జైనేంద్రకుమార్ రచనలు, చెంఘీజ్‌ఖాన్, క్లియోపాత్ర వంటి నవలల్ని ఆయన చదివారు. ఎస్.ఎస్.ఎల్.సి., నాటికే అనేక వృత్తాల్లో పద్యరచన చేయడమేకాకుండా కృష్ణశాస్త్రి గీతాలు, ఎంకిపాటలు శ్రావ్యంగా పాడేవారు. 1967లో హైదరాబాదు వచ్చేంతవరకు తిక్కనకవితా మాధురీ, పోనభక్తి తత్పరత, వేమన సామాజిక చింతన, నాన్నగారి భజనకీర్తనలు, జానపద గీతాలు, స్పెన్సర్, షేక్స్‌పియర్ రచనల్లో మునిగిన శివారెడ్డి హైదరాబాదు వచ్చి శీలా వీర్రాజు, సింగరాజు లింగమూర్తి, వరవరరావు , కె.వి.ఆర్.,సోమసుందర్, నగ్నముని సాంగత్యంలో తన అధ్యయన లక్ష్యాన్ని ఎంచుకొని దేనికి దాన్ని విడమర్చుకోవడాన్ని ప్రారంభించారు. సాహిత్య కల్లోలం ఆయన్ని కలవరపెట్టినా 'రష్యా ఏమిటో, చైనా ఏమిటో, అమెరికా ఏమిటో, ప్రపంచపోకడ ఏమిటో, మానవుని స్థితిగతులేమిటో, ఈ అంతరాలు, అన్యాయాలు రాజకీయాలు ఇన్నేళ్ళ స్వాతంత్ర్యఫలితాలు, మిశ్రమ ఆర్థిక విధానాలు, వలస విధానం మిగిల్చిన చదువులు' అన్నీ ప్రశ్నలుగా నిలబడ్డాయి.మార్క్సిజం ఆయన ప్రశ్నలకు సమాధానాల్ని చూపింది. 'కమ్యూనిస్టు మేనిఫెస్టో' ఒక అద్భుత కావ్యంగా కనిపించి ఆయన్ని వశం చేసుకోవడమే కాకుంటా ఆయన కవితలో అంతర్లయగా మారి, విరసంలో సభ్యుడు కాకపోయినా దానితో పుట్టి, పెరిగి ఇప్పటికి

దానితోపాటు ఎదుగుతున్నారు. కొత్త చూపునూ, శక్తినీ, యుద్ధ శీలతనీ, జీవన పోరాటావశ్యకతనీ విరసం తన కిచ్చిందని నిర్భయంగా ప్రకటించుకోవడమేకాదు, దానితో మమేకం చెందేలా దాని ప్రభావానికి లొంగి పోయారు.

శ్రీ శ్రీ అన్నట్లు శివారెడ్డి కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు కాకపోయినా మంచి కమ్యూనిస్టు, మార్క్సిస్టు. దానిపట్ల అపార గౌరవం, అచంచల విశ్వాసం కలిగిన వ్యక్తి.

1972లో వెలువడిన 'రక్తం సూర్యుడు' తో మొదలైన ఆయన కవితాప్రపంచం ఆరు ఖండాలుగా విస్తరించింది. అప్పట్నించీ అలుపెరగని కవితా భాస్కరుడైన శివారెడ్డి గోర్కీ అన్న 'I have come here not to compromise but to fight' మాటకు అక్షర సాక్ష్యంగా నిలిచారు. కవి తన్ను తాను దహించుకుంటేనే తప్ప, తన్ను తాను వ్యక్తీకరించుకోలేరనీ, తన్ను తాను ఆవిష్కరించుకోలేరనీ, ప్రకటించుకోలేరనీ నమ్మే శివారెడ్డి, Eliot అన్న 'Poetry is a continuous self extinction' ని కవన సూత్రంగా నిలుపుకున్నారు. ఆయన కవిత్వం జనం ఆర్తిని కౌగిలించుకొంది. వారి దుఃఖాన్నే పెనవేసుకొంది. వారి కష్టాల్నే ఉనికి చేసుకొంది. అది ఆయుధమూ, సమాజ రుగ్మతల్ని ఖండించే శస్త్రమై దూసుకు వెళ్తోంది.

'రక్తం సూర్యుడు'లో 'పదహారు హింసా వర్ణాల కుర్రాణ్ణి' తన కవితా సమరానికి జెండాగా చేసుకున్న శివారెడ్డి, దుఃఖాన్ని అసహ్యించుకుంటారు. కర్షకుడిగా, కార్మికుడిగా, విశ్వశ్రామికుడిగా తను మట్టిలో పుట్టి, మట్టిలో పాతబడి వుంటే, మేడలు, మిద్దెలు, ఓట్లు, ఎన్నికలు, అధికారాలు ఎలా తన నించి పుట్టుకొచ్చాయో వివరిస్తూ, అనంత స్పందనైక గీతాన్ని ఆలాపిస్తారు. కవిత్వానికి కార్యశీలనా ప్రేరణ ముఖ్యం. ఊహల్లోనూ, మానవాతీత శక్తుల్లోనూ నిన్ను ముంచేది కవిత్వం కాదు, నల్లమందు అంటూ 'కాళ్ళు చేతులు, కళ్ళు అప్రధానమనుకునే జాతికి ఉదయాల్లేవు; జన్మకి అమ్మానాన్నల్ని అప్రధానం చేసే ఫిలాసఫీలో పుట్టి పెరిగిన దేశంలో శాంతికి కూడా కత్తి అండ కావాల్సిన రోజు వస్తుందని నేటి అస్తవ్యస్తాన్ని చూపిస్తారు.

కరెంటు స్తంభం క్రీనీడలో ఒక రొమ్ము శిఖరాన్ని చూపిస్తూ, పదహారేళ్ళ కార్మికురాయిళ్ళు కమ్మిన యవ్వనం మనకు ఈ వ్యవస్థ వికృతాన్ని తెలియచేస్తుంది. దోపిడీ వ్యవస్థలో వంట చెరుగ్గా మారిన బీదచేతులు, కనురెప్పలెత్తే ధైర్యం లేని వాళ్ళు, మొదలంటా నరకబడ్డ తరువుల ఆర్తనాదాలు వినిపిస్తాయి. రక్తం బొట్లు ఇటుకలు పేర్చి కట్టిన ప్రహరీ గోడల శిరస్సుపై ఈత ముళ్ళలా నిక్కబొడుచుకున్న గాజు పెంకుల్లో మేస్త్రీ పెళ్ళాం అసువులు విరగబడి నవ్వుతాయి. వెలుగునది పొంగని ఈ జాతి రాతను మార్చడానికి కార్చిచ్చు ప్రభవిస్తుంది. అణగదొక్కబడ్డ అంతరంగాల స్తబ్ధతను ఛిద్రం చేసి రక్తం సూర్యుళ్ళు పైకి లేస్తారు.

భూమయ్య, కిష్టాగౌడులనే అమర వీరులకు అంకిత మివ్వబడిన రెండో కావ్యం 'చర్య' 1975లో వెలువడింది. మనుషులంటే రోడ్డుపక్క దొర్లించబడిన తారుడబ్బాలని అనుకునే వారికి కలిగించాల్సిన గుణ పాఠాన్ని వీరోచిత పోరాటం ద్వారా కలిగించమని పురిగొల్పే రచయిత స్వేచ్ఛ, శిక్ష, దొంగ, లాజిక్, కొవ్వొత్తి, గెరిల్లా, బూర్జువా, అనలస్పర్శ, స్పృహ, క్రియ, అనలధ్వజం వంటి వాటిని విశదీకరిస్తూనే 'ప్రజల శక్తి నా శక్తి, ప్రజల ముక్తి నా ముక్తి', 'జనం కోసం సృజనాన్ని విరుస్తాను, జనమే నా సృజనం, జనమే నా స్పృహ' అంటూ తన జీవితానికీ, కవిత్వానికీ గల గమ్యాన్ని వివరిస్తారు. అంతే కాదు. తాత ముత్తాతల తరాలనుండి తేరగా తింటూ కండలు పెంచుకున్న వారినీ, భూస్వామ్యాన్నీ, గుండెల్లో గుండ్లు దూసుకెళ్ళేలా కాల్చమని, ప్రబోధిస్తారు.

అనంత జీవన దుఃఖాన్నీ, విషాదాన్నీ, అసమానతనీ, అసహ్యాన్నీ ప్రతిబింబించే శివారెడ్డి "ఎపిక్ పోయమ్"

'ఆసుపత్రి గీతం'. 1976లో అచ్చయిన ఈ కావ్యంలో అలలు అలలుగా సాగే శర పరంపరలు మొత్తం వ్యవస్థకే తగలాలని గురిపెట్టబడ్డాయి. ఆయన చిన్న తనంలో పాడుకున్న సంగీతం లయాత్మకంగా భాషతో సమ్మిళితమై సహవాసం చేసే కావ్యమిది. సమాజ వికృతాలు, కన్నీటి గాథలు కసుగాయలుగా రాలిపోయిన జీవితాలు మనసుల్ని కలచివేస్తాయి. దౌష్ట్యం, క్రౌర్యం, దుర్మార్గం, నిస్సహాయత, లేమి, మొదలైన వన్నీ హృదయాల్ని చుట్టుముడతాయి. కొత్త బావిలో తన్నుకు వచ్చే ఊటలా కవితా ధార పొంగులు వారే కావ్య మిది.

శివారెడ్డి రాజకీయాన్ని, ఉధృతమైన, సాంద్రతరమైన, ఉత్తేజకరమైన, ఉద్వేగవంతమైన వక్తృత్వ శైలిలోని వచన కవితా పటిమను చవి చూపించే కావ్యం 'నేత్ర ధనస్సు'. 1978లో వచ్చిన ఈ కావ్యం 'ధ్వంసం'తో ప్రారంభమై రచయిత నిబద్ధతను, ఆశయాన్ని స్పష్టం చేస్తుంది. 'దేన్నీ ధ్వంసం చేయకుండా దేన్ని నిర్మిస్తావు? ధ్వంసం చేయతగిం దేదీ లేకపోతే నీ కీలోకంలో, నువ్వు తప్పకుండా ధ్వంసం చేయ తగిన వ్యక్తివి' అనే కవి రాజకీయం ప్రస్ఫుటమవుతుంది. మాగాణి మట్టివాసనలు, పశువుల పేడా రొచ్చు ఇందులో కనిపిస్తాయి. నలుగురి కోసం ఆహుతి కావడం, పోరాడ్డం వంటివి తన జీవితానికి సార్థక్యత చేకూరుస్తాయని కవి బలంగా విశ్వసిస్తారు. విత్తనపు చెరుకు తుంటల్లా ఆలోచనలు సారభూముల్లో పునః జన్మించాలని కవి ప్రగాఢంగా వాంఛిస్తారు. వ్యవసాయానికి చెందినప్రతీకలతో సరికొత్తగా ధ్వనించే కావ్య మిది.

పరాయీకరణకు బలైపోయినరచయిత, పరిశోధకులు 'బంగోరె'కు అంకితమిచ్చిన కావ్యం 'భారమితి.' 1983లో వచ్చిన ఈ కావ్యంలో ప్రవాహవేగం, ఆవేశ తీవ్రత, సాంద్రత ప్రతి పంక్తిలోనూ కనిపిస్తుంది. ప్రపంచ సాహిత్యాధ్యయనం-ముఖ్యంగా యూరోపియన్ కవిత్వం, ఆఫ్రికన్ కవిత్వం, లాటిన్ అమెరికా కవిత్వం కథలు విస్తృతంగా చదివిన శివారెడ్డి భారమితిలో వచన కవితను సంపద్వంతం చేశారు. 'సాలోచనగా ముక్కు ముక్కు మీంచి జారి కిందపడి మొలిస్తే కవిత్వం, బోర్లాపడుకుని భూమిని వాటేసుకుంటే కవిత్వం, రెండు చేతుల్నిండా దుమ్ము తీసుకుని నెత్తిమీద పోసుకుని జలకాలాడ్డం కవిత్వం.

"నేను శబ్దాన్ని, లోనకానదిగి మట్టి పెళ్ళను విరుస్తున్న పలుగుచేసే క్రియాత్మక శబ్దాన్నీ' అంటూ సాగే పంక్తులు విలక్షణ కవితాత్మకతకు నిదర్శనం, ఎంత శారీరక హింస కలిగించినా ప్రాణ స్పందనల్ని ఏచేతి వేళ్ళూ తాకలేవని ఆయన ధైర్యం. 'ఆయుధం లేకుండా యుద్ధానికి మాత్రం రాకు' అనే ఈ కవి 'రాత్రి'ని గూర్చి రాసినా 'దారిని' గూర్చి రాసినా, అడవులు, శరీరం, స్మృతి, పాదం, పాట, భాష, కంజిర, ఇలా ఏ అంశాన్ని తీసుకున్నా విప్లవీకరించి, వస్తు శిల్పాల సమన్వయంతో కవిత్వాన్ని పండించారు.

1988లో విడుదలైన శివారెడ్డి ఆరోకావ్యం 'మోహనా ఓ మోహనా' ఆర్థిక సంబంధాలే మానవ సంబంధాలవుతున్న దశలో కలిగే ఏకాకితనం, నిరాశ, ఒక జీవన నిష్ఫలత్వం, ఘర్షణ ఇంకా అనేక జీవనాంశాల్ని లోపల కెళ్ళి పరిశీలించిన అనుభవాలు, అనుభూతులు ఈ కావ్యంలో కనిపిస్తాయి. 'అత్యంత సన్నిహిత మిత్రులకూ, అత్యంత సన్నిహిత శత్రువులకూ' ఎనలేని కృతజ్ఞత అంటూ ప్రచురించిన ఈ కావ్యం మానవీయ మూల్యాలకు, ఆర్ద్రతకు నెలవు. 'నా అక్షరాల్లో ఒక అక్షరం నా ముందు ఎదిగి, జాలిగా నా మీద వంగి, నా చుబుకాన్ని తాకితే నువ్వు గుర్తొస్తావు'- 'ఏ ఆడపిల్లని చూచినా రాత్రికీ పగటికీ మధ్య కొట్టుకొంటున్ననల్లని తెరలా నాలో ఎపుమెడూ కదుల్తూనే వుంటావు' అని ఓ మధ్యతరగతి స్త్రీ దయనీయతకు స్పందించిన హృదయం ఈ కవితలో ప్రత్యక్షరంలో ప్రత్యక్షమవుతుంది. మరణంగురించి చెప్పినా, నిషూపై

(తరువాయి 153వ పుటలో)

# తెలుగు సాహిత్యంలో సైన్స్ ఫిక్షన్

- శ్రీ రెడ్డి రాఘవయ్య

సాహిత్యంలో ఫిక్షన్‌కు సముచితమైన స్థానం ఉన్నది. ఫిక్షన్ అనగానే మనకు కథలు, నవలలు చప్పున జ్ఞాపకం వస్తాయి.

తెలుగు సాహిత్య ప్రపంచాన్ని అవిచ్ఛిన్నంగా ఏలుతున్నాయి ఈ రెండు ప్రక్రియలూనూ. మనకు అవి జ్ఞాపకం వచ్చేది అందువల్లనే!

ఫిక్షన్ కు - కట్టుకథ, కాల్పనిక కథ అనేది నిఘంటువులు ఇచ్చే అర్థం.

జానపద, చారిత్రక, రాజకీయ, సాంఘిక, ఐతిహాసిక, పౌరాణిక విషయాలను తీసుకొని దానిచుట్టూ ఊహలతో కల్పించి అల్లటమే "కాల్పనిక సాహిత్యం" అనిపించుకుంటుంది.

ఆలాగే సైన్స్‌ను ఆధారంగా తీసుకొని కల్పించి వ్రాస్తే అది "సైన్స్ ఫిక్షన్" అవుతుంది.

సైన్స్ - ఫిక్షన్ రెండూ విరుద్ధమైన భావాల సమ్మేళనం. సైన్స్ వేరు. ఫిక్షన్ వేరు. సైన్స్ అంటే సైన్స్‌ను యధాతథంగా చెప్పటం. ఫిక్షన్ అంటే కల్పించి చెప్పటం. యధాతథంగా ఉన్న సైన్స్‌ను ఆధారంగా చేసుకొని ఇక్కడ కల్పించి చెప్పడం అవుతున్నది. అంటే "యథార్థం + కల్పన = సైన్స్ ఫిక్షన్ అన్నమాట.

కొందరు తెలుగులో కథ వ్రాసినపుడు సైన్స్‌ఫిక్షన్‌ను "వైజ్ఞానిక కథ" అని, నవల వ్రాసినపుడు "వైజ్ఞానిక నవల" అనీ అన్నారు. మరి కొందరు దీనినంతా "వైజ్ఞానిక కాల్పనిక సాహిత్యం" అన్నారు.

వైజ్ఞానికం అనగానే అది పూర్తిగా సైన్స్‌కు సంబంధించినది అని భ్రమ పడేందుకు అవకాశం ఉన్నది. ఇది 'సైన్స్ ఫిక్షన్' కాబట్టి వైజ్ఞానిక కాల్పనిక సాహిత్యం అంటే ఉచితంగా ఉంటుందేమోననుకుంటాను.

మామూలుగా మన జానపద కథల్లో... రాజ్యాలూ...రాజులు... రాజకుమార్తెలు... మంత్రదండాలు... సాహసోపేతులైన యువరాజులు.. శక్తిపూరితమైన ఖడ్గాలు... సప్తసముద్రాలు... కీలుగుర్రాలు... ఎగిరే చెపమలు... కనుపించకుండా ఉంచే కాటుకలు... పరకాయ ప్రవేశాలు... దూరదృశ్యాలను చూపే సాధనాలు ఎన్నో సాక్షాత్కరిస్తాయి...

"వైజ్ఞానిక కాల్పనిక సాహిత్యం"లో ఈ నాటి వరకూ సైన్స్ సాధించిన విజయాలు.. ఇక ముందు సాధించబోయే విజయాలు.." యధార్థత-కల్పన"ల మాటున దోబూచులాడుతూ సాక్షాత్కరిస్తాయి.

అందులో "రోబోట్స్, కాంతివేగంతో పోగల అంతరిక్ష నౌకలు,సోనిక్‌లాక్స్, లేసర్‌గన్స్, సోలార్ ఎయిర్ కార్లు, ఫ్లయింగ్ సాసర్లు, దృష్టి కందని నక్షత్ర సమూహాలు, ఇమేజ్ సిమ్యులేటర్స్, డీప్‌ఫ్రీజెస్, బుద్ధి జీవులు, క్లాటర్ యంత్రాలు, ఏంటీమేటర్స్, లేసర్ టార్చ్‌లు, బ్లాక్ హోల్స్, నక్షత్ర యుద్ధాలు, అదృశ్యులు, సూర్యతేజాలు, మైక్రోమాగ్నిఫయింగ్ గ్లాస్ తో చదువగలిగే అగ్గి పెట్టె సైజులో ఉన్న పుస్తకాలు, టెస్ట్ ట్యూబ్ మనుషులు, బాక్టీరియా విష క్రిములు, ఇలా ఎన్నో మరెన్నో సైన్స్‌లోని విషయాలు ఆధారంగా మన కళ్ళముందు ప్రత్యక్షమౌతాయి.

సైన్స్ ఫిక్షన్‌లో ఉద్వేగం కలిగించే సంఘటనలు ఉంటాయి. ఒళ్ళు గగుర్పొడిచేదృశ్యాలూ ఉంటాయి. పాఠకులకు ఉత్కంఠత కలిగించి ఏక బిగిన చదివింపజేసే శక్తి వీటికి ఉన్నది. దానితో పాటు సైన్స్‌ను అర్థం చేసుకొనే అవకాశమూ ఉన్నది.

గత శతాబ్దంలోనే సైన్స్‌ఫిక్షన్ ప్రపంచ సాహిత్యంలో

చోటుచేసుకున్నది. ఇటీవలి కాలంలో బాగా ప్రపంచాన్ని, ఊపునూ అందుకున్నది. సైన్స్ కూడా శాఖోపశాఖలు గా విస్తృతం గా వ్యాపించింది. అది అణువు గుండెను చీల్చింది. అంతరిక్షాన్ని అందుకున్నది. సాగరాలను సాంగోపాంగంగా వీక్షించింది. గుండెను మార్చి గుండెను పెట్టింది. టెస్ట్ ట్యూబ్‌లలో పాపాయిలను సృష్టించింది. ఇలా ఇంకెన్నో అద్భుతాలను సాధించింది. ఈ అద్భుతాలన్నిటిలో అసంఖ్యాకమైన 'సైన్స్ ఫిక్షన్' వచ్చింది.

ఈ సాహిత్యం తెలుగులో ఇంకా శైశవదశను వీడలేదు. వేల కొద్దీ వచ్చిన సాహిత్య గ్రంథాలలో సైన్స్ ఫిక్షన్‌ను వేళ్ళమీద లెక్క పెట్టవచ్చు.

ఈ ప్రక్రియ తెలుగులో పుట్టి 'అర్ధ' శతాబ్ది మించలేదు. ఈ అర్ధశతాబ్దిలో కూడా వివిధ సాహిత్య ప్రక్రియలలో వచ్చిన దానినంతా క్రోడీకరిస్తే అర్ధ శతం మించ లేదంటే అతిశయోక్తి కాదనుకుంటాను.

సైన్స్ ఫిక్షన్ వ్రాయటం అనుకున్నంత తేలికపని కాదు.

సైన్స్‌ను గురించిన చక్కని 'అవగాహన' ఉండాలి. అవగాహనకు తోడు "ఆలోచన" ఉండాలి. ఈ రెంటినీ ఉపయోగించుకోగల ప్రజ్ఞాపాటవాలు' ఉండాలి. ఇవన్నీ ఉన్నప్పుడే 'సైన్స్ ఫిక్షన్' తన పూర్ణత్వాన్ని సంతరించు కుంటుంది.

తెలుగులో ఇప్పటి వరకూ వచ్చిన సైన్స్‌ఫిక్షన్ ను పరిశీలిస్తే వచ్చిన వరకయినా బాగావచ్చింది' అనే సంతృప్తి మిగులుతుంది.

తెలుగులో తొలి సైన్స్ ఫిక్షన్ రచన ఏదీ అంటూ వెతుక్కుంటూ పోతే 'నేనున్నాను' అని "విహంగయానం" అనే నవల తటస్థపడుతుంది. దాదాపు ఇప్పటికి అర్ధ శతాబ్దం క్రింతం ఆవిర్భవించిన ఈ నవలను అప్పటి వారు 'సైన్స్ ఫిక్షన్' అని అనుకున్నారో లేదో గాని దానిలో ఉన్న విషయం దృష్ట్యా, కల్పన దృష్ట్యా అది సైన్స్ ఫిక్షన్ కు సబంధించిందేననిపిస్తుంది.

ఈ నవలను కీర్తిశేషులు టేకుమళ్ళ రాజగోపాల రావుగారు వ్రాశారు. ఆ నాటికి పెంపొందుతూ ఉన్న "నాటికల్‌సైన్స్"ను "ఎయిరో నాటికల్‌సైన్స్‌ను" ఆధారంగా తీసుకున్నారు రచయిత.

ఇతివృత్తంలో నూతనత్వమున్న ఈ నవలను డా॥ గిడుగు సీతాపతిగారు కేంద్ర సాహిత్య అకాడమీ వారికోసం వ్రాసిన STORY OF TELUUGU LITERATURE" లో "Tekumalla Raja Gopala Rao wrote two short Novels, Lalitha and Vihangayanam, the later of which has a wonderful theme, based on the modern development of beautiful and aeronautical science...In the course of the development of the story, the author acquints the reader with the Marvels of Modern Science " అని దీనిని ప్రస్తుతించారు.

పద్మావతి అనే యువతికి సైన్స్‌ను అభివృద్ధి చేయాలనే కోర్కె బలీయంగా ఉంటుంది. దానికి పుష్కలంగా డబ్బు కావాలి. సముద్ర గర్భంలో 'నిధి' ఉన్న దని తెలుసుకొని అక్కడికి వెళ్ళి దానిని సంపాదించుకు వస్తుంది. దానితో దేశంలో సైన్స్ అభివృద్ధికి తోడ్పడుతుంది. కథా కథనంతో పాటు అక్కడక్కడా సైన్స్‌ను గురించి కూడా రచయిత వివరిస్తాడు.

ఈ శతాబ్దంలో మానవుడు సాధించిన అద్భుత విజయం చంద్రుడి మీద కాలుపెట్టటం.. గత శతాబ్దంలోనూ, అంతకు ముందు ఊహా మాత్రంగానే వున్న చంద్రమండల యాత్రను ఇతివృత్తంగా తీసుకొని ముప్పై సంవత్సరాల క్రితం 'నవల' ఒకటి ఓ వారపత్రికలో సీరియల్‌గా వచ్చింది. అదే తరువాత పుస్తకంగా వచ్చింది. దానిపేరు "చిత్రగ్రహం". డాక్టర్ రావూరు భరద్వాజ గారు దీనిని వ్రాశారు.

రచయిత ఆత్మగతంగా చెప్పిన ఈ నవలలో రచయితతోపాటు భారతీయుడైన బెనర్జీ, అమెరికా శాస్త్రజ్ఞుడు ఆల్‌ఫ్రెడ్, ఇందులోని పాత్రలు.. వీరు ముగ్గురూ కలిసి చంద్రమండలాన్ని చేరుకోగల నౌకను సృష్టిస్తారు.

దానితో చంద్రమండలానికి బయలు దేరుతారు. కాని, వారు అనుకోని విధంగా ఓ వింత గ్రహం పైన దిగుతారు. ఆ గ్రహానికి రచయిత పెట్టిన పేరు తెలుగులో ఓ కొత్త పదానికి ఊపిరి పోసిందను కోవచ్చు. ఆ గ్రహం పేరు "శశూన్".

శశూన్ ప్రజలను 'శశులు' అంటారు. వారు ఎంతో విజ్ఞాన ప్రగతిని సాధిస్తారు. అక్కడ సమానత్వం వెల్లివిరుస్తూ ఉంటుంది. భూలోకంలో లాగా,అసూయలు, ద్వేషాలు, దౌర్జన్యాలు, దొంగతనాలు, అక్కడ లేవు. అక్కడి సమాజ ప్రకృతి ఆల్‌ఫ్రెడ్‌కు నచ్చుతుంది. అతడు అక్కడే వుండిపోతాడు. మిగతా ఇద్దరూ భూమికి తిరిగి వస్తారు.

భరద్వాజ గారిదే ఇంకొక నవల జలప్రళయం 1963లో వచ్చింది.. చంద్రుడి ఆకర్షణ భూమి మీద పనిచేస్తూ ఉంటుంది. దానికే సముద్రంలో ఆటుపోటులు కలుగుతూ ఉంటాయి. చంద్రుడికీ, భూమికీ మధ్య 'ఆకర్షణ' పరిధి ఉన్నదని 'రోషే' అనే శాస్త్రజ్ఞుడు కనిపెట్టాడు. చంద్రుడు ఆ పరిధిని దాటి వస్తే భూమి ఆకర్షణకు బద్దలై పోతాడు' భూమి మీద ఉత్పాతాలు జరుగుతాయి. జల ప్రళయం సంభవిస్తుంది.

మనిషి మీద మనిషి ఈర్ష్యతో కసితో కొట్టుకుంటు న్నాడు. అలాగే దేశాల మధ్య ద్వేషాలు రగులుతున్నాయి. ఈ ద్వేషాలతో ఊహింపరానంతటి శక్తిగల 'మారణా యుధాలు' సృష్టించి ఒకరిపైన ఒకరు ప్రయోగించుకోవాలని సిద్ధమౌతున్నారు. ఇంతలో చంద్రుడు భూమికి దగ్గరగా వస్తాడు. జల ప్రళయం వస్తుంది. అంతా నాశనమైపోతుంది.. విజ్ఞానంతోపాటు చక్కని సందేశం కూడా ఈ నవలలో ధ్వనిస్తుంది.

భరద్వాజగారి 'చిత్రగ్రహం- జల ప్రళయం' మధ్య వచ్చింది మరో అద్భుత మైన నవల. పేరు "ఎక్కడి నుండి- ఎక్కడకు?". ఇది కొడవంటి నరసింహం గారి రచన. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారు 1957 లో పెట్టిన పోటీలో ఈ నవల బహుమతిని పొందడం ఇంకో విశేషం.

గత శతాబ్దం చివరి రోజులలో "ఆంగ్లరచయిత- హెచ్.జి. హెల్స్" టైం మెషిను సృష్టించి ఒ నవల వ్రాశాడు. ఈ టైం మెషిన్ తరువాతి ఎందరో రచయితలకు ఒరవడి పెట్టింది. దీనినే "కాల యంత్రం" అన్నారు.

కాలయంత్రంలో ప్రయాణించి భూతకాలంలోకి వెళ్ళి రావచ్చు. భవిష్యత్తును చూచిరావచ్చు. ఈ కాలయంత్రాన్ని ఆధారం చేసుకొని వ్రాయబడిందే "ఎక్కడినుండి ఎక్కడకు?"

డాక్టర్ 'ఎక్స్' అనే ఆయన సృష్టించిన కాల యంత్రంలో 'ధీనిధి' అనే యువకుడు భూతకాలానికీ... "ధీశాలి" అనే యువకుడు 'భవిష్యత్ కాలానికీ ప్రయాణం చేస్తారు.

"ఈ సృష్టి ఎప్పుడు ప్రారంభమయ్యింది? ఏఏ పరిణామాలకు లోనయ్యింది? భవిష్యత్తులో ఏవిధంగా మారుతుంది?" అనే ప్రశ్నలకు భౌతిక శాస్త్ర పరంగా, రచయిత జవాబులు చెబుతారు.

'గతం'లోని పరిణామాలను చరిత్ర కారులు రకరకాలుగా ఊహించారు. వాటినన్నిటినీ క్రోడీకరిస్తూ 'ధీనిధి' ఆయా కాలాల వ్యక్తులతో కలిసి చర్చించినట్లు రచయిత చిత్రిస్తాడు.

భవిష్యత్తు అగమ్యగోచరంగా ఉన్నది.

కొందరు 'జలప్రళయం' వచ్చి సృష్టి నాశన మౌతుంది అని అంటే మరి కొందరు గుర్తు తెలియని ఏదో 'తోకచుక్క' భూమిని ఢీ కొంటుంది, దానితో భూమి మీద జీవమంతా నశించి పోతుంది అని ఊహిస్తారు. ఆ ఉపద్రవం నుండి తప్పించుకోవటానికి ఆనాటి మానవులు ఏం చేసిందీ తెలుసుకుంటాం మనం.

తెలుగు సాహిత్యాన్ని అపరాధ పరిశోధక నవలా సాహిత్యం కొన్నాళ్ళు ప్రభావితం చేసింది. ఆ సాహిత్యంలో అక్కడక్కడా సైన్స్‌ను పొందుపరచి 'సగం' అపరాధ పరిశోధన.. సగం 'సైన్స్ ఫిక్షన్' అని అనిపించేలా రచనలు

చేసిన రచయితలు కొందరు ఉన్నారు. ఇటీవలే వచ్చిన 'వాణిశ్రీ' రచన 'కాంచనగ్రహం' ఆ కోవకు చెందిందే.

భరద్వాజ గారి 'జలప్రళయం' 1963 లో ప్రచురింపబడింది. ఆనాటి నుండి రెండు దశాబ్దాల పాటు 'సైన్స్ ఫిక్షన్ 'తెలుగు సాహిత్యంలో నిశ్శబ్దంగా ఉండి పోయిందనే చెపమికోవాలి.

ఆంగ్ల సాహిత్యం ఇచ్చిన ఊపు వల్లనో, పత్రికాసంపాకులు ఇచ్చిన ప్రోత్సాహం వల్లనో పాఠకులు చూపించిన ఆదరణ వల్ల నో కాని ఇటీవల రెండు మూడు సంవత్సరాలలో కొన్ని పేర్కొనదగిన నవలలు, కథలు వచ్చాయి.

అలా వచ్చిన నవలల్లో శ్రీ ఎన్. ఆర్. నంది గారి "గుడ్‌బై... భూదేవీ...గుడ్‌బై.. డిసెంబర్31,1,99,999. శ్రీ మైనంపాటి భాస్కర్‌గారి "బుద్ధిజీవి", పురాణపండ రంగనాధ్ గారి 'సంకేతం' చెప్పుకోదగినవి.

ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రిక వారు నిర్వహించిన ఉగాది నవలల పోటీలో బహుమతి పొందిందే మైనంపాటి భాస్కర్‌గారి "బుద్ధిజీవి".

రాబోయే శతాబ్దం లో మనుష లెలా ఉంటారు? అప్పటి సామాజిక పరిస్థితితులు ఎలా ఉంటాయి? అనే ప్రశ్నలకు సమాధానాలా? అన్నట్లు నేటి 'సైన్స్' ను ఆధారంగా తీసుకొని అల్లిన కల్పనా కథ "బుద్ధి జీవి".

సైన్స్ సాధించిన మరమనుషులు... టెస్ట్‌ట్యూబ్ ప్రజలు.. క్షణంలో భూమి మీద ప్రాణకోటిని నాశనం చేయగల "బాక్టీరియా విషక్రిముల సృష్టి.అప్పుడప్పుడూ ఆకాశంలో కనుపించి ప్రజలను భయ భ్రాంతులను చేసే "ఫ్లయింగ్ సాసర్లు... గాలిలో ఎగిరిపోగల 'సోలార్ ఎయిర్‌కార్లు' కంఠస్వరంలోని శబ్దాల కే పడిపోగల' సోనార్ లాక్స్', ఇతర గ్రహాలలో ఉన్నారేమో? నని ఊహిస్తున్న ' బుద్ధి జీవులు ఈ నవలలో పాఠకుడికి ప్రత్యక్షమౌతారు.

"అమీబా" అనేది ఏకకణజీవి. ఆ జీవినుండి, ఏ జీవీ లేకుండానే ఇంకొక జీవి ఉద్భవిస్తుంది. అలాగే మని షిలోనుండి మనిషిని సృష్టించవచ్చు; అన్న విషయాన్ని తీసుకొని "క్లోనింగ్" ప్రజలను రచయిత పరిచయం చేస్తాడు.

ఒక చెట్టుకు అదే చెట్టు కొమ్మను కట్టి ఇంకో చెట్టును సృష్టించడం వృక్షశాస్త్రం సాధించిన విజయం. అల్లాగే ఒక వ్యక్తి శరీర కణంలో నుండి ఇంకో వ్యక్తిని సృష్టించవచ్చునేమో?' అని ఊహించిన ఊహకుతోడు నేడు" జెనిటిక్స్ శాస్త్రం సాధించిన ప్రగతిని జోడించి "క్లోనింగ్" మనుషులు సృష్టింపబడతారు.

ఇందులో నాయికానాయకులు "అపురూప... అజిత్‌లు. అపురూప టెస్ట్‌ట్యూబ్ నుండి జన్మిస్తే... అజిత్ అచ్చంగా మరమనిషి.. అతడు మరమనిషి అనే విషయం ఎక్కడా బైటపడకుండా పాఠకులకు ఉత్కంఠ కలిగించేలా కథ నడిచిపోతుంది.

ఈ సృష్టి అంతా "ద్రవ్యం" తో నిర్మించబడి ఉన్నది. ద్రవ్యాన్నే ఆంగ్లంలో "మేటర్" అంటారు. ఈ మేటర్‌కు ఏంటీమేటర్ కూడా ఉన్నదని శాస్త్రజ్ఞులు కనుక్కున్నారు. ఈ ద్రవ్యాలు రెండూ కలుసుకుంటే ప్రళయం జరుగుతుంది. సర్వం నాశనమై పోతుంది. ఈ విషయాన్ని ఇతివృత్తంగా తీసుకొని భూమి మీద జీవులకూ.. యాంటీ మేటర్ లోని జీవులకూ సంబంధాలు కలిపి వ్రాయబడినదే "గుడ్‌బై భూదేవి.. గుడ్‌బై" నవల..

దీనిలో ఒక కొత్త ఎలక్ట్రానిక్ యంత్రాన్ని పరిచయం చేస్తాడు రచయిత.. అదే "క్లాటర్ యంత్రం" మనిషిని "హిప్నటైజ్ చేయటం మనం విన్నాం.. ఆలాగే క్లాటర్‌మెషిన్‌తో ఎక్కడో దూరాన ఉన్న వాళ్ళ మెదడుతో మాట్లాడవచ్చునట. "కంప్యూటర్ అండ్ లేసర్ ఎసిస్టెడ్ ట్రాన్స్‌మీటర్ అండ్ రిసీవర్"లోని మెదటి అక్షరాల కలయికే "క్లాటర్"

మెదడులో ఉత్పత్తి అయ్యే రసాయనిక విద్యుత్ ప్రకంపనాలను క్లాటర్ గ్రహించి ఆ వ్యక్తితో కాంటాక్ట్

పెట్టుకుంటుంది. వ్యక్తి యొక్క "బ్రెయిన్ వేవ్‌లెంగ్త్" తెలిస్తే చాలు? అతడిని చెప్పుచేతల్లో పెట్టుకోవచ్చు.

ఈ యంత్రం 'దుష్టబుద్ధి' ఉన్నవాళ్ళ చేతుల్లో పడితే ఎన్ని అనర్థాలు సృష్టిస్తుందో.. మంచి వాళ్ళ చేతుల్లో ఉంటే సమాజానికి ఎలా ఉపయోగపడుతుందో తెలియజెబుతుంది ఈ నవల...

మనిషిలో "అసూయ...ద్వేషాలు " ఉన్నాయి. అవి ఎటువంటి విప్లవాలను సృష్టించి భూమిని అల్లకల్లోలం చేస్తాయో సైన్స్ ద్వారా వివరించి చెప్పే రచన "డిసెంబర్ 31,1,99,999. ఇదీ ఎన్. ఆర్. నందిగారి రచనే... సైన్స్‌ను చక్కగా కథనంలో అతికిస్తారు మన నందిగారు.

'ఈనాటి మనిషి భావాలైన "కోపం, అసూయలు.. 2 లక్షల సంవత్సరాల తరువాత కూడా వాటి ప్రభావాన్ని చూపిస్తాయి అని వ్యంగ్యంగా చెబుతాడు రచయిత.

'సైన్స్' కోవలోనే నడచిన పురాణపండ రంగనాథ్ గారి "సంకేతం' నవల కూడా చెప్పుకోదగిందే!

కథా సాహిత్యంలో కూడా "సైన్స్ ఫిక్షన్" చోటు చేసుకున్నా అది అడపా దడపా వచ్చిందనే చెప్పుకోవాలి.

ఎప్పుడో వసంతరావు వెంకటరావుగారు బుధ గ్రహాన్ని గురించి "బుధులు" అనే కథ, కొత్తగా కనిపెట్టబడిన "మిథేనియా" నక్షత్రం గురించి కథ వ్రాశారు.. మిథేనియాలో ఉన్నదనుకుంటున్న వాతావరణాన్ని బట్టి అక్కడి జీవులు ఎలా ఉంటారో? వారి ఆచార వ్యవహారాలు ఏమిటో? కల్పించి చెబుతారు వెంకట రావుగారు.

అబ్బరాజు నాగభూషణం గారు 'కళ్ళ' మార్పిడి గురించి ఒక కథ వ్రాశారు.. కె. ఆర్. కె.మోహన్ గారు ఇతర నక్షత్రాలు.. గ్రహాల యాత్రల గురించి అక్కడి జీవుల గురించి కథలు వ్రాశారు.

అమెరికాలో ఉద్యోగరీత్యా స్థిరపడిన ఆంధ్రులు సంవత్సరానికి రెండు సంచికల చొప్పున 1972లో "తెలుగు భాషా పత్రికను ప్రారంభించారు. దానిలో సైన్స్ వ్యాసాలతో పాటు చాలా "సైన్స్ ఫిక్షన్" కథలను ప్రచురించారు. అంతేకాకుండా "సైన్స్ ఫిక్షన్ కథల పోటీ"ని గూడా నిర్వహించి మంచి కథలు రాయటానికి దోహదం కలుగజేశారు.

'ఆంధ్ర ప్రభ సచిత్ర వారపత్రిక'వారు 1983 ఉగాదికి "వైజ్ఞానిక కథల పోటీ ఏర్పాటు చేశారు. ఆ పోటీలో తెలుగులోనికి వచ్చినవే, రెంటాల నాగేశ్వరరావుగారి "స్త్రీ పర్వం", పిల్లలమర్రి రామలక్ష్మి గారి "జెనెసిస్"... సరోజా సింధూరి గారి "వరదగుడి"... మైనంపాటి భాస్కర్‌గారి "డీప్‌ఫ్రీజ్" కథలు..

స్త్రీ పర్వం ఒక చిత్రమైన కథ. దీనిలో కథను జెనిటిక్ విషయాలతో అల్లాడు రచయిత. స్త్రీ చర్మంనుండి భాగాన్ని తీసి... స్త్రీ అండంతో కలిపి పిల్లలను సృష్టి చేయించవచ్చునట.. ఇక్కడ చర్మదాత" అయిన స్త్రీ తండ్రి అయితే "వీర్యదాత" అయిన స్త్రీ తల్లి అవుతుంది. ఇదంతా సైన్స్ చేయబోయే గమ్మత్తు.

కథలు నవలలతో పాటు అప్పుడప్పుడు రేడియోలో వినిపించి...గాలిలో కలసి పోయిన కొన్ని సైన్స్ ఫిక్షన్ శ్రవ్య నాటికలూ ఉన్నాయి... ఇలా విజయ వాడ కేంద్రం... మద్రాసు కేంద్రం వారు గాలా కాలం క్రితం ప్రసారం చేశారు.

ఇటీవలి కాలంలో హైదరాబాదు కేంద్రం నుండి ప్రసారమైన కె. చిరంజీవి గారి రచనలు.. "కాలయంత్రం... ఆకలి మందు... వంశాంకురం....." సైన్స్ ఫిక్షన్ కోవకు చెందినవే!

మానవాళిని పట్టి పీడిస్తున్న ఆకలికి మందు ఉంటే దాని వల్ల వచ్చే పరిణామాలను 'ఆకలి మందు' ఎలుగెత్తి చాటుతుంది. పిల్లలు కలుగక పోయిన వాళ్ళు 'పరీక్షా నాళికలు ' (టెస్ట్ ట్యూబ్‌ల) పాపాయిల్ని పెంచుకొని "వంశాన్ని' నిలబెట్టుకోవచ్చు అని చెబుతుంది "వంశాంకురం"

"కాలయంత్రం" ఒక వినూత్న సృష్టి. నాటిక

"సైన్స్ ఫిక్షన్" అయితే.. దాని ప్రసారం కూడా "సైంటిఫిక్" గానే జరుగుతుంది. ఆకాశవాణి కేంద్రంలో వారు ఒక 'అద్భుత యంత్రాన్ని' సృష్టిస్తారు. దానిపేరు "మిరికల్ మెషిన్" దానికి ఏదన్నా విషయాన్ని ఇచ్చి నాటికను ప్రసారం చేయమంటే చక్కగా ప్రసారం చేస్తుంది. అలా ప్రసారం చేయబడుతుంది 'కాల యంత్రం.'

విశ్వంలో ఎంతో శక్తి ఉన్నది. దానిని మానవాళి సక్రమంగా వినియోగించుకోవచ్చు - అన్నదానికి 'ప్రతీక' గా దీనిలో "విశ్వం" అనే మేధావి రకరకాల యంత్రాలను సృష్టిస్తాడు. రచయిత తన రచనను "సైఫిక్" రచన అంటారు. "సైన్స్-ఫిక్షన్" అనే రెండు పదాలలోని మొదటి అక్షరాలే "సైఫిక్". ఇదో వింత సృష్టి.

సాగర మంత ఉన్న సాహిత్యంలో చిన్న చెరువంత ఉన్నది "బాలసాహిత్యం". ఈ సాహిత్యంలో కూడా కొన్ని సైన్స్ ఫిక్షన్ రచనలు వచ్చాయి.

ఎప్పుడో "రాయ్ వ్యాస్" గారు "అష్ట సిద్ధ అంతరిక్ష యాత్ర" నవల వ్రాశారు. చింతా బాలం భొట్లు గారు "చంద్రమండల యాత్ర" నవల అందించారు. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ఇచ్చిన ప్రేరణతో "అనంతంలో అంతం"... నవల వ్రాసి అకాడమీ వారి బహుమతిని పొందారు శ్రీమతి కంచి రమాదేవిగారు.

"అనంతంలోని అంతం" లో చక్కని సైన్స్ కథతో పాటు సందేశాన్ని కూడా జత చేశారు రచయిత్రి.. పిల్లలు చదివి పొందుపరుచుకోదగిన విషయాలు ఎన్నో ఈ నవలలో ఉన్నాయి.

పిల్లల మాసపత్రిక "బాలజ్యోతి" వారి బహుమతి పొంది సీరియల్‌గా వచ్చింది రెంటాల నాగేశ్వరరావుగారి దక్షిణ 'ధ్రువయాత్ర'.

బెలగాం భీమేశ్వరరావు "చెట్లొస్తున్నాయి జాగ్రత్త" నవల వ్రాశారు. శాస్త్రీయంగా చెట్లు గురించీ, అవేమనుషుల్లాగా మసలితే రాగల పరిణామాలగురించీ రచయత పిల్లలలకు ఆసక్తి కరంగా చెబుతారు...

ఆంధ్రప్రభ వార పత్రికలో సీరియల్‌గా వచ్చి తరువాత పుస్తక రూపంలో వచ్చింది ప్రఫుల్ల చంద్రగారి "మహానగరంలో మరుగుజ్జు" నవల. చక్కని ఇతివృత్తం తో సైన్స్ విషయాలనే గాక "వెంట్రిలాక్విజమ్... హిప్నాటిజం" మొదలైన విషయాలను గూడా పొందుపరిచాడు రచయిత...

ఇతర భాషలలో ప్రజాదరణ పొందిన రచనలను తెలుగులోకి తెచ్చుకుంటున్నారు. సైన్స్ ఫిక్షన్ రచనలు అనువాదాలు అంతంతమాత్రంగానే వచ్చాయి.

జూల్స్‌వెర్న్ వ్రాసిన "వాయేజ్ టు ది సెంటర్ ఆఫ్ ది ఎర్త్... ట్వెంటీ థౌజండ్ లీగ్స్ అండర్ ద సీ... ఎరౌండ్ ది వరల్డ్ ఇన్ ఎయిటీ డేస్.." నవల అనువదింపబడ్డాయి..

రష్యన్ రచయిత 'అలెక్సీ టాల్‌స్టాయ్' వ్రాసిన మంచినవల 'అయిలీత' చాలా కాలం క్రితమే అనువదింపబడి మాస్కోనుండే తెలుగు భూమికి వచ్చింది. ఉత్కంఠ కలిగించే కథతో పాటు చక్కని కథనం ఉన్ననవల 'అయిలీత', ఇటీవల ఇది పునర్ముద్రింపబడింది.

వి.ముఖనోవస్కీ "ప్రతిరూపాలు", ఎ. బెల్యాయెవ్ "ఇకతియాండర్" అబ్రయోవ్ "గులాబిమేఘాలు". అలెగ్జాండర్ గ్రీన్ "ఎర్ర తెరచాపలు", రష్యన్ నవలలు తెలుగులోకి ఇటీవలి కాలంలో వచ్చిన మంచి నవలలు..

ఈ శతాబ్దం ప్రారంభంలో ప్రఖ్యాత ఆంగ్ల సైన్స్ ఫిక్షన్ రచయిత, ఆనాటి వరకూ వచ్చిన సైన్స్ అభివృద్ధిని.. రాగల కాలంలో అది పొందగల 'పరిణామాన్ని' "ఊహిస్తూ" ఒకరోజువస్తుంది"... అని ఆశాభావాన్ని వ్యక్తం చేస్తాడు.

అలాగే తెలుగు సాహిత్యంలో సైన్స్ ఫిక్షన్ 'వెల్లువలా' రావటానికి తప్పకుండా 'ఒకరోజువస్తుంద'ని ఆశిద్దాం!

●●●

# తెలుగు నవల – ఇటీవలి ధోరణులు

– డాక్టర్ కె.వి.కృష్ణకుమారి

సమాజంలో సాహిత్యానికున్న స్థానం అపూర్వ మైనదీ, అతి పవిత్రమైనది, ఎంతో శక్తిమంతమైనదీ. సమాజపరంగా రచయిత కాపాడించబడిన బాధ్యతలు గురుతరమైనవి, ఊహాతీతమైనవి.

రచయిత తల్చుకుంటే – సాధించదల్చుకుంటే – అతని మేధకు గానీ – కలం వేగానికిగానీ అడ్డూ ఆపూ ఉండదు. అవధులనేవే వుండవు. ఎంతో శక్తిమంతమైన కలం– సమాజపులోతుల్లోకి చొచ్చుకుపోయి గూడుకట్టిన కల్మషాన్ని కడిగివెయ్యగలదు. దుర్గంధ భూయిష్ఠమైన పరిసరాలను దావాగ్నిలా దహించివేయనూ గలదు –

ఒక సర్జన్ చేతిలోవున్న కత్తి – శరీరంలోని కుళ్ళిన భాగాలను వేరుచేసి – ఆరోగ్యవంతం చేసి – ఆ ప్రాణాన్నీ – అతనికి సంబంధించిన కుటుంబాన్ని మటుకు కాపాడగలిగితే –

రచయిత తన చేతిలో వున్న శక్తిమంతమైన ఆయుధంతో అవినీతితో గూడు కట్టుకొని లోపభూయిష్ఠమైన కుళ్ళి దుర్వాసనలు వెదజల్లుతున్న సమాజపు అట్టడుగు పొరలోకి చొచ్చుకుపోయి, కాలుష్యాన్ని నిర్మూలించి – ఆరోగ్య వాతావరణాన్ని సృష్టించగల శక్తి సామర్థ్యాలను సాధించగల శక్తివంతుడు.

అభిమానులూ– పాఠకులూ – గుడ్డిగా అభిమానించే తమ అభిమాన రచయిత అడుగు జాడల్లో కళ్ళుమూసుకు నడవటానికి సిద్ధంగా వున్నారు. ఎప్పటికీ వుంటారు. అటువంటి పవిత్రస్థాయిలో వున్న రచయిత – తనస్థితినీ – కలం బలాన్ని – మెదడు పదునునూ – సమాజ పరమైన అభివృద్ధికోసం – అత్యున్నతి కోసం – ఆరోగ్య వాతావరణం సృష్టించటానికి కంకణం కట్టుకోవాలి. తన మీదనున్న బృహత్తర బాధ్యతకూ – తననే అనుసరించటానికి సిద్ధంగా వున్న అభిమానులుకూ శక్తివంచన లేకుండా తన రచనల ద్వారా న్యాయం చెయ్యటానికి సంసిద్ధంగా వుండాలి.

న్యాయం చెయ్యలేక పోయినా – కనీసం–అన్యాయం చెయ్యకుండానైనా జాగ్రత్తపడాలి.–

కానీ – రచనాపరంగా ఇపమెడు జరుగుతున్న దేమిటి ?

రచనల్లో – ఆ శైలిలో ప్రస్ఫుటించే భావావేశంలో భాషలో – ఇవ్వాలనుకునే సందేశంలో – తప్పకుండా – రచయిత మానసిక స్థితీ – రచయిత వ్యక్తిగతాభిప్రాయాలూ చోటుచేసుకుంటాయి.

వేప విత్తనానికి మామిడి మొక్కలు మొలవవుకదా. గమ్యం తెలియకుండా వెళ్ళేరైలులో ఎక్కినవారు అనుకున్న గమ్యం చేరలేరు కదా –

అలాగా – బాధ్యతారాహిత్యం – రచయిత లేదా – రచయిత్రిపరమైనప్పుడు దాని ప్రభావం చాల దయనీయంగా వుంటుంది. అటువంటి ప్రభావాన్నే – నవలల పరంగా, సహజపరంగా – మన మిప్పుడు స్పష్టంగా చూడగలుగుతున్నాం.

సమాజంలో మంచిని గమనించాలనీ – మంచిని సృష్టించాలనీ మంచిపనులు చెయ్యాలనీ – మంచిని సాధించాలనీ – ఆరాటంతో సాహిత్య పోరాటం చేసిన – ఎందరో సమర్థులైన రచయితలు ఇప్పుడు చేతులు ముడుచుకు కూర్చున్నారు – చేవచచ్చి కాదు.

ప్రస్తుత సాహిత్యంతో పొలుపంచుకోలేక – అనారోగ్య వాతావరణంలో – కాలుమోపటం ఇష్టంలేక – సాహితీ

పరంగా కూడా దారుణంగా వ్యాప్తి చెందుతున్న కాలుష్య వాతావరణం పోకపోతుందా - సాహితీవనంలో- ఆరోగ్యపవనాలు వీవకపోతాయా అన్న ఆశతో......

ఆ ఆశ ఎప్పటికప్పుడు నిరాశగానే మిగిలిపోతోంది. సాహిత్యం - వ్యాపార పంథాలో నడుస్తోంది - ప్రచురణ కర్మలో - పత్రికాధినేతలు చేతులు కాల్చుకోటానికి సాహసించలేకపోతున్నామంటున్నారు. రచయితలు పాఠకుల నాడిని బట్టే - పుంఖాను పుంఖాలుగా రచనలు చేస్తున్నామంటారు - పేరు ప్రఖ్యాతులు సంపాదించుకుంటున్నారు. చిత్రంగా - ఎటువంటి సాహిత్యమైనా హాట్ కేక్స్‌లా అమ్ముడుపోతున్నాయి.

పాఠకులు చదవకుంటే మే మెందుకు వ్రాస్తా మంటున్నారు సెక్స్‌రచయితలు - అనారోగ్య పంథాలో యథేచ్ఛగా నడుస్తున్న ప్రస్తుత ప్రముఖ రచయితలు- అలా ఆత్మవంచన చేసుకునే ముందు క్షణం ఆలోచించి ఆత్మపరిశీలన చేసుకుంటే ఎంత బాగుంటుంది !

చెడు వ్యాపించినంత వేగంగా మంచి వ్యాపిస్తుందా? వ్యాపించగలదా? చెడును ఆదరించినంత వేగంగానూ మంచి నెవరైన ఆదరించగలరా ?

ఇద్దరు స్త్రీ పురుషుల మధ్య పవిత్ర అనుబంధం వుందంటే, వుందని నమ్మదు లోకం. ఆ పవిత్రతను హర్షించి అర్థంచేసుకోలేదు. లేని అపవిత్రతని ఆపాదించాలనీ మరొకరు ఆపాదించగా విని కళ్ళు మూసుకొని చూసి ఆనందించాలనీ అవ్యక్తానందాన్ని అందుకోవాలని - సగటు మనిషి తాపత్రయ పడుతూ వుంటాడు. ఇది అనారోగ్య లక్షణం. ఈ అనారోగ్య లక్షణానికి మందువేసి- మందలించి ఆరోగ్యపు ఆలోచనల వైపుకు దృష్టిని సారించేలా చెయ్యాలి గానీ అటువంటి వారి ఊహా గానాలకే ఊపిరి పోస్తే ?

ఊపిరే పోస్తోంది నేటి నవలా సాహిత్యం. ఎక్కడ చూసినా సెక్స్, క్రైం, భయాందోళనలను-రక్తపోటును పెంచే భయంకర రచనలు.

అభిమాన రచయితలే వ్రాయగా లేనిది ఆచరిస్తే తప్పే ముందనుకుంటున్నారు బుజ్జిఎదగని అమాయక పాఠకులు - చెడునుకూడా - మంచిగా అన్వయించుకొని ఆచరిస్తున్నారు, అథఃపాతాళంలోకి కృంగిపోతున్నారు.

ఎంతబలమైన శిలమీదనైనా జలపాతం అదేపనిగా ఉద్ధతంగా పడుతూవుంటే ఆతాకిడికి శిల కరిగి తన ఉనికినే కోల్పోతుంది.

ప్రస్తుత నవలా సామ్రాజ్యంలో ఎందరు అమాయకులు మహోద్ధృతంగా సాగుతున్న రచయితల తాకిడిని తట్టుకోలేక తమతమ మానసిక శక్తుల్ని కోల్పోతున్నారు. కొందరి మీద నేటి నవలా సాహిత్యం స్లోపాయిజన్‌లా పనిచేస్తోంది.

ఆరోగ్యకరమైన మనిషికి కేన్సర్ వ్యాధుందని పదిమంది అదే పనిగా ఆలోచన్లని రేకెత్తిస్తే అతనిలో నిజంగా కేన్సర్ వుందేమోనన్న అనుమానం మహావృక్షమై వ్రేళ్ళునాటుకుపోయి ఆ మనిషినీ మనసునూ బలహీన పరచి- వ్యాధి నిరోధక శక్తి తగ్గిపోయి నిజంగానే కేన్సరును తెచ్చే పరిస్థితులకి దారితీస్తుంది.

అదేవిధంగా - విశృంఖలంగా సెక్స్, సిగ్గువిడచి నేటి సాహిత్యంలో, నవలా సాహిత్యంలో, వెఱ్ఱితలలు వేస్తూ - నేటి యువతరంపైన అనూహ్యమైన అనారోగ్యకరమైన ప్రభావాన్ని చూపిస్తుంటే, ఆవలయంలో కొట్టు మిట్టాడు తున్న వారికి, మంచీ చెడూ తారతమ్యం నశించి పోతోంది. విచ్చలవిడిభావాలు వెఱ్ఱితలలు వేస్తున్నాయి. ఎంతో విలువైన కాలం వ్యర్థమై పోతోంది. మంచి నుంచి కూడా చెడును ఆస్వాదించే స్థితికి అమాయకులు దిగజారిపోతున్నారు.

సెక్స్ - లేదంటే - క్రైం - అవీ లేదంటే - బీభత్సం

-చేతబడులూ, మానసికంగా, శారీరకంగా, మనుషుల్ని ఉన్మాదులను చేస్తున్నాయి.

"ఒక తండ్రి కూతుర్ని త్రాగిన మైకంలో గర్భవతిని చేశాడు" సెక్స్ - అన్నం తినుట లాంటి ఒక అనుభూతట. అలా అని అతని అభిమాన రచయిత వ్రాశాట్ట!

"ప్రేమకు అర్థం శరీరాల కలయికేట; అది లేని ప్రేమకి అర్థం లేదుట" అలాఅని- ఒక రచయిత్రి వ్రాసిందిట - ఎందరో, అతిచిన్న వయసులోనే గర్భాలు తెచ్చుకు వచ్చారు గర్భవిచ్ఛిన్న చెయ్యమని.

చాలామంది - మానసికాందోళనని అదుపులో పెట్టుకోలేక తన కెవరో చేతబడి చేశారని విపరీతంగా భయపడి పోతున్నారు.

ఎందరికో నేటి నవలా ప్రపంచం రక్తపోటునూ, షుగరునూ, మానసిక ఉన్మాదాన్ని ప్రసాదిస్తోంది. మదోన్మత్తుల్ని చేస్తోంది.

ఈ ధోరణిని వ్యతిరేకించే సాహితీ వేత్తలు ఎదురు చూస్తున్నారు. పెరుగుట విరుగుటకొరకేనని బాగా తెల్సు వారికి. ఈ అతి పెరిగి పెరిగి ఏదోనాడు విరిగిపోతుంది.

సామాన్య పాఠకులు మత్తు కరిగిపోతుంది. మంచి తమ అభిమాన రచయితలనుంచే కాదు, ఎవరైనా, ఎవరైనా సరే నాలుగు మంచిమాటలు చెప్తే చదివి జీర్ణించుకుని తమజీవితాలను చక్కదిద్దుకోవాలని, ఆర్తిగా, ఎదురు చూసే మంచిరోజులు త్వరలోనే వస్తాయి.

ఆశుభదినాన సాహితీలోకంలో ఆరోగ్య పవనాలు వస్తాయి.

పదునెక్కిన కలాలు బలంగా ఆరోగ్య పంథాలో పరుగులు తీస్తాయి.

ఆరోజు త్వరలో, అతీత్వరలోనే వస్తుందన్న ఆశతో, ఎదురు చూస్తూవుంటాను.

●●●

## అలుపెరగని కవితాభాస్కరుడు

*(144వ పుట తరువాయి)*

రాసినా, ఎలిజీ రాసినా, నగ్నమునికి కవి అంటేనే దేశం అని రాసినా అనంత వైవిధ్యంతో మనుషుల పట్ల, కవిత్వం పట్ల, జీవితం పట్ల ప్రేమని వ్యక్తీకరించారు. కె. శ్రీనివాస్ అన్నట్లు 'ఎవరి గొప్పతనానికైనా అవార్డులు గీటురాళ్ళు కావు. శివారెడ్డి విషయంలోనైతే కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు పెద్ద సందర్భంగా కూడా కాదు'. నిజమే కదూ.

1990లో కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు (1989కి) అందుకున్న శివారెడ్డికి సాన్నిహిత్యం జీవలక్షణం. ఎవరి కళ్ళల్లో నైనా మంటకానీ, దుఃఖం కానీ కనిపిస్తే, ఎవరైనా కవిత్వాన్ని బొమ్మగా చేసి అడుక్కుంటే అసహ్యించుకుంటారు. మనిషికీ, భూమికీ ఉన్న సంబంధం, తన శ్రమ ఫలితం తనది గాకుండా పోయినపమిడు మిగిలేది విషాదం ఒంటరితనం అనివార్యంగా పోరాటం అవసరమనేది ఆయన కవితల అంతస్సూత్రం.

ఆయనే అన్నట్లు 'నా జీవితం నుంచి నన్ను విడదీసి, నా సమాజం నుంచి నన్ను విడదీసి, నా కాలాన్నుంచి నన్ను విడదీస్తే నా కవిత్వమేమీ మిగలదు,' నిజమే ఆ మాటకొస్తే ఏ సాహిత్యమూ మిగలదు. ఆయన కవిత్వాన్నీ మనుషుల్నీ ప్రాణప్రదంగా ప్రేమిస్తారు. ఆకలి ఉన్నంతకాలం, పోరాటం సాగినంత కాలం ఆయన ఆగిపోరు.

●●●

# నామిని రచనలు – ఒక వివేచన

– శ్రీ ఫణికుమార్

తెలుగు కథ పురాణాలంత పురాతనమైనది. తెలుగు నవలేమో నూరేళ్ళ పంట. తెలుగు కథానిక వయసు సుమారు ఎనభై యేళ్ళు. ఈ ప్రక్రియా విశేషాలలో ఏదీ శైశవ ప్రాయంలో లేదు. ఇన్నేళ్ళ అనుభవమున్న తరువాత యిప్పుడొచ్చే రచనల్లో లోపాలేవైనా ఉంటే అవి ఆయా రచయితలకు సంబంధించినవే తప్ప ప్రక్రియలలో పరిణామం, అభివృద్ధి లేనందువల్ల వచ్చినవి కావు.

తెలుగు నవల వీరేశలింగం, చిలకమర్తి, విశ్వనాథ, ఉన్నవ, జి.వి. కృష్ణారావు, గోపీచంద్, బుచ్చిబాబు, రావిశాస్త్రి, బీనాదేవి వంటి వుద్దండుల చేతుల్లో తెలుగు జన జీవితానికి అద్దం పట్టింది. తెలుగు కథానిక కూడా ఈ మార్గాన్నే అనుసరించింది. గురజాడ, శ్రీపాద, పాలగుమ్మి, కా.రా, రావిశాస్త్రి, చాసో,బీనాదేవి గార్ల సాహచర్యంలో ఏ ఇతర భారతీయ భాషలలోని కథకు తీసిపోకుండా నిలిచింది.

తెలుగు కథానిక, నవల తొక్కిన ఒక మార్గం ఇలా వుండగా, అవి తొక్కిన మరో మార్గం దీనికి భిన్నంగా వుంది. ఆధునికత అంటే వివిధ విషయాలకు సంబంధించిన వస్తు పరిజ్ఞానం ఇవ్వడమని నిర్వచించుకుని, విచిత్ర ఇతివృత్తాలు ఎన్నుకుని, అందుకు సంబంధించిన సూక్ష్మాతి సూక్ష్మమైన వివరాలు ఇవ్వడం ప్రారంభించారు రచయితలు. అలాగే క్షుద్ర విద్యలకు సంబంధించిన కథలు, నవలలు రాసినవారు కూడా ఆ విద్యల తాలూకు వివరాలను సేకరించి రాయడం ద్వారా అవన్నీ పరిశోధనాత్మక రచనలు అనే భ్రమను కలిగించారు.

అవి వొకవేళ పరిశోధనాత్మక రచనలే అయినా సాహిత్యపు పరమోద్దేశం విషయ పరిజ్ఞాన దానం కానేకాదు. జన జీవితానికి అద్దం పట్టి జీవితాన్ని విమర్శించి, దైనందిన జీవితంలోని సుఖ దుఃఖాలకు ప్రాతిపదికలైన సాంఘిక, ఆర్థిక పరిస్థితులను విశ్లేషించి ప్రపంచం పట్ల ప్రపంచంలోని మనుషుల పట్ల మన అవగాహనను పెంచడం, జన జీవితంలోని చీకటి కోణాలపై వెలుగు ప్రసరించడం సాహిత్య పఠనం వలన కలగవలసిన ప్రయోజనం.ఈ స్పృహ చాలా తక్కువమంది రచయితల లోనే కనబడుతూంది. ఈ రచయితల్ని ఆదరించే పత్రికలూ, పాఠకులూ మరీ తక్కువ.

ఈ మార్గం నుంచి తెలుగు కథానికనూ, నవలనూ జన మార్గంలోకి మళ్లించాలంటే పాఠకుల అభిరుచిలో విప్లవాత్మకమైనమార్పైనా రావాలి; లేదా అలాంటి మార్పు తెచ్చి పథ నిర్దేశం చేయగల రచయితలన్నా రావాలి.

అయత్నంగానే ఈ ప్రయత్నం చేస్తున్న కొద్దిమంది యువతరం రచయితలలో ముఖ్యుడు 'నామిని' అనే శ్రీ నామిని సుబ్రహ్మణ్యం నాయుడు. "పచ్చనాకు సాక్షిగా" స్కెచ్‌లు, "సినబ్బ కతలు" గా వచ్చిన గల్పికలు, "మునికన్నడి సేద్య" మనే నవల ఇప్పటికి నామిని ప్రధాన రచనలు. ఆంధ్రజ్యోతి దినపత్రికలో వచ్చిన "మాఅమ్మ చెప్పిన కథలు" ఇంకా సంకలనంగా రాలేదు. పై రచనల స్థాయికి చెందినవి కూడా కాదు. అందుచేత ఈ కథల్ని, నామిని అప్పుడప్పుడూ పత్రికలలో రాసే వ్యాసాలనీ ఈ వివేచన పరిధిలోకి తీసుకోవడం లేదు.

"పచ్చ నాకు సాక్షిగా" స్కెచెస్‌లో, "సినబ్బ కతలు" గల్పికలలో 'అమ్మ' ప్రధానంగా కనిపిస్తుంది. అమ్మ తరవాత తనకు చదువు చెప్పిన అయ్యవార్లు, భూలోక రంభ, జమున, ఉమ మొదలైన క్లాసు పిల్లలు, ఎంగటలచ్చిమి అనే రికార్డు డాన్సరూ దర్శనమిస్తారు. పాఠశాలలో చదువుకునే రైతు కుటుంబానికి చెందిన విద్యార్థి దృష్టిలో మాస్టారులు, వివిధ ఆర్థిక వర్గాలకు చెందిన తోటి విద్యార్థులు ఎలా వుంటారో తెలుస్తుంది ఇది చదివితే. కథ, కథనమూ ఒకేసారి ప్రారంభమై ఒకేసారి అంతం కావడం వీటి ప్రత్యేకత.

కథకు అనవసరమైన వర్ణనలను, పొల్లు పదాలనూ దరి చేరనివ్వని క్లుప్తత, సాంద్రత వీటి మరో ప్రత్యేకత.

బహుశా చాలా మట్టుకు యివి ఆత్మకథాత్మకాలే అయుండాలి. నామిని స్వీయ జీవితంలోని సంఘటనలకు కొంత వర్ణన, వూహ మేళవించి యీ గల్పికలను సృష్టించారు. నామిని రచనలన్నీ ఉత్తమ పురుషలోనే చెప్పడానికి బహుశా యిదొక కారణం కావచ్చు.

ఇక భాష. రాయలసీమ పల్లీయులు- విశేషించి తిరుపతి-చంద్రగిరి ప్రాంతాల రైతు కుటుంబాల జీవ భాషలో పాత్రలు సంభాషించడమే గాక, కథనం కూడా సాగుతుంది. ఒక విధమైన వీర మాండలిక వాదం కూడా కనబడుతుంది. సంభాషణలు, కథనమే కాక అంకితం కూడా జానపద భాషలో వుంటుంది. మునికన్నడి సేద్యాన్ని బూశవ్వకు అంకితమిస్తూ "చచ్చిపోయినాక యిప్పుడింత జ్ఞాపకాన్ని చూపే నంగి నా కొడుకునైన నేను బతికున్నప్పుడు ఆమె చేతిలో అంత పెట్టని దొంగ నా కొడుకును" అంటాడు నామిని.

"సినబ్బకతల" ను తండ్రి కంకితమిస్తూ -

"మా నాయన నా కడుపున బుట్టాలని, నేను ఆయనను నా కొడకా అని ఏడిపించినట్టే నాకు బుట్టి నా రెక్కల కష్టాన్ని తిని నన్ను 'నా కొడకా, నాకొడకా' అని తనివితీరా అనాలని ఆ భగవంతుని, మా నాయన్ను ప్రార్థించుకుంటున్నాను" అంటాడు.

పల్లీయుల జీవితంపై తన అవగాహన, ఆ మాండలికంపై తనకున్న పట్టు కథనంలోని నిజాయితీ నామిని కథలను యింత బలంగా పలికించాయి. రంగనాయకమ్మగారు నామినిని 'మనగోర్కీ' గా అభివర్ణించడానికి కారణమూ యిదే. రాయలసీమ ప్రాంతపు చిన్న రైతుల జీవితాలను మనకు పరిచయం చేసి మన అవగాహన పరిధిని విస్తరింపచేయడం నామిని యీ స్కెచెస్‌లో, గల్పికలలో సాధించారు.

అయితే ఈ జీవితంపై నామిని కున్న ప్రేమ ఎంత గాఢమయినదంటే రైతుల సుఖ దుఃఖాలపై, మన కతనిచ్చే అవగాహన, సుఖదుఃఖాలకు కారణభూతాలైన ఆర్థిక పరిస్థితులపై ఇవ్వడు. రైతులను యిక్కట్ల పాలుజేసే వ్యక్తులన్నా, పరిస్థితులన్నా మనకు కలగవలసిన కోపమూ ద్వేషమూ కలగనే కలగవు. రైతులు జీవిస్తోంది ఆదర్శవంతమైన జీవితమనీ, వారు ఎటువంటి మార్పూ కోరడం లేదనిన్నీ అనిపిస్తుంది. ఇది సత్యమయే అవకాశం లేదు. కాబట్టి నామిని రచనల బలహీనత ఇదేనని చెప్పవచ్చు.

"మునికన్నడి సేద్యం" నవల కొచ్చేసరికి యీ బలహీనతను వదిలించుకోకున్నా, ఇంత అమాయకంగానైతే లేడు రచయిత. రచయితగా ఎంతో పరిణతి చెందాడు.

"మునికన్నడి సేద్యం" నవల ఇతివృత్తం స్థూలంగా ఇది :

రంగంపేట అనే గ్రామంలో జీవితం గడవని కారణంగా బావ ప్రోత్సాహంతో ఇలామంతునాయుడి కుటుంబం మిట్టూరు గ్రామం వెడుతుంది. ఇలా మంతునాయుడు, భార్య వెంకటమ్మ, పుత్రులు మునికన్నమనాయుడు, ధర్మానాయుడు, చిన్నోడు ఈ కుటుంబ సభ్యులు, అక్కడ అద్దాలామె అనే absentee land lady నుంచి భూమి కౌలుకు తీసుకుని, పుష్కలంగా ధాన్యం పండించి, కడుపు నిండా తినడమే కాక మిగులు ధాన్యాన్ని అమ్మి రెండు గేదెలు కూడా సంపాదిస్తాడు. మరుసటి సంవత్సరం సరిగ్గా వానలు కురవని కారణంగా, కరెంటు కోత కారణంగా వీరంతా నానా బాధలు పడ్డా భూమిని మాత్రం బీడు పెట్టనివ్వడు. వెంకటమ్మకు "కేళీ యిలాసం" గా వుంది. ఫ్యూడల్ వ్యవస్థలోని మంచి లక్షణా లివి.

అయితే, అప్పటికే వుత్పత్తులలో, వుత్పత్తి సంబంధాలలో పరిణామం వస్తోంది. ఏటా కష్టపడి భూమి దున్ని మునికన్నడు సంపాదించే సొమ్ము పాలు పితకడం లాంటి వృత్తులలో సంపాదించవచ్చునని 'ధర్మడు' గ్రహించాడు. పాల కేంద్రం వచ్చి ఈ పని పోయినా సా

మిల్లులో పనిచేస్తాననడమే కాక ఆస్తిలో భాగం పెట్టమంటాడు ధర్మడు. ఫ్యూడల్ సంబంధాల నుంచి పెట్టుబడి సంబంధాలకు జీవితం పరిణామం చెందే సంధి దశలో, పెట్టుబడి వ్యవస్థకు, ఆ వ్యవస్థ తాలూకు విలువలకు ప్రతీక ధర్మడు. ఈ మార్పు ఎంత తీవ్రమైనదంటే, మధ్య తరగతినే మాయం చేస్తుంది. ఒకవైపు భూ కామందులు, మరోవైపు రైతు కూలీలు మాత్రమే మిగుల్తారు. బంగారం పండించిన మునికన్నడు చెక్ డామ్ కూలీగా వెళ్లిపోతాడు.

ఇంత చక్కటి చారిత్రకావగాహన వున్న నామిని ఎందుచేతనో చెప్పవలసిందంతా చెప్పడు. వెళ్లవలసినంత దూరం వెళ్లడు. ఉదాహరణకి-

ఈ నవల కాలం నిర్ణయం చేయడం కష్టం. గ్రామమనే మైక్రో వ్యవస్థను దాటి నవల వెళ్లకపోవడంతో చారిత్రక సంఘటనల నాధారంగా కాల నిర్ణయం చేయలేము. నవలలో ఒక పాత్ర ఈ విషయం ఎమ్మీ రామారావుకి తెలియాలి అంటుంది కాబట్టి ఈ నవల ఇతివృత్తం వర్తమాన గ్రామీణ రైతు జీవిత మనుకోవాలి. అలాంటప్పుడు గ్రామీణ జీవితంపై రాజకీయాల ప్రభావం ఎంతో వుండాలి కదా? గ్రామాలు, చివరికి కుటుంబాలు కూడా రెండు ప్రధాన రాజకీయ పక్షాల మధ్య చీలిపోవడం, సామాన్యమైన ఈ రోజులలో మిట్టూరు గ్రామంలో అసలు రాజకీయాలు లేవు. లారీలు ఆపి తగలబెడదామన్న నిర్ణయం తీసుకున్నప్పుడు కూడా ఏ రాజకీయ నాయకుడు కనబడడు.

వ్యక్తి సభ్యుడైన కుటుంబం, సమాజం, రాజ్యం అనే మూడు ముఖ్యమైన వ్యవస్థలలో కుటుంబ వ్యవస్థ, సమాజ వ్యవస్థా మాత్రమే వర్ణింపబడ్డాయి. రాజ్యం, రాజ్య వ్యవస్థకు మూలమైన రాజకీయాలు నామిని దృష్టి నాకర్షించలేదు. కరెంటు వాళ్లు గ్రామంలోకి రావడం వర్ణించిన నామినికి రాజ్య వ్యవస్థ ఎంత బలీయమైనదో తెలుసు. అయితే అ వ్యవస్థ ప్రభావాన్ని సరిగ్గా అంచనా చేయలేదు.

పై మూడు వ్యవస్థలనూ చూపి ఈ ప్రాంతం రైతు జీవితాన్ని వర్ణించిన రచయిత డాక్టర్ కేశవరెడ్డి. కేశవరెడ్డి గ్రామాల్లో హరిజనుల బాధలను కళ్ళకు కట్టినట్టుగా వర్ణించారు. కానీ రెడ్డిగారిలో శాస్త్రం పాలెక్కువ. భావుకత్వం తక్కువ. తన పరిసరాలలో నామిని నిమగ్నమైనట్టు కేశవరెడ్డి నిమగ్నులవరు. రెడ్డిగారి ఇతివృత్తంలో, శిల్పంలో వైవిధ్యం కూడా తక్కువ. గ్రామీణ జీవితాన్ని వర్ణించే ఆయన నవలలన్నీ హరిజనులపై అగ్రవర్ణాలవారు దాడి చేయడమూ, రోడ్డున పడ్డ హరిజనులను అదే అగ్ర వర్ణాలకు చెందిన ఒక "సౌజన్యరావు పంతులు" సహాయం చేయడమూ చూపుతారు. పందులు మేపడానికి సంబంధించిన వివరాలు దాదాపు అన్ని నవలల్లోనూ వుంటాయి. ఈ మూసనుంచి కేశవరెడ్డిగారు బయటపడలేదు. (గ్రామీణ జీవితం ఇతివృత్తంగా గల నవలలకే నా పరిశీలన పరిమితం - సిటీ బ్యూటిఫుల్ లాంటి నవలలకు కాదు). నామిని రచనలలో యిలాంటి ఫార్ములా కనబడదు.

మునికన్నడికి పిల్ల నివ్వమని చెంగమునాయుడు భార్య అచ్చముల నడుగుతుంది వెంకటమ్మ. ప్రతి పనికీ మునికన్నడిని పిలిపిస్తుంటారు. కాబట్టి వాడంటే వాళ్లకి ప్రేమ అని ఆమె భ్రమ. ఒకే కులస్థులయినా, ఆర్థికపరమైన తారతమ్యం వుండడం కారణంగా పిల్లనివ్వడానికి తిరస్కరించడమే కాక నానా దుర్భాషలూ ఆడి పంపుతుంది అచ్చములు. "ఒక పనికి మాలోణ్ణి పిలిచినట్టే నీ కొడుకునూ పిలిచినాం. అంతమాత్రాన నీకు కూతురి నిస్తామనా" అంటుంది.

వర్గ దృష్టితో ఈ సంఘటన నిర్మించిన నామిని వెంటనే అచ్చములు కాఫీ అలవాట్లు వగైరా వర్ణించి ఆ వర్గపు విలువల పట్ల కలగవలసినంత ద్వేషం కలగనివ్వడు. దీనికి ఆ వ్యవస్థ మొత్తంమ్మీద నామిని కున్న అభిమానం కారణం కావచ్చు. శిల్ప లోపమూ కావచ్చు.

అలాగే కూలీగా మారిన రైతుకీ, తరతరాలుగా ఈ స్థితిని అనుభవిస్తున్న హరిజనులకీ భేదం లేదు అని చెప్పడు నామిని. ఈ విషయం అర్థమైతే కానీ ఆర్థిక సంబంధాలపై సమగ్రమైన అవగాహన వున్నట్టు కాదు.

యువకుడూ, భావుకుడూ, మేధావీ అయిన నామిని పైన చెప్పిన విషయాలన్నింటినీ గుర్తుంచుకుని ముందు ముందు ఆయన రాసే నవలల్లో సమగ్రమైన సమకాలీన మైన రాయలసీమ గ్రామీణ వ్యవస్థను చూపుతారని ఆశించవచ్చు.

లోగడ పులికంటి కృష్ణారెడ్డి, డాక్టర్ కేశవ రెడ్డి వంటి ప్రతిభావంతులైన రచయితలు చక్కటి రాయలసీమ మాండలికంలో రచనలు చేశారు. ఈ మాండలికంపై వారికంటే సంపూర్ణమైన అధికారం నామిని కుంది. మా గోఖలే, తాడిగిరి పోతరాజు, రావిశాస్త్రిగార్లు వారి వారి మాండలికాలలో చూపిన మార్గ మిది. అన్ని ప్రాంతాల మాండలికాలను కలుపుకుంటే భాష సుసంపన్నమవుతుంది. ఉదాహరణకు నామిని వర్ణనలూ పలుకుబళ్ళూ చూడండి. అయ్యవారి కారియర్ భోజనం చూసి ఆ భోజనం తినేవాడి 'కడుపు కైలాసం'కదా అనుకుంటాడు. (ఈ ప్రయోగం ధూర్జటిలో వుందని తరవాత అక్కిరాజు రమాపతిరావు గారు చెప్పారు).

మునికన్నడు తొందరపడ్డం చూసి అలా తొందరపడడం మంచిది కాదని చెబుతూ వెంకటమ్మ "ముందు కూచుని కదా పానుకోవాల (పడుకోవాల)" అంటుంది.

కయ్య పక్కోడితో, కాలవ పక్కోడితో స్నేహంగా వుండాల.

గుడ్డు పెట్టే కోడికి గదా తెలుస్తుంది ... నొప్పి ఇత్యాదివి. రచయితగా నామినిని మొదటి వరుసలో పెట్టేదిఆయన సజీవమైన భాషా, సూక్ష్మ పరిశీలనా దృష్టినీ.

నామిని వంటి ప్రతిభావంతులైన రచయితల రచనలను చదివిన తర్వాత సమకాలీన సాహిత్యపు పోకడలను చూస్తుంటే రానున్న కాలంలో తెలుగు సాహిత్యం ఈ విధంగా వుంటుందనిపిస్తోంది.

శతాబ్దాలుగా ఆర్థికంగా, సాంస్కృతికంగా వెనుకబడ్డ ఆఫ్రికా ఖండం ఎలాగైతే యిప్పుడు అద్భుతమైన సాహిత్యాన్ని అందిస్తోందో అలాగే మన రాష్ట్రంలో వెనకపడ్డ ప్రాంతాలైన రాయలసీమ, తెలంగాణా ప్రాంతాల నుంచి వుత్తమ సాహిత్యం వస్తుంది.

ఈ ప్రాంతాలలో కూడా రచయితలు సంప్రదాయేతర కుటుంబాల నుంచి వస్తారు, బడుగువర్గాల నుంచీ, రైతు కుంటుంబాల నుంచీ వస్తారు.

తెలుగు నవల, కథానిక ప్రక్రియలను యిన్నాళ్లు మోసిన శిష్టవ్యావహారిక భాషకు కాలం చెల్లింది. సృజనాత్మక రచనలకు సంబంధించినంత వరకూ రానున్న రోజుల్లో మాండలిక భాషలో గానీ, మాండలిక పదాల శాతం ఎక్కువగా వున్న వ్యావహారికంలో గానీ రచనలు వస్తాయి.

ఈ మార్పులకు స్వాగతం చెప్పడానికి తెలుగు సాహిత్యకారులందరూ సిద్ధమవాల్సిన తరుణమాసన్నమయింది.

•••

# జానపద కథా నిర్మాణం

- శ్రీ పులికొండ సుబ్బాచారి

జానపద కథా సాహిత్య సేకరణ పరిశోధనలు పందొమ్మిదో శతాబ్ది ప్రథమార్థంలో గ్రిమ్ సోదరులతో ప్రారంభమైనాయి. అప్పటి నుండి ఇప్పటి దాకా సిద్ధాంత పరంగా, విశ్లేషణా విధానాల పరంగా ప్రపంచ వ్యాప్తంగా అంతులేని కృషి జరిగింది. దీని చరిత్రకు సంబంధించిన గ్రంథాలే లభిస్తాయి.

జానపద కథను బాగా సీరియస్‌గా విశ్లేషించి దాని నిర్మాణ శిల్పాన్ని ఆవిష్కరించే దశ ప్రారంభమైంది మాత్రం రష్యన్ భాషా శాస్త్రజ్ఞుడు సామాజిక శాస్త్రజ్ఞుడూ అయిన బ్లాదీ మీర్ ప్రాప్ తోనే జరిగింది. ప్రాప్ పరిశోధన జానపద విజ్ఞాన శాస్త్రాన్ని ఒక సంపూర్ణమైన శాఖగా ఒక శాస్త్రంగా మిగతా మానవీయ శాస్త్ర శాఖల సరసన నిలబెట్టగలిగింది.

పందొమ్మిదో శతాబ్ది ఇరవై యవ శతాబ్ది తొలి రోజులలో జానపద విజ్ఞాన శాస్త్రంలో పనిచేసిన ప్రముఖులందరూ భాషా శాస్త్రజ్ఞులు కావడం గమనించదగిన అంశం. జానపద శాస్త్రం ఒక శాస్త్రంగా ఎదిగిన క్రమంలో భాషా శాస్త్రం దానికి వెన్నుపూసలా నిలిచింది.

గ్రిమ్ సోదరులు, మాక్స్‌ముల్లర్, ఆండ్రూలాంగ్ ఇంకా ఫిన్లాండు జానపద విజ్ఞాన శాస్త్రజ్ఞులందరూభాషలను ప్రపంచ వ్యాప్తంగా తులనాత్మకంగా అధ్యయనం చేసే పద్ధతిలోనే జానపద కథల పుట్టుకలు, అవి ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి ప్రయాణించడం, భిన్న దేశాల కథల్లో సామ్యం మొదలైన అంశాలను పరిశోధించారు. ఇవన్నీ బహు మూల, ఏకమూల సిద్ధాంతాల భేదాలతో వెలువడినయ్.

తరువాత కొంతకాలానికి జానపద కథల పుట్టుకను గురించి వివేచించడంపైన విసుగు పుట్టడమే కాక శాస్త్రజ్ఞులలో ఒక చికాకు కూడా కలిగింది. ఈ పద్ధతి క్రమంగా మరుగునపడింది.

జానపద కథ పుట్టుక, ప్రయాణాలను దాటి దాని నిర్మాణాన్ని గురించి ఆలోచించడం వ్లాదీమీర్‌ప్రాప్ తోనే ప్రారంభమైంది. ప్రాప్ తన కంటే ముందు కథకు సంబంధించి జరిగిన కృషినంతా విచక్షణతో సమీక్షించి అది లోపభూయిష్ఠంగా ఉందని గుర్తించాడు. గ్రిమ్ సోదరుల నుండి తన కాలంనాటి శాస్త్రజ్ఞుల వరకూ జానపద కథలను వర్గీకరించిన పద్ధతి అంతా లోపభూయిష్ఠంగా ఉందని నిరూపిస్తూ దాన్ని తిరస్కరించాడు.

జానపద కథను, నీతికథ, జంతువుల కథ, దైవందిన కథ, హాస్యకథ, మొదలైన విధంగా విభజించడం అసమర్థమైనది అని అంటాడు ప్రాప్. ఈయన వరకూ దాదాపు అందరూ కొద్దికొద్ది మార్పులతో జానపద కథలను ఈ విధంగానే వర్గీకరిస్తూ వాటి వాటి లక్షణాలను వివరించడానికి పూనుకునేవారు. ప్రాప్ తన గ్రంథం "మార్ఫాలజీ ఆఫ్ ది ఫోక్‌టేల్" లో వీటన్నింటినీ సహేతుకంగా తిరస్కరించాడు.

"వర్గీకరణ ప్రాథమికమైంది, విశ్లేషణ తరువాతి దశ. విశ్లేషణ ఉన్నత ప్రమాణంలో జరగాలంటే కథల వర్గీకరణ ఉన్నత ప్రమాణంలో ఉంటేనే సాధ్యమౌతుంది. అసమర్థమైన వర్గీకరణ అసమర్థమైన విశ్లేషణకే దారితీస్తుంది" అంటాడు ప్రాప్. జానపద కథా నిర్మాణ శిల్పాన్ని దానితత్వాన్ని సమగ్రంగా చెప్పడానికి ప్రపంచంలోని కథలన్నింటినీ అధ్యయనం చేయనవసరం లేదని చెప్పి ఆ పనికి కేవలం ఒక వంద కథల్నే గ్రహించి కథా నిర్మాణ శిల్పాన్ని వివరించాడు ప్రాప్ .

జానపద కథలను - జంతువుల కథ, నీతికథ, దేవతల కథ, హాస్యకథ, విషాదకథ మొదలైన విధంగా గీతలు గీచినట్లు స్పష్టమైన విభాగాలుగా విభజించడం

సాధ్యం కాదంటాడు ప్రాప్. జంతువుల కథలో నీతి ఉండవచ్చు. నీతికథలో జంతువులో, దేవతలో పాత్ర వహించవచ్చు. దైనందిన కథలో జంతువులు ఉండవచ్చు. పై విధమైన విభజనలోని విభాగాలన్నీ ఒక దానిలోనికి ఒకటి చొచ్చుకొని పోయి ఉంటాయి. కాబట్టి ఈ విభజన, దీనిపై ఆధారపడి పనిచేసే విశ్లేషణలూ లోపభూయిష్టమైనవని ప్రాప్ నిరూపించాడు. ఈ కారణంగానే ఆర్నే థాంప్సన్‌లు సంగ్రథించిన 'టేల్ టైప్', 'మోటిఫ్' ఇండెక్సులు అసమగ్రము, లోపభూయిష్ఠమైనవని అవి అపరిశోధకులను తప్పుదారి తీయించగలవని హెచ్చరించాడు ప్రాప్.

తనకు ముందు జరిగిన కృషిని అంతా గమనించి జానపద కథా సాహిత్య వర్గీకరణ విశ్లేషణ మరొక మార్గంలో జరగాలని భావిస్తూ ఆ క్రమంలో జానపద (అద్భుత) కథా స్వరూప శాస్త్రాన్ని వెలయించాడు ప్రాప్. దీన్ని 1928లో రష్యన్ భాషలో రచించాడు. 1958లో తొలిసారిగా ఇది ఆంగ్లంలోకి అనువదించబడేంత వరకూ వెలుగులోనికి రాకుండా మరుగున పడిపోయింది. రష్యాలో ఆనాటి రాజకీయ పరిస్థితులు పాశ్చాత్య వ్యతిరేక వైఖరి, ఫార్మలిజం మీద అధికారికంగా దాడి చేయడం మొదలైనవన్నీ దీనికి కారణాలు. కథా నిర్మాణాన్ని గురించి ఆలోచించిన ప్రాప్ గ్రంథానికి 'ఫార్మలిస్టు' ముద్ర చాలా స్పష్టంగా తేలిగ్గానే పడింది. ప్రభుత్వం, ప్రభుత్వ సంస్థల ఉక్కుపాదం దీనిమీదపడింది. ప్రాప్ ప్రభుత్వానికి లొంగి తాను చాలా కాలం కాపాడుకున్న వ్యక్తిగత ప్రతిష్ఠను ధారపోసి ప్రభుత్వాన్ని సంతృప్తి పొందించి క్షమాభిక్ష పొందాడు. ఆలస్యంగానైనా ఆయనకూ ఆయన గ్రంథాలకూ అక్కడా గౌరవం లభించింది.

ఏ అంశాలు ఏ విధంగా కథను నిర్మిస్తున్నాయి అన్న విషయం తెలుసుకునే దిశలోనే జానపద కథా స్వరూప శాస్త్రం ఆవిర్భవించింది. కథల వర్గీకరణ వాటి వస్తువుమీద ఆధారపడి జరగకూడదని కథల నిర్మాణాలను ఆధారం చేసుకొని జరగాలని చెప్పాడు ప్రాప్. భిన్న విధాల కథలకు భిన్న నిర్మాణాలుంటాయని పాత్రలు ఎవరు (లేక జంతువులు) ఎలా మారినా నిర్మాణాలు మారవని అందువల్ల కథల వర్గీకరణ విశ్లేషణ వాటి నిర్మాణ వివేచనపై ఆధారపడి జరగాలని చెప్పాడు ప్రాప్.

జానపద కథలోని మూలకాంశాల తులనాత్మక అధ్యయన ఫలితంగానే జానపద కథాస్వభావ శాస్త్రం ఏర్పడింది. "జానపద కథలోని మౌలికాంశాలను వర్ణించడం, ఈ మౌలికాంశాల పరస్పర సంబంధం, మొత్తం కథతో వాటికున్న సంబంధాన్ని వర్ణించడమే జానపద కథా స్వరూప శాస్త్రము" అని నిర్వచించాడు ప్రాప్.

జానపద కథలోని కథా పాత్రల చర్యలే కథలోని మౌలికాంశాలను నిర్ణయిస్తాయి. పాత్రలు స్వభావాలు మారినా అవి మారవు. ఉదా 1. ఒక నాయకునికి రాజు డేగ నిస్తాడు. ఆ డేగ నాయకుని వేరే రాజ్యానికి తీసుకుపోతుంది. 2. సుచెంకోకు ఒక ముసలివాడు గుర్రాన్నిస్తాడు. గుర్రం సుచెంకోను వేరే రాజ్యానికి తీసుకుపోతుంది. 3. ఒక మాంత్రికుడు ఇవానుకు చిన్నపడవ నిస్తాడు. ఆ పడవ అతడిని వేరు రాజ్యానికి తీసుకుపోతుంది. 4. ఒక రాజకుమార్తె ఇవాన్‌కు ఉంగరాన్నిస్తుంది. దానిలో నుండి పుట్టిన యువకులు ఇవానును వేరే రాజ్యానికి తీసుకుపోతారు. 5. రాజకుమారుడు ఇద్దరు రాక్షసుల నుండి పాదరక్షలు గ్రహిస్తాడు. అవి రాజకుమారుడు అనుకున్న చోటికి తీసుకుపోతాయి. 6. రాజు ఒక యువకునికి కీలుగుర్రాన్నిస్తాడు. అది యువకుని సముద్రాలు దాటిస్తుంది. 7. బాలుడు గండభేరుండ పక్షి పిల్లల్ని కాపాడుతాడు. అవి బాలుడిని సప్త సముద్రాలు దాటిస్తాయి. 8. ఒక ముని రాజకుమారునికి మాయకంబళిని ఇస్తాడు. అది రాజకుమారుణ్ణి అనుకున్న ప్రతిచోటికీ తీసుకుపోతుంది.

ఇటువంటి ఉదాహరణలను ప్రపంచ వ్యాప్తంగా ఉన్న జానపద అద్భుత కథలలో చూడవచ్చు. పై ఉదాహరణలలో స్థిరాంశాలు అస్థిరాంశాలు అని రెండున్నాయి. పై వానిలో కథా పాత్రలు మారాయి, స్వభావాలు మారాయి.

కథలు ప్రవర్తించిన దేశాలు వేరు. కాని, పాత్రల చర్యలు మారలేదు. ఒక పాత్రనుండి పొందిన యాంత్రిక వస్తువు సహాయంగా నాయకుడు తన కార్యసాధనలో ముందుకు వెళ్ళడం అనే మౌలికాంశం అన్నింటిలో ఒకే విధంగా సమానంగా ఉంది. దీనిని బట్టి జానపద కథ తరచుగా భిన్న కథా పాత్రలతో (Dramatise persons) ఏకరీతి నుండే చర్యలు కలిగి ఉండేదిగా నిర్ణయించాడు ప్రాప్. ఈ 'చర్యల'నే ప్రకార్యాలు (Functions) అని అన్నాడు. ఈ విధంగా ఒక తరహా కథల్లో ఉండే భిన్న ప్రకార్యాలను ఎన్నుకొని, భాషా శాస్త్రంలో వర్ణ నిర్ణయ విధానాన్ని అనుసరించి, ఒక ఘట్టంలో అన్నికథల్లో ఒకే విధంగా కనిపించే కథాపాత్రల చర్యలను ఒక ప్రకార్యంగా గుర్తిస్తాడు. ఈ విధంగా కథలో ఆద్యంతమూ ఉండే ప్రకార్యాలను నిగమన (Deducitve method) పద్ధతి ద్వారా సంఖ్యను సంక్షేపించి ఒక కథా నిర్మాణ నమూనాను కనిపెట్టగలిగాడు ప్రాప్. ఈ విధానం సంచలనాత్మకమై ఒక కొత్తపద్ధతికి దారితీసింది. ఈ పద్ధతి ద్వారా ప్రాప్ జానపద కథలలో ప్రధాన భాగమైన అద్భుత కథను (Fairy tale or wonder tale) అధ్యయనం చేసాడు.

అద్భుత కథలలోని ప్రకార్యాలు, వాటి పరస్పర సంబంధం మొత్తం కథతో వాటికున్న సంబంధాలను అధ్యయనం చేయడం ద్వారా అద్భుతకథను అధ్యయనం చేసాడు. అద్భుత కథ ప్రక్రియను నిర్ణయించేది గేయ, వచన, రూపంకాని రూప భేదాలు కాదని, దాని నిర్మాణమే దాన్ని నిర్ణయిస్తుందని రుజువు చేసాడు. ఉదా॥ బాలనాగమ్మ కథ దక్షిణాది భాషల్లో లభిస్తున్న బహుళ ప్రచారమున్న అద్భుత కథ. ఇది భిన్న భాషల్లో ఉండవచ్చు. నాటకంగా, సినిమాగా విజయవంతమైంది, గేయకథ,వచనకథ, యక్షగానం మొదలైన భిన్నరూపాలలోనూ ప్రవర్తిస్తూ ఉంది. అయినా ఇది ప్రక్రియరీత్యా 'అద్భుతకథే'. దీన్ని అలా ఉంచగలిగేది దాని నిర్మాణం. ఈ అన్ని రూపాలలోనూ మౌలికమైన నిర్మాణ ప్రక్రియ ఒకే విధంగా ఉండడాన్నే చూడవచ్చు.

జానపద కథా ప్రపంచంలోని అసంఖ్యాక పాత్రలతో పోల్చినప్పుడు ఆశ్చర్యకరంగా ప్రకార్యాల సంఖ్య చాలా తక్కువ. ప్రాప్ నిర్మాణ విశ్లేషణానికి ఒక వంద కథలనే ఉదాహరణలు ప్రదర్శించేందుకు గ్రహించినా, ప్రపంచ వ్యాప్తంగా లభించిన కొన్నివేల కథలను అధ్యయనానికి గ్రహించాడు. వీటి అన్నింటిలో ఉన్న కథా పాత్రల ప్రకార్యాలను నిగమన పద్ధతి ద్వారా ఎన్నుకున్నప్పుడు కథా నిర్మాణంలో కీలక పాత్ర వహించే ప్రధాన ప్రకార్యాలు 31 మాత్రమే ఉండడాన్ని ప్రదర్శించి చూపాడు. వీటికి అతిరిక్తంగా మరొక ప్రకార్యం వచ్చినా అది శిష్టసాహిత్యంలోని కథాసాహిత్య ప్రభావం వల్ల రావచ్చునని సూచనచేశాడు ప్రాప్.

కథాపాత్రల ప్రకార్యాల సంఖ్య పరిమితమై ఉంటుంది. అయినా వీటి స్వభావంతో అదే చర్యలతో ఉండే అదే చట్రంలో ఇమిడే మరిన్ని ప్రకార్యాలు ఉండవచ్చు. పరిమిత సంఖ్యలో ఉండడమే కాకుండా వీటి అనుక్రమం (A→Z) మారదు. ఒక కథలో కొన్ని ప్రకార్యాలు లేకపోయినా వెనుక ప్రకార్యం ముందుకు ముదుది వెనుకకు రాదు. ఇది కథానిర్మాణ సూత్రానికి విరుద్ధం. భిన్న సంస్కృతుల భేదాలవల్ల కథల్లో భిన్న కథావస్తువులు ఉండడం ద్వారా ప్రాప్ చూపిన అనుక్రమానికి సంవదించని అనుక్రమాలు భిన్న సంస్కృతీ ప్రాంతాలలో కనిపించవచ్చు. అయినా ఆయా అనుక్రమాలు అక్కడి కథా సంచయానికి వర్తిస్తాయేగాని విరుద్ధ క్రమాలు అక్కడా రావు. కథలో ఉండే అనుక్రమంలో ఒక గతితర్కం తప్పకుండా ఉంటుంది. తాళం పగలగొట్టిన తర్వాతనే దొంగతనం జరుగుతుంది. దొంగతనం ముగిసిన తర్వాత తాళం పగులగొట్టడమనే ప్రకార్యం జరుగదు. ఈ సూత్రం కథ మొత్తానికి వర్తిస్తుంది. తర్కానికి వచ్చి తాళం పగులగొట్టకుండా తలుపులు విరగ్గొడితే గోడలు తవ్వితే అని ఎవరైనా అడగవచ్చు. కాని, ప్రకార్యాల లక్షణాలను అనుసరించి తాళం పగులగొట్టడం, తలుపులు విరగగొట్టడం, గోడలు తవ్వడం

ఇవి అన్నీ ఒకే విధంగా దొంగతనానికి దారితీసేవి కనుక ఈ మూడూ కథా పాత్రల ఒకే ప్రకార్యం అవుతాయి. "ప్రకార్యాల ఎన్నిక జానపదకథాసంచయం అంతటి పై ఆధారపడి చెప్పే కీలకాంశం" అని అంటాడు ప్రాప్. ప్రకార్యాలకు కింది నాలుగు ప్రధాన లక్షణాలు చెప్పాడు.

1. ప్రకార్యాలు మారకుండా ఉండి పనిచేసే స్థిరమైన కథాంశాలు. కథాపాత్రలకు ఏవి నిర్వహిస్తున్నాయన్న విషయం, ఎలా నిర్వహిస్తున్నాయన్న విషయం నుండి ఇవి స్వతంత్రంగా ఉంటాయి.

2. ప్రకార్యాల సంఖ్య ఎప్పుడూ పరిమితంగా ఉంటుంది.

3. ప్రకార్యాలు ఒక అనుక్రమాన్ని పాటించి ఉంటాయి. ఎప్పుడూ వ్యతిక్రమంలో ఉండవు.

4. ప్రకార్యాలు కథానిర్మాణానికి ఏకరూపతను కలిగిస్తాయి. ఇది ప్రకార్యాల అనుక్రమం ద్వారా సాధ్యమౌతుంది.

ప్రాప్ కథా నిర్మాణ విశ్లేషణా విధానాన్ని అనుసరించి మొత్తం జానపద కథను ఒక వాక్యంలో సంభావించడం జరుగుతుంది. కథానిర్మాణం వాక్యనిర్మాణ పద్ధతిలో పరిశీలితమౌతుంది.

భాషకు సహజ సిద్ధమైన నిర్మాణం, వ్యాకరణం ఉంటాయి. ఒక భాషావ్యవహర్త తనకుభాషించడం అలవడిన దగ్గర నుండి 'నిర్దోషంగా' మాట్లాడగలుగుతాడు. లిఖిత భాషకు వ్యాకరణమని నియమాల్ని తప్పించి మాట్లాడడు. అది అతనికి లభించిన భాషణశక్తి. 'నిరక్షరాస్యుల' వ్యవహారంలో వ్యాకరణనియమాలన్నీ పాటిస్తూ ఒక క్రమబద్ధనిర్మాణం (వ్యాకరణం) కలిగిన భాష వెలువడుతోంది. ' అక్షరాస్యులు కాని వారు' వారికై వారు సృష్టించుకొనే మౌఖిక కథా సాహిత్యంలోనూ ఒక నిర్మాణ చట్రం ఉంటుందని దాని కొక వ్యాకరణం ఉంటుందనే ఆలోచన మూలంగానే జానపద కథాసాహిత్యానికి సంబంధించిన వ్యాకరణాన్ని శాస్త్రజ్ఞులు అర్థం చేసుకోవడం ప్రారంభించారు. కథానిర్మాణ వివేచనా సిద్ధాంతాలన్నీ ఇక్కడి నుండే ఆవిర్భవించాయి.

అద్భుత కథానిర్మాణంలో ప్రాప్ విశ్లేషించిన 31 ప్రకార్యాలు వాక్యంలో భాగాలైన 'పదాలు' పదాంశాలవంటివి. వాక్యంలో అర్థవంతమైన పదాల అనుక్రమం వంటిదే ప్రకార్యాల అనుక్రమం. పదాల అనుక్రమంలో మార్పు కొంతమేరకు అర్థవంతమైన వాక్యాలను సృష్టించగలిగినా భిన్న వాక్య నిర్మాణాలలో అర్థచ్ఛాయాభేదం ఉంటుంది. కొన్ని అనుక్రమాలు అర్థవంతమైన వాక్యాలను అందించలేవు. కొన్ని పదాలు వాటి సరసన మరి కొన్ని పదాలను అంగీకరించవు. కథలో ప్రకార్యాల అనుక్రమం కూడా ఇటువంటిదే. ఈ పరిమితులను దృష్టిలో ఉంచుకొని ప్రకార్యాల ఎన్నిక వాటి అనుక్రమాన్ని అర్థం చేసుకోవలసి ఉంటుంది. అద్భుత కథకు ప్రాప్ చెప్పిన ప్రకార్యాలు ఈ విధంగా ఉన్నాయి. 1. అనుపస్థితి 2. నిషేధం 3. అతిక్రమణం 4. దుష్ట వ్యూహం 5. వార్తా బహిర్గమనం 6. మోసం 7. మోసానికి చిక్కడం 8. దౌష్ట్యం 8ఎ. అభావం 9. మాధ్యమికదశ 10. ప్రతి చర్యారంభం 11.నిర్గమనం 12. సహాయకుని ప్రకార్యం 13.నాయక ప్రతిస్పందన 14. మాంత్రిక శక్తి గ్రహణం 15. మార్గాంతర్గమనం 16. పోరాటం 17. ముద్ర 18. విజయం 19. అభావ నిష్కృతి 20. తిరిగి రాక 21. శత్రువ్యూహం 22. శత్రు వ్యూహ నిర్గమనం 23. గుర్తింపులేమి 24. విఫలారోహణ 25. కష్టకార్యం 26. కార్యసాధన 27. గుర్తింపు 28. భంగపాటు 29. మార్పు 30. దుష్ట శిక్షణం 31. వివాహం – రాజ్యలబ్ధి 32. మరొక అదనపు ప్రకార్యం.

ఈ ప్రకార్యాలు అద్భుత కథా నిర్మాణంలో మౌలికాంశాలు. ఈ మౌలికాంశాలు తెలుగులో లభించే అద్భుత కథలలోను అద్భుత కథేతివృత్తాలున్నా కథా కావ్యాలలోనూ కనిపిస్తాయి. (రాజశేఖర చరిత్ర) అన్ని కథలలోనూ అన్ని ప్రకార్యాలు ఉండకపోవచ్చు. కాని కథా నిర్మాణంలో ఈ ప్రకార్యాల అనుక్రమం ఉంటుంది.

(తరువాయి *167*వ పుటలో)

# తెలుగు నాటక రంగం - శ్రీ కృష్ణ పాత్రధారులు

## శ్రీ అయ్యదేవర పురుషోత్తమ రావు

భారత భాగవతాలన్నా అందులో ఉన్నకవిత్రయం, పోతనగార్ల పద్యాలన్నా అత్యంత ఆకర్షణీయంగా సాక్షాత్కరించే శ్రీ కృష్ణ పాత్రలన్నా తెలుగువారికి చాలా ఇష్టం.

ఆ పద్యాల ప్రభావంతోనే తెలుగు నాటకాలు ఆ రోజుల్లో అందరినీ ఆకట్టుకున్నాయి. తెలుగు భాషకు పద్యం ఒక వరం. ధారాశుద్ధి గల పద్యానికి సంగీతం తోడయి శ్రోతలను ఆనందవార్ధిలో ముంచుతుంది.

చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారి గయోపాఖ్యానం లోని కథ. ఏ భారత భాగవతాల్లో దో కాకపోయినా తెలుగు వారిని బాగా ఆకట్టుకుని ఆ రోజుల్లో అనన్య సామాన్యమైన ప్రచారం గల నాటకంగా ప్రసిద్ధి చెందింది. అందులో శ్రీ కృష్ణుడు ఒక అగ్గిపిడుగులా కనబడతాడు.

పానుగుంటి లక్ష్మీ నరసింహారావుగారి రాధాకృష్ణ నాటకం లో శ్రీకృష్ణుడు శృంగార ప్రియుడుగా కనిపిస్తాడు. ముత్తరాజు సుబ్బారావుగారి శ్రీకృష్ణ తులాభారంలో కూడా కృష్ణుడు శృంగార ప్రియుడైన దక్షిణ నాయకుడే.

మల్లాది అచ్యుతరామ శాస్త్రిగారు, సోమరాజు రామానుజరావుగారు రచించిన సతీ సక్కుబాయి నాటకాలలో శ్రీకృష్ణుడు భక్తవరదుడు, ఆర్త త్రాణపరాయణుడు. అందులో పాత్ర చిన్నదే అయినా పాత్రధారుల ప్రతిభతో ప్రాధాన్యాన్ని సంతరించుకున్నది.

కాళ్ళకూరి నారాయణరావుగారు రచించిన చింతామణి నాటకంలో శ్రీకృష్ణ పాత్ర ఉన్నా, మిగతా పాత్రల ప్రాధాన్యతతో శ్రీ కృష్ణ పాత్ర మరుగున పడిపోయింది.

శ్రీ కృష్ణ పాత్రను లోకానికి అందించిన ప్రసిద్ధ నాటకాలు ఇవి. మిగతా నాటకాల్లో శ్రీ కృష్ణ పాత్ర ఉన్నా అటు నటులకు ఇటు నాటకాలకు పరస్పరం కీర్తి ప్రతిష్ఠలు కలుగజేసిన నాటకాలు ఇవే.

తొలి దశలో కేవలం సాహిత్యానికి పాత్రధారణకు మాత్రమే కొంత ప్రాముఖ్యం కనిపించేది. సంగీతానికి అంత ప్రాధాన్యం ఉండేది కాదు, ఆరోజుల్లో శ్రీకృష్ణ పాత్ర ధరించిన వారు మంజులూరి కృష్ణారావు గారు, యడవల్లి సూర్యనారాయణగారు, మాధవపెద్ది వెంకటరామయ్యగారు అంటే చాలామందికి ఆశ్చర్యం కలగవచ్చు. తరువాత వారి పాత్రధారణను చూసిన వారు ఒకరకంగా బెల్లంకొండ సుబ్బారావు గారు (మీసాల కృష్ణుడు) మీసాలతో శ్రీ కృష్ణ పాత్ర ధరించేవారు అంటే ఈ తరంవారికి నచ్చకపోవచ్చు.

మంజులూరి కృష్ణారావు గారు పాండవోద్యోగ విజయాలలో శ్రీకృష్ణ పాత్ర ధరించేవారు. ఆయన పాత్ర పోషణ గాంభీర్యానికి నటనకు ప్రాధాన్యత నిచ్చేది.

తరువాతి తరంలో దుర్యోధనపాత్రకు అఖండ ఖ్యాతి నార్జించిన మాధవపెద్ది వెంకటరామయ్యగారు శ్రీకృష్ణ తులాభారంలో శ్రీకృష్ణపాత్ర ధరించేవారు. ముఖ్యంగా రుక్మిణి శ్రీకృష్ణుని పుట్టిన దినమని విందునకు ఆహ్వానించినప్పుడు అలిగిన సత్యభామను మోచేతితో శృంగారంగా తట్టి పలకరించటం సామాజికులను ఆ రోజుల్లో ఎంతగానో ఆకట్టుకునేది.

యడవల్లి సూర్యనారాయణగారు అందంగా ఠీవీగా ఉండేవారు. ముఖ్యంగా ఆయన ముఖం గాంభీర్యాన్ని కలిగి చక్కని ముక్కుతో ధరించిన ఏ పాత్ర అయినా కొట్టవచ్చినట్లుండేది. ఆయన కృష్ణుడుగా రాణించారు. పద్యపఠనానికే వారు ప్రాముఖ్యత నిచ్చేవారు. యడవల్లి వారు మంచి పండితులు చక్కని వాచికాభినయం కలవారు. అందువలననే సంగీతం అంతగా లేకపోయినా ఆయన శ్రీ కృష్ణపాత్రకు పేరు వచ్చింది.

కపిలవాయి రామనాథ శాస్త్రిగారు, జొన్న విత్తుల శేషగిరిరావు గారు సంగీత కృష్ణులు. కపిలవాయి రామనాథశాస్త్రిగారు సంగీతంలో నిధి. పాండవోద్యోగ

విజయాలలో శ్రీ కృష్ణపాత్రధారణ చేసేవారు.తిరుపతి వేంకట కవుల ఆ పద్యాలకు వారి సంగీతం తోడై ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేసేది. కపిలవాయివారి గ్రామఫోను రికార్డులకు మంచి గిరాకీ ఉండేది. హిజ్ మాష్టర్స్ వాయిస్ కంపెనీ వారు ఆయనకు నెలకు యాభై రూపాయలు ఇచ్చేవారు. ఇది తెలుగు నాటక చరిత్రలోనే అపూర్వం.

జొన్నవిత్తుల శేషగిరి రావుగారు శ్రీ కృష్ణ పాత్రలో హిందూస్తానీ సంగీతాన్ని గుప్పించేవారు. ఆయనకు 'ఆంధ్రబాల గంధర్వ, అనే బిరుదుండేది. ముఖ్యంగా మల్లాది అచ్యుత రామశాస్త్రిగారు రచించిన సతీసక్కుబాయి నాటకంలో శ్రీ కృష్ణ పాత్ర ధరించేవారు. అసలే ఆ నాటకం సంగీతమయం. అందులో కృష్ణ పాత్ర చిన్నదే అయినా ఆ పాత్రను ఆయన తన సంగీత ప్రావీణ్యంతో ఎంతగానో సాగదీసి ప్రజలను మెప్పించి మన్ననలను పొందేవారు. శ్రీ కృష్ణ పాత్రకు ప్రసిద్ధి గాంచిన రఘురామయ్య గారికి వీరు సంగీత గురువులు.

కపిలవాయి రామనాథ శాస్త్రిగారు, జొన్న విత్తుల శేషగిరి రావుగారు తమ శ్రీకృష్ణపాత్రలను పద్యాలతో పాటలతో కర్ణాటక, హిందూస్థానీ సంగీతంతో తెలుగు రంగస్థలంపై హోరెత్తించేవారు.

తరువాతి తరంలో విద్యావంతులు సుస్వరద్రూపులు కర్ణాటక, హిందూస్థానీ శాస్త్రకోవిదులు, ప్రజ్ఞావంతులు శ్రీ కృష్ణపాత్ర ధరించేవారు.

ప్రధాన పాత్రధారణకు కావలసిన అన్ని హంగులు సంతరించుకున్న శ్రీ కృష్ణ పాత్ర ధారులు సి.యస్.ఆర్. ఆంజనేయులు, బందా కనకలింగేశ్వరరావు, కె. రఘు రామయ్య గార్లు నాటకాలలో ప్రసిద్ధి పొందినవారు చలన చిత్రరంగంలోనికి కూడా ప్రవేశించారు.

సి.యస్. ఆర్., అని ముచ్చటగా మూడు అక్షరాల లో పిలవబడే చిలకలపూడి సీతారామాంజనేయులు శ్రీ కృష్ణుడి పాత్రకు అన్ని విధాల తగినవారు. విద్యావంతులు. నిండైన విగ్రహం, ముఖసంపదకు వెలుగునిచ్చే కోటేరు వంటి నాసిక , కమ్మని కంఠం, సంభాషణా చాతుర్యం, నటనా వైవిధ్యం, కర్ణాటక హిందూస్థానీ సంగీతాలలో అభినివేశం, రంగస్థలంపై ప్రతిభాయుతమైన సమయస్ఫూర్తి సి.యస్. ఆర్. శ్రీ కృష్ణ పాత్రకు అఖండకీర్తి నార్జించి పెట్టినవి. పోటీగా 1936లో 'ద్రౌపది' చలన చిత్రం నిర్మిస్తున్నప్పుడే సి.యస్.ఆర్. శ్రీ కృష్ణ పాత్రకు ఎన్నిక చేయబడి ఆ రోజులలో అయిదు వేల రూపాయలు అందరికన్నా ఎక్కువ, సాటి, మేటి నటులకన్న రెట్టింపు పారితోషికాన్ని పొందారు.

చిన్నతనంలోనే సి.యస్.ఆర్. రాధాకృష్ణ నాటకం లో శ్రీ కృష్ణ పాత్ర ధరించి పలువురి ప్రశంస అందుకున్నారు. ఆ రోజుల్లో పానుగుంటి వారి రాధాకృష్ణ నాటకానికి పారుపల్లి సుబ్బారావుగారి రాధ పాత్ర ఎంతో పేరు పొందింది.

రాధాకృష్ణ నాటకంలో శ్రీ కృష్ణ పాత్ర చూసిన ప్రఖ్యాత నటులు స్థానం నరసింహారావుగారు సి.యస్. ఆర్. ను తన సరసన శ్రీ కృష్ణ తులాభారంలో శ్రీ కృష్ణ పాత్ర ధరించుమని అడిగారు. స్థానం సత్యభామ పాత్రను చూసిన సి.యస్.ఆర్. స్థానం ప్రక్కన తాను కృష్ణ పాత్ర ధరించాలనీ, కనీసం ఆయన కొంగయినా తగిలితే చాలు తరించిపోవాలనీ అనుకుండేవారు. కారణాంతరాల వలన కొంత ఆలస్యమయినా తెలగు రంగస్థలం మీద సి.యస్. ఆర్, స్థానంల కృష్ణ సత్యభామ పాత్రలు శ్రీ కృష్ణతులాభారం నాటకానికి ఎంతో కీర్తిని కలుగ జేసినాయి. రంగూన్ మొదలగు విదేశాలలో కూడా ఆ నాటకం ప్రదర్శించబడింది.

స్థానం సరసన కృష్ణుడు గా నటించడానికి మురిసిన తాను ముఖం మొత్తేదాకా నటించాను అన్నారు సి.యస్.ఆర్.

సి.యస్.ఆర్. పాండవోద్యోగ విజయంలో కూడా శ్రీ కృష్ణ పాత్ర ధరించారు. శ్రీ కృష్ణుడు అర్జునుని కన్న ముందుగా వస్తున్న దుర్యోధనునిని చూసి కపటనిద్ర నటించడం కోసం దుర్యోధనుడు వచ్చే ముందు రంగస్థలం మీద అటు ఇటూ తిరుగుతూ దుర్యోధనుడు వస్తున్న అలికిడి కాగానే చప్పున పడుకునేవారు.

పాండవోద్యోగం నాటకంలో శ్రీ కృష్ణుడు కపట నిద్ర నుంచి లేస్తూనే కాళ్ళవైపు ఉన్న అర్జునుని చూసి 'ఎక్కడ నుండి రాక ఇటకు' అన్న పద్యం పాడిన తరువాత

"బావా! ఎప్పుడు వచ్చితీవు' అనటం అలవాటు. కానీ సి.యస్. ఆర్. అంత వ్యవధి ఉండకూడదని అర్జునుని వైపు ఒక చరణం కాగానే దుర్యోధనుని వైపు తిరిగి రెండో పద్యం చరణం అంటూ రెండు పద్యాలను అటు ఇటు తిరుగుతూ ఎక్కడ ఉచితమైన నటనను అక్కడ ప్రదర్శిస్తూ ప్రేక్షకులను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తేవారు.

ఒక దర్శక నిర్మాత శ్రీ కృష్ణపాత్ర ధరించ వలసిందిగా సి.యస్.ఆర్. ను శ్రీకృష్ణ రాయబారం సినిమా తీస్తూ 1936కు పూర్వమే అడిగితే ఆయన పద్యానికి అయిదు వందలు రూపాయలు పారితోషిక మడిగారు. ఆ రోజుల్లో ఆయన శ్రీ కృష్ణ పాత్రకు అంత విలువ ఉండేది. రంగస్థలంపై సి.యస్.ఆర్. శ్రీ కృష్ణ పాత్ర ధారణానుభవం ఆయనకు చలనచిత్ర రంగంలో ప్రవేశమే గాక చరమ దశ వరకు ఏ పాత్రనయినా సునాయాసంగా వైవిధ్యంతో ఆదర్శ ప్రాయంగా నటించగల ప్రతిభా వ్యుత్పత్తులను కలుగజేసింది.

మాతృమూర్తి అయిన నాటక రంగ సేవచేయటానికి సినిమాలలో విరామం దొరికినప్పుడల్లా సి,యస్.ఆర్ నాటకాలలో శ్రీకృష్ణ పాత్ర ధరించి కీర్తితో పాటు అపారంగా ధనాన్ని ఆర్జించి రసజ్ఞులను ఆనందింపచేసే వారు.

బందా కనకలింగేశ్వరరావు గారు విద్యాధికులు, న్యాయవాదులు, స్ఫురద్రూపులు, అనన్యసామాన్యమైన ప్ర తిభ కలవారు. చక్కని వాచికంతో శ్రావ్యమైన కంఠంతో తెలుగునాట శ్రీ కృష్ణ పాత్రలో తన ప్రత్యేకత నిల్పుకున్న ప్రముఖ నటులు.

శ్రీ కృష్ణ తులాభారంలో స్థానం వారి సరసన బందా వారు శ్రీ కృష్ణ పాత్ర ధరించి నిగ్గ తేలారు.

పద్యాలను విపులంగా పూసగ్రుచ్చినట్లు పనస తొనలను వలచినట్లు ఆచి తూచి అందివ్వడంలో బందావారికి బందావారే సాటి.

శ్రీ కృష్ణ పాత్రకు బందావారికి ఎనలేని కీర్తి తెచ్చి పెట్టిన నాటకం చిలక మర్తి వారి గయోపాఖ్యానం. ముఖ్యంగా సుభద్రార్జునుల సంధి విఫలం కాగా శ్రీ కృష్ణుడే సుభద్రతో "రాజసూయంబు చేసిన రాజుకాను"మొదలైన పద్యాలు అంటున్నప్పుడు బందావారు చూపించే హావభావాలు ఆయనకు పెద్ద పేరు ప్రఖ్యాతులు తెచ్చి పెట్టినాయి. బందావారి గయోపాఖ్యానం అంటే జనం విరగబడి చూసేవారు. ఆయన సినీ నటుడు కూడా కావటం వలన నాటకానికి విలువ పెరిగేది. ఆయనకు ఎక్కువ పారితోషికం ముట్టేది.

బందా ప్రక్కన అర్జునులుగా మేటి నటులు పంచాంగం రామానుజాచార్యులు, పులిపాటి వెంకటేశ్వర్లు, అబ్బూరి వరప్రసాదరావు, పీసపాటి నరసింహ మూర్తి, మల్లాది సూర్యనారాయణ. బి.వి. రంగారావు వంటి హేమాహేమీలు నటించేవారు.

బందావారి శ్రీ కృష్ణ పాత్ర చూసిన తరువాత బెల్లంకొండ సుబ్బారావుగారు తాము శ్రీ కృష్ణ పాత్ర నుంచి విరమించాలని అనుకున్నారు. అంటే శ్రీ కృష్ణ పాత్రకు గీటురాయి అయిన బెల్లంకొండ సుబ్బారావు గారు మెచ్చిన కృష్ణుడు బందా.

క్రీ.శ. 1936 ప్రాంతంలో చలన చిత్ర రంగం ప్రముఖులు స్థానం రెండు వర్గాలుగా ఏర్పడి ప్రసిద్ధ రంగస్థల నటులతో ద్రౌపదీ వస్త్రాపహరణం, ద్రౌపదీ మాన సంరక్షణము అనే రెండు చిత్రాలను పోటీగా నిర్మించారు. వస్త్రాపహరణంలో సి.యస్.ఆర్.కృష్ణుడయితే మాన సంరక్షణలో బందా కృష్ణుడు. అదృష్టవశాత్తు ద్రౌపదీ వస్త్రాపహరణం విజయ ఢంకా మ్రోగించింది. ద్రౌపదీ మానసంరక్షణం విజయం పొందక పోయినా బందావారి శ్రీకృష్ణపాత్రకు విలువ తగ్గలేదు.

విద్యా గంధం లేక పోయినా తన సంగీత ప్రావీణ్యంతో చక్కని రూప సంపదతో నటనా చాతుర్యంతో తనువు చాలించే వరకు శ్రీ కృష్ణ పాత్రలో జీవించిన వారు కళ్యాణం రఘురామయ్యగారు. ఆయన నిలువెల్ల నటులు.

రఘురామయ్యగారు శ్రీ కృష్ణ తులాభారంలో పాండవోద్యోగంలో సతీ సక్కుబాయిలో శ్రీ కృష్ణ పాత్ర ధరించేవారు.

జలతరంగిణి మ్రోగించినట్లు తన అపార హిందూ

స్థానీ సంగీత ఝరిలో రఘురామయ్యగారు శ్రీ కృష్ణ పాత్రలో జనాన్ని వోలలాడించేవారు. నోటిలో చూపుడువేలు మడిచి పెట్టి ఈల పాటపాడుతూ ఈల పాట రఘురామయ్యగా అశేష జనాదరణ పొందారు. తుది శ్వాస వరకు శ్రీ కృష్ణ పాత్ర ధారణ చేసినవారు వీరే.

దాదాపు నాటకకళ అంతరించి పోతున్న తరుణంలో చలన చిత్ర నటులుగా ఖ్యాతి నార్జించి రఘురామయ్యగారు నాటక కళామతల్లికి సేవచేసే ఉద్దేశంలో కురుక్షేత్రంలో మొదటి కృష్ణుడుగా పాత్రధారణ చేయటం వల్ల నాటక ప్రదర్శనకు విలువ ధనాకర్షణ జనాకర్షణ కలిగింది. కేవలం రఘురామయ్యగారు ఉన్నారని తెలిస్తే చాలు మొదటి తరగతి టిక్కెట్లు ఎన్నో అమ్ముడుపోయేవి. ఆయనకు అవకాశం ఉంటే చాలు ఎవరు పిలిచినా ఏమారు మూలకైనా శ్రీ కృష్ణ పాత్ర ధరించటానికి వెళ్ళేవారు.

సి.యస్.ఆర్., బందా రఘురామయ్యపాటలూ, పద్యాలూ ఎడాపెడా పాడగలిగి శ్రీ కృష్ణ పాత్రలకు గొప్ప పేరుతెచ్చి పెట్టారు. నిజానికి అది నాటక రంగానికి స్వర్ణయుగము.

బెల్లంకొండ సుబ్బారావు గారు మీసాల కృష్ణుడు గా తెలుగునాట ప్రసిద్ధి పొందారు. సుబ్బారావుగారు మీసాలు తీయకుండా గుబురుగా ఉన్నా పలుచగా ఉన్నా మీసాలతోనే శ్రీ కృష్ణ పాత్ర ధరించేవారు. మీసాలు ఉన్న ఆయనను కృష్ణుడుగా చూసి ఆయన పద్యాలకూ నటనకూ జనం నీరాజనం పట్టారు అంటే ఆయన ఎంత ప్రతిభావంతులో తేలికగా అర్థమవుతుంది.

పాండవోద్యోగ విజయాలలో గయోపాఖ్యానంలో బెల్లంకొండ వారి కృష్ణ పాత్ర తెలుగు నాట ప్రతీ చోట ప్రచారాన్ని పొంది ప్రసిద్ధి చెందింది. చివరి దశలో ఆయన ధృతరాష్ట్ర పాత్ర ధరిస్తూ ఒకనాడు శ్రీ కృష్ణ పాత్రధారి రాకపోతే తాను శ్రీ కృష్ణ పాత్ర ధరించి వస్తూనే 'ననుదూతగ బంపిరి సంధి సేయ' అంటూ చమత్కరించారు. ఆ మాటలకి అక్కడి వారు ఎంతో ఆనందించారు.

అబ్బూరి వరప్రసాదరావుగారి శ్రీ కృష్ణ పాత్ర సంగీతభరితము, రంగస్థల సంగీత ప్రియులకు ఆయన వరప్రసాదము. తిరుపతి వేంకట కవులు రచించిన పాండవోద్యోగ విజయాలు నాటకానికి ఇంత ప్రఖ్యాతి రావటానికి అబ్బూరి వారే కారణము. అబ్బూరి సోదరులు ఆ నాటకంలో వివిధ పాత్రలు ధరించేవారు. అబ్బూరి వారి విషయంలో ఎంత ఇస్తారు అన్నది కాదు ఎక్కడ నాటకం వేయాలి అన్నదే ప్రశ్న. పదిమంది పాత్రధారులు నిలబడకలిగిన ఏ ప్రదేశాన్నయినా ఆయన రంగస్థలం చేసేవారు. సంగీతంతో కూడుకున్న అబ్బూరి వారి శ్రీ కృష్ణుని పద్యాలు ప్రవాహంగా సాగి పోతాయి. తెలుగు నాట అబ్బూరి బాణీ వెలసింది. ఆయన జీవించింది కొలది కాలమే అయినా అందులో కొంత అస్వస్థతతో గడచినా ఆయన ఎన్నో వేల నాటకాలు ప్రదర్శించారు. ఒక్కొక్క రోజు రెండు చోట్ల కూడా పాత్ర ధారణ చేసేవారు. అబ్బూరి సంగీత సామ్రాజ్యానికి శ్రీ కృష్ణ పాత్రకు పట్టం కట్టారు. ఆయన లేకపోయినా ఆయన పద్యాలు ఇంకా తెలుగువారి చెవులలో మారుమ్రోగుతూనే ఉన్నాయి.

అప్పటికే కాంట్రాక్టు నాటకాలు కిరాయి నటులు రావటంతో ఒక్కొక్క పాత్రను పెక్కురు నటించటం వలన కురుక్షేత్రం నాటకంలో నలుగురైదుగురు కృష్ణులు వెలిశారు.

పీసపాటి నరసింహమూర్తిగారు వాచికాభినయాలకు ప్రాధాన్యతనిస్తూ తెలుగునాట శ్రీ కృష్ణ పాత్రలో మహానటనలను ప్రవేశింపచేశారు. పెద్ద నాటకమైన పాండవోద్యోగ విజయాలు ఆయన శ్రీ కృష్ణ పాత్ర ధారణలో శీఘ్రకాలంలో ముగించినట్లుగా భావింపచేయగల ప్రతిభామూర్తులు. సమయానుకూల వచన రచనా శక్తితో పీసపాటి వారి కృష్ణ పాత్ర ముఖ్యంగా రాయబారఘట్టంలో ఎంతగానో రాణిస్తుంది. ప్రజల కరతాళ ధ్వనులను చూరగొంటుంది. ఆయన శ్రీ కృష్ణ పాత్ర ఎన్నిక చేయబడి బహుమతి నందినది. రాయబారం కృష్ణుడు అంటే పీసపాటి వారే అనే కీర్తిని ఆయన తెచ్చుకున్నారు.

పీసపాటివారి శ్రీ కృష్ణ పాత్ర వెంట నాటకము రంగస్థలమే కాక ప్రేక్షకులు కూడా వెళ్ళి పోతున్నట్లుంటుంది. అది ఆయన పాత్ర పోషణ గొప్పతనము. గయోపాఖ్యానము

నాటకంలో పీసపాటివారి శ్రీ కృష్ణపాత్ర ఎంతో ప్రాముఖ్యం ఉంది. ఆయన ప్రక్కన అర్జునులుగా పులిపాటి, బి.వి. రంగారావు, వేమూరి రామయ్యగారలు ఎంతో రాణించేవారు

తెలుగునాట కురుక్షేత్రం ప్రసిద్ధమయిన నాటకం. ముక్కపాటి వెంకట రత్నంగారి మయ సభ, మల్లాది అచ్యుతరామశాస్త్రిగారి ద్రౌపది వస్త్రాపహరణం. తిరుపతి వేంకటకవుల జంట నాటకం పాండవోద్యోగ విజయాలు ఇన్ని కలిపితే కురుక్షేత్రం. నలుగురైదుగురు కృష్ణులు పాత్ర ధారణం చేయటము మొదలైంది. ఒక రంగస్థలంపై ఇంతమంది కృష్ణులను చూసే అవకాశం కలగటం అలవాటైంది. షణ్ముఖి, ఎ.వి. సుబ్బారావు మొదలైన వారు ఆయా రంగాలలో కృష్ణులుగా కనబడేవారు. చలన చిత్ర నటులు సి.యస్. ఆర్. బందాలే కాక తరువాతి తరం వారైన అమర్‌నాథ్ , కాంతారావు, చంద్రమోహన్ మొదలైనవారు కూడా అప్పుడప్పుడు శ్రీ కృష్ణ పాత్ర ధరించేవారు.

షణ్ముఖి ఆంజనేయరాజుగారు మంచి సంగీత విద్వాంసులు. కంచుకంఠంతో జనాన్ని ఆనందోత్సాహాలలో ముంచెత్తుతారు. ఎక్కువ పారితోషకం పొందే శ్రీ కృష్ణ పాత్రధారులు వేరు. ఆయనసంగీతంకోసం జనం ఎర్రులు చాస్తూ ఉంటారు.

ఎ.వి. సుబ్బారావుగారు పద్యాలు పాడుతూ ఉంటే సన్నాయి మ్రోగిస్తున్నట్లుగా ఉంటుంది. శ్రీ కృష్ణ పాత్రకు తగిన మంచి విగ్రహం. చక్కని సంగీత పరిజ్ఞానంతో తన ప్రత్యేకతను నిలుపుకొని ఏ రంగంలో నయినా శ్రీ కృష్ణ పాత్ర ధరించి సమ్మోహనాస్త్రంతో ప్రేక్షకులను కట్టి వేయగల ప్రఖ్యాతనటులు ఈయన. రంగస్థలానికి శ్రీ కృష్ణులుగా, తనకు మించిన తన తనయులను అందించిన సుబ్బారావుగారు ధన్యజీవి. సుబ్బారావుగారి కుమారులు ఎ. వెంకటేశ్వరరావు శ్రీకృష్ణ పాత్రలో అప్పుడే పేరు ప్రఖ్యాతులు తెచ్చుకున్నారు.

బండారు రామారావుగారు శ్రీ కృష్ణ పాత్రలో తమ హావభావాలను ప్రదర్శించి అశేష జనాళిమన్ననలను పొందారు. వేమూరి రామయ్యగారు గగ్గయ్యగారి కుమారులు. పాండవోద్యోగ విజయాలలో, శ్రీ కృష్ణతులాభారంలో, రాధాకృష్ణలో శ్రీకృష్ణపాత్ర ధరించి మంచి పేరు తెచ్చుకున్నారు. చక్కని ఆహార్యము మంచి వాచికాభినయాలు వీరి సొత్తు. విద్యాధికులైన వీరి శ్రీ కృష్ణపాత్ర ఆదర్శమైనది.

పృథ్వి వెంకటేశ్వర రావుగారు రఘు రామయ్యగారి శిష్యులుగా తెలుగు నాట ప్రసిద్ధి చెంది శ్రీ కృష్ణ తులాభారంలో కృష్ణ పాత్రకు తన నటనతో మాధుర్యంతో గొప్ప పేరు తెచ్చుకున్నారు. పాండవోద్యోగ విజయాలలో వీరి కృష్ణ పాత్ర ప్రసిద్ధమయినది. అపారమైన వీరి హిందూస్థానీ సంగీతాభినివేశం ప్రేక్షకులను ఎంతగానో ఆహ్లాదపరుస్తుంది. సహస్రాధికంగా శ్రీ కృష్ణ పాత్ర ధరించిన నటులు వీరు. ప్రఖ్యాత నటులు బందరు డి.వి. సుబ్బారావుగారు ఒక పాండవ విజయము నాటకాన్ని మాత్రమే ప్రదర్శించి అందులో శ్రీ కృష్ణ పాత్రను అత్యంత ప్రతిభావంతంగా నటించేవారు. రెంట చింతల సత్యనారాయణ, పాపరాజు రమణయ్య, యమ్.ఆర్. ఆంజనేయులు, గుడిపాటి సాంబయ్య, కె. నాగేశ్వరరావు, నల్లంచి అప్పారావు, షేక్ పెద మీరా, అల్లాభిక్ష, అమరపు సత్యనారాయణ గుప్తా, నాగరాజు సైదులు, మొదలైనవారు తెలుగునాట శ్రీ కృష్ణపాత్రకు పేరు తెచ్చుకున్నారు.

సంగీత దర్శకులు భీమవరపు నరసింహారావుగారు, జొన్నలగడ్డ సీతారామ శాస్త్రిగారు స్థానం వారి సరసన శ్రీ కృష్ణ పాత్రను ధరించేవారు.

దాసరి కోటిరత్నం, పీసపాటి సత్యవతి, అబ్బూరి కమల, కనకం, షహీదా, మొదలైన స్త్రీలు శ్రీకృష్ణ పాత్రకు పేరు తెచ్చుకున్నారు.

ప్రఖ్యాత నటులు ఎన్.టి. రామారావుగారు రంగస్థలం మీద శ్రీ కృష్ణ పాత్ర ధరించి ఆ నాటకాన్ని వాడవాడలా ప్రదర్శించి ఆర్జించిన ధనాన్ని సమాజ శ్రేయస్సుకు ఉపయోగించి అటు కళకు ఇటు సమాజానికి ఎంతో తోడ్పడ్డారు.

హైదరాబాదులో శ్రీ కృష్ణ పాత్ర ధారులు వందల సంఖ్యలో ఉన్నారు. యావదాంధ్ర దేశంలో వేల సంఖ్యలో ఉన్నారంటే అతిశయోక్తి కాదు. ఆంజనేయ స్వామిలేని ఊరు ఏ విధంగా ఉండదో శ్రీ కృష్ణ పాత్ర కనిపించే రాయబారం నాటకం ప్రదర్శించని ఊరు కూడా ఉండదు. సంప్రదాయ నటులకు పాండవోద్యోగ విజయాల నాటకం పెద్ద బాల శిక్ష. శ్రీ కృష్ణ పాత్ర శ్రీరామరక్ష.

తెలంగాణాలో తిరుమల శేషాచార్యులు గారు పాండవోద్యోగ విజయాలలో, గయోపాఖ్యానంలో శ్రీ కృష్ణపాత్ర ప్రతిభావంతంగా నిర్వహించటమే కాక నాటకానికి అవసరమైన ఆహార్యాన్ని కూడా అందరికీ సమకూరు ుస్తున్నారు.

బాబూరావు, ఆర్.వి. సుబ్బయ్య, సూరిబాబు, వారణాశి అప్పారావు మొదలగు వారు శ్రీకృష్ణ పాత్ర ధరించి ఆరోజులలో వార్‌ఫండ్ నాటకాలాడి ప్రభుత్వానికి సహాయం చేసేవారు. తరువాత తరంలో ఓగిరాల జానకిరామయ్య, తెనాలి శ్రీనివాసరావు, కోకారాఘవరావు, యోగి బాబు, నాంచారయ్య, అల్విన్ రాజు, వేమూరి శ్యాంసుందరరావు, ఈమని ఉమామహేశ్వరరావు, జి.యస్. యస్. శాస్త్రి, ఎల్. వెంకటాచార్యులు. గుమ్మడి గోపాల కృష్ణ డాక్టర్ అక్కిరాజు సుందర రామకృష్ణ, యస్.ఎస్. వి. రామారావు, గుంటుపల్లి సుబ్బారావు మొదలైన ఎందరో శ్రీకృష్ణపాత్రధారణ చేస్తున్నారు. అయ్యదేవర పురుషోత్తమ రావు పాండవోద్యోగ విజయాలు, శ్రీ కృష్ణ తులాభారం, కర్ణ, గయోపాఖ్యానం, భక్త కుచేల, శ్రీ కృష్ణాంజనేయ యుద్ధం, సతీసక్కుబాయి మొదలైన నాటకాలలో శ్రీ కృష్ణ పాత్ర ధరిస్తున్నారు.

తెలుగు వారి ఆరాధ్య దైవమైన శ్రీ కృష్ణుడిని నిత్యనూతనంగా నూతన నటులు తమ శ్రీ కృష్ణ పాత్రధారణలతో శోభాయమానం చేస్తూ సంప్రదాయ నాటకం, తెలుగు పద్యం, చిరకాలం వర్ధిల్లేలా చేయాలన్నదే మన ఆశయం.

•••

## జానపద కథా నిర్మాణం

*(161వ పుట తరువాయి)*

కథను వాక్యంగా భావించి ( కథా మౌలికాంశాలను పదాలుగా పదాంశాలుగా విశ్లేషించి వాటి సంయోజనాన్ని పరిశీలించడం ద్వారా కథా నిర్మాణాన్ని విశ్లేషించే ఈ పద్ధతి వాడకంలోని కథా నిర్మాణాన్ని సంధి సంధ్యంశాల ద్వారా విశ్లేషించే పద్ధతి (కొన్ని పరిమితులకు లోబడి) ఒకే విధమైనవి.

ప్రాప్ అనుసరించిన పద్ధతిలో కూడా కొన్ని లోపాలున్నాయి. అది ప్రధానంగా కథకు సంబంధించిన ఉపరితల నిర్మాణాన్ని గురించే ఎక్కువగా ఆలోచిస్తుంది. కథ అర్థం తత్త్వంతో దాని కున్న సంబంధం గౌణమైంది. డండెస్ సూచించిన ప్రకారం ప్రాప్ నిర్మాణ వివేచనా పద్ధతి ద్వారానూ ఒక భాషా సంస్కృతిలో లభించే మొత్తం జానపద కథలలో పరివ్యాప్తమైన ప్రకార్యాల సంయోజనాన్ని పరిశీలిస్తూ ఆ కథలు అభివ్యక్తీకరించే తత్త్వాన్నీ అర్థం చేసుకోవచ్చు. కాని, ఆ పద్ధతి విడి కథల వివేచనకు అంతగా ఉపకరించదు.

ప్రాప్ పద్ధతి అన్ని తరహాల జానపద కథలను విశ్లేషించడానికి ఉపయోగపడుతుంది.కాని ఆయన చూపిన 31 ప్రకార్యాల చట్రమే దీనికి ఉపయోగిస్తుంది అని దీని అర్థం కాదు. భిన్నకథా ప్రక్రియలను ఈ పద్ధతిలో విశ్లేషించి కథా పాత్రల ప్రకార్యాలను నిగమన పద్ధతి ద్వారా ఎన్నుకొని, ఆయా కథా ప్రక్రియలలో (నీతికథ, హాస్యకథ మొ॥) ఉండే ప్రకార్యాల అనుక్రమాలను పరిశీలించి ప్రదర్శించవలసి ఉంటుంది. ఆయా ప్రకార్యాల సంయోజనం కథా నిర్మాణానికి ఎలా కారణం అవుతుందో ఆ చట్రం కథ అర్థాన్ని వ్యక్తీకరించడంలో ఏ పాత్ర వహిస్తుందో చెప్పవలసి ఉంటుంది. తెలుగులో లభించే భిన్న నిర్మాణాలున్న భిన్న జానపద కథలను విశ్లేషించడానికి ఈ విధమైన పద్ధతి బాగా ప్రయోజనకరమైంది. భారతీయ జానపద కథలను వాటినిర్మాణాలను అర్థం చేసుకోవడానికి అనుకూలంగా ప్రాప్ నిర్మాణ అధ్యయన పద్ధతిని పరివర్ధితం చేసుకోవలసి ఉంది.

ప్రాప్ సిద్ధాంత ప్రేరణ ఈ శాస్త్రాన్ని మరింత ముందుకు తీసుకుపోయింది. లెవిస్ట్రాస్, డండెస్ మొ॥ శాస్త్రజ్ఞులు కథా నిర్మాణ వివేచనను మరింత ముందుకు తీసుకుపోయారు. పరిమితులకు లోబడి ఆ పద్ధతులను ఇక్కడ ప్రస్తావించలేదు. ప్రాప్ నిర్మాణ పద్ధతి ఈ శాస్త్రంలో తొలిముందడుగు. తర్వాత చాలా పద్ధతులు వచ్చినా దీని ప్రయోజనం ఇంకా ఉంది.

•••

# పాఠ్యపుస్తకాల్లో స్త్రీ చిత్రణ

శ్రీమతి. బి. సరోజన

పాఠ్యపుస్తకాలు సామాజిక ప్రతిబింబాలు. సామాజిక విలువలను, ఆశయాలను, ఆకాంక్షలను, అవసరాలను అక్షరరూపంలో అందించి, అభ్యసనానుభవములు కలిగించి చదువరులకు సమగ్ర మూర్తిమత్వాన్ని అందివ్వగల సాధనాలుగా వానిని విద్యావేత్తలు గుర్తించారు. పాఠ్యపుస్తకాల లోని అంశాలను ఉపాధ్యాయు డాకళింపు జేసికొని, అందలి విషయ పరిజ్ఞానంతో పాటు విద్యార్థులు ఏర్పరచుకొనదగు వైఖరులను, వారి మానసిక వికాసమునకు, నైతిక విలువలను సాధించుటకు చేయదగు కృత్యములను నిర్ణయించి ఆచరించుట ఉపాధ్యాయుల కర్తవ్యము. కాబట్టి విద్యా సముపార్జనలోను సత్పౌరులుగా బాలలను తీర్చి దిద్దుట లోను పాఠ్యపుస్తకాల పాత్ర గణనీయము.

జాతీయ విద్యావిధానము 1986 విద్యాప్రణాళికలో దేశ పాఠశాలలన్నింటిలోనూ పదిమౌలికాంశాలు పొందు పరచాలని నిర్దేశించింది. అవి

1. భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్ర
2. రాజ్యాంగ బాధ్యతలు
3. జాతీయ భావాన్ని పెంపొందించుటకు అవసరమైన విషయాలు.
4. భారతదేశపు సామాన్య సాంస్కృతిక వారసత్వము.
5. దేశసమైక్యత
6. స్త్రీ పురుష సమానత్వము.
7. పరిసరాలు పరిరక్షణ
8. సాంఘిక అవరోధాల తొలగింపు
9. చిన్న కుటుంబ భావన
10. వైజ్ఞానిక, శాస్త్రీయ దృక్పథము కలిగించుట.

ఈ పది మౌలికాంశాలు విద్యార్థులను సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా, నైతికంగా, సామాజికంగా, సాంస్కృతికంగా, వైజ్ఞానికంగా, మరియు విద్యాపరంగా ఉన్నతమైన విలువల్ని సాధించి భావితరాలకు ఆదర్శంగా ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దడానికి తోడ్పడుతాయి. ఈ అంశాలలో 'స్త్రీ పురుష సమానత్వము' అను అంశము గూడా చోటు చేసికొనుట గమనార్హం.

## స్త్రీ పురుష సమానత్వపు ఆవశ్యకత

జాతీయ విద్యావిధానము 1986ను అమలు జరుపుటకు కార్యాచరణ కార్యక్రమము (Programme of Action) చేపట్టబడింది. భారత ప్రభుత్వంచే జారీ చేయబడిన కార్యక్రమంలో స్త్రీ సమానత్వము విషయంలో ఈ విధంగా వివరించడం జరిగింది.

"విద్యావిభాగంలో స్వాతంత్ర్యానంతరం స్త్రీలకు విద్యావకాశాలు అనే ముఖ్యాంగం పొందుపరచబడింది. 1951, 1981 మధ్య కాలంలో స్త్రీలలో అక్షరాస్యతా శాతము 7.93 నుండి 24.2కు అభివృద్ధి చెందింది. కాని నిరక్షరాస్యులయిన స్త్రీల సంఖ్య 158.7 మిలియన్లనుండి 241.7 మిలియన్లకు (అస్సాము మినహా) పెరిగింది. స్త్రీలు నిరక్షరాస్యులలో 57% కలరు. పాఠశాలలో నమోదుకాని బాలబాలికలలో బాలికల శాతము 70. ఇంతవరకు తీసికొనబడిన అనేక చర్యలలో స్త్రీ విద్యలో సమానత్వమును సాధించుటకు సరియైన చర్యలు గైకొనబడలేదు". కాబట్టి కొన్ని నిర్దిష్టమైన ప్రతిపాదనలు అమలు జరుపుచున్నారు. అట్టి చర్యలలో భాగంగా పాఠ్యపుస్తకాలలో లింగ వివక్షత, సాంప్రదాయక పద్ధతిలో చిత్రించబడిన స్త్రీ పాత్రలు గల అంశాలను తొలగించడం ఒక ముఖ్య చర్య. కాని 1986 నాటికి పాఠ్య పుస్తకాలలో స్త్రీలను కించపరిచి వారి హోదాను తగ్గించే అంశాలు, లింగ వివక్షతకు సంబంధించిన విషయాలు కలవని జాతీయ స్థాయిలో అంగీకరించడం జరిగింది. ఇవి కూడా సామాజిక పద్ధతుల ప్రతిబింబాలే గదా? కాబట్టి సమాజంలో స్త్రీ పాత్ర ఎటువంటిది అనే ప్రశ్న ఉదయిస్తుంది.

## సమాజంలో స్త్రీ పాత్ర

అనాది నుండి నేటి వరకు సమాజంలో స్త్రీ సాధారణంగా అన్ని రంగాలలోను అంటే సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా విద్యాపరంగా అన్ని రంగాలలోను రెండవ శ్రేణి పౌరసత్వాన్ని అనుభవిస్తున్నదని ఈః క్రింది ఉదాహరణలు రుజువు చేయగలవు.

### సాంఘిక రంగం

ఋగ్వేదకాలానికి ముందు స్త్రీ పురుషులు సమానంగా వేటాడి, కష్టాలనెదుర్కొని, కలిసి మెలసి ఉండేవారని చరిత్ర కారుల అంచనా. ఋగ్వేద కాలంలో పురుష సంతానం కావాలని ఋక్కులున్నవి. కాని స్త్రీ శిశు జననం దురదృష్టంగా భావించిన దాఖలాలులేవు. కాని అధర్వణ వేదంలో ఆడపిల్లలు వద్దనే ప్రార్థన లున్నాయి. బ్రాహ్మణాల కాలం నుండి కుమారునికి విలువ పెరిగింది. 'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి' అనే మనుధర్మ శాస్త్ర నిర్దేశాన్ని నేటికీ ఏదో ఒక రూపంలో అమలు జరుపుతూనే ఉన్నారు. కార్యేషు దాసి, అని గృహంలో పనిమనిషి స్థాయి ఏర్పాటు చేయబడింది. ప్రస్తుతము స్త్రీ కొంత సాంఘిక స్వేచ్ఛ కొఱకు పరితపిస్తున్నా సనాతన పరిస్థితి పూర్తిగా మారలేదు.

**ఆర్థిక రంగం :–** నాటినుంచి నేటి వరకు స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. కుటుంబ ఆర్థికాభివృద్ధికి పాటు పడవలసిందే తప్ప ఆదాయ వ్యయాలపై ఆమె పాత్ర శూన్యమనవచ్చు. కొద్ది మంది ఉద్యోగినులు, కూలీలు సంపాదించినది కుటుంబ యజమాని కందించి వారి నిర్ణయాలకు కట్టుబడి యుండడము నేటి పరిస్థితి.

**రాజకీయ రంగం :–** వేద కాలంలో స్త్రీలు యుద్ధాల్లో పాల్గొనిన సందర్భాలు కలవు. ముద్గలుని భార్య ముద్గలాని శత్రువులను తరిమి కొట్టింది. తరువాత అప్పుడప్పుడు స్త్రీలు రాజ్యమేలినట్లు, స్వాతంత్ర్యోద్యమంలో ఝాన్సీ రాణి మొదలగు వారు యుద్ధంలో పాల్గొన్నప్పటికీ సాధారణంగా స్త్రీలకు రాజకీయ ప్రవేశం బహుతక్కువ. నేడు పార్లమెంటు లోగల 595 సభ్యులలో 27 మంది మాత్రమే స్త్రీలు. 295 మందిగల ఆంధ్ర ప్రదేశ్ విధాన సభలో 18 మంది మాత్రమే స్త్రీలు. సమానత్వం దరిదాపులలో గూడా లేదు.

### సాంస్కృతిక రంగం

పూర్వం స్త్రీ పాత్రలు గూడా నాటక రంగంలో పురుషులే ధరించేవారు. దేవదాసీలు మొదలగు నర్తకీ మణులకు న్యూనతా భావమే ఎదురైంది. ఇప్పుడిప్పుడే ఆడపిల్ల స్టేజీపై నటించినా, నర్తించినా సహనం కనిపిస్తుంది. ఆటపాటల లోను, సాహస క్రియలలోను ఎక్కడో ఒక పి.టి. ఉష, అశ్వినీ నాచప్ప, బిచేంద్రిపాల్, సుబ్బలక్ష్మి తప్ప తగినంతమంది లేరు.

### విద్యారంగం

వేదకాలంలోఆడ పిల్లలు ఇంట్లో పెద్దల వద్ద విద్య నభ్యసించారు. ఘోష, లోపాముద్రవంటి కవయిత్రులు ఋషులు కలరు. గార్గి మైత్రేయి, బ్రహ్మ జ్ఞానాభ్యాసకులు. బౌద్ధుల కాలంలో స్త్రీలు సన్యసించి గ్రంథాలు రచించారు. క్రమేణా ముఖ్యంగా ముస్లిం యుగం నుండి వీరి విద్యా వ్యాసంగం దాదాపు అంతరించి, బ్రిటిషు కాలం నుండి మరల కొంచెం మేలుకొన్నది. నేటి పరిస్థితి ముందే వివరించబడింది.

జాతీయ విద్యావిధానం 1986 ననుసరించి మన రాష్ట్రంలో పాఠ్యపుస్తక రచన కొనసాగుతోంది. కొన్ని పుస్తకాలు పాఠశాలల్లో ప్రవేశపెట్టబడ్డాయి. కొన్ని ప్రవేశపెట్టబడనున్నాయి. ఇవన్నీ పది మౌలికాంశాలను దృష్టిలో వుంచుకొని వ్రాయబడుచున్నవి. ప్రస్తుతం అమలులో ఉన్న పాఠ్య పుస్తకాలలో స్త్రీ పాత్ర చిత్రణ జాతీయ విద్యా విధానాని కనుగుణంగా ఉన్నదా అనే విషయాన్ని పరిశీలించడం అవసరం.

మొదటి తరగతి నుండి పదవ తరగతి వరకు అన్ని పుస్తకములు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వముచే తయారు చేయబడి అమలునందున్నవి. మొదటి రెండు తరగతులకు భాషకు తప్ప (తెలుగు) ఇతర పుస్తకములు లేవు. ఇంగ్లీషు,

ఉర్దూ, హిందీ తదితర భాషలలో వ్రాయబడిన పుస్తకములను సమీక్షార్థము గైకొనలేదు. ఒక్క తెలుగు మాధ్యమంగా గల పుస్తకాలను పరిశీలించినచో ఈ క్రింది విషయములు స్పష్టం కాగలవు. ద్వితీయ భాష తెలుగు కూడ సమీక్షించ బడింది.

1. ప్రస్తుత పాఠ్య పుస్తకములలో సాధారణంగా అన్ని పాఠాలు పురుషాధిక్యతనే కలిగి ఉన్నాయి. కొన్ని పాఠాలలో స్త్రీల ప్రసక్తి ఉంది. వాటిలో272 అంశములు స్త్రీలను గౌరవించేవిగా, వారి హోదాను ప్రతిబింబించేవిగా, ప్రదీపింపజేసేవిగా ఉన్నాయి. 339 అంశములు వివక్షతతో స్త్రీని కించపరిచేవిగా, ఆమె హోదాకు భంగం కల్గించేవిగా ఉన్నాయి. కొన్ని సాంప్రదాయిక పద్ధతిలో స్త్రీని చిత్రీకరించాయి. ఉదాహరణకు అమ్మ మనసు వెన్న కన్న మెత్తన- అను అంశము స్త్రీని గౌరవించేదిగను, 'చేసుకున్న పెళ్ళాన్నయితే కోసి కారత వేయవచ్చు' అను అంశము వివక్షతతో కూడుకొన్నదిగాను పరిగణించడమైనది.

2. మొత్తము పాఠ్యపుస్తకాలను 117 మంది రచయితలు, 85 మంది సంపాదకులు తయారుచేయగా అందు 10 మంది స్త్రీ రచయితలు, ఇద్దరు సంపాదకురాండ్రు మాత్రమే కలరు.

3. స్త్రీపట్ల వివక్షత చూపు అంశములు అన్ని విషయములకు సంబంధించిన పాఠ్య పుస్తకములలోనూ గలవు.

4. సాంఘిక రంగంలో స్త్రీ పాత్ర చిత్రణలో కొన్ని అంశములు గౌరవించేవిగను, ఎక్కువ అంశములు వివక్షతతో కూడుకొని యున్నవిగను యున్నవి. ఉదా : గిడుగు రామమూర్తి పంతులు తల్లి వద్ద రామాయణ మహా భారతకథలను నేర్చుకొన్నాడు. పెద్దవాళ్ళు పిల్లలను అడుగుతుంటారు. ఒకడు ఇంజనీరునవుతానని, అమ్మాయి టీచరునవుతానని చెప్పుంది.

5. ఆర్థిక పరమైన చిత్రణలో గూడ గౌరవ వివక్షలు చోటు చేసికొన్నాయి.ఉ : ఖాదర్ అను కుర్రవాడు తల్లి పోషణలో పెరుగుతున్నాడు. కొడుక్కి చదువుపట్ల గల ఆసక్తిని గమనించి ఆమె ఎంతో సంతోషించింది.

ఒక బాలింతరాలు చంటిదాన్ని చేతుల్లో పెట్టుకొని ఒక్క పైసా వేయండి బాబ అని అడుగుతూనే ఉంది.

6. రాజకీయంగా : రాజకీయ పరమైన స్త్రీ చిత్రణలో గూడ గౌరవ వివక్షలున్నాయి.

ఉ - ఓరుగల్లును పాలించిన రుద్రమదేవి వీరవనిత. శత్రు రాజులను ఓడించి రాజ్యంలో శాంతి భద్రతల్ని నెలకొలిపింది.

స్త్రీపరిపాలనను అంగీకరించని కొందరు సామంతులు దేవగిరి రాజును ఉసికొలుపుతారు. ఒక ఆడదానికి లొంగి ఉండడమా? చేతులకు గాజులు తొడుక్కున్నామా?

7. సాంస్కృతిక పరంగా : కొన్ని సన్నివేశాలు సాంస్కృతిక పరమైనవి పాఠ్యపుస్తకములలో గలవు. కాని బహుతక్కువ. అయినను వివక్షత చూపబడింది.

ఉ: వివిధ రంగాలలో ప్రతిభ గనపరచిన సరోజినీదేవి భారత నారీలోకానికి గర్వకారణం.

అంబేద్కర్(ఆయన) భార్యతో సహా బౌద్ధమతాన్ని స్వీకరించాడు.

8. విద్యారంగంలో : విద్యా విషయకంగా స్త్రీ పాత్ర చిత్రణలో న్యూనత గౌరవము రెండూ ఉన్నాయి.

ఉ : మొల్ల వ్రాసిన పాఠము స్వయంవరము, కలదు. తాళ్లపాక తిమ్మక్క తొలి తెలుగు రచయిత్రి.

స్త్రీలకు ఏకధాటిగా గ్రంథపఠనం సాగించాలంటే కుదరక పోవచ్చు. మొత్తం స్త్రీలలో గృహిణులైన తరువాత పుస్తకాలు తెరిచేవారు చాల తక్కువ.

9. ఉన్నత పాఠశాలల్లోని 14 సంవత్సరముల వయసులోపు గల బాలలకు వివరింప వీలుకాని విషయాలు పొందుపరచబడ్డాయి మన పాఠ్య పుస్తకాలలో ఉ : కొంగుచాటున వర్థిల్లు కుచభరమున -పూర్ణకుచకుంభ ఒక బ్రాహ్మణ స్త్రీయందు బ్రాహ్మణు డొకడు, శూద్రుడొకడు ఇద్దరు కొడుకులను కన్నారు.

(తరువాయి 176వ పుటలో)

# తెలుగు దూరదర్శన్ ఇలా ఎందుకుంది ?

డా॥ సి. మృణాళిని

తెలుగు దూరదర్శన్ ఇలా ఎందుకుంది? అని ప్రశ్నించుకునే ముందు అసలు తెలుగు దూరదర్శన్ ఎలా వుంది ? అని ప్రశ్నించుకోవాలి. తెలుగు కార్యక్రమాలు చాలా అధమస్థాయిలో ఉన్నాయని కొందరంటే, మేము రాత్రి 9 వరకు టి.వి. 'ఆన్' కూడా చెయ్యమండీ అని చెప్పేవారు మరికొందరు. తెలుగు కార్యక్రమాలు వీక్షించడమే మహాపాపమని భావించే ఆంధ్రులు చాలామందే ఉన్నారు. దీనికి కారణమేమిటి ? నిజంగా తెలుగు కార్యక్రమాలు అంత నాసిరకంగా ఉన్నాయా లేక తెలుగు కార్యక్రమాలను తిట్టడం ఒక ఫాషనా? రెండు అభిప్రాయాల్లోనూ కొంత నిజం వుంది. వీటిని చూడము, చూడలేము అని చెప్పేవాళ్ళు ఈ కింది కారణాలు చెప్తారు.

1. నాటకాలు (స్పాన్సర్డ్ గాని, దూరదర్శన్ చూపించేవిగానీ) బాగుండవు. ముఖ్యంగా సీరియల్స్‌లో పౌరాణిక, జానపదం కొండొకచో బాగున్నా, సాంఘికాలు చూసేట్టు ఉండవు.
2. నటీనటులు ఆకర్షణీయంగా ఉండరు. జాతీయ కార్యక్రమాల్లోని సీరియల్స్‌లో నటీనటులు అందమైన వారు, నాటకానుభవం ఉన్నవారు వుంటారు. కానీ తెలుగులో డైలాగు చెప్పటం కూడా రాని వారు నటులౌతున్నారు. నటుల ఎంపికకు ఒక పద్ధతి, ప్రమాణం లేవా?
3. ప్రేక్షకులకు ఏ మాత్రం నచ్చని సీరియల్స్‌కు అనూహ్యమైన రీతిలో ఎక్స్‌టెన్షన్ వస్తూంటుంది. కనుక, దీనవెనుక 'రాజకీయం' 'స్వలాభాపేక్ష' ఉన్నాయన్న అనుమానం ప్రేక్షకులకు సహజంగానే కలుగుతుంది.
4. బొడ్డూడని పిల్లలచేత నాట్యాలు చేయించడం, ఆంధ్రదేశంలో గాయకుల క్షామం వున్నట్టు, పాడిన వాళ్ళ చేత మళ్ళీ మళ్ళీ లలిత సంగీతం పాడించడం, స్త్రీల కార్యక్రమాలు మూసలో పోసినట్టు ఒకేరకమైన చర్చలు చూపించడం చికాకు కలిగిస్తాయి.
5. పొరబాటున ఓ మంచి కార్యక్రమం ప్రసారమైతే దాన్ని నాలుగుసార్లు పునఃప్రసారం చేసి బోరు కొట్టించేస్తారు. ముఖ్యంగా స్త్రీల కార్యక్రమాలలో ఒక్కొక్క చర్చా కార్యక్రమం ఎన్నిసార్లు పునఃప్రసారమౌతోందో చూస్తే, అసలు అందులో కొత్త కార్యక్రమాలు చేయడం మానుకున్నారా అనిపిస్తుంది.

ఇలా చెప్పుకుంటూ పోతే సవాలక్ష కారణాలు కనిపిస్తాయి. ఎవర్ని కదిలించినా ఈ ఆరోపణలన్నీ చేస్తారు. ఇంకా ఘాటుగా కూడా చేస్తారు. బహుశా జాబులు-జవాబులు దూరదర్శన్ సిబ్బంది చదివే ఉత్తరాల్లో తప్ప, ఫలానా కార్యక్రమం అద్భుతంగా వుంది అని ఎవరైనా మెచ్చుకోవడం చాలా అపురూపమే. (ఆ ఉత్తరాలు నిజంగానే వస్తాయనుకోండి).

కార్యక్రమాలు చెప్పుకోదగ్గ స్థాయిలో లేవనీ, వాటిని మెరుగు పరచవలసిన అవసరం ఎంతైనా వుందనీ అటు ప్రేక్షకులకు, ఇటు కార్యక్రమాల రూపశిల్పులకు కూడా తెలుసు. కానీ ఏ పనయినా పదిమంది మెచ్చుకునే స్థాయిలో ఉండాలంటే దాని వెనుక ప్రతిభ వుండాలి. కృషి ఉండాలి. కొత్తదనం తీసుకురావాలన్న ఉత్సాహం ఉండాలి. బాధ్యతుండాలి. అన్నిటికంటే ముఖ్యంగా 'నేను పనిచేసినా చేయకపోయినా నెల తిరిగేసరికి నాలుగంకెల జీతం వస్తుండగా పనిచేయనేల' అనే సగటు మనస్తత్వం పోవాలి. ప్రభుత్వ సంస్థలన్నిటిలోను ఉన్న అలసత్వం, బాధ్యతారాహిత్యం, నిర్లక్ష్యం ఇక్కడ కూడా ఉన్నాయి. కనుకనే దూరదర్శన్ ప్రారంభమై ఇన్నేళ్ళయినా ప్రమాణాలు మాత్రం పెరగనంటున్నాయి.

దూరదర్శన్‌లో ప్రసారమయ్యే కార్యక్రమాలు స్థూలంగా

ఆ రెండు రకాలు. 1. దూరదర్శన్ రూపొందించేవి సాహిత్య కార్యక్రమం, తరుణీ తరుణం, యువజనుల కార్యక్రమం, వ్యవసాయదారుల కార్యక్రమం, మంగళవారం వార్తల అనంతరం ప్రసారమయ్యే నాటకాలు, చిత్రలహరి, పర్వదినాల్లో ప్రత్యేక కార్యక్రమాలు, ఇత్యాదులు. 2. ప్రాయోజిత కార్యక్రమాలు లేదా స్పాన్సర్డ్ కార్యక్రమాలు ఎక్కువగా రాత్రి 7 నుంచి ఏడున్నర వరకు ఆదివారం 8.30 నుంచి 9 వరకు ఇవి ప్రసారమౌతాయి.

ఈ రెండింటిలోనూ దూరదర్శన్ రూపొందించేవి, లేక దూరదర్శన్ కమీషన్ చేసేవీ అయిన కార్యక్రమాలే ఓ పిసరు మెరుగని చాలామంది ఒప్పుకుంటారు. వస్తువు ఎంపిక దగ్గర్నుంచీ ఎడిటింగ్ వరకూ అన్ని అంశాలపైన శ్రద్ధ వహిస్తే తప్ప ఓ 20 నిముషాల కార్యక్రమం అందంగా రూపుదిద్దుకో జాలదు. వస్తువు దగ్గర్నుంచీ దూరదర్శన్ అధికారులకు కొన్ని పరిమితులున్నాయి. అది ప్రభుత్వ సంస్థ కనుక, ప్రభుత్వ లక్ష్యాలను సిద్ధాంతాలను చాటే అంశాలను చర్చనీయాంశాలు గానో, ఆధారవస్తువుగానో స్వీకరించాలి. ఏ వర్గానికీ, మతానికీ, కులానికీ సంబంధించిన పదజాలం, నుడికారం వాడరాదు. అభ్యంతరకరమైన వస్తువు, అభ్యంతరకరమైన సంభాషణలు రాకుండా జాగ్రత్త పడడంలోనే సగం సృజనాత్మకత ఎగిరిపోతుంది. అదీకాక వర్ధంతులు, జయంతులు, దినోత్సవాలు ప్రభుత్వం వారికి అతి ప్రియమైనవి, ఎప్పటి కప్పుడు కాలెండర్లు చూసు కుంటూ హడావిడిగా కార్యక్రమాలు చేస్తుంటే ప్రమాణాలు ఏ స్థాయిలో ఉంటాయి? నా అనుభవంలో జరిగిన ఓ సంఘటన చెప్తాను. దాదాపు నాలుగేళ్ళ క్రితం ఓ రోజు వినియోగదారుల దినోత్సవమని ఢిల్లీ వారికి అకస్మికంగా జ్ఞానోదయమైంది. వెంటనే హైదరాబాద్ దూరదర్శన్‌కు ట్రంకాల్-రాత్రి అధమం ఓ పావుగంట వినియోగదారులపై కార్యక్రమం ప్రసారం చేయాలని. ఆ ప్రొడ్యూసర్ హడావిడిగా ఒక న్యాయవాదినీ, ఓ వినియోగదారుల కోర్టు జడ్జినీ ఓ గృహిణినీ, ఓ సంధాన కర్తనూ వెతికి చర్చ నిర్వహించారు. ఆ గృహిణి పాత్రధారిని నేను. ఇప్పటికప్పుడు అనుకుంటే ఎలా? అని మేమంతా తర్జన భర్జనలు పడుతూనే వెళ్ళాం. సాయంత్రం 6.30 కు ప్రసారం కావలసిన కార్యక్రమం మధ్యాహ్నం రెండున్నరకు రికార్డు అవుతోంది. నలుగురం ఫోన్ పై దొరికాం కాబట్టి రాగలిగాం కానీ, అందరూ ఆ సబ్జెక్ట్‌లో నిష్ణాతులమని కాదు. ఒక్క రిహార్సల్ లేకుండా కానిచ్చేశాం. అదృష్టవశాత్తు అది అందరూ నిత్యం ఎదుర్కొనే సమస్యే అందులో అందరం కొద్దో గొప్పో మాట్లాడే అలవాటున్న వాళ్ళం కనుక అభాసుపాలు కాకుండా కార్యక్రమం బాగానే చేయగలిగాం. కానీ, చెప్పవచ్చేదేమంటే, ఇలా ఓ పథకం, పద్ధతీ, కళాకారులను ఎంపిక చేసుకునే వ్యవధి లేకుండా కార్యక్రమాలు రూపొందిస్తే, నాసిరకంగా ఉండక ఏమౌతాయి?

ఇక స్పాన్సర్డ్ (ప్రాయోజిత) కార్యక్రమాలు. వీటి విషయంలోనే దూరదర్శన్ పై ఎక్కువ ఆరోపణలు వినిపిస్తుంటాయి. నటనలో, నాటక రచనలో ఓనమాలు తెలియని వాళ్ళు రచించి, దర్శకత్వం వహించి, నటించేసి ఓ ముగ్గురు స్పాన్సర్లను సంపాదించగలిగితే, చచ్చినట్లు 22 నిముషాల పాటు ప్రేక్షకులు వారిని భరించ వలసిందేనా? ఈ నిర్మాతల కున్న అర్హత స్పాన్సర్లను సంపాదించగలగడమేనా? ప్రాయోజిత కార్యక్రమాలకు నాణ్యత, ప్రమాణం లాంటివి అవసరం లేదా? ఏ ప్రాతిపదికపై ఈ కార్యక్రమాలను ఎన్నుకుంటారన్నది సామాన్య ప్రేక్షకులకు అర్థమయ్యే విషయం కాదు. దూరదర్శన్ రూపొందించే కార్యక్రమాల వెనుక కొద్దో, గొప్పో శ్రద్ధ, కనిపిస్తుంది. కానీ ప్రాయోజిత కార్యక్రమాల్లో ఆపాటి క్వాలిటీ వుండడం కూడా అనవసరమని దూరదర్శన్ భావిస్తుందేమో. స్పాన్సర్డ్ కార్యక్రమాలన్నీ చెత్తవని ఎవరూ అనరు. కానీ అధిక

శాతం నాసిరకంవే. ఆంధ్రప్రదేశ్‌లో కళాకారులకు ఇంత కొరతా అనిపిస్తుంది ఒక్కొక్కరి నటన, నాట్యం, సంగీతం చూస్తుంటే (వింటుంటే).

దూరదర్శన్ నాటకాలు ఎందుకు ప్రేక్షకుల ఆదరణ పొందలేక పోతున్నాయన్నది ఆలోచించవలసిన విషయం. చాలాసార్లు ప్రసిద్ధమైన నాటక కర్తలు కూడా దూరదర్శన్‌కు నాటకాలు రాస్తుంటారు. వాటిలో విషయం బాగుండవచ్చు. కానీ ప్రధానమైన లోపం ఎక్కడుందంటే, రంగస్థల నాటకానికీ, టి.వి. నాటకానికీ వారికి తేడా అర్థం కాక పోవటం. టి.వి. నాటకాల సంభాషణలు ఎంత తక్కువగా, భావ ప్రకటన ఎంత ఎక్కువగా ఉంటే అంత బాగుంటుంది. రంగస్థలంపై హావభావాలు ఎంత బాగా ప్రకటించినా, అందరికీ కనిపించవు కనుక సంభాషణలకు ప్రాముఖ్యం ఎక్కువ. కెమేరా ముందు చేసే అభినయానికి మాటలు తక్కువ, భావ ప్రకటన ఎక్కువ వుంటేనే బాగుంటుంది. టి.వి. అనే మీడియా స్వరూపాన్నీ సరిగా అర్థం చేసుకోక పోవడం వల్ల మన స్పాన్సర్డ్ నాటకాలు గానీ, దూరదర్శన్ నాటకాలు కానీ అంతగా రక్తి కట్టడం లేదు.

తెలుగు దూరదర్శన్ ప్రమాణాల గురించి మాట్లాడుకుంటున్నపుడు, వార్తల ప్రసారం గురించి కూడా ఓ రెండు మాటలు చెప్పాలి. వార్తలు చదివే వారిలో ఎప్పటికప్పుడు కొత్త వారిని పరిచయం చేయడం ముదావహమే కాని వారి ఎంపిక ఏ ప్రాతిపదికపై జరుగుతోందో తెలియడం లేదు. ఫోటోజెనిక్ గా వుండి, కంఠస్వరం బాగుంటే చాలదు. కొద్దో గొప్పో వార్తా పత్రికలు చదివే అలవాటు, జనరల్ నాలెడ్జ్ కూడా వుంటేనే గానీ వార్తలకు పనికిరారు.

దూరదర్శన్ బాగు పడాలంటే, 1. ప్రతిభ ఎక్కడున్నా గుర్తించగలిగే నైపుణ్యం ప్రయోక్తలకు ఉండాలి. 2. కనీసం నాట్యం, సంగీతం వంటి కళల ప్రదర్శనలకైనా సిఫారసులు, అస్మదీయుల ప్రస్తావన ఉండరాదు. 3. టి.వి. అనే మీడియాను అటు నిర్మాతలు, ఇటు ప్రేక్షకులు కూడా అర్థం చేసుకోవాలి. 4. ఏం చేసినా మా ఉద్యోగాలకు ఢోకాలేదు అనే వైఖరి పోయి మా వృత్తికి సార్థక్యం చేకూర్చుకోవాలి అనే వైఖరి అక్కడి ఉద్యోగుల్లో రావాలి.

ఇలాంటి ఉచిత సలహాలు ఎన్నయినా ఇవ్వవచ్చు. నిజానికి వీటిని పాటించాలని అక్కడి పెద్దలకు తెలియకపోలేదు. అందరికీ తెలిసినవే, కానీ ఎవరూ పట్టించుకోనివి మరోసారి మనం గుర్తుకు తెచ్చుకుంటున్నాం. అలాగే దూరదర్శన్ కార్యక్రమాల సమీక్షకులు, విమర్శకులు, సామాన్య ప్రేక్షకులు కూడా గుడ్డెద్దు చేలో పడ్డట్లు తిట్టిపోసుకుంటారేగానీ ఆయా కార్యక్రమాలను ఎలా బాగు చేయవచ్చో చెప్పే పరిజ్ఞానం గానీ సహృదయం గానీ వారికి లేవు. ఏ వ్యవస్థ అయినా బాగుపడాలంటే దానిలోని మంచిని స్వీకరించి చెడును సహేతుకంగా నిరూపించే సద్విమర్శ అవసరం. మన దూరదర్శన్‌కు ఉన్న అనేక కొరతల్లో ఇది కూడా ఒకటి. ఇవన్నీ బాగు పడినపుడు 'తెలుగు దూరదర్శన్ ఇలా ఎందుకుంది' అని అడగాల్సిన అవసరం రాదు.

★★★

# సంస్కృతి - కుటుంబం

శ్రీమతి కె. అరుణావ్యాస్

అనశ్వరమైన మానవీయ విలువలని మధించి వెలికి తీసిన నవనవోన్మేష నవనీతమే సంస్కృతి. తరతరాలుగా అవిచ్ఛిన్నంగా, అనూచానంగా అమలులో వున్న జీవిత విధానమే ఈ సంస్కృతి. ప్రాచీనులు నవీనులకి సుగమమూ, సువిశాలమూ సురుచిరమూ అయిన జీవన పంథాని చూపిస్తూ అందజేసిన దివిటీయే ఈ సంస్కృతి. ఈ సంస్కృతి అనేక మతాలకి పట్టుగొమ్మ. అనేక విశ్వాసాలకి మూలాధారం. అనేక కళలలకి కాణాచి. అనేక శాస్త్రాలకి మారు పేరు. ఇలా వైవిధ్యాల సురభిళంతో గుబాళిస్తోంది సంస్కృతి.

ఇంగ్లీషులో సంస్కృతిని "Culture" అంటాము. ఇది latin పదం "Cultura" నుంచీ, French పదం "Cultus" నుంచీ వచ్చింది. ఈ పదానికి "కృషి" అని అర్థం. వ్యవసాయ సంబంధిత పదం "కృషితో నాస్తి దుర్భిక్షా" న్నీ "శ్రమైక సౌందర్యాన్నీ" చాటుతోంది. పుడమి తల్లిని నమ్ముకున్న శ్రామికుడు నియమమూ నిర్దుష్టమూ, నిబద్ధమైన జీవితాన్ని సాగిస్తాడు. "యోగః కర్మసు కౌశలమ్" అనే గీతాతత్వాన్ని "కృషి"గా, శారీరకశ్రమగా- ఇలా బాహిరమైన సంస్కృతిగా ప్రస్ఫుటమైంది. తత్వ శాస్త్రాలు, లలితకళలూ, విజ్ఞాన శాస్త్రాల్లో ఆంతరిక సంస్కృతి ద్యోతకమౌతున్నది.

ఈ సంస్కృతి త్రిముఖంగా కనిపిస్తోంది. వ్యక్తిగత, వర్గగత, సమాజగత సంస్కృతులుగా. వ్యక్తి సంస్కృతి మనిషి మాట తీరునీ, ప్రవర్తననీ, నడవడికనీ, అలవాట్లనీ తెలుపుతోంది. "వాణ్యేకాసమలంకరోతి పురుషం యాసంస్కృతాధార్యతే" (సంస్కరించబడిన వాక్కే పురుషుడికి చక్కని అలంకారం). అలాగే ఒక వర్గంలోని విభిన్న వ్యక్తుల సంస్కృతుల లోనూ సారూప్యత ఉంటుంది. ఒక సమాజంలోని వ్యక్తులు భాష, విశ్వాసాలు, మతాలు, కళల విషయాల్లో ఏకీభావం చూపితే అది సామాజిక సంస్కృతికి దర్పణమే.

భారతదేశం తనదైన సంస్కృతిని దాదాపుగా 5 వేల సంవత్సరాల నుంచీ కాపాడుకుంటూ, నిలుపుకుంటూ వస్తోంది. భారత దేశ సంస్కృతి అంటే సత్యం, శౌచం, ఋజువర్తన, ధర్మం, ఆత్మసంయమనం, నియమ జీవన కాఠిన్యం, మత సహనం - ఇలా అనేక పాయలు కలసి అనితరమై నిరంతరమై, అనంతమైన వాహినిగా ప్రవహిస్తోంది. తల్లినీ, తండ్రినీ, గురువునీ, అతిథినీ దేవుళ్ళను చేసింది మన సంస్కృతి. విశ్వమానవ సౌభ్రాత్రాన్ని కాక్షించింది మన సంస్కృతి. "భ్రాతారోమానవాస్సర్వే" విశ్వమానవ కల్యాణాన్ని ఆశించింది మన సంస్కృతి. "సర్వేజనా స్సుఖినోభవంతు". భూతలాన్ని ఒక కుటుంబంగా వీక్షించింది మన సంస్కృతి. "వసుధైక కుటుంబకమ్" మత సామరస్యాన్ని సర్వత్రా, సర్వదా ఆకాంక్షించింది మన సంస్కృతి. అందుకే మన విశ్వాసాల పట్టుగొమ్మ "మతం" కాదు. - అది "సనాతన ధర్మం". మతానికంటే ధార్మిక జీవనానికీ, ఆచారాల కంటే ఆధ్యాత్మిక దృక్పథానికీ ప్రాధాన్యమిచ్చింది మన సంస్కృతి.

భారతీయ సంస్కృతి కిరీటంలో దగద్ధగ శోభాయమానమైన మణి స్త్రీ పూజ. (Gynocentricism). స్త్రీని అధిష్ఠాన దేవతగా పూజించే అపురూప సంస్కృతి మనది. అలాగే సృష్టి, స్థితి లయ కారులైన త్రిమూర్తులూ స్త్రీని గౌరవించినవారే. హరుడు పార్వతిని దేహంలో సగ భాగంగా స్వీకరిస్తే (అర్ధనారీశ్వరుడు) హరి లక్ష్మిని హృదయంలో పదిలంగా దాచుకున్నాడు. సృష్టికర్త బ్రహ్మ వాగ్దేవి వీణా వాద సందోహంతోనే సృష్టి చేస్తాడుట. చెట్టునీ పుట్టనీ పూజిస్తూ, ప్రకృతి మాతను పరవశింపజేస్తున్నాం మనం. జన్మలలోని నమ్మకం దానధర్మాలకి ప్రోద్బలం కలిగించింది. "మంచి అన్నది పెంచుతోంది" కూడా. కర్మసిద్ధాంతం మనిషికి పాపభీతిని కలగ జేస్తూ సద్వర్తనుణ్ణి చేస్తోంది. ఇదంతా మన సంస్కృతీ వైభవ ప్రకంపనాలే.

ఒక దేశ భౌగోళిక స్థితిగతులు కూడా ఆ దేశ ప్రజల జీవన విధానాలని ప్రభావితం చేస్తాయి. సస్యశ్యామలమైన క్షేత్రాలతో, శుభ్రజ్యోత్స్నాపులకిత యామినులతో- సుభిక్ష మైన మన దేశం ధన, ధాన్య నిక్షేపాలలో అగ్రగామిగా నిలిచింది. ఏనాడూ తన సరిహద్దులను దాటి పరదేశాధిక్ర మణాలను చేయలేదు. అందుకే ఇక్కడ శాంతి ప్రియత్వం, సౌజన్య కాంక్షా మొగ్గలు తొడిగాయి. భౌతిక వాదం, వ్యక్తివాదం, సామ్రాజ్యవాదాలు విదేశీ సంస్కృతులుగానే మిగిలిపోయాయి.

అనేక దృక్పథాల నాహ్వానించి, విభిన్న సంస్కృతుల సారాన్ని స్వీకరించి, వివిధ విశ్వాసాలను తనలో విలీనం చేసుకున్న అపూర్వ సంస్కృతి మనది.

మన సంగీతం ఆహత, అనాహతమై ధాతు, మాతువులు వర్గమాత్మ ఉచ్ఛ్వాస, నిశ్వాసాలుగా విస్తరిల్లింది. సప్తస్వరాల తో శోభిల్లుతూ - రాగాలై మూర్ఛనలై, అనంతమైన "అనంతావై రాగాః" - నివృత్తికి ఏడుస్వరాలు ఏడు మెట్లై పరమ పద సోపానమైంది.

మన నృత్యం- ఆది దంపతుల నటనా, లాస్యాల సమ్మేళమై- సృష్టి, స్థితి, లయల ప్రతీకగా- పంచమవేద మైంది.

మన సాహిత్యం- సంస్కృతి వైశిష్ట్యానికి ప్రతీక. మన గ్రంథాలు సంస్కృతి వృక్షానికి పూచిన కొమ్మలు. తరతరాలుగా భారతీయులమని మన కావ్య, పురాణ, ప్రబంధాలు ప్రభావితం చేస్తున్నాయి. మన నాటకాలు "చాక్షుష క్రతువులు"ఇలాగ భారతీయ కళలన్నీ ఆత్మవికాసానికి, సద్యఃపర నిర్వృతికి ఆలంబనాలు.

చారిత్రికంగా మనిషి గుంపు జీవితం నుంచి కుటుంబ జీవితానికి నడవటానికి అనేక వేల సంవత్సరాలు పట్టింది. పెళ్ళి మనిషి జీవితానికి సుస్థిరతని ఆపాదిస్తే, పిల్లలు అతని జీవితాన్ని పుష్టివంతంగానూ, అర్థవంతంగానూ చేస్తారు. పిల్లలు వ్యక్తిగత సంవేదనలనీ, వాత్సలాన్నీ, అనురాగాన్నీ నిర్ణీత పద్ధతిలో నియమ బద్ధం చేస్తారు. పిల్లలు పుట్టటంతో బాధ్యతలు మనిషి జీవితాన్ని క్రమబద్ధం చేస్తాయి. అంతేకాకుండా మనిషి "స్వంత లాభం కొంత మానుకో"డం నేర్చుకుంటాడు. అంతర్గత వాత్సల్య భావ ప్రకంపనలు పిల్లల ద్వారా ప్రకటితమవుతాయి. మనిషి జీవితం అతని మరణంతో సమాధి దగ్గర ఆగిపోదు. అతని పిల్లల ద్వారా కొనసాగుతూనే ఉంటుంది. పిల్లలెప్పుడు "తినరాని పండ్లే. తీపి తీపే" పిల్లలు లేని ఇళ్ళు కట్టడాలే అవుతాయి. అందుకే Alfred Tennyson తన Ullysses చేత అనిపిస్తాడు. "This is my son, my own Telemacher" అని. బాలకుడైన భరతుణ్ణి చూసి దుష్యంతుడు "ధన్యాస్తదంగ రజసామలినీ భవంతి". (ఈ పిల్లలకి అంటుకున్న మట్టి అంటుకున్న తల్లిదండ్రులు ధన్యులు). తల్లిని మొదటి దేవుణ్ణి చేశాయి మన ఉపనిషత్తులు. తల్లి గర్భంలో జీవం పోసుకుని ఊపిరితో ఊపిరి పీలుస్తూ తల్లి తిండి తిని పెరుగుతూ తల్లి నుండి బయట పడి లోకాన్ని చూస్తుంది బిడ్డ. బహిః ప్రపంచంలో ఆ బిడ్డకి ఆహారం మాతృస్తన్యమే. తల్లే నిజం - తండ్రి భావనే. తల్లినీ, బిడ్డనీ బంధించేది మంత్రసాని కోసే బొడ్డు కాదు. అది అనిర్వచనీయాను బంధం.

కాలం వేగాన్ని పుంజుకుని నడవటం మాని, దౌడు తీస్తోంది. ఉమ్మడి, ఆస్తులు పోయి విస్తార కుటుంబాలు పోయాయి, కొడుకుల ఉద్యోగాలతో చిన్న కుటుంబాలు వచ్చేసాయి. (Nuclear Families) తల్లులు విద్యావంతులై, ఉద్యోగస్థుల పథంలో కుటుంబ వ్యవస్థే కొత్త రూపు తొడుక్కున్నది. భార్య, భర్తల ఉద్యోగాలు, ఒత్తిడులూ, అవిశ్రాంత జీవితం కుటుంబ జీవితాలకి కొత్త భాష్యాలు చెపుతున్నాయి. తల్లుల మానసిక పరిణతీ, బౌద్ధిక చైతన్యం ఆమెనిగృహిణి,మాతృస్థానాలనుంచి ముందుకు నడి పించాయి. గృహిణిగా, తల్లిగా, ఉద్యోగినిగా-మూడు వైవిధ్య భూమికలని నిర్వహించక తప్పటం లేదు- కసరత్తులూ తప్పటం లేదు. ఈ ఒత్తిడులు కుటుంబంలో చీలికలకి దార్లు తీస్తున్నాయి. ఉద్యోగస్థులైన తల్లుల పిల్లలని ఆయాలు baby-sitters, చూసుకుంటున్నారు. స్త్రీకి ఉద్యోగం, గృహ బాధ్యతజోడుగుర్రాల స్వారీఅవుతోంది. ఈఒత్తిడులు వైవాహికజీవితంలో అపశ్రుతులు పలికిస్తున్నాయి. స్త్రీ తనని తాను నిరూపించుకొనే యత్నంలో గృహజీవితాన్ని త్యాగం

చేసుకోవటం కనిపిస్తోంది.

ఉద్యోగాలు, క్రొత్త పరిచయాలు, కొంగ్రొత్త మోజులు వైవాహిక సంబంధాలను బీటలు వారిస్తున్నాయి. అసహనం, అహంకారం, ఉద్రేకం వివాహానికి మంగళం పాడి వితండానికి దారితీస్తోంది. వీటితో కొత్త కుటుంబాలు మొదలవుతున్నాయి. విడాకులు తీసుకున్న వ్యక్తులు వేరు, వేరు పెళ్ళిళ్ళు చేసుకుంటే, రెండు వైపుల పిల్లలు కలసి ఆ కుటుంబాలు "aggregate family" గా తయారవుతోంది. Mergaret Mead అంటుంది "పిల్లల్ని పెంచాలన్న కోరిక ఉండేవాళ్ళే అమ్మా, నాన్నలుగా ఉండి, కుటుంబాలు నిలుపుతున్నారు. చరిత్రలో మొదటి సారిగా, మిగతావాళ్ళంతా వ్యక్తులు గానే మిగిలిపోతున్నారు" అని. Ferdinand Lendenberg అన్నారు.- "కుటుంబ వ్యవస్థ పూర్తిగా అంతరించటానికి చేరువులో వుంది" అని.

స్త్రీ విమోచన, స్వాతంత్ర్య ఉద్యమాలతో అవివాహితలుగానో, పిల్లల తల్లులుగానో, (Single Parent Syndrane తో) ఉండటానికి మక్కువ చూపుతున్నారు. పిల్లకి తల్లో, తండ్రో ఉంటారు- ఇద్దరూ ఉండరు. మరి కొంతమంది తల్లి దండ్రులుగా ఉండటానికిష్ట పడడంలేదు.

National Organisation of non-parents అనే సమాఖ్య ఉంది అమెరికాలో విజ్ఞాన శాస్త్రం అకాశపుటంచులే తాకుతోందో, అగాధపు లోతులే వెతుకుతోందో తెలియదు. విజ్ఞాన శాస్త్రం సృష్టించిన గొప్ప విప్లవం విశృంఖలతో, స్వైర్వతా వీరవిహారం చేసి అసహజ కామానికి నాంది పలికాయి. ఇది వైవాహిక వ్యవస్థను దిగజార్చే ఆఖరి గడ్డిపోచ.

భారతదేశం అనేక మార్పులని చవి చూసింది. భారత నారి అనేక ఒడిదుడుకులని ఎదురొడ్డింది. తట్టుకుంది. నిండుగా నిలబడింది. క్షీణిస్తున్న అపురూపమైన కుటుంబ వ్యవస్థను భారత నారి తప్పక కాపాడుతుంది. భారత సంస్కృతికి బీజాలైన ఆత్మనిగ్రహం, సహనం మూర్తీభవించిన భారత స్త్రీ కుటుంబ పరిరక్షకురా లవుతుంది. ఇందుకు మగవాడు తన వంతు కర్తవ్యం తాను నిర్వహిస్తూ- అంటే తన స్త్రీపట్ల సహనాన్ని, సయోధ్యతనీ, ప్రదర్శిస్తూ-తన స్త్రీకి చేదోడు వాదోడుగా నిలిచిన నాడు కుటుంబ వ్యవస్థ అజరామరంగా, అప్రతిహతంగా అనంతంగా సాగుతూనే ఉంటుంది. భారతీయ సంస్కృతి సత్యం, శివం, సుందరంగా వెలుగు లీనుతూనే ఉంటుంది.

•••

## పాఠ్య పుస్తకాల్లో స్త్రీ చిత్రణ

(170వ పుట తరువాయి)

10. స్త్రీలను కించపరచే సన్నివేశాలు అనేకం ఉన్నాయి.

ఉ : వీధుల్లో అసభ్యంగా, అసహ్యంగా పైటలు జారుస్తూ కన్యలు గీతాలు, సంగీతాలు అభినయిస్తుంటే ...... మొదలైనవి.

పై వివరణలు, ఉదాహరణలు మాతృభాష, ద్వితీయ భాష తెలుగు పాఠ్య పుస్తకాలనుండి గ్రహింపబడినవి మాత్రమే విస్తరణ భీతిచే ఇతర విషయములకు సంబంధించిన పాఠ్య పుస్తకములనుండి గ్రహింపబడలేదు.

పాఠ్య పుస్తకాలలో స్త్రీ చిత్రణ జాతీయ విద్యా విధానమునకు అనుగుణంగా లేదని గ్రహింపనగును. మరల పాఠ్యపుస్తకములను ప్రత్యేకముగా సమీక్షించి, బాలబాలికలలో స్త్రీలపట్ల గౌరవాన్ని పెంపొందింపజేయు సన్నివేశములను కల్పించి వివక్షతను చూపు సన్నివేశములను తొలగించి, తిరిగి వానిని సంస్కరించి పాఠశాలల కందించినచో భావి భారతపౌరులలో ఆశించిన మార్పును, సమాజములో స్త్రీ పురుష సమానత్వమును సాధించుట సంభవమే.

•••

# కళగా నఖవిన్యాసం

డా॥ డి.కె. శ్రీనివాసాచార్యులు

కళలు అనాదినుంచీ వున్నాయి. వేదకాలం నుంచీ నేటివరకు కళలను ఎన్నోరకాలుగా పేర్కొనవచ్చు. మనం చూచి అనుభవించు వస్తువులను మార్చి మరియొకరీతిగా భావించి చిత్రించుట "కళ" అని చెప్పవచ్చును. సంగీతం వలెనే "కళ" కూడా సామాజికుని యందు భావోద్రేకాన్ని కలిగించి హృదయ స్పందన కలిగిస్తుంది. "కళ" శబ్దానికి, భాగము, పాలు, అంశము, చంద్రునిలో పదునారవ భాగము, ముప్పది కాష్ఠలకాలము, (కాష్ఠ 18 రెప్పలు కాలము,) రాశి చక్రమునందు 21600 భాగము, రాశిలో 18000 భాగము, శరీరము నందలి సప్తధాతువులలో నేదోనొకటి, ఏక మాత్రమగు లఘువర్ణము, మూలధనము మీద వచ్చు వడ్డీ, స్త్రీ రజస్సు, నౌక, ఓడ, కపటము, గీతవాద్యాది చతుష్షష్టి కళలో నేదే నొకటి, శిల్పము, మణి శిల, సంఖ్యానము లెక్కించుట, ద్రుత ప్రకృతికము కాని పదము, మూర్ఖ, అర్థాన్ని గ్రహించవచ్చు.(ద్వి.సం. (సూ-నిఘంటువు)

సంస్కృత రామాయణంలో "కళ" శబ్దం ప్రయోగించబడింది.

> గీతవాదిత్ర కుశలా నృత్యేషు కుశలాస్తథా।
> ఉపాయజ్ఞాః "కళా" జ్ఞాశ్చ వై శికే పరినిష్ఠితాః॥

కళా కలశాబ్ధిలో ఉదయించిన భావాల పీయూష బిందువులు విభిన్నాకృతులను దాల్చాయి. అవి గీతం, వాద్యం, నృత్యం, నాట్యం, ఆలేఖ్యం, మున్నగు 64రీతులుగా కనబడుతున్నాయి. శైవతంత్రంలో కళాసంప్రత్యయమును గూర్చి తెలియజేసే ఆధారాలు కోకొల్లలు. గీతం, వాద్యం నృత్యం, నాట్యం అనేవిషయాలను భరతుని నాట్యశాస్త్రం బాగుగా వివరించింది. ఆలేఖ్య పదమునకు వ్రాయదగినది, చిత్రింపదగినది, అను అర్థాన్నిబట్టి చిత్రకళను గ్రహించాలి.

ఈ నఖ చిత్రకళ 19వ శతాబ్దివరకు అభివృద్ధి చెందలేదని చెప్పవచ్చు. పాశ్చాత్యుల పాలనలో భారతీయులు భారత కళలపై ఆదరాన్ని చూపేవారుకారు. అజంతా గుహలను కనుగొనిన తరువాత చిత్రకళలో సంకుచిత భావం పోయింది. అపుడే భారతీయుల ఐరోపీయుల హృదయ భావనా గగనంలో కళాభానుడుదయించాడు.

పరిశీలనాత్మకమైన భావనతో చూస్తే ప్రాచ్య పాశ్చాత్య చిత్రకళలో భేదం సుస్పష్టంగా కనబడుతుంది. భారతీయ చిత్రకళ సామాజికుల హృదయాలను స్పందింపజేసి రసానుభూతిని కల్గిస్తుంది. పాశ్చాత్య చిత్రకళ భిన్న భిన్న వర్ణ ఛాయలతో కూడి ప్రకృతికి దర్పణంగా నిలుస్తుంది. చిత్రకళ రాజపుత్రులలో, మొగల్ చక్రవర్తులలో బెంగాల్ ప్రజల్లోను విస్తరించింది. బెంగాల్ ప్రజల మనోభావాలను చిత్రీకరించినవాడు అవనీంద్రనాథ్ ఠాకూర్. ఆయన చిత్రాలలో నూతనత్వం, వ్యక్తిత్వం స్వాతంత్ర్యం వ్యక్తమవుతాయి. 20వ శతాబ్దంలో "రవివర్మ" అనే చిత్రకారుడు భారతీయ చిత్రకళకు ఉన్నతిని కల్పించాడు. ప్రస్తుతకాలంలో బాపు, వపా, వీరాజు మొదలగువారు తమ చిత్రాల ద్వారా ఆబాల వృద్ధులను అలరింప చేస్తున్నారు.

కాలంతో పాటు చిత్రకళకూడ విపరిణామాన్ని పొందుతూవస్తోంది. చిత్రకళలో కేవలం కుంచెల వాడుకలే కాక 'నఖాలు" కూడా ఉపకరిస్తాయని చిత్రకారులు నిరూపిస్తున్నారు. "నఖాలు" కేవలం చిత్రాలు వేయటానికేకాక నిత్యకృత్యాలలో వుపయోగించే సాధనాలు కూడా. చిత్రకారుడు కుంచెలతో బొమ్మలు వేస్తే, శిల్పిచేతిలో శిల్పంగాను, వడ్రంగి చేతిలో దారు శిల్పంగాను రూపాంతరము చెంది ప్రజల మనోఫలకాలలో చెరగని

స్థావరాన్ని ఆక్రమించుకొంటాయి.

ప్రతికళ, ప్రతికదలిక ఒక కళాత్మకంగానే భావించవచ్చు. చంద్రుడు 16 కళల పూర్ణుడని, కొందరు 64 కళలని, ప్రస్తుత సమాజాన్ని బట్టి ఆలోచిస్తే ప్రతిదీ ఒక కళగా, కళాత్మకంగా భావించబడుతుంది. ఆ కోవలోకి జెందిందే "నఖచిత్రకళ" అనగా గోటితో చిత్రాలు వేయడమన్నమాట.

మానవుడు ఏపని చేయాలన్నా తన దైనందిన కార్యక్రమాలు చేతివ్రేళ్ళగోళ్ళ సహాయం లేనిదే నిర్వహించ లేడు. చేతివ్రేళ్ళకు అందాన్ని సంతరించేవి గోళ్ళు. వీటి అందాన్ని ఇంకా ఇనుమడింప చేయడానికి ఇటీవలే గోళ్ళరంగులు వెలిశాయి. ఈ గోళ్ళ కార్య క్రమాలు ఉదయం మొదలు అస్తమానం వరకు " గోళ్ళు కొరుక్కోవడాలు మొదలు వెంట్రుకలు గోళ్ళ కొట్టు కోవడాల వరకు ఉపయోగపడు తుంటాయి. ఈ గోటి పనులు ఎన్ని లాభాలు చేసి పెడ్తాయో అన్ని అనర్థాలు కూడా కలిగిస్తాయి. ఐనా ఈగోళ్ళే కొన్ని సందర్భాలలో ఒక్కో కవిచే ఒక్కొ రకంగా తమతమ కావ్యాలలో చిత్రవిచిత్రాలుగా వర్ణించ బడ్డాయి. కొందరు స్తోత్రపరంగా కీర్తిస్తే మరికొందరు శృంగార పరంగా మలిచి పలురకాలు వర్ణించారు. ఈ గోళ్ల రాగాలాపనకు మూలకందాలుగా వర్ణించినా, ఘొరకృత్యాలు జరపాలంటే యివిలేక పనంతా జరగదు, వాటిని సాధకాలుగా వాడుకోక తప్పదు.

ఇలా వివిధ కార్యాలలో ఉపయోగపడుతున్న గోళ్ల చిత్రీకరణాది కార్యాలలో కూడా పనికొస్తున్నాయి. కొన్ని చోట్ల చేతిగోళ్ళు పెంచుకొని పత్రికల్లో కీర్తింప బడ్డే, అలాంటి గోళ్ళతోనే గాయాలు చేసి కారాగారం పాలవడం కూడా జరుగుతుంది. గోళ్ళతో చిత్రకళలు రూపొందించ వచ్చన్న వాదన కేవలం కామశాస్త్రానికి ఆలంబనగా గ్రహించు చున్నట్లు వాత్స్యాయనుడు తన కామ శాస్త్రంలో నిరూపించాడు. మహాకవి కళ్యాణమల్లుడు తన "అనంగరంగ" మను గ్రంథంలో "నఖప్రకరణమని" ఒక ప్రకరణాన్నే సుమారు ఏబదికి మించిన శ్లోకాల్లో గ్రంధించాడు. వివిధ రాష్ట్ర ప్రజల నఖవిన్యాస వినోద విషయాలకు దర్పణం అయింది. స్త్రీల శరీరావయవాలపై ఈ నఖాల వాడుకలను ప్రముఖ కవులు కూడా వివరించారు. (నఖజాత్యం వా.కా.సూ.పుట. 207) - రాగవృద్ధౌ సంఘర్షాత్మకం, నఖలిలేఖనం, (నఖజాత్యం అంటే నఖక్షతాలు) దీర్ఘాణి హస్త శోభిన్యాలోకేచ యోషితాం చిత్త గ్రాహిణీ', "గౌడానాం నఖానిస్యుః", గౌడదేశ స్త్రీలగోళ్ళు చాలా పొడుగ్గా హస్తానికి అలంకారంగా వుంటాయిని "మధ్యమాస్యుభయభాంజి మహారాష్ట్రికాణా మితి" మహారాష్ట్రుల గోళ్ళు మధ్యరకంగా వుంటాయని వర్ణించాడు.

వివిధ కావ్యాదులలో యీ గోళ్ళవాడుకలను, గోటి నొక్కులుగా, నఖక్షతాలుగా వర్ణించబడినాయి. ఈ నఖక్షతాలు కొంతమంది కొన్నిరకాలుగా వర్ణించారు. " నఖక్షతాధికారం" ప్రత్యేక ప్రకరణం

> " నఖక్షతాని పశ్యంత్యా గూఢస్థానేషుయోషితః
> చిరాతీతాప్యభినవా ప్రీతిర్భవతి పేశలా ॥"
> "ఛురికార్థచంద్ర కమండ రేఖా వ్యాఘ్రనఖ
> మయూర పదశశప్లుతోత్పల పత్ర మిత్యష్టధా"॥
>
> (కామ కుంజలత- 17 శ్లో)

> కతిర్నఖో సంభూతో యునోః స్థాన విశేషకే।
> సా నఖక్షతి రాఖ్యాతా భేదతో నవధా భవేత్॥
>
> యథా ఛురితకంచార్థ చంద్రమండలకే తథా।
> రేఖావ్యాఘ్ర పదంచైవ మయూర పదకం తథా॥
>
> శశప్లుతం చోత్పలకం పత్రం స్మారక మిత్యపి
> నఖరక్షతి భేదాఃస్యుః తేషాం స్థానం ప్రచక్షతే॥
>
> *రతిరత్నప్రదీపికా - 49 - 51*

అని నఖక్షతాల రకాలు వివరించ బడినాయి. గోళ్ల

వునికిని బట్టి స్త్రీలక్షణాలు కూడా చెప్పబడినాయి.

శశివదనా బింబోష్ఠీ తన్వీ తామ్ర నఖీ తథా ।
మందగా లజ్జితా శ్యామా రక్తప్రాంత విలోచనా ॥

అలా నఖాల గురించి మగువలనుద్రేకపరచేందుకు గోళ్ళను పదునుగా, వుండేట్లు, గోళ్ళను కొసలను ఐదుభాగాలుగా విభజించి కామ ప్రకోపాలకు కారణాలౌతున్నాయని వాత్స్యాయనుడు నిరూపించాడు. అలా నఖాగ్రాల గురించి 'హాస్యార్ణవ ప్రహసనం'లో ద్వితీయాంకంలో "సాయం చంద్రకలాయుతోదయగిరి" సాయం సమయాన ఉదయగిరియం దుదయించిన చంద్రరేఖవలె గోళ్ళ చివరలుంటా యని "శ్రీజగదీశ్వర భట్టాచార్య "వర్ణించాడు. 'శృంగార పదాలు" ( OML ప్రచురణ) అన్న గ్రంథంలో "కులుకు గుబ్బలపైని నెలవంకలుంచరా" మరోచోట "క్రొన్నెలలు" "చిన్న గోరులుంచరా" "గోరులుంచి చిన్నెలు చేసెనే గోర చీరి" అని గోళ్ళ చేష్టితాలు చిత్రించబడ్డాయి.

న్యూనతాభానం సూచించడం కోసం గోళ్ళను వర్ణ్యవస్తువులుగా స్వీకరించిన సందర్భాలు మన ప్రబంధాలలో కోకొల్లలు. "కాలి గోరుకైన బోలనేనని తార పరికించి వెల వెల బారకున్నె" యని (వసు చరిత్ర -తృ - ఆ-లో) "తదీయ శక్తి నీచరణ నఖాంచలంబునకు సాటియే" యని, మరో చోట "ప్రబల గోత్రఘ్నతికి నీపదనఖంబె చాలు శతకోటిసాధనం బేల మాకు" యని అలాగే కోలహలుని జిమ్మివేయుటలో "పోటున బంతి (మా) మీటు గతి భూవరుండు అంఘ్రినఖాంచలంబుననొ" అన్నట్లు వర్ణించ బడినాయి.

కొన్ని ప్రాంతాలలో మన నిత్యవాడుకల్లో పిల్లల మెడల్లో "పులిగోళ్ళు" వ్రేలాడతీయడం ఆచారంగా వుంది. ఆ విషయాన్ని "ఇందుమతీ పరిణయం" (OML ప్రచురణ) లో- "పులిగోరు గళమున బొల్పు మిగుల" అని అక్షర బద్ధం చేశాడు. పులిగోరు ధరించుటయనేది ధరించిన వ్యక్తి యొక్క పరాక్రమాతిశయాలు ప్రత్యేకించి చెప్పకనే, దర్శన మాత్రం చేతనే అవగాహన అగుటకు ప్రాచీన కాలంలో రాజులు, వీరులు ధరించేవారు. మరి నేడు జంతు సంబంధమైన గోళ్ళ ధారణ వల్ల సౌందర్యాతిశయం ఇనుమడించడంతో పాటు గాలి ధూళివంటివి ఏవీకూడా సోకవనే మూఢనమ్మకం చోటు చేసుకొంది.

స్త్రీలు తమనిత్యకృత్యాలలో తలస్నానం తర్వాత వెంట్రుకలను గోళ్ళ చివరలతో విదలించడం చిక్కులను గోళ్లతో దువ్వుచు కురులను సవరించడం వంటి విషయాలను కొందరు కవులు తమ కావ్యాల్లో వర్ణించిన సందర్భాలు ఎన్నోవున్నాయి. "కుంతలముల్ చలింప కొనగోరున దువ్వుచు మోము మూచుచునొ" అని "కొనగోళ్ళ దువ్వం బోయిన" యని మరోచోట "పేశల మృదు కేశమంజరులు సన్నపు గోళ్ళను జిక్కువాపి" "కొనగోళ్ళతో గాళ్ళ కొట్టటం" ఇలాంటి అనేక విషయాలన్నీ కావ్యనాయికా వర్ణనా సందర్భాల్లో వర్ణించ బడ్డాయి.

ఇలా లలితమైన కార్యాలలో వర్ణింపబడిన ఈ గోళ్ళు అద్భుతమైన కార్యాలలో కూడ వినియోగించ బడినట్లు వర్ణించిన సందర్భాలు కూడా వున్నాయి. "వాల్మీకి రామాయణం" లో సగరకుమారులు యాగాశ్వాన్ని వెదికేందుకై యే ఆయుధాలూ ధరించక ధరిత్రిని తమవాడి గోళ్ళతోనే "యావత్తురంగ సందర్శస్తావత్ ఖనత మేదినీం" ----- నొక్కొక్క డొక్కొక్క యోజనంబు ద్రవ్వుదమని వజ్ర స్పర్శసమంబులైన "నఖంబుల" (గోపీనాథ రామాయణంలో - 789) తో త్రవ్వినట్లు సగర వృత్తాంతంలో వర్ణించబడింది. దీనిని బట్టి చూస్తే సగర కుమారులు "గోళ్లతోనే భూమిని త్రవ్వారని తెలుస్తోంది. ఈ గోళ్ళు దైవందిన జీవితంలో మానవాళికే గాక తక్కువ జీవరాసులకు కూడా ఏదోవిధంగా అక్కరకు వస్తూనే వున్నాయి. ఋక్షులు ఆహారాన్ని సంపాదించడానికి

సామాన్యంగా కాలిగోళ్ళనే ఉపయోగిస్తాయి. మహాభారతం లోని సౌపర్ణోపాఖ్యానంలో దృఢకాయులైన గజకచ్ఛపాలను గరుడుడు తనవాడి కాలిగోళ్ళతో పట్టుకొని తినడానికి తీసుకుపోతాడు. సింహము తనగోళ్ళతో యేనుగు కుంభస్థలాన్ని భేధించి అందలి రత్నాలు గోళ్ళ, వ్రేళ్ళ సందుల్లోంచి జాలువారుతుండగా ఆ మాంసాన్ని భుజిస్తుందని చాలా గ్రంథాల్లో వర్ణింపబడింది. అలాగే ఈ గోళ్ళు భయానకమైన పనులు చేసినట్లు వర్ణించబడ్డాయి. ఈ గోళ్ళ వర్ణన కావ్యాల్లోనే కాకుండా స్తోత్రాల్లో సంకీర్తనల్లో "తిన్నని వాడి గోళ్ళు ......వృశ్చికరాశి" "వీరరసము గోళ్ళు" అలాగే చేతులు మెత్తవైనా "చేతులు మెత్తనగాని చిమ్ము గోళ్ళు కఠినాలు" "కోరి మేన బైతిరాలీ కొనగోర వెండిరాలీ" గోళ్ళు వర్ణించబడినాయి 'బృహత్ స్తోత్రరత్నా కరంలో "వజ్రసమప్రభైః" అని. "తస్యోదరాన్నఖవిదీర్ణ" తనవాడిగోళ్లతో హిరణ్య కశిపుని వక్షాన్ని చీల్చడం భయానకంగా వర్ణితము. ఈ విషయాన్నే మాఘుడు తనకావ్యంలో

> సటాచ్ఛటా భిన్న ఘటేన బిభ్రతా
> నృసింహ సైంహీమతనుం తనుంత్వయా ।
> సముగ్ధకాంతా స్తవ సంగభంగురైః
> ఉరో విదారం ప్రతి భాస్కరే నఖైః ॥

అని పేర్కొన్నాడు. క్రూరనరసింహ రూపం దాల్చి ప్రియురాలి మారు చనులతాకునకు సైతము మొక్క వోవునంత సుకుమారములైన గోళ్ళతో ఔమ్మ పగల జీరితిని గదా అని వర్ణితము. వరాహపురాణంలో హిరణ్యకశిపుని విదళించు నపమెడు

> తొడ లను వధ్య శిలా స్థలి
> బడవైచి నఖంబులను కృపాణంబులచే
> విడివడి వచ్చి ప్రేవులు
> తొడిమెలు కుండంగ ద్రుంచె దుర్వారుండై ॥

ఇందులో నఖాలు కృపాణాలుగా వర్ణించబడ్డాయి. అలాగే వేణీ సంహార నాటకంలో

> పీనాభ్యాం మద్భుజాభ్యాం భ్రమితగురుగదా
> ఘాత సంచూర్ణితో రోః
> క్రూరస్యాధ్యాయ పాదం తవశిరసి నృణాం
> పశ్యతాం శ్వః ప్రభాతే ।
> త్వన్ముఖ్యభ్రాతుచక్రోద్దలనగలదసృక్చల
> దనేనానఖాగ్రం ।
> స్యానే నార్ద్రేణ చాక్తః స్వయమను భరితా
> భూషణః భీమమస్మి ॥

ఇక్కడ కూడ నఖవర్ణన చేయబడింది. భయానకములైన నఖాలేమమ్ము కాపాడుగాక "స్ఫాలన స్ఫార ప్రస్ఫుట దష్టి పంజరరవే క్రూరానఖాః పాతవః" " నఖాన్ శూలేశ్వరీ రక్షేత్" "జ్వాలాముఖీ నఖజ్వాలాం" అని లలితాసహస్ర నామాలలో

> కరాంగుళి నఖోత్పన్న నారాయణ దశాకృతిః ।
> మహాపాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధ సురసైనికాః ॥ అని

వర్ణించబడ్డాయి.

కవులు ఇష్ట దేవతా ప్రార్థనలో కూడా **నఖాలు, వాటి చిహ్నాల సోయగాలు, వాటికృత్యాలు ఇమిడించారు.**

> జయతి ముద ముదిత మధుకర మధుర
> రుతా కలన కూజితాపాంగః ।
> కర విహిత గండ కండూ వినోద సుఖితో
> గణాధిపతిః । (వరరుచి ప్రాకృత ప్రకాశః । శ్లో)

కరవిహిత గండ కండూ వినోద సుఖితుడైన ఆగణాధీశుడు రక్షించుగాక యని, స్తుతించాడు.

> "మాణిక్యాంగుళి ముద్రికా నఖరుచుల్
> మార్మాటికిం బర్వగా" అని

హరిభట్టు వరాహ పురాణ కావ్యారంభంలో ఇష్ట దేవతాస్తుతిలో స్తుతించాడు.

ఇలా గోళ్ళ చరిత్రను గూర్చి మనకవులు ప్రాచీన గ్రంథాలలో ఎంతో వైవిధ్యంతో వర్ణించారు.

ఈ గోళ్ళతో భయానకాది రసాలుద్భవిస్తే ఈ గోళ్ళతాకిడితో హృదయానందకరమైన రాగాలు పలకడానికి, పలికించడానికి వీలయ్యేది. సామాన్యంగా యీ గోళ్ళు సంగీతానికి ప్రాణంలాంటివి. వీటిని వాడిన పూర్వీకుల్లో సరస్వతి, నారదుడు, తుంబురుడు మొదలగు వారున్నారు. ఈ రాగాలాపన గురించి శృంగార నైషధంలో

"పితామహు కూర్మి పట్టి హస్తాంబురుహాంగుళీ
నఖశిఖాంకురకోటి విపంచి మీటుమన్" అని,

అలాగే వాల్మీకి చరిత్ర తృతీయాశ్వాసంలో

సీ, గవిసెన సడలించి కరపంకజద్యుతి
గడలుకో జీవి పావడను దడిచి
బలితంపు మెరుగు గుబ్బల మీద జేర్చి ఘ
మ్మన నఖంబుల శ్రుతులంటి మీటి
జవ్వాది బదనిచ్చి సారణుల్ సారించి
సరసత బిరడలు చక్కనొత్తి
మంద్రమధ్యమ తార మహిమ మీరగ ద్రి
స్థానంబులును ముట్టి తాళగతుల

గీ॥ నతులకంకణ ఝణఝణ త్కృతులు సెలగ
మాయురే యన రాగముల్ గేయములును
గీతములు ప్రబంధములు రక్తి గనుపింప
వీణ మీటెను నానీలవేణి యపుడు ॥

అలాగోళ్ళతో వీణమీటి రాగాలు పలికించి హృదయోల్లాసము కలిగించడమేకాక ఆగానమాధురికి -

"శైలంబు ల్గరంగెన్ మృగంబులు మేపుల్విడి
చూచుచుండె నచలన్మూర్థాగ్ర కర్ణంబులై
చెలగెన్ పక్షిగణంబు మోడులు చిగిర్చెన్" అని. గోరు మీటడంలో అంతటి రాగాలుద్భవించి, శ్రోతలకు మనోరంజకాలవుతున్నవి. ఒక ఆధునిక కవి "కొనగోటితో మీటితే కోటి రాగాలు పలుకుతావని అవి లేకుంటే అసలు రాగాలాపనే కరువని, అవి పలుకవని అన్నాడు. అలాగే మరో కవయిత్రి "మాతృశ్రీ"గారు వ్రాసిన "వింటివా" యన్న గేయములో

"మూగబోయిన హృదయ వీణను
గోట మీటెను మాధవుండు!
తిరిగిపోయిన జీవమురళిని
శ్రుతులు బెట్టుచు వూదుచుండెను" ఈగేయంలో

గోటమీటితేనే రాగాలుద్భవిస్తాయని నిక్కచ్చిగా పేర్కొంది.

ఇలా అనాదినుండి గోళ్ళకు, వాటి ప్రయోగాలకు. కృత్యాలకు ప్రాధాన్యత యిస్తూ మనసాహిత్యంలో చాలా చోట్ల పలురకాలుగా కవులు వర్ణించారు

ఈ గోళ్ళు ఇతర కళా రూపాల్లో కూడా చోటు చేసుకున్నాయి. లేఖలు వ్రాయడంలో, చిత్రాలు గీయడంలో ప్రముఖ పాత్రవహించాయి. దానికి నిదర్శనంగా కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలంలోని తృతీయాంకంలో

శకుంతల - హలా! చింతితా మయా గీతి కా!
అసన్నిహితాని పునః లేఖన సాధనాని.

ప్రియసఖి - నన్వస్మిన్ శుకోదర సుకుమారే నళినీ పత్రే నఖైః నిక్షిప్త వర్ణాం కురు.

శకుంతల ప్రియంవదతో నావద్ద వ్రాయడానికి ఎటువంటి సాధనాలు లేవు కదా! నే నెలా ప్రేమ లేఖ వ్రాసేది ? అన్నది. అపుడు చెలి నాదాపునేవున్న సుకుమారమైన నళినీ పత్రములపై నీ కొనగోటితో (గోళ్ళతో) అక్షరాలు వ్రాయుమని సలహాయిస్తుంది. ఈ సంభాషణమును బట్టి శకుంతల దుష్యంతునకు గోటితోనే కమల పత్రమునందు ప్రేమలేఖ వ్రాసినట్లు స్పష్టమగుచున్నది గదా ! అలాగే శ్రీహర్షుడు వ్రాసిన నైషధంలో -

శ్లో॥ దలోదరే కాంచన కైతకస్య
క్షణాన్మషీ భావుక వర్ణలేఖమ్ ।
తస్యైవయత్ర స్వమనంగ లేఖం
లిలేఖ భైమ "నఖలేఖినీభిః" 6-63.

దమయంతి బంగారు రంగు మొగలిరేకు పై వెంటనే

నల్లబడెడి యక్షర పంక్తులు కల మన్మధ లేఖను నలునకు తన గోళ్ళతో వ్రాసి పంపింది.

ఈ భావాన్నే శ్రీనాధుడు శృంగార నైషధంలో యధాతధంగా గ్రహించాడు.

తే ॥ వ్రాసె నొక్కలతాంగి క్రొవ్వాడిగోర
వర్ణములు దోడుతో మశీ వర్ణకములు ।
బసిడి గేదంగి రేకున బ్రస్ఫుటముగ
మదనలేఖంబు నర్మమర్మంబు మెరయ॥
(శృ.నై.3వ ఆ.)

వీటన్నిటిని బట్టి అలనాటి నుండే గోళ్ళతో వ్రాయడం ఆచారంగా వున్నట్లు స్పష్టమవుతుంది. కథలోని నలదమయంతులు, శకుంతలా దుష్యంతులు ఎంతో ప్రాచీన నాయికా నాయకులు. వీరి చరిత్రలు అతి పురాతనమైనవి వారు ఎలా వ్రాసుకున్నారో తెలీదు కాని వారి చరిత్రలు వ్రాసినవారు కాళిదాసు, శ్రీ హర్షుడు, శ్రీనాథులు, వారు నఖచిత్రలేఖనం గురించి తెలిసినవారు కాబట్టే వారు ఆలోచనలను ఆయా పాత్రల ద్వారా అమలులోకి వచ్చేలా వ్రాశారు. దీన్ని బట్టి చూస్తే పైకవులే గోటితో చిత్రాలు వేసే వారిలో ఆదికళా కారులుగా భావించవచ్చు. చిత్రాలు వేసే పద్ధతులు వారికాలంలోనే ఎలావుండాలన్నది నిరూపించారు. చిత్రాలు గీసేందుకు ఘృదువైనవి, గోటి తాకిడికి సరిపోతాయనుకుంటే అలా వేస్తే చిరిగిపోయేందుకు తావౌతావి, కలకాలం నిల్వపు అన్నట్లు చిత్రాలుకు కాస్త పటిష్ఠము, నునుపూ వుండాలన్నట్లు కమల పత్రం కంటే మొగిలి రేకు వాడుకున్నాడు. ఊరికే వ్రాస్తే అవి యేర్పడవని భావి కళాకారులకు మార్గదర్శకంగా వేసిన చిత్రం బయటివారికి త్వరితంగా అర్థమయ్యేలా వాటికి మసిబూసి నట్లైతే తెలుస్తుందన్నట్లుగా ఆనాడే "మశీవర్ణకములుగ వ్రాసినట్లు" కాళిదాసు కంటే ఓపై మెట్టు శ్రీనాథుడు శ్రీహర్షుడు వీరిద్దరూ ముందుకు పోయారు. వీళ్ళ ముగ్గురికంటే ఇంకాముందుకు యీ గోటి వ్రాత గురించి "హాస్యార్ణవ ప్రహసనంలో"

"ఘటియత ఘట జాలం తోయశూన్యం పురస్తాత్
పధితుష"నఖలేఖా" క్షిప్యతాంభోనియుక్తాః
నిజపురపరిచర్యా కర్తుమేవాయముక్తో
నృపతి రనయసింధు స్సూర్ణ మాగచ్ఛ తీహ॥ "

ఇందులో "నఖలేఖాః" అనే శబ్దం వాడ బడింది. ఇచట "లేఖా" శబ్దానికి "ఉత్తరం" అని అర్థం గ్రహించరాదు "లేఖ" అనగా ! "రేఖ" అని అర్థం కూడావుంది. ఇక్కడ "నఖలేఖాః క్షిప్యతాం" అన్నప్పుడు "నఖాలతో" రేఖలు గీతలు గీయండి అని అర్థం చెపమికోవచ్చు. సందర్భాన్ని బట్టి "లేఖలు" అనగా ఉత్తరాలు కాక రంగవల్లులు(ముగ్గులు) అని అర్థం చెబితే బాగుంటుందేమో. ఎందుకంటే రాజుగారికి స్వాగతం చెప్పవలసిన సందర్భంలో అక్కడ చేయవలసిన అలంకరణాది విషయం చెబుతున్నాడు. కాబట్టి అలంకర ణాలలో రంగవల్లులకు అతి ప్రాముఖ్యం సంతరించ బడింది. రాజుగారు వచ్చే మార్గాలలో "గోళ్ళతో రేఖలను చిత్రీకరించండని హెచ్చరించడం జరిగింది. "గోళ్ళతోనే" ఎందుకు రేఖలు గీయాలి ? అనే ప్రశ్న కలగవచ్చు. సాధారణంగా ముగ్గులు బొటన వ్రేలు చూపుడు, (మధ్యమవేలు) వ్రేలుతోనే (పెట్టడం) వేయడం జరుగుతుంది. దానివల్ల అనుకొన్నంత సన్నగా రేఖలు గీయడం కుదరదు. అదే గోటితో అయితే చాలా సన్నని గీతలు గీయడానికి వీలవుతుంది. సన్నటి గీతలు గీయడానికి గోళ్ళే తగిన సాధనాలుగా భావించారు. అందుచే గోళ్ళతో సన్నటి గీతల ద్వారా రంగవల్లులు అలంకరించండి అని చెప్పడమే కవిగారి అభిప్రాయమై వుంటుంది. ఈ శ్లోకంలో ఎటువంటి ప్రదేశం గోటితో రేఖలు గీయడానికి అనువుగా వుంటుందో చెప్పడం కూడా గమనార్హం. ఎటువంటి ఇబ్బందులు లేక ఓ రాజరుషుల్లారా ! నీరులేక బాగా ఎండిన స్థలంలో సమతల ప్రదేశమే గోళ్ళతో చిత్రీకరించ డానికి అనువైన ప్రదేశమని ఇందు స్పష్టంగా పేర్కొనబడింది.

గోళ్ళతో చిత్రాలు వేయాలంటే ఇటువంటి అనువైన ప్రదేశాలుండాలని సూచన ప్రాయంగా

సూచించడం ఈ శ్లోక ప్రధానోద్దేశ్యం కాబోలు. ఇపమిడా సాహిత్యమంతా మరుగై పోయింది. కాలక్రమేణ తామరాకులు, కేతకీ పత్రాలు ఇవ్వన్నీ కాలగర్భాన కలిసిపోయాయి. ఇపమిడా నఖచిత్రాలు "కార్డుల" మీదవేసే వరకు వచ్చాయి.

ఆనాడు యీ కళ ఏమరుగైందో కాని నేడది కళగామారి నిత్యజీవితావసరాలు తీర్చడంలో ఉపయోగపడి మానవ వికాసానికి తోడ్పడుతుంది. ఈ నఖచిత్రలేఖనము వృత్తికళగా కూడ దిద్దుకుంటుంది. కాని ఆనాడు పత్రాలపై, రహదారులపై వ్రాస్తే గీస్తే గుర్తింపైనా దొరికింది.కాని యీనాటి పరిస్థితుల్లో ఏ సంస్థలూ యీ నఖ చిత్రఖకళను గుర్తించడం లేదు. ఎందుకనగా - పాకాలు మూడు రకాలు ద్రాక్ష ఒకటి నోట్లో వేసుకుంటేనే రుచితెలిసేది. మరొక దానికి కాస్త కష్టపడ్తే తెలుస్తుంది. కదళీపాకం, ఇక మూడవది మరీ మరీ కష్టపడాలి. అపమిడుకాని దాని రుచి తెలియదు. అదే నారికేళ పాకం. అలాగే ఈ కళలను వాటి కనువుగా సమన్వయించుకోవచ్చు. చూడగానే అర్థమయ్యేది రంగుల చిత్రాలు (ద్రాక్షవంటివి). రంగులైనా అర్థం కాకపోతే కదళీపాకం లాంటిది. ఇక మిగిలింది నారికేళం. అదే నఖచిత్రాలుకావచ్చు. గీచినా, చూపించినా అర్థమయ్యేలా చెప్పినా పట్టించుకునే నాథుడే కానరాడు. అందుకే యీ కళ ప్రచారంలో లేదు. గత వైభవ మెంతవున్నా ప్రస్తుత వైభవం గుర్తింపు శూన్యం. అలా కళ గుర్తింపునకు రాకపోతే కళాకారుడు గుర్తింపు వచ్చేందుకై ప్రయత్నిస్తున్నాడు. అలాంటి ప్రయత్నాలలో జనసమ్మర్దం వున్న స్థలంలో నిల్చొని తన కళను వారి వారి చిత్రాలను గీసి కొంత జీవనోపాధికై కొంత డబ్బు సేకరించుకొనుచున్నారు. అలా వేసిన చిత్రాలు కొంతకాలానికే పరిమితమౌతాయి. అలా కాక యీకళ అభివృద్ధిలోకి రావాలంటే పెద్ద సంస్థలు, పెద్దలు ముందుకొచ్చి కళాభివృద్ధికి రాకమానదు. ఈ కళ కొందరికే పరిమితమైంది. ఈ కళ అందరికి తెలిసింది కాదు. మరుగున వున్న ఈ కళను ప్రభుత్వం సంస్థలు, గుర్తించాలి. ఈ కళ కొన్ని ప్రాచ్య దేశాలలో అసలే కానరాదు. రంగుల చిత్రాలు, పెన్సిల్ చిత్రాలు వేసినట్లు కాదు. వాటిల్లో ఏవైనా అవకతవకలున్నా వాటిని చెరిపి తిరిగి వేసుకోవచ్చు. కాని ఈ కళ ఈ రేఖ ఒక సారి కార్డుపై వేశామంటే చెరిపేస్తే చెరిగేది కాదు. ఇది శాశ్వతకళ. ఈ కళ ఇంతటితో అంతరించిపోకుండా కొందరు గుర్తిస్తున్నట్లు తెలుస్తుంది. వారికి కృతజ్ఞతలు. ఈ మధ్యనే కొంత మందయినా ఈ చిత్రాలు వేస్తున్నారు. శ్రీశిష్టా రామకృష్ణారావు గారు, పర్సి నాయుడు గారు, ధర్మాచార్యులు మొ॥వారున్నారు. వారు యింకా వుద్యమించి ఈ కళను ప్రజలకందుబాటుగా చిత్రిస్తే ఈ కళ ఎంతో ఎత్తుకు ఎదుగగలదని ఆశిస్తున్నాను.

ఈ కళను నాకు తెలిసినంతవరకు గుర్తించి ఆదరించిన వారిలో శ్రీ శ్రీ శ్రీ అఖండానందస్వామి వారు, శ్రీ శ్రీ శ్రీ విరజానంద తీర్థ స్వామివారు, శ్రీ శ్రీ శ్రీ విద్యానంద స్వామి వారు, శ్రీ శ్రీ శ్రీ పూర్ణానంద స్వామివారున్నారు. కొనగోటితో మీటిన వీణ సంగీత రసమాధురిని అందిస్తుంది. నఖవిన్యాస విన్యస్త రేఖలతో కార్డులపై అవతరించిన చిత్రాలు మానవాళికి నవరసాల అనుభూతిని అందిస్తూ నవవసంత శోభను జగతిలో వ్యాపింప జేస్తాయి.

నఖ విన్యాస విన్యస్తా
కళాహృదయ రంజనీ
వేదాది గ్రంథ సుప్రోక్తా
రసశోభాం కరోతి సా॥

అని ఈ కళను భావిస్తున్నా. ఇపమిడీ వ్యాసం వల్లనైనా ఏకొందరికో తెలుస్తుందని ఆశిస్తూ సజీవమైన ఈ కళకు ఉజ్జ్వలభవిష్యత్తు ఉంటుందని, నఖ కళకు ప్రాధాన్యత చేకూరాలని కోరుకుంటున్నాను!

# యువభారతి రజతోత్సవ మహాసభలు

– డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

"మట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే, ప్రయత్నించి, ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించడం మంచిది" – అనే లక్ష్యం ఊపిరిగా; తెలుగు భాషా సాహిత్య సంస్కృతుల వికాస ప్రయత్నపరంపరే అక్రుతిగా, సామాజిక సామరస్యం, సముదాత్త సామరస్యం, విభిన్న సాంఘిక శక్తుల సముచిత సమ్మేళనం సమన్వయం ద్వారా ప్రజాస్వామ్య పరిరక్షణం వంటి ఆశయాలతో; అ ఆశయ సిద్ధికి భాషా సాహిత్యాతే సాత్విక సాధనాలనే ప్రగాఢ విశ్వసంతో యథాశక్తి 25 సంవత్సరాలుగా జంట నగరాలలో కృషి చేస్తున్న ప్రసిద్ధ సాహితీ సాంస్కృతిక సంస్థ యువభారతి.

ప్రాచీన ఆధునిక ఆంధ్ర సాహిత్యాలలోని శాశ్వత మూల్యాలను ప్రజానీకానికి పంచిపెట్టి, వారిలో సదవగాహనను పెంపొందింపజేయడానికి ఈ సంస్థ రకరకాలుగా కృషి చేస్తూ వస్తున్నది.

కావ్యలహరి, చైతన్యలహరి వంటి ఉపన్యాస పరంపరలను నిర్వహించింది. ఈ ఉపన్యాసాలను గ్రంథాలుగా అందించింది. "మారుతున్న విలువలు – రచయితలు" 'యువత' "1980-90 దశాబ్దంలో తెలుగు సాహిత్యం" "పాతికేళ్ళపత్రికా రచన" వంటి సదస్సులను సాగించింది. "మందార మకరందాలు" "వేమన్నవేదం" వంటి కవితా వ్యాఖ్యాన గ్రంథాలను ప్రకటించింది. పక్షసమావేశాలను నిర్వహించి, యువతలో భాషా సాహిత్య సామాజిక చైతన్యాన్ని ఉద్దీపింపజేసింది. యువకుల్లో అంతర్లీనంగా ఉన్న ప్రతిభా పరీమళాలను వెలికితీసే ఉద్దేశంతో కవితా సంపుటాలను ప్రచురించింది. కేవలం ఆంధ్రభాషలోని ఉత్తమ మూల్యాలను అందించటమే కాకుండా, కొన్ని భారతీయ భాషల్లోని విశిష్ట రచనలను ఆంధ్రులకు అందించే ఉద్దేశంతో తులసీదాసు, కబీరు, బాబా ఫరీదు వంటి మహనీయుల విశ్వజనీన కవితా ఖండికలను ముద్రించి అందించింది. తెలుగు సాహిత్యంలోని విభిన్న ప్రక్రియల స్వరూప స్వభావలనూ, వికాశ దశలనూ విశారదుల చేత వ్రాయించి, 'మహతి' అనే ఒక మహా గ్రంథంగా సహృదయలోకానికి సమర్పించింది. అ గ్రంథం పరిశోధకులు, విమర్శకుల పాలిట కల్పవృక్షం అంటే అతిశయోక్తి కాదు. ఇప్పటిదాకా 142 గ్రంథాలను వెలువరించి, సాధ్యమైనంత తక్కువ ధరకు వీలైనంత ఎక్కువ మందికి అందిస్తూ వస్తున్నది. యువభారతి. ఇలాంటి ఉత్తమ కార్యసాధనకు పూనుకున్న యువభారతి కార్యకర్తల్లో కీ॥ శే॥ డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు ప్రాతస్మరణీయులు, ప్రస్తుతం ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, ఆచార్య వంగపల్లి విశ్వనాథం, శ్రీ సింగంపల్లి వెంకటేశ్వరరావు వంటి కార్యదక్షుల నేతృత్వంలో యువభారతి రజతోత్సవ సభాకార్యక్రమాలను రూపొందించింది. ఈ రజతోత్సవ సంవత్సరం పొడుగునా నెల నెలా 'సమాలోచనం' పేర వివిధ కార్యక్రమాలు ధారావాహికంగా సాగినాయి. రజతోత్సవ సభలకు శిఖరప్రాయంగా ముచ్చటగా మూడు రోజులు మే 31, జూన్ 1,2 తేదీలలో స్థానిక ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనంలో సదస్సులు, ఉపన్యాసాలు, కవిసమ్మేళనం, మహాసభలు నిర్వహించింది.

మే 31వ తేదీ ఉదయం 10.30 గంటలకు "క్రొత్త గొంతుకలు – సరికొత్త విలువలు" అనే సాహిత్య సదస్సు మొదటి సమావేశం ప్రారంభమయింది. ఆచార్య రవ్వా శ్రీహరి అధ్యక్షతలో జరిగిన ఈ సమావేశానికి డా॥ వి.వి.కృష్ణశాస్త్రి ముఖ్య అతిథిగా పాల్గొని సదస్సును ప్రారంభించారు. ఆచార్య శ్రీహరి సంస్కృత కవిత్వంలో

ఇటీవల వస్తున్న వివిధ ఛందోరూపాలను పరిచయం చేస్తూ అందుకు ఉదాహరణగా శ్రీ విజయసారథి గారి రచనలను పేర్కొన్నారు. డా॥ వి.వి. శాస్త్రి ప్రాచీన నాగరికతా విశిష్టతను చారిత్రక దృక్పథంతో సమీక్షించారు. ఆచార్య కోవెల సుప్రసన్నా చార్యులు "సమకాలీన సాహిత్యం - భారతీయత" అనే అంశంపై ప్రసంగిస్తూ, సమకాలిక జగత్తు భారతీయ మూల్యాలను పోగొట్టుకోగూడదని ప్రబోధిస్తూ, వ్యక్తిత్వ వికాసంలో గాంధిజీ, సృజనాత్మక ప్రతిభా వికాసంలో ఠాగూరు, ఆధ్యాత్మిక భావనా ప్రపంచంలో అరవిందుడు వంటి మహనీయుల ఆదర్శాలనూ ఆశయాలనూ ఈనాటి యువతరం అనుసరించవలసిన అవసరమున్నదన్నారు.

"సమకాలీన కవిత్వం కొత్త గొంతుకలు" అనే అంశంపై డా॥ ముదిగొండ వీరభద్రయ్య గారు ఉపన్యసిస్తూ వర్ధమాన యువ ప్రతిభామూర్తులైన కవుల రచనలను సోదాహరణంగా ఉట్టంకించి, అందలి కవితా సౌందర్యాన్ని కవితా ప్రయోజనాన్ని వివరించి చూపారు.

"పుంజుకుంటున్న పద్యకవిత్వం" అనే విషయంపై డా॥ ఎల్లూరి శివారెడ్డి ప్రసంగిస్తూ, వెయ్యేళ్ళ చరిత్ర ఉన్న పద్యకవిత్వం వికాసదశలో ఉందన్నారు. పద్యకవిత్వంలో స్పష్టత ఉందని వక్కాణించారు. ఈనాటి పద్యకవుల పద్యాలను హృద్యంగా చదివి, వాటి ప్రాశస్త్యాన్ని ఎత్తిచూపారు. "తెలుగు సాహిత్య విమర్శ-కొత్త ధోరణులు" అనే అంశంపై డా॥ కోవెల సంపత్కుమారాచార్యులు ఉపన్యసిస్తూ, ఈనాడు వస్తున్న విమర్శలను చదివి వినిపించి,, అందలి అస్పష్టతను నిరసించారు. విమర్శకులు పాఠకునికి అదనపు విజ్ఞానాన్ని, అనుభూతిని అందించే సాధనాలుగా ఉపయోగపడాలని అన్నారు. ఈ సమావేశ ప్రారంభంలో రజతోత్సవ సంఘం అధ్యక్షులు శ్రీ బి.ఎన్.రెడ్డిగారు తమ సందేశం అందించారు. యువభారతి అధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం స్వాగతోపన్యాసం చేశారు.

మధ్యాహ్నం జరిగిన సమావేశానికి ఆచార్య ఎన్. గోపి అధ్యక్షత వహించగా, శ్రీ ఎం.ఆర్. సుబ్రహ్మణ్యం ముఖ్యఅతిధిగా విచ్చేశారు. దిగజారుతున్న విలువలు ఈనాటి సాహిత్యాన్ని ఎలా ప్రభావితం చేస్తున్నాయో వివరిస్తూ తమ ఆవేదనను వ్యక్తం చేశారు. మౌలిక మూల్యాలను కాపాడుకోవాలని ఈ ఉభయులూ ప్రబోధించారు.

"తెలుగు నవల - ఇంకా మిగుల్చుకొన్న విలువలు" అనే అంశంపై ఆచార్య నాయని కృష్ణకుమారి ప్రసంగిస్తూ, నవలల్లోని కేవల కాలక్షేప లక్షణాన్ని నిరసిస్తూ, నిబద్ధతనూ ఉత్తమ మూల్యాలను రచయితలు పరిరక్షించాలని కోరారు. "రూపపరిణామం - కథా శిల్పం" అనే అంశంపై డా॥ ముక్తేవి భారతి ఉపన్యసిస్తూ ఆధునిక కథా శిల్పరూప విశేషాలను వివరించారు. కొన్ని విలువలను కాపాడుకుంటేనే శ్రేయస్కరమని కథారచయితలను ఉపదేశించారు. "ప్రచార సాధనాలు - మారుతున్న విలువలు" అనే అంశంపై ఆచార్య పేర్వారం జగన్నాథం తమ వ్యాసాన్ని సమర్పిస్తూ - ప్రచార సాధనాలలో నిష్పక్షపాత భావం అభిలషణీయమని వక్కాణించారు. "మారుతున్న గ్రామీణ సమాజం - జానపద కళారూపాలు" అనే విషయంపై డా॥ పి. సుబ్బాచారి ప్రసంగిస్తూ ఇటీవల గ్రామీణ జనజీవనంలో వచ్చిన పలుమార్పులను, జానపదకళారూప పరిణామాలను సమీక్షించారు. "నేటి సాహిత్య సంస్థలు - తీరుతెన్నులు" అనే అంశంపై డా॥ మసన చెన్నప్ప ఉపన్యసిస్తూ - సంస్థల సాహితీ సేవలలో త్రికరణ శుద్ధిని అకాంక్షించారు.

సాయంకాలం "తెలుగువారి సాంస్కృతిక వికాసం" పై జరిగిన సభకు డా॥ ఉండేల మాలకొండారెడ్డి అధ్యక్షత వహించగా, శ్రీ కె.వి.రమణ ముఖ్యఅతిథిగా విచ్చేసి, "పాతికేళ్ళపత్రికారచన" అనే గ్రంథాన్ని ఆవిష్కరించారు. శ్రీరమణ తరతరాల తెలుగు సంస్కృతిని సోదాహరణంగా ఎత్తిచూపారు. "తెలుగువారు-నాటకరంగం" అనే అంశంపై పద్మభూషణ శ్రీ ఏ.ఆర్. కృష్ణ ప్రసంగిస్తూ, నాటకాలు సమాజానికి ప్రయోజనకరంగా ఉండాలని కోరుతూ, ఈనాటి తరిగిపోయిన విలువలను ఎత్తిచూపి తమ ఆవేదనను

వ్యక్తం చేశారు. "తెలుగువారు - నాట్యరంగం" అనే అంశంపై పద్మ శ్రీ నటరాజ రామకృష్ణ ప్రసంగిస్తూ, మన రాష్ట్రంలోని విశేష నృత్యరీతులను వివరించారు. "తెలుగు వారు - సంగీత రంగం" అనే అంశంపై పద్మ శ్రీ శ్రీరంగం గోపాలరత్నం మాట్లాడుతూ - కళాకారులకు కళల పట్ల ఆసక్తి, అభినివేశం, తపన, సాధన ఉండాలన్నారు. "తెలుగువారు - సినిమారంగం" అనే అంశంపై శ్రీ గుడిపూడి శ్రీహరి ప్రసంగిస్తూ, ఈనాటి సినిమాల అశ్లీలతను నిరసించారు. మంచి సినిమాలు రావడానికి ప్రేక్షకులు పూనుకోవాలని ఆకాంక్షించారు.

జూన్ ఒకటవతేదీ ఉదయం "విద్యా వైద్య శాస్త్ర కళారంగాలు - మానవతా విలువలు" అనే అంశంపై సదస్సు జరిగింది. ఈ సదస్సుకు డా॥ వెలిచాల కొండలరావు అధ్యక్షత వహించగా శ్రీ జె.రాంబాబు ముఖ్యఅతిధిగా పాల్గొన్నారు.

"ఆధునిక జీవితం - మానవతా విలువలు" అనే అంశంపై డా॥ కమలా జయరావు మాట్లాడుతూ, అధ్యాత్మికమైన విలువలను పెద్దలు పిల్లలకు అందించవలసిన అవసరాన్ని నొక్కి చెప్పారు. ఉగ్రవాదం పెరగడానికి కారణం మానవతా మూల్యాలు తగ్గిపోవడమే అని అన్నారు.

"శాస్త్ర విజ్ఞానం - మానవతా విలువలు" అనే అంశంపై డా॥ కె.బి. గోపాలం ప్రసంగిస్తూ - శాస్త్ర విజ్ఞానం మానవుని జీవితాన్ని ఆక్రమించి, విలువలను గూర్చి ఆలోచించే అవకాశం లేకుండా చేస్తున్నదన్నారు. సదుద్దేశ్యంతో కనిపెట్టిన శాస్త్ర విజ్ఞానం దుర్వినియోగ మవుతున్నదని తమ ఆవేదనను తెలిపారు.

మధ్యాహ్నం జరిగిన రెండవసమావేశానికి ఆచార్య జి. లక్ష్మీనారాయణ అధ్యక్షత వహించగా శ్రీ జి.రాందాసు ముఖ్య అతిధిగా పాల్గొన్నారు.

ఈ సమావేశంలో "పాఠశాల ఉపాధ్యాయులు - విద్యార్థులు - మానవతా విలువలు" అన్న అంశంపై డా॥ సురవరం పుష్పలత ప్రసంగిస్తూ, ఉపాధ్యాయులు విద్యార్థులకు ఆదర్శంగా ఉండాలని అభిలషించారు.

"క్రొత్త అధ్యయన రంగాలు - యువత - మానవతా విలువలు" అనే అంశంపై శ్రీ పి. నాగరాజు మాట్లాడుతూ వివిధ అధ్యయన రంగాలలో మానవతా విలువల ప్రాముఖ్యాన్ని వివరించారు.

"తల్లిదండ్రులు - పిల్లల పెంపకం మానవతా విలువలు" అన్న విషయంపై డా॥ కె.వి. కృష్ణకుమారి ప్రసంగిస్తూ - పిల్లల పోషణకు తల్లిదండ్రుల ఉద్యోగాలు అవరోధాలవుతున్నాయని బాధపడ్డారు.

"ఆధ్యాత్మికత - మానవతా విలువలు" అనే విషయంపై శ్రీ తెన్నేటి పూర్ణచంద్రరావు ఉపన్యసిస్తూ, ఆధ్మాత్మిక మూల్యాలు మాత్రమే శాశ్వత మానవత్వాన్ని స్థాపించగలుగుతాయని అన్నారు.

సాయంకాలం జరిగిన కవి సమ్మేళనానికి యువభారతి రజతోత్సవ సంఘం కార్యనిర్వాహక అధ్యక్షులు, సహజకవి శ్రీ ఎం.ఎస్.రెడ్డి అధ్యక్షత వహిస్తూ, తెలుగు కవితా సౌందర్యాన్నీ, ప్రాశస్త్యాన్నీ వేనోళ్ళకొనియాడారు. ఈ సభకు ముఖ్యఅతిథిగా విచ్చేసిన శ్రీ తాళ్ళూరి సూర్యనారాయణరావు కవిత్వానికున్న శక్తినీ, ప్రభావాన్నీ ఉగ్గడించారు. వారు "అమృత రాజీవం" అనే కవితా సంకలనాన్ని ఆవిష్కరించారు. అటు తర్వాత జరిగిన కవి సమ్మేళనంతో పలువురు కవులూ కవయిత్రులూ పాల్గొన్నారు.

మూడవరోజు ఉదయం అనగా 2వతేదీ జరిగిన "స్త్రీ వాద ధోరణులు - సమకాలీన సాహిత్యం" అనే సాహిత్య సదస్సుకు డా॥ రావి భారతి అధ్యక్షత వహించారు. స్త్రీ వాదం అనేది ఒక ఇజం అనుకోవడం భావ్యం కాదనీ, కవిత్వంలో వాడబడుతున్న జుగుప్సాకరమైన పదజాలాన్ని వారు గర్హించారు. ఈ సభకు ముఖ్యఅతిథిగా పాల్గొని, సదస్సును ప్రారంభించిన శ్రీ జి.వి.ఎల్.ఎన్.మూర్తి, ఉద్యోగినుల సమస్యలను అర్థం చేసుకుని, వారికి తగిన ప్రత్యేక సౌకర్యాలు కల్పించాలని అన్నారు.

"పెళ్ళి-కుటుంబ జీవితం" అనే అంశంపై శ్రీమతి అరుణా వ్యాస్ ఉపన్యసిస్తూ - భారతీయ సంస్కృతిలోని రకరకాల వివాహాలను, అందలి ఆచార వ్యవహారాలనూ వాటి ప్రయోజనాన్ని వివరించి, కుటుంబాన్ని రక్షించవలసిన ఆవశ్యకతను ఉద్ఘాటించారు.

"ఉద్యోగినుల సమస్యలు" అనే అంశంపై ప్రసంగిస్తూ శ్రీమతి తురగాజానకీరాణి, నారీవాదంలోని విభిన్నాంశాలను సూక్ష్మదృక్కులతో వివరించి చూపారు. "స్త్రీ వాదం - సాహిత్య విమర్శ" అనే విషయంపై శ్రీమతి వోల్గా మాట్లాడుతూ, నారీవాదానికి సంబంధించిన తెలుగు సాహిత్య విమర్శ ఇంకా ప్రాథమిక దశలోనే ఉందని అభిప్రాయపడ్డారు.

"ఆధనిక వీధి నాటకం - క్రొత్త ప్రయోగాలు" అనే అంశంపై శ్రీ డి.ఎన్. దీక్షిత్ ప్రసంగించారు.

మధ్యాహ్నం జరిగిన సమావేశానికి డా॥ ఎన్. నిర్మలాదేవి అధ్యక్షులుగా, శ్రీమతి శారదా అశోకవర్ధన్ ముఖ్యఅతిథులుగా వ్యవహరించారు. "భావకవితాయుగ సాహిత్యం - స్త్రీ" అన్న అంశాన్ని గూర్చి డా॥ ఎం. లావణ్య సరస్వతి, "అభ్యుదయ కవిత్వంలో స్త్రీ" అనే అంశంపై డా॥ వై. కామేశ్వరీ, "ఇటీవలి కవిత్వంలో స్త్రీ వాద ధోరణులు" అన్న అంశంపై శ్రీ భుజంగరెడ్డి, "ఇటీవలి తెలుగు నవలలు - స్త్రీవాద ధోరణులు" అన్న అంశంపై డా॥ కాత్యాయనీ విద్మహే, "తెలుగు కథ - స్త్రీ వాద ధోరణులు" గూర్చి శ్రీమతి కె.బి. లక్ష్మి సభారంజకంగా, విషయ గంభీరంగా ఉపన్యసించారు.

జూన్ 2వ తేదీ సాయంకాలం 6 గం॥లకు యువభారతి రజతోత్సవ మహాసభ జరిగింది. డా॥ తిరుమల శ్రీనివాసాచార్య ప్రస్తావనతో సభ ప్రారంభమైంది. ఈ సభకు రజతోత్సవ సంఘం అధ్యక్షులు, వాస్తు శిల్పి శ్రీ బి.ఎన్.రెడ్డి 'మల్లెమాల' అతిథులకు స్వాగతం పలికారు. ముఖ్య అతిథులుగా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్దనరెడ్డి విచ్చేశారు. యువభారతి సంస్థ సమాజంలో సాహిత్య చైతన్యానికి చేసిన చేస్తున్న కృషిని ప్రశంసిస్తూ పెద్దల సలహా మేరకు సంస్థకు సముచిత సహకారాన్ని అందించగలనని తమ అభిభాషణలో అన్నారు. వారు ఈ సందర్భంగా, డాక్టర్ సి. నారాయణరెడ్డి రచించిన ఉపన్యాస వ్యాస సంపుటి "తెలుగు కవిత-లయాత్మకత" అనే యువభారతి ప్రచురణను ఆవిష్కరించారు.

మహాసభకు ప్రత్యేకాహ్వానితులుగా పాల్గొన్న ఆచార్య సి.నారాయణరెడ్డి యువభారతి రజతోత్సవ సంచిక "వెండి వెలుగులు"ను ఆవిష్కరించి ప్రసంగించారు. యువభారతికి ప్రభుత్వం ఆర్థిక సహకారాన్ని అందించవలసిన ఆవశ్యకతను వారు నొక్కి చెప్పారు. రజతోత్సవ సంఘ పోషక సభ్యులు శ్రీ దేవులపల్లి రామానుజరావు శుభాశీస్సులందించగా, రజతోత్సవ సంఘ ఉపాధ్యక్షులు శ్రీ జె. బాపురెడ్డి శుభాకాంక్షలను అందజేస్తూ యువభారతికి ఆర్థిక సహాయాన్ని అందించాలని ముఖ్యమంత్రికి విన్నవించారు.

ఈ సభలో మొదట సంస్థ అధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం సంస్థ లక్ష్యాలనూ సాధించిన సిద్ధులనూ వివరిస్తూ ఆర్థిక సహకారం కోసం ప్రభుత్వాన్ని అర్థించారు. చివరలో యువభారతి సంస్థ కార్యదర్శి శ్రీ ఎస్.వేంకటేశ్వరరావు వందన సమర్పణ చేశారు.

ఇలా ముచ్చటగా యువభారతి 3 రోజుల రజతోత్సవ సభలు విజయవంతంగా ముగిశాయి.

సమావేశాలు ఉదయం 10 గంటలనుండి రాత్రి 8 గంటలవరకు సాగినా అధికసంఖ్యలో సహృదయులు సభలకు హాజరై కార్యక్రమాలను దిగ్విజయం చేసి, యువభారతి పట్ల తమకున్న ఆదరాభిమానాలను ప్రదర్శించారు. పత్రికలూ, రేడియో, టి.వీ వారు యువభారతి రజతోత్సవాల వార్తలను ఆసక్తికరంగా ప్రచురించి, ప్రసారం చేసి సాహిత్యం పట్ల వారికున్న ఆసక్తిని చాటుకున్నారు. ఎందరి సహకారమో లభించింది. అందరికీ వందనాలు!

